హాస వ్యాస మంజరి

HASA VYASA MANZARI

1993_500 Copies

ఈ గ్రంథ ముద్రణకై తెలుగు యూనివర్శిటీవారు రూ॥ 5000/– ఆర్థిక సహాయమందించిరి. వారికి నా కృతజ్ఞతలు.

వెల : **Rs. 63-00**

ముఖచిత్రం : ఆర్. ప్రభాకర్

ప్రతులకు
**యన్. సి శేషాచార్యు**
శ్రీవత్స నిలయము
2-2-647/149-A,
సెంట్రల్ ఎక్సైజ్ కాలనీ,
హైదరాబాదు-500 013.

ముద్రణ :
యల్. ఎ. వి. ఎంటర్ప్రైజెస్
తిలక్‌నగర్, హైదరాబాదు.

# అంకితము



## శ్రీమాన్ శ్రీరంగం దేశికాచార్యులు

వారు ఆంధ్ర గీర్వాణ తమిళ భాషలయందు విద్వాంసులు,

కడప పట్టణము మునిసిపల్ హైస్కూలులో ప్రథమశ్రేణి పండితునిగా మూడు దశాబ్దాల క్రిందట పదవీ విరమణ చేసిన వారు.

ఉపాధ్యాయ వృత్తిలో నున్నప్పుడు, విద్యార్థినులకు చక్కని శిక్షణనిచ్చి మేకప్, దర్శకత్వము, సంగీత దర్శకత్వము బాధ్యతలను నిర్వహిస్తూ శ్రీనివాస కళ్యాణము, శ్రీకృష్ణ తులాభారము మున్నగు పౌరాణిక నాటకాలను, రసవత్తరముగా, జనరంజకంగా వేయించి, బహుధా ప్రశంసల నందుకున్న లబ్ధప్రతిష్ఠులు!

విద్యార్థి దశలో వారు అనుభవజ్ఞులైన స్కౌటు మాస్టరు!

ఫార్మసిస్టుగా ఒక దశాబ్దము పనిచేసిన వారు. అలోపతి, ఆయుర్వేద వైద్యములను ఆకళింపు చేసుకున్నవారు.

ఫొటోగ్రఫీని ఒక హాబీగా తీసికొని ఎందరకో నేర్పించి, వారి జీవనమునకు తోడ్పడిన ఉదారశీలి,

వేదము, ఆగమ శాస్త్రము, మంత్ర శాస్త్రములను క్షుణ్ణంగా నెరిగిన వారు. వైదీక కార్యములను జరిపించగల దిట్ట. వేణుగాన విద్య నేర్చినవారు. చిత్రలేఖనము మృత్తికా శిల్పములను తయారుచేయుట వారికి అభ్యసింపనియే అబ్బిన ప్రజ్ఞ. అన్నిటికన్నా మిన్న అపారమైన వారి నిష్కళంక భగవద్భక్తి! గీతలోని చరణములను ఆచరణలో పెట్టి జీవితమును గడుపుచున్నవారు. వారు సేవించని దివ్యక్షేత్రములు లేవు! ఎన్నిమారులో లెక్కలేదు!

వారు లేనిదే ఆ ప్రాంతములలోని కొన్ని దేవాలయములలో ఉత్సవ విగ్రహాలంకరణ జరుగదన్న అతిశయోక్తి గాదు. విగ్రహాలంకరణలయందు తాదాత్మ్యము చెందుతారు. వయసు నవతిలో పడ్డా మనసు ఉరకలు వేసే పదమూడేళ్ల (13X7) నవయువకులు! రసహృదయులు! హాస్య సంభాషణా చతురులు! బహుముఖ ప్రజ్ఞాశాలి!

వారు నాకు మామగారు గావటం నా పూర్వజన్మ సుకృతముగా భావిస్తున్నాను.

అందుకే శ్రీమాన్ శ్రీరంగం దేశికాచార్యుల వారికి ఈ "హాసవ్యాస మంజరి"ని 'చందమామ'కు నూలుపోగు చందమున అంకితమిచ్చి కృతజ్ఞతాభివాదములర్పిస్తున్నాను.

నల్లాన్ చక్రవర్తి శేషాచార్య

23-5-93

(శ్రీముఖ జ్యేష్ఠశుద్ధ విదియ)

# విషయ సూచిక

## ప్రథమ భాగము

## ద్వితీయ భాగము



## తృతీయ భాగము

# కృతజ్ఞతాభివందనములు

ఈ పుస్తకములోని వ్యాసాలను ఓపికతో విని, ప్రశంసించి, ప్రోత్సహించిన సుప్రసిద్ధ సాహితివేత్తలైన

డా. తిరుమల రామచంద్ర గారికి

డా. నండూరి రామకృష్ణమా చార్యుల గారికి

డా. ఆచార్య తిరుమల గారికి

ప్రెస్ అధినేత, స్నేహశీలి, విద్యావేత్త శ్రీ బి. నరసింహం ఎం.ఎ గారికి

చిత్రకారుడు శ్రీ ప్రభాకర్ బాబుగారికి

నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు

యన్. సి. శేషాచార్య

# మనవి

ఈ పుస్తకానికి సుప్రసిద్ధ సాహితీవేత్తల లేదా నలుగురి నోళ్లలో నానుతున్న వారి అభిప్రాయాలను ఏవీ వ్రాయించలేదు. ఎందుకని మీరడగొచ్చు. ఎదురుగా లేను గాన అలా అనుకోవచ్చు. 'సుప్రసిద్ధ సాహితీవేత్తల' అన్న తర్వాత మళ్లీ "నలుగురి నోళ్లలో నానుతున్న" అని ఎందుకు అన్నానా అని అనుకోవచ్చు. ఈ స్పీడు యుగములో నిజమైన 'సరుకు' గల పండిత ప్రకాండులూ పత్రికలవారి సౌజన్యంతో పబ్లిసిటీ బ్రహ్మాండంగా పొంది నెట్టుకొస్తున్న రచయితలూ క్రమక్రమంగా రెండు వర్గాలుగా విడిపోతున్నారా అని నా అనుమానం.

ప్రస్తావన, మున్నుడి, ఆముఖము అవతారిక లాంటివి అందరిలాగా నేను వ్రాయిద్దామనే అనుకున్నా. ఇదివరలో ముద్రితమైన నా నాలుగు పుస్తకాలకూ, అద్భుతంగా వున్నాయని ఆశీస్సులనందిస్తూ ఆకాశానికెత్తి లబ్ధప్రతిష్ఠులు వ్రాశారుకూడా, ఉదాహరణకి ఈ పుస్తకం కవరు పేజీ చూడండి.

ఏ ఎరిగున్న వారినో, వారిద్వారానో అనుకున్న వారిని ఆశ్రయించి అభిప్రాయం వ్రాయించుకోవడం ....... అదేమంత దుర్లభం కాదు. ఎటొచ్చీ, సదరు అభిప్రాయాలకు పాఠక మహాశయులు అట్టే విలువ ఇవ్వరేమో అని నా అభిప్రాయం. తెలుగు పాఠకులు మరీనూ.

అభిప్రాయాలు బేషుగ్గా ఉన్నాయనుకోండి. "ఆ ....... బాగా కాకాబట్టి వ్రాయించి ఉంటాడని తేలిగ్గా తేల్చివేసే మనస్తత్వము మనవాళ్లది! ఈ పుస్తకంలో 'పుస్తకాలు' వ్యాసంలో తెలిపినట్లు సు, కా, ము, మా, త్రై, జపంతోనే (సుత్తి, కాకా, మస్కా, మాలీసు, త్రైరు కొట్టడం వగైరాలు!) సులభంగా పనులౌతున్న మంచి రోజులాయె. సీసాలూ, పైసాలూ కొంతమేర ప్రభావితం చేస్తున్నట్లు కూడా వినికిడి!? పోతే ......అభిప్రాయం నాకు నచ్చలేదనుకోండి. దానిని అలాగే అచ్చులోకి దింపించే వెర్రిబాగులవాడివి కాదు, నేనేంటి ఏ రచయితా ఉండడు.

అగ్రశ్రేణి రచయితలకు, అడపా దడపా అవార్డులందుకున్న ఆంధ్ర సాహితీవేత్తలకూ ఈ పుస్తకాన్ని క్షుణ్ణంగా చదివే, తీరుబడి ఉంటదు. ఒకటీ, అరా పేజీలు తిరగేసి వారఫలాల్లాగా గోడమీద పిల్లి వాటంగా రాసి తప్పుకోవచ్చు. అంత గొప్పోళ్ళ పట్టీలో లేనివారిని పట్టుకొని వాళ్ళచేత రాయిస్తే వృథా శ్రమ. వాళ్ల పుస్తకాలకు పట్టిన గతే నా వాటికీ పట్టొచ్చు!

ఎందుకొచ్చిందబ్బా! డబ్బు పోతే పోనీ, నా డబ్బా నేనే వాయించుకుందామనే నిర్ణయానికి వచ్చా. చదివేవాళ్లు చదువుతారు. చదవరో... రద్దీ పేపరు కొనే అంగట్లు రాజధానీ నగరంలో రద్దీగానే వుంటాయి!

సాధారణంగా, ఎవరూ బాగాలేవని వ్రాయరుగాక వ్రాయరు. అట్లా వ్రాస్తే నేను అచ్చు వేయించనని తెలియదా యేంటి? వాళ్ల పేర్లు అచ్చులో పడాలని వాళ్లకూ ఉండదా?

ఇక్కడ మరో విషయం. బహు పసందుగా ఉన్నాయని ప్రశంసల నందుకున్న గ్రంథాలమీద పత్రికల వాళ్లు "చప్పగా" ఉన్నాయనీ, రచయిత ఆశించిన ప్రయోజనం ఏమిటో స్పష్టంగా లేదనీ పాఠకులను విసిగించిన సందర్భాలు అక్కడక్కడా చోటుచేసుకున్నాయనీ 'చురక' లంటించిన సమీక్షలు ఎన్నో చూచా! కొండొకచో, ప్రాతికేయ సార్వభౌములే, మహామహాగా. యమాగా వున్నాయనీ గగనతలానికి ఎత్తిన గ్రంథరాజాలను వి.పి. తెప్పించుకొని, వెర్రి పాఠకుడనై భంగపడ్డా! సారీ! ఒక్కసారి కాదు. కొన్ని ఆవిష్కరణ సభల్లో రచయితను శృతిమించి ప్రస్తుతించి ప్రోత్సహించిన సందర్భాలు కద్దు. మరి తద్గ్రంథాలు అయిదేళ్ళయినా అలమారా గూళ్ళలో అలంకారం చేసుకుంటూనేవున్న కేసులు ఎన్నో! అలమారాలు కూడా చాలినన్ని లేక అటకమీద మూషక సంతతికి ఆహారమైనవెన్నో! మహామహా గ్రంథకర్తలు కూడా ఫుట్‌పాత్‌లమీద మనకు దర్శనమిస్తుంటారు. అయిదేళ్ళయినా అమ్మకానికి నోచుకోలేదంటే ఆ రాసినోడికి అయిదువేళ్లు నోట్లోకి పొయ్యేదెప్పుడు? వంటిమీద దుప్పట్ల సంగతి దేముడెరుగు! పేరుకున్న అప్పులు ఎప్పట్లో తీరేటట్లు? రచయిత 'రాత' మారేదెప్పుడు? మళ్ళీ కలం కదిలేదెప్పుడు? మదిలో కలకలం వదిలేదెప్పుడు? 'గిఫ్టు' వుంటే కళ అబ్బుతుంది కానీ కలిమి ప్రాప్తికి "లిఫ్టు" చాలా ముఖ్యం!

ఈ పరిస్థితి ఒక్క సాహితీ రంగానికే పరిమితి కాలేదు. కాదంటే ఈ ఫీల్డులో కొంచెము ఎక్కువ. సినిమాలూ అంతే. కొన్ని క్లాసికల్ పిక్చర్లు ఫ్లాప్; Solmon Brand. Born on Monday అని చిన్నతనంలో నేర్చిన పద్యంలాగా వారం తిరక్కముందే డబ్బాలు వెనక్కొస్తాయ్! మరికొన్ని గబ్బు పిక్చర్లు, డబ్బు పిక్చర్లు హిట్, సూపర్‌హిట్ అని ప్రకటనలు చూస్తూంటాం.

"న నారీ హృదయ స్థితం" అన్నారు గానీ, నారీ హృదయం తెలుసు కోడం అంత కష్టం కాకపోవచ్చు. న పాఠక జన హృదయ స్థితం అనో, న ప్రేక్షక హృదయ స్థితం అనో, న వోటరు హృదయ స్థితం అనో చెప్పాలేమో!

ప్రజలు ఎలాంటి చిత్రాలను ఆదరిస్తారు. వేటిని ఛీదరించుకుంటారో, నిర్మాతలకు దర్శక సార్వభౌములకే అంతు చిక్కక నెత్తీనోరూ కొట్టుకుంటు న్నారు. వోటర్లూ........డిటో........ఏ పార్టీకి తాళం వేస్తారో, ఎవరిని పాతాళం పంపిస్తారో, ఎవరిని పల్లకి ఎక్కిస్తారో గల్లంతు చేస్తారో దొడ్డదొడ్డ రాజకీయ విశ్లేషక చక్రవర్తులే చెప్పలేక లేకచెప్పి పప్పులో కాలేసినట్లు తెలుసు కుంటున్నాం.

పత్రికల్లో రివ్యూ చూచి, చిత్రాలను చూచేవాళ్ళ శాతం ఎంతో, సమీక్ష లతో, ప్రభావితులై పుస్తకాలను చదివేవారి శాతం అంతే!

'ఎడిషన్' లాంటి కొమ్ములు తిరిగిన రచయిత పుస్తకాలే సెకండ్ ఎడిషన్ నోచుకోలేదట!

ప్రముఖ కవి శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యుల వారు ఒక చోట ప్రస్తుత పుస్తకములకు పట్టిన పరిస్థితిని గూర్చి ఆవేదన చెంది ఇలా వ్రాశారు.

ఉ॥ ఇప్పుడు పుస్తకమ్ములివి ఇట్టి పరిస్థితి నొంది వీధిలో
త్రిప్పుచు పోవుచుండ అమరించిన చక్కని బీరువాలలో
చెప్పుల లంకరించినవి శ్రేష్ఠములైనవి ఉచ్చ నీచముల్
దప్పెను నేటి నాగరకతా మహిమమ్మది ఏమి చెప్పుదున్''

వీటన్నింటినీ దృష్టిలో పెట్టుకొని, అందరికన్నా చదువరులే పుస్తక సమీక్షా చతురులని తెలుసుకొని అభిప్రాయ సేకరణ అనవసరమనీ అదనపు వ్యయమనీ మానుకున్నా.

ఈ పుస్తకానికి మోక్షం రావాలని మాత్రం నాకేమాత్రం లేదంటోయ్ మోక్షం వస్తే పునర్జన్మ ఉండదంటారు గదా! నా పుస్తకం పునర్జన్మకు నోచుకోవాలనే (పునర్ముద్రణ:) ఆశిస్తున్నా.

వ్యంగ్యము, హాస్యము ప్రధానముగా గల ఈ వ్యాసాలు హాస్య రస ప్రియులైన పాఠకులందరి ప్రశంసలకు నోచుకుంటాయని నా విశ్వాసం అందరికీ అన్నీ నచ్చాలని రూలు లేదనుకోండి.

గాన, ఓ చదువరులారా! మీరు ఈ గ్రంధాన్ని చదివితే. కొని చదివితే పొంగిపోతా. సద్విమర్శలకు సర్వదా స్వాగతం. చదువరులుగానే గాక, ఏ నూతన వధూవరులకో, మేరేజీడేలూ గట్రాలూ(ఇంగ్లీషులో ఎట్సెట్రాకు వికృతి!) జరుపుకునే రసహృదయులకు చదివిస్తే చాల సంతోషం.

ఈ పుస్తకాలు నావి. కాదు మీవి. కాదు మనవి. ఇదే నా వినయ పూర్వక మనవి!

నల్లాన్ చక్రవర్తి శేషాచార్యు

23-5-93

(శ్రీముఖ జేష్ఠశుద్ధ విదియ)

# 1. ఇదేనండీ లోకంతీరు!

తామర లాంటి చర్మరోగమేదయినా వస్తే డాక్టరిచ్చే మొట్టమొదటి సలహా టెర్లిన్‌లూ, పాలియెస్టర్లూ, ఇలాంటి సింథటిక్ దుస్తులు కొంత కాలం పాటు మానేసి, కాటన్ దుస్తులు ధరించమని! సబ్బులు కూడా మానేసి సున్నిపిండినో లేదా ఏ సువాసనా లేని మెడికేటెడ్ సోపునో వాడమని! అంటే అర్థం? సింథటిక్ వస్త్రాల కన్నా, నూలువే ఆరోగ్యదాయకమనీ, పూర్వం మన నాయనమ్మలూ, అమ్మమ్మలూ, తాతలూ వాడే సున్నిపిండి, సబ్బులకంటే శ్రేష్ఠమైనవనేగా? కానీ, వీటికి గిరాకీ? ఈ నవనాగరిక ప్రపంచంలో సింథటిక్‌లూ, కాస్మటిక్‌లూ స్వైర విహారం చేస్తున్నాయి. దంత రోగాలను అరికట్టగలిగే, చౌకగా లభించే వేప పుల్లలూ, కానుగ, ఉత్తరేణి పుల్లలూ పడిపోయి అడ్వర్టయిజ్‌మెంట్ల ప్రభావంతో, టూత్‌పేస్టులూ, బ్రష్‌లూ టూ-ఇన్-వన్ లాగా దర్శనమిస్తున్నాయి. పోనీ దంతములేమైనా పటుత్వంగా వున్నాయా అంటే పట్టుమని "ఫిఫ్టీ" నిండక ముందే కట్టుడుపళ్లు! దంతరోగ ఉదంతాలు?

డయబెటిస్ వ్యాధి వచ్చిందంటే డాక్టరిచ్చే మొదటి సలహా వరి అన్నం తగ్గించి, వీలైతే మానేసి రాగులు, గోధుమలు, ఆకుకూరలు ఎక్కువగా తీసుకోమని! మరి ఆగర్భ శ్రీమంతులు, ఆధునికులు అనుకోవటం రాగులను ఎవరో గతిలేని బైరాగులు, పల్లెటూరి రైతులు, లేబరు వర్గాలు తినే తిండి అని. ఇప్పుడు వాళ్ళుకూడా మానేశారులెండి. జొన్నలు, సజ్జలు, రాగులు మున్నగు చిరు ధాన్యాలలోని పోషక పదార్థాలతో పోలిస్తే, వరి ధాన్యం ఖచ్చితంగా కడపటి కాటగిరీ లోకి వస్తుంది! అయితేనేం? బియ్యం దొరగారు భోగానికి చిహ్నమై సమాజంలో 'రాంకు' కొట్టేశారు!

శ్రీనాథుడు కవిసార్వభౌముడే అయ్యుండొచ్చుగాక! ఆయనగారు రాజాధిరాజులచే పోషింపబడియుండొచ్చుగాక! పోషక పదార్థ పరిజ్ఞానం కలిగినవాడు కాదంటా: కాకుంటే "జొన్నన్నము జొన్న కలి, జొన్న

అంబలి" అంటూ "సన్న న్నము సున్న సుమీ" అంటూ పీర పల్నాటి సీమను వెక్కిరిస్తాడా? "వెల్లుల్లిన్ తిలపిష్టమున్ మెసవితిన్" అనీ, తింత్రిణీ పల్లవ యుక్తమౌ ఉడుకు బచ్చలి శాకము" అనీ పోషక పదార్థాలను అప హేళన చేస్తాడా? వాటిని తినగానే ఆ పద్యాలను ఆశువుగా చెప్పాడు! వాటిలో కవితా ధార వృద్ధిచేసే ఖనిజాలుండితీరాలి! నిజం! బచ్చలిలో దండిగా 'ఐరన్' ఉంది! తిలల్లో పుష్కలంగా 'కాల్షియం' ఉందాయె. తింత్రిణీ ఫలంలో సరే విటమిన్ 'సి' ఉందిగదా? వెల్లుల్లిని తల్లితో పోల్చారే? వెయ్యి రోగాలను పోగొట్టగల దిట్ట అనీ బి.పి. తగ్గిస్తుందనీ, ఆధునిక భిషగ్వరులు కూడా అంగీకరిస్తున్నారే! గార్లిక్ పెరల్సు (వెల్లుల్లిముత్యాలట) వెలిశాయే. శ్రీనాథులుంగారు కంగారులో ఆ విధంగా అనింటాడు. మహా కవి గారైనా 'మహానస' (వంటఇల్లు) విషయంలో మామూలు మనిషే! లేదా వరుసగా అవే రోజూ తిని తిని మొఖం మొత్తిండొచ్చు!

హఠాత్తుగా ఏ నడుమో పట్టుకుందనుకోండి. డాక్టరు గారు ఏ చాప మీదో, చెక్క మంచం మీదో బల్లపరుపుగా, పరుపు, తలగడ కూడా లేకుండా పడుకోమని సలహా ఇస్తారు. దీని అర్థం ఆరోగ్యానికి మంచిదిగాకున్నా, ఫోమ్‌బెడ్లూ, స్పాంజి తలగడాలూ ఎక్కువ మార్పులు సమాజంలో కొట్టేశాయనేగా ?

అందరికీ అందుబాటులో వుండే అరటిపండ్లూ, జామపండ్లూ, పోషక విలువల్లో ఆపిల్ పండ్లకు తీసిపోవు! వేరుశెనగపప్పు జీడిపప్పుకు తల వంచక్కర్లా: కానీ ఆపిల్ పండ్లకూ సమాజంలో గౌరవం: పై అదికార్లకు హాపీ న్యూయియర్ గ్రీటింగ్స్ చెప్పేందుకు ఆపిల్ పండ్లను బహూకరించడమే ఆచారమై కూర్చుంది. ఆంగ్ల నాగరికత వాసన! జామపండ్లనో, నారింజ పండ్లనో ఇస్తే 'జావ్‌బే' అంటారు మరి!

గుమ్మడికాయలు రెండు రకాలు ఒకటి పసుపు పచ్చగా వుండేది, రెండోది తెల్లగా వుండేది. గుణాత్మకంగానూ, ఔషధాలకూ, లేహ్యాలకూ వడియాలకూ, శుభ కార్యాలకూ ఉపయోగకరమైన తెల్ల గుమ్మడికాయలకు

'బూడిద' పూసి 'బూడిద గుమ్మడి' అని పేరు పెట్టాం. శ్లేష్మ కరమైనదీ, అశుభాలకు వాడే పచ్చ గుమ్మడికాయలను 'మంచి' గుమ్మడి, తియ్య గుమ్మడి అని బిరుదు ప్రదానం చేశాం. అలాగే నల్లగా వుండే పాత చింతపండు ఆరోగ్యం. తెల్లగా వుండే కొత్త చింతపండు అనారోగ్యం. మరి డిమాండు దేనికి?

చుట్ట, బీడి, సిగరెట్ అన్నీ ఒకే తల్లి బిడ్డలైనా, నశ్యానికి మాత్రమే నేటికీ సభా గౌరవం! 'నశ్యం పశ్యకరం' అన్నారు.

పంచదార కన్నా బెల్లం గుణాత్మకంగా మంచిది 'గుడ' దానాలున్నాయి గానీ, పంచదార దానాలు నిషిద్ధం: కానీ పంచదారకు నెత్తిన కిరీటం పెట్టాం:

గులాబీ పూలను 'కింగ్ ఆఫ్ ఫ్లవర్స్' అని తెగ కీర్తిస్తాము. వాటి ప్రదర్శనలను ఏర్పాటు చేస్తారు. పోటీలను నిర్వహిస్తారు. గులాబీ తనను ముట్టుకునే వాళ్ళను గుచ్చుతుంది. దాని బ్రతుకంతా గంట, మహా అయితే రెండు గంటలు: రేకలన్నీ రాలిపోతాయ్। సువాసన అంటారా మనో రంజితం, పారిజాతం, మల్లె, సంపంగి ముందర ఏపాటి? కనకాంబరాలు రెండు మూడు రోజుల వరకూ కళకళలాడుతూ వుంటాయే? చైనా దేశంలో గులాబీ పూలను సంతాపాన్ని ప్రకటించే సాధనాలుగా పరిగణిస్తారట. ఏం లాభం, గులాబీ పూలు స్టేటస్ సింబల్సు! ఒక స్వీటుకు కూడా దాని పేరు తగిలించాం, ఇంక ఏ ఇతర పుష్పానికీ ఆ గుర్తింపు రాలేదు, అంతేనండీ.

పులిని చూడండి.ఎంత అందం! ఎంత ఠీవి! ఎంత హుందాతనం! మునీశ్వరులు పులి చర్మం మీద, జింక చర్మం మీద కూర్చుని తపస్సు చేసుకొంటారుగానీ సింహం చర్మం తపోనిష్ఠకు పనికిరాదే? పరాక్రమ విషయంలో మాత్రం పులిదే పైచేయట! సింహానికి బద్ధకం ఎక్కువట. ఆఘ్రాణ శక్తి కూడా పులికే ఎక్కువ! ఏం ప్రయోజనం? 'మృగరాజు' బిరుదును తన్నుకొని పోయింది సింహం! కవికేసరి బిరుదుకే ఘనత! లోకం తీరే అంత ?

ఇలా చెప్పుకుపోతే ఎన్నో. లోకం వ్యవహారమే అంత. కాకిని తీసుకోండి. కలుపుగోలు తనములో కాకిని చూచి మనము సిగ్గు పడాలి. పితృదేవతలకు ప్రతినిధి అంటారు. అదెంతవరకూ నిజమో తెలియదు కానీ, తస్సాదియ్యా రోజూ వచ్చి విసిగించే కాకులు తద్దినం రోజు మాత్రం, కనబడి కూడా వాయస పిండాన్ని ముట్టుకోకుండా మారాం చేస్తాయ్. మనలను పరీక్షిస్తాయి! చిత్రం గదూ, ఇక అందంలో కాకి కోకిల కన్నా నయం! కోకిల కాకి శ్రమను దోచుకునే సోమరి దొంగ! పెట్టుబడి దారీ వర్గాలకు ప్రతీక! గుడ్లు పెట్టగానే సరా! పొదగడం రాదాయె! అయితే ఏమంట? మన సాహితీ వేత్తలు, కవి పుంగవులు కోకిలకే బ్రహ్మరథం పట్టారే. కవికోకిల, గానకోకిల బిరుదులకై ఎగబడతారే. వాయస కవి అనిపించుకోటానికి ఇష్టపడరెందుకు స్వర మాధుర్యం అంటారా? ఆ ఆపాటి మాధుర్యం తేరకు తిని కూర్చుంటే కాకి గొంతులో కూడా వుండేదేమో.

గోపూజలు, గోదానాలు, గోసంరక్షక సమితులున్నాయి. గేదె దానాలు శాస్త్రాల్లో ఉన్నట్లు లేవు. ఎందుకో? గేదె పాలు, ఆవు పాల కన్నా ఏమంత తక్కువండీ.

వీధుల్లో గారడీ వాళ్ళను చూడండి వాళ్ళ సరంజామా అంతా ఒక చిన్న చేతి సంచి! స్టేజీలూ, లైటింగ్‌లూ ఏ హంగులూ వుండవు ఒక చిన్న వెదురు బద్ద వయొలిన్, ఒక ఢమరుకం అవే పాపం వాళ్ళకున్న నేపథ్య గాన వాయిద్య సంపద. ఆడ, పాడా, మద్దెల గొట్టా అన్నట్లు అన్నీ వాళ్ళే. వన్ మాన్ షో. గంట, రెండు గంటలు టికెట్టు లేకుండా జనాన్ని ఆకర్షిస్తారు. మా కాలంలో 'విప్ర వినోదులు'ండేవారు. ఇప్పుడు వారి తెగ అంతరించి పోయినట్లుంది. మన కట్టెదుటే అత్యద్భుత ఇంద్రజాల విద్యలను ప్రదర్శించి ముగ్ధులను చేసేవారు. మరి వీరికి ఎవరైనా 'జాదోరత్న' బిరుదులిచ్చారా? సర్కారువారు సహాయం చేశారా. అభినవ సర్కారు బిరుదులిచ్చారా? అది అంతేనండీ, ఈ తరం వారిలో ఎంతమందికి 'విప్ర వినోదుల' విషయం ఎరుక?

రైళ్ళలో గుడ్డి బిచ్చగాళ్ళు, తామే పాడుకుంటూ, రెండు చెక్కముక్కలను చేతిలో ఇరికించుకొని లయాత్మకంగా అందించే వాద్య మాధుర్యాన్ని, గాన రసాను ఆనందించేవారేగానీ, ఆర్థికంగా ఆదుకునే వారున్నారా ? అక్షరజ్ఞానం లేకుండా సంగీత శిక్షణ లేకుండా రైళ్ళలోనే రాపురం చేసే వీరిలో ఘంట సాలలనూ, జేసుదాసులనూ, బాలసుబ్రమణ్యాలనూ తొంగిచూస్తుంటాము. తారు రోడ్లమీద రంగు రంగుల సుద్దముక్కలతో, బొగ్గు ముక్కలతో అద్భుతమైన చిత్రాలను రచించే నిరుపేదలను చూస్తుంటాం. వీరికి సమాజం, సర్కారు శిక్షణ యిప్పిస్తే వీరిలో ఎందరో పికాసోలూ, రవి వర్మలూ బయటికి రావచ్చు! కానీ వీళ్ళను ఆదుకునేదెవరు?

చంద్రుడు-ఆయన కేవలం ఛాయాగ్రహం ! స్వయం ప్రకాశుడుకాడు. నెలలో పక్షం రోజులు క్షీణ దశలో వుంటాడు. అన్ని గ్రహాల్లాగా ఆయన గారు ఆదిత్యుని చుట్టూ తిరుగుతూంటాడు. అయితే ఏమాయె ? మన సాహితీ వేత్తలు ఆయన్ను ప్రశంసా వర్షంతో ముంచెత్తుతారు. చుట్టరికం అంటగట్టి చంద 'మామ' అన్నారు. కవి చంద్రుడు అని చంద్రునితో పోల్చి కవులను సత్కరిస్తాము. స్వయం ప్రకాశత్వం కలిగియుండీ, సూర్య చంద్రాదులకన్న ఎన్నో రెట్లు వైశాల్యంలో పెద్దవి అయ్యుండీ బహుదూరంగా ఉండటంతో, తారలు, సాహితీ రంగంలో పేరు ప్రఖ్యాతులను ఆర్జించలేకపోయ్యాయి అసలు సరుకు లేకున్నా అందరి మన్ననలను అందుకున్నాడు చంద్రుడు! స్వయం ప్రకాశుడు కాకున్నా తారానాథునిగా జనంలో చలామణి అవుతున్నాడు.

మహాభారతంలో కర్ణుని పాత్ర తీసుకోండి. ఎంత మహోన్నత వ్యక్తి! స్నేహానికీ, నిస్వార్థానికీ, త్యాగానికీ, వీరత్వానికీ నిలువెత్తు ప్రతీక! అంతటి మహాపురుషుని ముందు ధర్మరాజుగా కీర్తించబడిన యుధిష్ఠరుడు మార్తాండుని ముందు మసక దీపం! కానీ కర్ణుణ్ణి ఎవరు గుర్తించారు? పాపం వలు శాపాలకు గురి అయ్యాడు. అలాగే రామాయణంలో భరతుని పాత్ర. రాజ్యాన్నే త్యజించిన మహా మనిషి. శ్రీరామునికన్నా ఉన్నత వ్యక్తిత్వం. ఆయనకు ఒక్క దేవాలయం కనీసం ఒక్క దేవాలయం ప్రత్యేకించి వుందా ?

ఇంతెందుకు? మన దేశం సంగతే తీసుకోండి! మహాత్మా గాంధీ లాంటి ఎందరో మహానుభావులు తమ తమ జీవిత సర్వస్వం ధారబోసి, కారాగార క్లేశాలను అనుభవించి, దేశ ప్రజలకు స్వాతంత్ర్య ఫలాన్ని అందించి, నిస్వార్థంగా తనువులు చాలించారు. ఫలితం: రెండు దశాబ్దాలు తిరక్క-ముందే, స్మగ్లర్ సార్వభౌములు, సారా రాజులు, బ్లాక్ మార్కెట్ చక్రవర్తులూ మాఫియా గ్యాంగులూ, బందిపోటు దొంగలూ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో పాలకులై దేశం నలుమూలలా వీరవిహారం చేస్తున్నట్లు దినపత్రికలను చదవని వాళ్ళకు కూడా తెలుసు! గాంధీ ప్రబోధాలను ఆరడుగుల లోతున పాతేసి అక్టోబరు రెండు నాడు ఓట్లకోసం బయటకు తీసి, ఆయన సిద్ధాంతాలను భూ స్థాపితం చేసి ఖద్దరు టోపీలను బీరువాల్లో బీరు, విస్కీ సీసాల ప్రక్కన భద్రపరుస్తున్నారు! పైలోకాలనుండి గాంధీ గారు చూస్తే షాక్ తగిలి నిలువునా కూలిపోతాడు. ఎందుకు స్వతంత్రము తెచ్చిపెట్టానా అని ఏడ్చి తిడుతాడు. సొమ్ము మనది షాక్ ఆయనది.

ఇదేనండీ లోకం తీరు! అయిదువ్రేళ్లూ వాటి అవసరాలు, విలువలూ ఒకటే అయినా ఆ మాటకొస్తే బొటనవ్రేలు ఎక్కువ ప్రాముఖ్యాన్ని కలిగి వున్నా 'రింగ్ ఫింగర్' అవార్డు కొట్టేసింది ఎవరు? 'అనామిక'. కొందరు ప్రతిభా పాటవాలు లేకున్నా అంచెలంచెలుగా జీవిత సోపానంలో నిచ్చెనమీద నిచ్చెనలెక్కి పాపులర్ అయి కూర్చుంటారు. కలికాలంలో పాపుతే పాపులర్! కొందరు దురదృష్టవంతులు వారెంతటి పండితోద్దండులైనా పబ్లిసిటీ లేక భజన పరులను ప్రోగుచేయలేక పస్తులుండటం వింటున్నాం. ఎందరో మహానుభావులు అజ్ఞాత కళాకారులుగా అసువులు బాయటం కద్దు. అంతేనండి ఈ యుగంలో అనామకులకే అగ్రాసనాలు! ఫ్రీ పాసురాయుళ్ళకే ఫ్రంట్ సీట్లు! ప్రతిభ గల వాళ్ళకు బాక్ సీట్లు!



# 2. అసత్యమేవ జయుతే !?

నాస్తి సత్యాత్ పరోధర్మో-నానృతాత్ పాతకం వరమ్
స్థితిర్హి సత్యం ధర్మస్య-తస్మాత్ సత్యంనలోపయేత్

"సత్యము కన్న గొప్ప ధర్మము అసత్యమును మించి పాతకమును లేవు సత్యము వల్లనే ధర్మము నిలబడు చున్నది. కావున సత్యమును పాటింప వలెను. అని నీతి సూక్తి. "సత్యమేవ ఈశ్వరో లోకే సత్యేధర్మ ప్రతిష్ఠితః సత్యమూలాని సర్వాణి సత్యాన్నాస్తి పరంపదం "అని మరొక ప్రవచనం.

ప్రపంచంలో వందలాది మతాలున్నాయి మత సూత్రాలు కూడా విభిన్నంగా ఉండటం కద్దు కానీ అబద్ధమాడరాదు అనీ సత్యమునే పలుకవలె నని అన్ని మతాలవారూ రాసుకున్నారు ఆచరిస్తారా అని అడక్కండి అక్కడే చిక్కు. మానవులకు ముఖ్యంగా మనవాళ్లకు హిపోక్రసీ పాళ్లెక్కువ పటాటో పాలు పైపై మెరుగులు! గ్రంథాలు రాసుకోవడంలో, విభూతి పూసుకోడంలో ఊర్ధ్వపుండ్రాలనూ తులసి మాలలను ధరించడంలో వున్న శ్రద్ధ ఆచరణ దగ్గర కొచ్చేసరికి యాభైశాతం డిస్కౌంట్! ఇంకా ఎక్కువే నేమో.!

మన వాళ్ల కున్నన్ని మతగ్రంథాలు ఏ దేశంలో గూడా లేవు. వేదాలు వేదాంగాలు, అష్టాదశ పురాణాలు, ఉపపురాణాలు, ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రాలు. భగవద్గీత, బండ్ల కొద్ది భాష్యాలు! ఓ! ఓ! ఎన్నని ఇంకా ఏవో గృహ్య సూత్రాలనీ షడ్దర్శనాలనీ బోలెడు గ్రంథాలు రాసులు రాసులు విదేశాల వాళ్లకి ఇంత సంపద బాదర బందీ ఉన్నట్లు లేదు ఒకటి, రెండు బైబిలు, పాత నిబంధనలు కొత్త నిబంధనలు అంతే ఒకటి, రెండు గ్రథాలున్న వాళ్లే, వాళ్ల వాళ్ల మతాలను ఆచరించ లేక తన్నుక చస్తున్నారు "పొరుగును ప్రేమించు అన్నారు వారు ఎంత వరకు ప్రేమిస్తున్నారు? కాదంటే వేరే

అర్థంలో ఉండొచ్చు. **Love thy neighbour all the day but when her husband is away.** అన్నాడట ఎవరో.

ఎప్పుడు చూచినా యుద్ధాలు, ఎక్కడ చూచినా ఆయుధాల రాసులు: యుద్ధ భయాలు: అన్నిమతాలు సత్యమునే పలుకమనీ స్వార్థాన్ని తగ్గించు కోమనే మెటీరియల్ జనుని రియల్ జనునిగా చేసేనే రెలిజియన్. ఇది ఎంత వరకు అమలుపరచబడిందో గత చరిత్ర పుటలు ప్రతి పేజీ చాటు తూనే వుంది. ఎన్ని మతకలహాలు: మత యుద్ధాలు: మతాధిపతుల్లోనే షష్టాష్టకాలు: స్వార్థాలు కుతంత్రాలు: రాజకీయాలు.:

చం॥ సకల మతాలు నూరుపనిషత్తులు, గీత పురాణశాస్త్రముల్
రకరకమైన తత్త్వములు రాజులొసర్చిన ధర్మశాసనా
లొకటియు గూడ నిన్నణగ ద్రొక్కగ జాలవె నిన్ జయించుటల్
సుకరమె మర్త్యకోటికిని చూడ అజేయుడవో అసత్యమా.:

ఈ సత్యపరిరక్షణ ఏ యుగాంలో నైనా జరిగిందా అని ఈ పాడు దేహానికి సందేహం: దేవతల రాజు ఇంద్రుడే అబద్ధాల కోరు: అనుక్షణం పరాంగనలను కోరు కానీ జనం అలా అనుకోరు యజ్ఞాల్లో పూజించటం మానుకోరు: 'అహల్యాజారుడు' అనుబిరుదాంకితుడైన బిడౌజుడు (ఇంద్రుడు) అంటే అహల్యమ్మ దగ్గర కాలు జారిన వాడని: పురాణ పురుషుడైన కృష్ణుడు ధర్మ రాజు సమయాను కూలంగా అబద్ధాలాడి నెట్టుకొచ్చిన దాఖలే: కాదంటే ధర్మ సూక్ష్మాలనీ రాజనీతి అనీ, లోక కళ్యాణార్థమనీ, పూర్వ జన్మ శాపమనీ, పాప మనీ వాటికి కాస్త వార్నిష్ పూసి బుకాయిస్తారు నాకు తెలిసినంత వరకూ మీకు కోపంకాదంటే మీకు, లేదా మనకు తెలిసినంత వరకూ ఈ సత్యాన్ని పట్టుకొని ఊగిసలాడ కుండా ఊగులాడిన రాజు హరిశ్చంద్రుడొక్కడే. కృష్ణ పరమాత్మగారు 'సత్యా సత్యా' అని సత్యభామగారి 'శారీ' బట్టుకొని తిరిగాడే గానీ 'సత్యం' కొంగు పట్టుకోలేదు. కాదంటారా? మహాభారతం తిరిగెయ్యడి టి.వి. భారతం కూడా మరోసారి చూడండి. హరిశ్చంద్రుడు, పాపం: ఆ ఇక్ష్వాకులరాజు వ్యాకులపడి, ఆకులలములు తినుకుంటూ, ఆలిని అమ్ముకొని

తనను అమ్ముకొని, సర్వనాశనమయ్యాడు అలాంటి 'నభూతో నభవిష్యతి' యనదగ్గ ఆదర్శమూర్తికి మన పవిత్ర భారత దేశంలో ఎక్కడైనా ఒక్క దేవాలయం కట్టించామా? ఊ. హూ. తమిళనాడులో 'ఒట్టేరి' అనే ఒక కుగ్రామంలో హరిశ్చంద్రదేవాలయం ఉందిట. అదీ ఎక్కడ? శ్మశానంలోనట! ఎందుకు? దయ్యాలు పూజించడానికా? సత్యహరిశ్చంద్ర సినిమా చూచి, ఎంత మంది సత్యవ్రతమునకు కంకణం కట్టు కున్నారో తెలియదు. బ్లాకులో టిక్కెట్లు కొని అరటికెట్టు కక్కుర్తి కోసం, తమకుర్రాళ్ల వయస్సు అబద్ధంచెప్పి, గాడిద బరువు కుర్రాళ్లను భుజాల కెత్తుకొని సినిమా చూచినవాళ్లు చాలా మంది వున్నారు. నా మిత్రుడు అన్నవరం సత్యనారాయణ "ఇక ముందు బుద్ధుంటే నిజం చెప్పకూడదు అని నిజంగా ఒట్టేసు కున్నాడు. అప్పటి నుండి వాడు అసత్యనారాయణ అయ్యాడు.

నిజం నిప్పులాంటిది అంటారు. అక్షరాలా నిజం. నిప్పు ఎప్పటికైనా బూడిద కావాల్సిందే. ఆ నిజం చెప్పేవాడు కూడా బూడిదగా మారకున్నా అంత్యదశలో పూసుకోవలసి రావచ్చు.

నాకు అప్పుడుపుడు అనిపిస్తూంటుంది. మొత్తం మన భూగోళం అంతా 'అబద్ధం' అనే ఇరుసు మీదనే తిరుగుతూందా, అబద్ధం చేతనే పరిరక్షించ బడు తూందా అని! కాదంటారా?

మీ రేషను కార్డు చూసుకోండి. మీ సుపుత్రుల, పుత్రికల జనన తేదీలను స్కూలు రికార్డులో చూచుకోండి. సినిమా తారల వయస్సు వద్దులెండి. వారి ఆదాయపన్ను రిటర్న్సు చూడండి. అమాత్యవర్యుల ఆస్తి వివరాలు చూడండి హరిశ్చంద్రపాత్రధారిగా, శ్రీరాముని పాత్రధారిగా, నటించి ప్రజలలో చెరగని ముద్రవేసిన నటసార్వభౌముల, పద్మశ్రీల, పద్మవిభూషణ్ బిరుదాంకితుల ఆదాయపన్ను కాగితాలు తిరగెయ్యండి. పది సంవత్సరాల పాటు రిటర్న్సు దాఖలు చెయ్యకుండా మరచిపొయ్యానని నమ్మపలికిన రాజ్యాధినేతలు మనకున్నారు!

"ఏమిటయ్యా పాలు మరీ నీళ్లగా వున్నాయ్? అని నిలదీసి అడిగితే గేదె మీద ఒట్టు నీళ్లు కలపలేదంటే కలపలేదంటాడు పాలు పోసే పోలయ్య.

ఇంట్లో సత్యనారాయణ వ్రతం అని సెలవు చీటి గీకి పారేసి, ఆఫీసు కెగేసి మాట్నీలకు, క్రికెట్ గేమ్స్‌కూ చెక్కేసే నిజాయితీ వరులు మనలో లేరా?

కోర్టుల్లో ప్రమాణాలు చేసి చెప్పే సాక్ష్యాలలో నిజం పాళ్లు ఎంతో తెలియని దెవరికి? న్యాయవాదులే అబద్ధాలు నూరిపోస్తారాయె!

పిల్లాడే లేకున్నా "అబ్బాయికి ఉపనయనం" అనీ 'పుట్టు వెంట్రుకలు' అనీ అర్జీపెట్టి, ప్రావిడెంట్ ఫ్రండ్ లోను తీసికొని, అనునయంగా "అశ్వమేధ యాగాలను" పావనంచేసి 'పూజ్యులై, పోయిన అశ్వద్ధనారాయణులున్నారు!

ఇన్ కం టాక్స్ కన్సల్టెంట్లనీ, స్టడీ సర్కిల్ అనీ, ఎడ్యుకేషనల్ అకాడమీ లనీ అదనీ ఇదనీ ఆర్భాటంగా బోర్డు పెడితే పదికాలాలపాటు వర్ధిల్లు తుంది గానీ, "ఇచట ఆదాయపన్నులు ఎగగొట్టు మార్గములు చెప్పబడును" అనో డబ్బు తీసికొని పరీక్షలు పాసు చేయించ బడును అనో అసలు రహస్యం బయటపెట్టి బోర్డు కడితే రెండో రోజు టపాకట్టాల్సిరాదూ.!

అను నిత్యం మనం చెవులు చిల్లులు పడేటట్లు వినే ప్రకటనలు, పచ్చి అబద్ధాలో, పాక్షిక సత్యాలో కావా.?

ఇహ పోతే, రాజకీయాల్లో నిజం ఎంత రసవత్తరంగా పోషించ బడుతూందో మీకు తెలియనిదా? మన గిరీశం సూక్తులే వారికి శిరోధార్యాలు 'గోబెల్స్' దొరగారే వారి కులదైవం!

"అయ్యా!బాబూ! నాకు పదవీ దాహం ధనవ్యామోహం పెచ్చు పెరిగింది పిల్లల పెళ్లిళ్లున్నాయ్. చిన్న సైజు కోటీశ్వరుణ్ణో, పెద్దసైజు లక్షాధి కారినో కావాలని కలలు కంటున్నా. దయచేసి నాకు 'ఓటు' వెయ్యండి. చచ్చి మీ కడుపున పుడతా. ఈజన్మకు మీమేలు మరవను" అని ఏడుపుగొట్టు మొగముతో మనసులో వున్న మాట చెపితే తలకాయ వున్నవాడెవడైనా వోటు వేస్తాడా?

"బ్రహ్మాండాన్ని డిసమెట్లు పెట్టి బ్రద్దలు చేస్తా. బీదరికాన్ని చిరునామా లేకుండా చించి చెండాడుతా, అవినీతికి అవనీ తలములో ఆరడుగులలోతు సమాధి కట్టిస్తా" అని పొలికేకలు పెడతాడు. మీ ఇంటి ముంగిటకు వచ్చి, బిడ్డ గా వుతున్నా సరే మీ కుర్రాడే అనుకొని మీ పనిమనిషి పిల్లాడిని యెత్తు కుంటాడు. అదంతా సొల్లు కూతలు లొల్లు కూతలు అని మన అంతరాత్మకు తెలిసినా, మనకు పెద్ద తలకాయ వున్నా ఆ అసామీకే 'ఓటు' వేస్తాం! ఎన్నికల ముందు ఓటు! గెలిస్తే వాట్? అంతా షరా మామూలే! ఓటు అంటే ఓటమి భంగపాటు అని కూడా నైఘంటిక కార్థాలండోయ్!

అణుబాంబులు తయారు చేస్తూకూడా అబ్బే! అదేదో మాకు తెలియదు రామ!రామ! (లేదా అల్లా అల్లా అని అని యుంటాడనుకోండి) అని దబాయించే పొరుగు దేశాలు లేవూ!

రాజకీయ నేతలు పరస్పరం బురద చల్లుకోవడం, 'త్వంశుంఠ' అంటే 'త్వంశుంఠ' అనుకోవడం, పత్రికల కెక్కడం, అవి కట్టు కథలని, సయోధ్య వారూ 'పరక్కు' కథలని అయోధ్య వారూ(?) విరుచుక పడటం సవాళ్లూ, ప్రతి సవాళ్లూ, రాజీనామా బెదరింపులు (ఉత్తుత్తిగనే?!) అందరూ కలసి ఒక అవగా హనకొచ్చి ప్రజలకు పంగనామాలు పెట్టడం ఇవన్నీ మొచివట్టిన వార్తలు.!

అందాకా ఎందుకు? మన ఇంట్లోనే చూడండి క్లబ్బులో రాత్రి పన్నెండు దాటేదాకా ఉండి కొంప జేరి "ఆఫీసులో వెధవ ఇన్‌స్పెక్షన్ తగలడింది చచ్చేంతపన్కి" అని అర్ధాంగితో అబద్ధమాడి ఇంట్లో రణరంగం తప్పిస్తాడు బ్రదుకనేర్చిన భర్త.!

అప్పుడప్పుడు అయ్యగారికి తెలియకుండా, పోపుల పెట్టెలో (అది ఆడువారు 'సేఫ్ డిపాజిట్ లాకర్) పొదుపు చేసి కొనుక్కున్న పట్టుచీర "మా అమ్మగారు మొన్న పండక్కి పెట్టారు" అని అత్తగారితో కాస్తంత దర్పం ఒలకబోస్తూ బుకాయిస్తుంది లౌక్యం నేర్చిన ఒక అమ్మడు.!

కాలేజీకి వెళ్ళిన అమ్మాయి కధలు....పాపం వ్రాయలేక....సదపుతూ "ఇంత ఆలస్యం ఎందుకమ్మా" అని తండ్రి అడిగితే (తెలుగు సినిమాల్లో సాధారణంగా తల్లి ఉండదు!) 'ప్రైవేటు క్లాసు తీసికున్నాడు నాన్నా!" అని అమాయకురాలి పోజు పెడుతుంది. సదరు పుత్రికా రత్నం త్వరలో నెలదప్పే ముప్పు వచ్చి పడేదాకా!

ఈసారి జీతం ఇంత తక్కువ వచ్చిందెందుకురా అంటే కటింగ్స్ ఎక్కువ అయ్యాయ్ నాన్నా!అని నమ్మబలుకుతాడు క్రొత్తగా పెండ్లిచేసుకున్న పుత్ర శిఖామణి ఇంట్లోకి హడావిడిగా దారితీస్తూ!

ఈ ఉదాహరణలు ఇక చాలు! ఇలా ఏకరుపు పెడుతూపోతే మూడు పెన్నులూ ఆరు తావుల కాగితాలూ చాలవు. కాగితాల ధరలు?.... మీకు తెలియందేముంది!

అబద్ధాలాడడాన్ని మన పూర్వీకులు చతుష్షష్టి కళల్లో ఎందుకు చేర్చ లేదో? చోర కళను చేర్చిన విజ్ఞులు అబద్ధాలాడడాన్ని వెలివేయడం, అన్యాయం! నిజానికి, నిజాన్ని చెప్పడం బహు సులభం. దానికి శిక్షణా, గట్రా అక్కర్లా. అదే అబద్ధం చెప్పాలంటే ఎన్ని రిహాల్సుండాలి! ఎంత గుండె ధైర్యం కావాలి. అంతరాత్మను చంపుకునేందుకు ఎంత ఆత్మ విశ్వాసం వుండాలి! ఎంత జ్ఞాపక శక్తి, సమయస్ఫూర్తి, సంయమనం వుండాలి!

అదే విదేశాల్లో అంతర్జాతీయ అబద్ధాలకోర్ల మహాసభలు వైభవంగా జరిపి అత్యుత్తమ అబద్ధానికి నిజంగా బహుమతి ఇస్తారట! మన ఖర్మభూమిలో అలాంటి యేర్పాటు లేకపోవడం మన దేశ ప్రతిష్ఠకే భంగం కాదా!

బీడిల్ అను మహాశయుడు "**Half of the work that is done in this world is to make things appear what they are not**" అని తేల్చిపారేశాడు! ఎంత సున్నితంగా దెబ్బకొట్టాడు! సత్యాన్ని, సత్య స్వరూపాన్ని మరుగుపరచుటకే మానవాళి సగం కాలాన్ని తగలేస్తుందట!

ఒప్పుకోరా. అనుమానమా? అయితే ఈ బండ్లకొద్దీ కాస్మటిక్సూ, హేర్ డైలూ కట్టుడు పళ్ళూ కాంటాక్ట్ కటకాలూ సవరాలూ, విగ్గులూ, వగైరాలూ ఏమిటంట!

లేనిది ఉన్నట్లుగా, ఉన్నది లేనట్లుగా కనిపింపజేసే నిరంతర ప్రయత్నంలోనే జనాలు ఉన్నదంతా ఊడ్చిపెట్టుకొంటున్నారు. లేనివాడు లేనట్టుగ పడియుండక ఉన్నవానిననుకరించి ఉన్నది ఊడించుకొంటాడు!

ప్రపంచమంతా ఇలా అబద్దాలు ఎందుకు ఆడతారు? అబద్ధం ఆడితేనే గానీ జీవితం సాఫీగా నడవని పరిస్థితి, దుస్థితి ఎందుకు వచ్చింది? ప్రతివాడూ లేనిది ఉన్నట్లుగా ఉన్నది లేనట్లుగా కనబడాలని ఉబలాట పడతాడెందుకు ?

వీటిని గూర్చి కాస్త పరిశోధించాలి అనుకొని, తెలుగు నిఘంటువును తెరిచా. అనుకోకుండా ఒక 'క్లూ' దొరికింది. ఏమిటంటారా నిఘంటువులో ప్రపంచము అంటే (1) భూలోకం, (2) సంసారం, (3) శబ్ద విస్తరం, (4) విరివి, (5) రచన, 6) వ్యత్యాసము, [7] మోసపుచ్చుట. అని ఏడు అర్థాలిచ్చాడు. అదండీ సంగతి! ఇదంతా నిఘంటుకారుని పని. ఆ యేడో అర్థాన్ని అమలుపరచి అహోరాత్రాలూ అహోరిస్తున్నాము!

మన పుట్టిన భూమినే తీసుకుందాం. "గోళాకారంగా వుందని జాగ్రఫీ చదువుకున్నాం." అబ్బే నేను బల్లపరుపుగా వున్నానే కనబడ్డంలేదా? గోళం లేదూ, గండ్రగోళంలేదూ అని భూమి నవ్వేస్తుంది.

సూర్యుని చుట్టూ తిరుగుతుంది అనీ తన చుట్టూ తాను తిరుగుతూంది అనికూడా జాగ్రత్తగా జాగ్రఫీ చాటిందాయె!

నాయనా! అధికార్లచుట్టూ, మంత్రిగార్లచుట్టూ, వారి కార్లచుట్టూ, అప్పులాళ్ళచుట్టూ, ఆఫీసులచుట్టూ, అంగనామణులచుట్టూ, ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్చేంజీలచుట్టూ, ఎలక్ట్రిక్ ఆఫీసులచుట్టు, సినిమాహాళ్ళచుట్టు తెల్లవారింది

మొదలూ తిరుగుతూ, పాదాభివందనాలు కూడా చేసే పాడు అలవాటు మీకుంది గానీ ఆ తిరుగుళ్ళ టెక్నిక్ నాకు తెలియదు సుమీ. మీరే అద్దమైన తిరుగుళ్ళకూ అలవాటు పడ్డారు అని తిరుగుతూనే బుకాయిస్తుంది ! చుక్కలెక్కడున్నాయో చూపించవయ్యా సూరీడా అంటే అబ్బే ఆకాశంలో అవి లేనే లేవంటాడు !

మన భూమే ఇలా పచ్చి అబద్ధాలాడితే దానిమీద నివసించే అల్ప జీవులమైన మనము అందులో బుద్ధి జీవులమని భ్రమపడే మనము అవనిలో అడుగిడినప్పటినుండీ ఎప్పుడు టపా కట్టేస్తామో చెప్పలేని మనము భూగోళ ప్రభావితులము కాకుండా ఎలా వుండగలం ? పృథ్వీతలంపై పాదాలు మోపితే చాలు. మాటలే కాదు కనిపించేవి అన్నీ ఖచ్చితంగా అబద్ధాలే! కన్ను అను పదమే 'Cunning' లో నుంచి పుట్టిందేమో. నేత్ర అనే శబ్ద కూడా న + ఇతి — నేతి = ఇది కాదు అనే అర్థంలో ఏర్పడి యుండకూడదాం ఏమో? సూర్యుడు ఉదయించినట్లు, అస్త మించినట్లు అగపడటం అబద్ధం గాదా నక్షత్రాలు సూర్యునికన్నా, చంద్రునికన్నా చిన్నవిగా కనిపించడం అబద్ధం గాదా. ఆకాశం భూమిని స్పృశించినట్లు కనిపించడం అబద్ధం గాదా? నీలంగా ఉండటం అబద్ధంగాదా. ఎండమావుల్లో కనిపించే నీరు అబద్ధంగాదా. తస్సాదియ్యా! అన్నీ అబద్ధాలే! పచ్చి అబద్ధాలే!

శ్రుతిలయలే జననీ జనకులు కావా ! అన్నారు శ్రుతిఃమాతా లయః పితా అని. అనగా "పైవారి మాటలకు తైరు కొట్టి శ్రుతి కలపాలి" లయ తప్పకుండా చూచుకోవాలి. లయ అంటే మోసపుచ్చుట అని కూడా అర్థమండోయ్! లయ నుండి వచ్చిందే LIE వుండొచ్చు. లా తెలిసిన వాడు లాయర్ కాడు. లయలు నేర్చినవాడే లాయర్! జడ్జిగారి వద్ద లయలు చేయాలి! ఆయనగారి మూడ్‌ను గమనించి శ్రుతి, లయలు పట్టాలి అప్పుడు గానీ ఆ లాయరు గారికి గురువు ఏకాదశంలోనో, ఉచ్చలోనో, స్వస్థానంలోనో అంటాడు. ఎంచక్కా స్మగ్లర్లకూ, ఖూనీకోర్లకూ, బ్లాక్‌మార్కెటీర్లకూ సంఘ విద్రోహులకూ వగైరా శాల్తీలకూ బెయిళ్ళు ఇప్పిస్తూ, జైళ్ళ తప్పిస్తూ

ఆపద్బాంధవుడై అపర కుబేరుడైపోతాడు! ఈ సూత్రం ఉపేక్షించాడో, తాడూ, బొంగరమూ లేనివాడై చెట్టు నీడల నాశ్రయించి అడ్వకేట్ కాస్తా అడవికాట్ (Cat) అయిపోతాడు! లేదా ఉత్త UTTA అడ్వకేట్ అనగా **Under The Tree Advocate** అని అంటాడు మా ఫ్రెండ్.

యదార్థవాదీ లోక విరోధీ అని మనవాళ్ళు స్వానుభవంతో చెప్పినట్లే వుంది మరి!



# 3. శిశుర్వేత్తి! పశుర్వేత్తి!

సంగీత మంటే చెవి కోసికొని వారుండరు, కొండొకచోట మూసికొని మండిపడేవారుండక పోరనుకోండి అలాంటి శాల్తీలను మానసిక రోగులుగా, ప్రతిసూత్రానికి మినహాయింపులుంటాయని ప్రత్యేక సూత్రవర్గులుగా పరిగణించాలి! సంగీత మంటే 'ఎలర్జీ' బాధితులకు హోమియోపతి చికిత్సలో ఏవో మందులున్నాయట! అవి మన కొద్దులెండి. 'మనకు' అని మిమ్ములను కూడా ధైర్యంగా ఎందుకు కలుపు కున్నానండే మీకు సంగీత మంటే, మంట గాదనీ గ్యారంటీగా ఇష్టమే నని నాకు సంపూర్ణ విశ్వాసంగనుక.

సంగీత మనగానే కేవలం శాస్త్రీయ సంగీతమే కానక్కరలేదు. పాప్ మ్యూజిక్, డిస్కో పాటలు ఎంకి పాటలు, జానపద సంగీతం, యక్షగానాలు, ఏదైనా సరే! శాస్త్రీయ కాని సంగీతాన్ని లలిత సంగీతం అన్నారే గానీ, అశాస్త్రీయ సంగీతం అని నామకరణం చేయనందుకు సంతోషిద్దాం.

'శిశుర్వేత్తి, పశుర్వేత్తి వేత్తి గాన రసం ఫణిః' అని మన వాళ్లు ఏనాడో తేల్చిపారేశారు. పాములకు అసలు చెవులే లేవనీ, కాబట్టి, చెవులు కోసుకొని పాములవాని సొరకాయ బుర్రకుగానీ, శంకరాభరణ రాగానికి గానీ పరవశత్వ చెందే ప్రసక్తే లేదనీ, అవి పగపడతాయను కోవడం మూఢ విశ్వాసమనీ పాము మంత్రం, తేలు మంత్రం అంతా ఒక తంతు అనీ ఆధునిక శాస్త్రజ్ఞులు నెత్తీ నోరూ కొట్టుకోకుండానే డంకా బజాయించి చెప్తున్నారను కోండి. 'చక్షుశ్రవము అని పామును అనటంలో అర్థంలేదట! ఈ సైన్సును పూర్తిగా నమ్మనూలేము అలా అని కొట్టిపారేయనూలేము. స్వానుభవము అయ్యేదాకా.

సుప్రసిద్ధ చరిత్రకారుడు, విమర్శకుడు, కళాకారుడు, భారతీయుడు, ప్రస్తుతం అమెరికా పౌరసత్వం పొంది యున్న డా. రామకుమారస్వామి [ఈయన గారు కీ॥ శే॥ ఆనందకుమారస్వామి పుత్రుడు] ఏమన్నాడో తెలుసా?

"అన్నిటికన్న మించిన మత్తుమందు 'సైన్సు'. దాని పేరిట చలామణీ అయ్యే మూఢనమ్మకాలకు సాటి లేదు. ప్రగతి, పరిణామం అన్నవి కూడా యథా శక్తి నిషా పదార్థాలుగా తయారయ్యాయి" అని అవహేళన చేశాడు!

ఆయనగారు సెలవిచ్చిన దాంట్లో నిజము పాళ్లు ఎక్కువే అని నా అంతరాత్మ సెలవిస్తూంది సుమండీ! రెండు మూడు దశాబ్దాల క్రిందటి సైన్సు, దశ దిశ ఎన్నో మలుపులు తిరిగింది. తిరుగుతూంది. ఇంకా తిరుగుతూనే వుంటుంది మన భూగోళం లాగా. వాళ్లది ఎప్పటికీ 'రీసర్చే' దప్ప ఫైనల్ సర్చ్ కాదుమరి. సైన్సు ఎలా ఎలా దినదినం మారుతూందో చిత్తగించండి!

1930 లో మాచిన్నతనంలో భూగోళం త్వరత్వరగా వేడెక్కి పోతూందని అదరగొట్టారు. వేడెక్కడం సంగతటుంచి. 1940 నుంచి 1970 వరకూ క్రమంగా తగ్గుతూందన్నారు, మళ్లీ శాస్త్రజ్ఞులు 'అదుగోవచ్చేసింది వచ్చేసింది. మంచు యుగం వచ్చేసింది. అన్నారు ఇప్పుడేమో ఊహూ. మళ్లీ వేడెక్కుతూందిట అందు వల్ల ఆర్కిటిక్ అంటార్కిటిక్ ధ్రువాల్లో మంచు కరిగి ఆ నీరు క్రమంగా సముద్రాల్లోకి ప్రవహిస్తుందట. వచ్చే శతాబ్దానికి సముద్రమట్టాలు పది, పదునైదు అడుగులైనా పెరిగి కూర్చుంటాయట! తమాషా ఏమిటంటే మళ్లీ మరో వర్గం వారు, [వాళ్లూ శాస్త్రజ్ఞులే!] ఇహిహీ నాన్సెన్స్! అంటున్నారు!

ఇంతవరకూ మనం సూర్యుడు స్థిరంగా వుంటాడనీ భూమి, ఇతర గ్రహాలూ సూర్యుని చుట్టూ తిరుగుతూంటాయని చదువుకున్నాం. అలా రాసి మార్కులు కొట్టేశాం. పరీక్షల్లో. మరి ఇప్పుడేమో తత్ ఆధునిక శాస్త్రజ్ఞులు 'ఛట్' సూర్యుడు స్థిరంగా వుండటం లేదనీ, నిముసానికి 320 కి.మీ. స్పీడులో తిరుగు తున్నాడనీ అలా అంతరిక్ష నౌకలందించిన సమాచారం వల్ల తేలిందనీ తేల్చారు!

కుజగ్రహంలో ప్రాణులుండే అవకాశమే లేదన్నారు. ఇప్పుడేమో ఉండే

అవకాశం లేక పోలేదనీ, మరీ చెప్పాలంటే ప్రాణులుండే అవకాశాలే ఎక్కువ అనీ అంటున్నారట. మనవాళ్లు 'కుజుడిని' భూపుత్రుడు (కు—భూమి, జః పుట్టినది) అని ఏనాడో ప్రకటించారు!

యజ్ఞాలూ, యాగాలూ, శుద్ధవేస్టు అన్నారు, ఇప్పుడు యజ్ఞయాగాదులలో వచ్చే హోమధూమము వల్ల భూగోళమును సంరక్షించే ఓజోన్ పొర సంరక్షించ బడుతూందని పరిశోధనల్లో తేలు తూన్నట్టు అడపాదడపా వార్తలొస్తున్నాయ్! మన సువిశాల విశ్వం, సుమారు వెయ్యి కోట్ల సంవత్సరాల క్రిందట 'బిగ్ బాంగ్' [బ్రహ్మాండ మైన ప్రేలుడు శబ్దం] వల్ల ఏర్పడిందన్నారు, కానీ ఇటీవల జరిపిన అంతరిక్ష నౌకల పరిశోధనల వల ఆ అభిప్రాయం అంత సత్యం గాక పోవచ్చునే ఆలోచనలో పడ్డారట!

ఎగిరేపళ్లెల విషయం కానివ్వండి, హిమాలయాల్లో మంచుమనిషి విషయం కానివ్వండి శాస్త్రజ్ఞుల్లో ఇప్పటికీ భిన్నాభిప్రాయాలున్నాయి గదా!

ఇంతెందుకు మొన్నమొన్నటి దాకా ఆదిమజాతి మానవులు ప్రస్తుత మానవుని రూపం సంతరించుకున్నది మొదట ఆఫ్రికా ఖండంలో అన్నారు. మరి ఈ మధ్య చైనా దేశంలో కొన్ని శిలాజాలు లభ్యమయ్యాయట వాటిని విశ్లేషిస్తే ఒక్క ఆఫ్రికాలోనే కాదు, ఇంచుమించు ఆసియా, యూరోపు దేశాలలో కూడా ఈ పరిణామం సంభవించినట్లు తేలుతూందట!

ఐన్‌స్టీన్ సిద్ధాంతాన్ని విమర్శించి సవరణ ప్రతిపాదించిన శాస్త్రవేత్త నర్లేకర్ భారతీయుడు గదా.

సంగీతంతో కొన్నికొన్ని మానసిక రోగాలు కుదురు తాయంటే మా కాలంలో శాస్త్రజ్ఞులు అంగీకరించలేదు. ఇప్పుడిప్పుడు సంగీతం వినిపిస్తే పశువులు ఎక్కువ పాలు ఇస్తున్నట్లు రుజువవుతూందని అంటున్నారు శిశుర్వేత్తి తెలుస్తూనేవుంది 'పశుర్వేత్తి'కి రుజువులు కనబడుతూనే వున్నాయాయ.

బి.సి.జి. టీకాలు వచ్చిన రోజుల్లో రాజాజీగారు అవి అంత మంచివి

కాదన్నారు. శాస్త్రజ్ఞులు ఆయన్ను అంతగా పట్టించుకోలేదు. ఇప్పుడేమో బి.సి.జి. టీకాలు వల్ల కుష్ఠువ్యాధి వచ్చే అవకాశములున్నాయని శాస్త్రజ్ఞులు అభిప్రాయపడుతున్నట్లు వార్తలు?

అలాగే కుటుంబనియంత్రణకై జరిపే 'వాసెక్టమీ' శస్త్రచికిత్స వల్ల అండముల మీద కాన్సరు వచ్చే అవకాశమున్నట్లు కొన్ని వేలమంది మీద పరిశోధనలు జరిపి ప్రకటించారట ఎడింబరో విశ్వవిద్యాలయంలోని ఒక సుప్రసిద్ధ డాక్టరు

'కెమోదెరపీ' వల్ల కాన్సరు తగ్గుతుంది అన్నారు. ఈ మధ్య కెమోదెరపీ వల్ల రొమ్ము కాన్సరు ఇంకా ఎక్కువయ్యే ప్రమాదమున్నట్లు బోస్టనులోని, హర్వర్డు మెడికల్ కాలేజిలోని డా. స్పెక్లర్ చెప్పారట!

మన పూర్వీకులు గర్భస్థ శిశువుపైన గ్రహణ సూర్యకిరణాలు ప్రసరిస్తే శిశువుకు అంగవైకల్య మేర్పడుతుంది అన్నారు. ఆధునిక వైద్యులు దీన్ని కొట్టిపారవేశారు నాస్తిక సమాజం వారు కూడ 'ఇహిహీ' అన్నారు. మరి ఇప్పుడేమో లక్నోలోని కింగ్ జార్జి మెడికల్ కాలేజీకి చెందిన ఆర్థోపాడిక్ సర్జన్ డా. విజయప్రకాశశర్మ మన పూర్వీకులు చెప్పింది నిజమేనని గ్రహణ సూర్యకిరణాల వల్ల శిశువుకు అవయవలోపం వచ్చే అవకాశాలు లేక పోలేదని అలా విస్తృత పరిశోధనలో తేలిందనీ చెపుతున్నాడని పేపర్లో వార్తలు వచ్చాయి

పంచదారకూ సుగర్‌వ్యాధికీ సంబంధమన్నారు ఇన్నాళ్లు. మరి ఇప్పుడు పంచదారకూ, డయబెటిస్‌కూ ప్రత్యక్ష సంబంధ లేదూ. పంచదారకూ ఊబ శరీరానికి మాత్రం సంబంధం వుంది. ఊబశరీరానికి సుగర్ వ్యాధికీ కొంత వరకు సంబంధం అని విస్తృత పరిశోధనల్లో తేలిందని వార్త!

రక్తపోటూ గుండె జబ్బు కలవాళ్లు కొలెస్టరాల్ ఎక్కువగా ఉండే కోడిగుడ్లను తీసికుంటే మంచిది కాదన్నారు. ఇటీవల అమెరికన్ హార్ట్ అసోసియేషన్ పరిశోధకులు త్చే చెప్పినదేమనగా "రక్తంలో ఎక్కువగా వుండే కొలెస్టరాల్‌ను, ఎక్కువ కొలెస్టరాల్ శాతం వుండే ఆహారపదార్థాలే

కొలెస్టరాల్ లెవలును అదుపులో వుంచగలదనీ! హోమియో సిద్ధాంతము అదేగా.ఉష్ణం ఉష్ణేన శీతలమ్ అని మన వాళ్లు అన్నారు!

పోతే, రక్తంలో కొలెస్ట్రాల్ లెవలుకూ, గుండెజబ్బులకూ సంబంధం అనుమానాస్పదమేననీ, కొలెస్టరాల్ తగ్గించి నంత మాత్రాన గుండెజబ్బులు తగ్గుతాయని ఖండితంగా చెప్పలేమనీ లండన్ నగరంలోని స్వీడన్ శాస్త్రజ్ఞుడు డా. యు. రవన్‌స్కోవ్, ఘంటాపథంగా చెపుతున్నాడని వార్త. చాకొలెట్లు తింటే పళ్లు చెడిపోతాయనేది రూడిగా ఇంకాచెప్పడానికి లేదట మితంగా అయితే పర్వాలేదట!

వెనకటి రోజుల్లో సైన్సు పాఠాల్లో 'శరీరము కాలినప్పుడు కాలిన చోట చల్లనీళ్లను పోయరాదు' అని చెప్పారు ఇప్పుడు చల్లనీళ్లను పొయ్యమంటున్నారు.

కాఫీకి గుండె పోటుకు సంబంధం వుందన్నారు. ఆమధ్య జాన్ హపిన్స్ మెడికల్ ఇన్స్టిట్యూట్‌కు చెందిన డాక్టర్ రాయ్ ఫ్రెడ్ కాఫీకి గుండె జబ్బుకు ఏమీ సంబంధం లేదని ఘంటాపథంగా చెప్పాడు!

ఇన్నేళ్ల నుంచీ నీళ్లలో క్లోరిన్ కలుపు తున్నారు సర్కారువారు. త్రాగు తూనే వున్నాము ఇప్పుడేమో క్లోరిన్ కలిసిన నీళ్లు త్రాగితే 'కాన్సరు' వచ్చే ప్రమాదాలు ఎక్కువ అని వార్తలు వచ్చాయి.

మన వాళ్లు నిద్రించేటప్పుడు ఉత్తరం వైపు తలను పెట్టి నిద్రించ రాదన్నారు దీనిని మూఢవిశ్వాసం క్రింద కొట్టిపారేశారు ఆధునికులు. ఇప్పుడేమో శాస్త్రజ్ఞులు ఈ సూత్రంలో ఎంతో సైన్సు ఇమిడి యుందని అంగీకరించారట. భూమ్యాకర్షణ శక్తి దక్షిణం నుండి ఉత్తరం వైపుకు ప్రయాణిస్తుంది. మనిషిలో నిబిడీకృతమై ఉన్న ఇనుము, కోబాల్ట్ నికెల్ ఈ ఆకర్షణశక్తికి గురవుతాయి. దక్షిణం తలాపి అయితే ఇలా జరిగే అవకాశం లేదు! చూశారా మనవాళ్ల శాస్త్రీయ దృక్పథం!

పిల్లలు, యువకులు, ఎక్కువ నొప్పిని ఓర్చుకో గలరనీ, పెద్దవాళ్ళు

చిన్నపాటి నొప్పిని కూడా ఓర్చుకోలేరనీ ఇంతకు ముందు శాస్త్రజ్ఞుల అభిప్రాయం. ఇది సరికాదట, నొప్పి అనేది అందరికీ ఒకేలా వుంటుందనీ, దానిని భరించ గల శక్తి కీ వయసుకూ సంబంధం లేదనీ శాస్త్రజ్ఞులు అభిప్రాయ పడుతున్నారట!

ఉప్పువాడకానికీ, రక్తపోటుకూ సంబంధముందని ఇన్నేళ్ళ నుంచీ డాక్టర్లన్నారు. విన్నాము, ఇటీవల, హార్వర్డ్ విశ్వవిద్యాలయంవారు పోర్ట్ లాండ్‌లోని ఓరేగాన్ యూనివర్సిటీలో ఒక ప్రముఖ డాక్టరు డెట్రాయిట్‌లోని మరికొంత మంది పరిశోధకులూ ఎంతో మందిని పరిశీలించి తేల్చిన సారాంశమే మంటే ఆ అభిప్రాయం తప్పట రక్తపోటుకూ. కాల్షియం లోపానికి మాత్రమే

సంబంధమట కాల్షియం లోపం లేనివారిలో రక్తపోటురావటం లేదట మరో ఐదు సంవత్సరాల తర్వాత మళ్ళీ ఏమంటారో.

ఇంత సోదెందుకు? ఆరోగ్యవంతులైన మానవుని శరీర ఉష్ణోగ్రత 98.6 డిగ్రీలని థర్మామీటరు కనిపెట్టక ముందు నుంచీ లేదా కనిపెట్టిన కాడి నుంచీ, శాస్త్రజ్ఞులు చెప్పుతూ వున్నారు. లేదా పొయ్యారు! మరి ఇప్పుడేమో అది కరక్టు కాదనీ శరీర ఉష్ణోగ్రత 98.2 ఫారిన్ హీట్ డిగ్రీలేననీ విస్తృత పరిశోధనల వల్ల అమెరికా శాస్త్రజ్ఞులు తేల్చారట. ఈ తాజా పరిశోధన కేవలం అమెరికనులకే పరిమితమో లేక భారతీయులకూ ఇతర దేశీయులకూ కూడా వర్తిస్తుందో సెలవీయలేదు. ఇంక కొన్నేళ్ళు పోతే కాలే కడుపులు ఎక్కువగా ఉండే భారతీయులకు 100 డిగ్రీలు అనీ, కడుపు నిండిన అభివృద్ధి చెందిన దేశస్థులకు 98° డిగ్రీలే అనీ మరో పరిశోధన ఫలితాలు వెల్లడించ వచ్చు! ఏమో ఎవరు చెప్పగలరు?

చివరి మాట. పాములు పగపట్టడం మూఢ విశ్వాసం అన్నారా. ఆ మధ్య పేపర్లో ఒక వార్త. హుబ్లీలో ఒక ఆసామీ మోటారు సైకిలు కొని దర్జాగా పోతూ, పొరపాటున గమనించకూడా జతకట్టిన ఒక పాముల జంటపై నుంచి పోనిచ్చాట్ట. అందులో ఒక పాము అతనిని కాటేసింది. అక్కడి

కక్కడే మరణించాడు. అతని తల్లిదండ్రులు వాహనం అచ్చిరాలేదని దాన్ని అమ్మేశారు, ఆ వాహనాన్ని కొన్న రెండో అతను గూడా పక్షం తిరగక ముందే పాము కాటుతో మరణించాడట! ఈ విషయాలేవీ తెలియక మోటరు సైకిలును ఇంకోకతను కొన్నాడు ఆ మూడో వ్యక్తి అదే కేసుతో మరణించాడు. ఇప్పుడు ఆ మోటరు సైకిలును కొనే నాధుడు లేడట. ఇలాంటి కథలు అప్పుడప్పుడు అక్కడక్కడ చదువుతూనే వుంటాం. వింటూనే వుంటాం. శాస్త్రజ్ఞులు అభిప్రాయం ఏమైనా.

నిరంతరం మార్పులు, చేర్పులు, వస్తూన్న ఇలాంటి సైన్సులో భవిష్యత్తులో ఎవడో ఒక యమా సైంటిస్టు పాములు కూడా సంగీత ప్రియులే అనీ, శంకరాభరణం రాగానికి పరవశిస్తాయనీ, పగపట్టడం కూడా నిజమేననీ రుజువైనట్లు ప్రకటించేదాకా, ఈ 'శిశుర్వేత్తి' శ్లోకాన్ని అలాగే ఉండనిచ్చి భావి తరాలకు అందజేస్తే క్షేమం వలంటు కోవు. ఏమంటారు?!

# 4. శంకల చక్రవర్తులు

సందేహం వేరు ధర్మసందేహం వేరు, ధర్మసందేహం అంటే ధర్మం విషయమై ఇదమిత్థమనినిర్ణయించ లేని విషమ పరిస్థితి రానురాను దానికి ఒక విధమైన అవహేళనాత్మక అర్థం ఏర్పడి "ఏరా! ఇకనైనా, నీధర్మ సందేహం తీరిందా?" అని ఎగతాళి చేయటం కద్దు. ధర్మసందేహం అంటే చొప్పదంటు ప్రశ్న అనివాడుకలో ప్రయోగించడం పరిపాటై పోయింది!

శంకరాపుర అగ్రహారంలో పుట్టిన మా శంకర్రావుకు అన్నీ శంకలే! అసలు వాడు పుట్టడమే లగ్న సంధిలో, నక్షత్ర సంధిలో పుట్టాడట! చనువున్న వాళ్ల వాడిని 'శంకర్రావు' అనే జోక్‌గా పిలుస్తారు. వాడి బుర్ర శంకల కార్ఖానా! ముఖమే ఒక కొశ్చన్ మార్క్!

పువ్వుపుట్టగానే పరిమళిస్తుందంటారు. పుట్టగానే వీడి లక్షణాలు వాసన పట్టలేక పొయ్యాంగానీ, అయిదో యేటి నుండి గుబాళింపు ప్రారంభమైందని చెప్పొచ్చు! ఒక సారి బస్సులో పోతుంటే వాళ్లఅమ్మ "బస్సులో చేతులు పెట్టకూడదు" అని హెచ్చరించింది "అయితే కాళ్ళు పెట్టొచ్చా! అని అడిగాడేట మావాడు. విష్ణు సహస్రనామ స్తోత్రం చెప్పిస్తూండే వాళ్ల మేనమామ "పుణ్యోపేతం పుండరీకాయతాక్షం అని వస్తే "పుండరీకాయ" అంటే అది ఎలాంటి కాయ? ఆ చెట్టు నాకు చూపిస్తావా? పండ్లు తినొచ్చా? అని వాడు 'బాటనీ శాస్త్రజిజ్ఞాసను చిన్ననాడే బహిర్గతం చేశాడు!

బళ్లో చేర్పించిన తర్వాత తరగతుల్లో ఒక్కొక్క మెట్టు ఎక్కేకొద్దీ ఉపాధ్యాయులకు సమస్యాత్మకంగా, కొన్ని వేళ్ళో వినోదత్మాకంగా తయారై మాస్టార్లను ముప్పుతిప్పలు పెట్టేవాడు. "పెన్సిల్వేనియా" లో పెన్సిళ్లు ఎక్కువ తయారు అవుతాయా?" అని ప్రశ్నించేవాడు. 'గంగడోలు' అంటే ఆ వాయిద్యం ఎలా వుంటుంది? అది గంగానదిలో దొరుకుతాయా?" అని అమాయకంగా అడిగేవాడు!

వయసు పెరిగే కొద్దీ స్వభావం మారక పోగా అను బంధ ప్రశ్నలు కూడా వేయటం అలవాటు చేసుకున్నాడు. "టైమెంతండీ? అని అడుగుతాడు ఇహ అవతలివాడి తాడు తెగినట్టే! అతగాడేదో తనకున్న పాతకాలం వాచీ చూచుకొని టైము చెపుతాడు. అంతటితో మావాడు ఊరుకుంటే వాడు సార్థక నామధేయుడెలా అవుతాడు? "రేడియో టైమా? రైల్వేటైమా? పోస్టలు టైమా?" అని తిరిగి ప్రశ్నలు తప్పవు, అవతల వాడిని ఇబ్బంది పెట్టాలని మాత్రం వాడి అభిప్రాయం కాదు. వాడి స్వభావ విశేషమే అంత.

ఒకసారి కాలక్షేపానికి 'హరికథ' కు వెళ్లాం గిరిజాకళ్యాణం కథ హరిదాసు గారు భక్తి పార వశ్యంలో చెప్పుకొని పోతున్నాడు. మా డౌటింగ్ థామస్ [తామసుడు?]కు సందేహం రానే వచ్చింది "ఏమండీ! హరిదాసుగారూ ఈశ్వరుడిని గూర్చిన కథను కూడా 'హరికథ' అంటారెందుకూ? హరకథ' కావాలగదా? హరిదాసు అంటారు హానీ హరదాసు అనరెందుకూ? అని అడిగేశాడు. నిజానికి, వాడు అడిగాక, నాకూ ఆ సందేహమే వచ్చిందనుకోండి. కాని నేను అడగను, అడిగే ధైర్యంలేక! ప్రక్కవాడు నా అజ్ఞానాన్ని ఎక్కడ పసిగడతాడో అని భయం. మా వాడికి ఆ బాపతులేమీలేవు. అనుమానం తటస్థించడం తాడోపేడో తేల్చుకోడం అంతా ఒకే సమయంలో జరగాల్సిందే. హరిదాసుగారు ఏం సమాధానం ఇచ్చాడో మరోసారి విన్నవిస్తా. వించక పోతే మన్నించండి.

ఇప్పుడు వాడు నాలుగో పడిలో పడ్డాడు! కార్ఖానాలో సందేహాల ఉత్పత్తి శాతం 'గ్రిప్'లో నిచ్చెనెక్కుతూంది. కానీ ఇప్పుడు సందేహాలు కావనీ, తన అభిప్రాయమే సరియైనదనీ మొండిగా వాదించే స్థాయికి ఎదిగాడు! తానేదో పెద్ద పరిశోధకుడైనట్లు అనుకొని పోజుపెడతాడు అపునో కాదు చెప్పలేను గానీ అవతలి వాడి బుర్రను పాడుచేడి, అనుమానడునకు, ఆలోచనకు బీజాలు మాత్రం నాటగలుగు తున్నాడని పిస్తుంది నామటుకు నాకు! వాడి అభిప్రాయాలను కొన్ని వివరిస్తా వినండి.

Aethist యతిస్టు)లో నుంచే, యతి, యతీశుడు వచ్చాయట, ఈ యతీశ్వరులు సెంట్రల్ ఏషియా ప్రాంతం నుండి కొన్ని వేల సంవత్సరాల క్రిందట ఆసియా ఖండమంతా ముఖ్యంగా మన భారత దేశానికి వ్యాపించారట ఋషులే "రష్యన్లు"గా పిలువబడ్డారట. అమరులకూ 'అమెరికనులకూ' ఎక్కడో లింకు ఉందిట. ఎగిరేపళ్లాలు ఎక్కువగా అమెరికాలోనే, కనబడ దానికి కారణం అదేనట! హోమియో వైద్యమును కనిపెట్టిన 'హనిమాన్' హనుమాన్ సంతతి వాడేనట. రామాయణంలో హనుమంతుడు లక్ష్మణుని కిచ్చిన మందు సంజీవి మూలిక మదరుటించరట. ఇంగ్లీషులో HUN అంటే ఒకజాతి ఆదిమ మానవుడని అర్థమట. Hunman హన్‌మాన్ హనుమాన్, అయ్యుండొచ్చట. ఓంకారము నుండి జగత్తు పుట్టిందని వేదాలు చెప్పాయి గదా. ఆ ఓం కారము విద్యుత్ పరిమాణమునకు సంబంధించిన OHM పరిభాషట! దానిని 'ఓం' అనే జర్మను శాస్త్రజ్ఞుడు కని పెట్టాడు. మన 'శర్మణ్' జర్మన్‌లకు సంబంధమట. రావణాసురుడు ఎపుడో విహారయాత్రకు వెళ్లిన ప్రాంతమే లంకాషైర్ అయ్యుండొచ్చుట. మహబూబ్‌నగర్ జిల్లాలోని అలంపూరునుండి కొన్ని వందల సంవత్సరాల క్రిందట మలేసియాకు కొంత మంది వలసవెళ్లి అచటనివాస మేర్పరచుకున్నారట. అదే ఇప్పటి కౌలాలం పూర్‌ట! ఆరాతీస్తే విదేశీయుడైన అగస్టిన్ తీరా మన అగస్త్యులవారేనట. రామాయణంలో బలమైన పొడవైన చేతులు గల కబంధుడే అమెరికాలో అంతరిక్ష యాత్రికూడు Arm Strong గా పుట్టి యుంటాడట.

మన దేవుళ్లలో మొదటి అవతారం చేప గదా. ఆ చేప Cod చేపట. ఆ Cod Fish ఫిష్‌కాడ్ ఆయి ఫిష్‌గాడ్‌గా మారిందట. అసలు 'విష్ణు' లో నుండే ఫిష్ అనుపదం వచ్చిందట. ఇలాంటి వాటినన్నీ క్రోడీకరించి పెద్ద సిద్ధాంతవ్యాసం రాసి పి.హెచ్.డి. ఆ మీధ నోబెల్‌ప్రైజు కొట్టేయాలని వాడి జీవిత ఆకాంక్ష!

అప్పుడప్పుడు, అష్టావధాల సమయాల్లో,వీడి అదృష్టవశాత్తు ఎవరైనా పృచ్ఛకుడు రాకపోతే పిలువని పేరంటంగా మన శంకర్రావు 'నేను' అని ముందు కురుకుతాడు, వీడి ప్రియమైన స్థానం అప్రస్తుత ప్రసంగము। ఇక

ఆ అ: ధాని గారి అవస్థ చుడాలి.

"అవధాని గారూ। 'లోకాయుక్త' అంటే లోకానికి అయుక్తుడనియా। సవర్ణ దీర్ఘసంధియా।

"ఆడంబరము అంటే ఆడువారి అంబరము అనియా".

"నల్లిండ్లు అంటే నల్లులు ఎక్కువగా వున్న ఇండ్లు అనియా" [న:ండ్లు అంటే అగ్రహారాలు].

"ముదనష్టము అంటే ముదమును గూర్చు నష్టమా. ముదలాభం అనే పదము లేదేం ?

"ఉదయ రవి చంద్రిక అనే రాగం వుంది. రవికి చంద్రిక (వెన్నెల) కూ పొత్తు ఎలా ?

"వారిజాక్షులు అనగా కండ్ల యందు ఎప్పుడు 'వారి' అనగా నీరు కలిగియుండు వారనియా ?"

అరవ్వాళ్ళ కొళంబుకూ 'కొలంబో'కూ ఏమైనా లింకు ఉందా ? "క. ్నడ దేశస్థులకు కెనడా వారికి లింకు ఉండకూడదా."

ఆకాశరామన్న అంటారేగానీ ఆకాశసీతమ్మ అనరెందుకూ ? కులాలే వ: ంటూ తెలుగు విశ్వవిద్యాలయం వారు కులపతి కులసచివులు అని అంటా రెం..కూ ?

మంగళ సూత్రం అంటే వుమన్ గళములకు కట్టు సూత్రమనియా ? పంకజాక్షి, మీనాక్షి అంటే సరే. కామాక్షి అంటే వ్యుత్పత్తి ఏమిటి?

ఉద్యోగాలు చేసే స్త్రీలను వర్కింగ్ వుమెన్ అంటారు. మిగతా వాళ్ళు

ఇంట్లో ఏ పనీ చెయ్యకుండా దూబర తిండి తింటారా? పలానా వాడు కారెక్టర్ ఆక్టర్ అంటారు. మిగతా నటులకు కారెక్టరు లేదని అర్థమా 'మునివేళ్ళు' అంటే ఆ వేళ్ళు ఏ మునీశ్వరునివి? మునిసిపాలిటీ వాళ్ళ సులభ్ కాంప్లెక్స్‌లను కట్టించారు సులభ్ అంటే సులువైన అని కాంప్లెక్స్ అంటే చిక్కుతో కూడుకున్న అని. ఈ రెండు పదాలకు సంధి ఎలా? కంఠంలో ప్రాణం వుండగా అంటారు. ప్రాణం కంఠంలోనే వుంటుందని గ్యారంటీ ఏమిటి. ఇంకోచోట ఉండే అవకాశం లేదా?

రాజ్యాలు పోయినా, ఇంకా మన దేశంలో రాజ్యసభలు ఎందుకు? విమానాలున్న రామాయణకాలంలో స్టీమర్లు ఎందుకు లేవు. ఉంటే ఆంజనేయుడు సముద్రాన్ని దూకాడెందుకు? సేతువు కట్టారెందుకు?........

ఇలా ఇలా సవాలక్ష ప్రశ్నలతో అవధానిగారిని మూడు చెరువుల నీళ్ల త్రాగిస్తాడు అందుకనే వీడిని బాగా తెలిసిన వాళ్ల వీడికి ఛాన్సు ఇవ్వరు!

ఎక్కడి కెళ్లినా వీడు తన పాండితీ ప్రకర్షను (అది పాండిత్యమని వాడిభ్రమ!) ప్రదర్శించు కోవాలని ఉబలాట. ఒక సారి కాఫీ పొడి కొనేందుకు వెళ్లాం. కొన్నాం వచ్చెయ్యవచ్చుగా, "ఏమండీ ఇక్కడ కాఫీపొడి దొరకును" అని రాశారే? ఉచితంగా ఇస్తేనే అలా రాయాలి! అన్నాడు చనువుకొద్దీ. సరే. కాఫీవాడు గుడ్డతో సుద్దముక్క వ్రాతను చెరిపేసి, "కాఫీపొడి అమ్మబడును" అని దిద్దాడు. "బడును" కాదండీ, బడును అంటే భవిష్యత్తు. కాఫీపొడిని అమ్ముచున్నాము లేదా కాఫీపొడి అమ్మకమునకు కలదు అని రాయాలి. **Coffee Powder Sold here** అంటే ఇది వరకే అమ్మేశాం. ఇపుడు స్టాకు లేదు అని అర్థం అని ఉచిత సలహా పారేసి వచ్చాడు.

మరొక సారి నెహ్రూ పిల్లల పార్కుకు వెళ్లాం, మన శంకలరావుకు మళ్లీ ఒక పాయింటు దొరికింది. పిల్లల పార్కు అంటే పెద్దలకు ప్రవేశం

లేదా! లేక నెహ్రూగారివంశస్థులకొరకే ఏర్పడిన పార్టీ—అని అడిగాడు. నోరు మూసుకో అన్నా.

మొన్న ఆ మధ్య ఒక స్కిన్ స్పెషలిస్టు దగ్గరకు వెళ్ళాం. తిరిగి వస్తూ: డాక్టరుగారితో "మీ బోర్డు కాస్త సవరించాలి డాక్టరుగారూ". చర్మరోగ నిపుణుడు అన్నారు అది బహువ్రీహి సమాసం కావచ్చు. చర్మరోగం కల నిపుణుడు అని అర్థం స్ఫురించ వచ్చు, చర్మరోగ వైద్యనిపుణుడు అని వ్రాస్తే బాగుంటుంది మీ ఇష్టం" అని అయాచిత సలహా ఇచ్చి వచ్చాడు.

ఇలాంటి శంకరరావులు ఈ సమాజంలో ఎందరో! వందల మందికి వందనాలూ అనడం కష్టం తందనానా అనడం అంతకన్నా కష్టం. తప్పదు మరి సర్దుకుని పోవాలి.



# 5. ప్రేమ పురాణం

తే. గీ. ప్రేమమయమంత్రము జగమంత — వైరిమాట!
స్వార్థ భూయిష్ఠ మీ నరజాతి యంత
ఉన్న దాత్మానురాగమ్మె ఎన్నడైన
అర్థరహితము భ్రమయు — పరార్థప్రేమ!

అదీ సంగతి! ఆత్మాను రాగం తప్ప ప్రపంచంలో ఎక్కడా ప్రేమ పదార్థం లేదు. నిస్వార్థప్రేమలనీ అమర ప్రేమలనీ ఇవన్నీ కవుల మేధల్లో గ్రంథాలయ ప్రబంధాల్లో తప్ప, నిజ జీవితంలో, నిత్యజీవితంలో ఎక్కడా కనబడుతున్నట్లు రుజువులు లేవు. అసలు ప్రేమ అనే బ్రహ్మపదార్థాన్ని గూర్చి ఎంతో మంది కవులు, వేదాంతులు ఎన్ని రకాలుగానో వర్ణించారు. నా కెందుకో ఆ పోలికలు అంతగా నచ్చలేదు.

ప్రేమ సముద్రంలాంటిది అన్నారు. అంటే అందులో కూడా ఆటు పోటులుంటాయనీ, పైకి గంభీరంగా వున్నా, వినేవారికి హోరు అనీ, లేదా లోపల, లోపల అనలాలనూ, బడబానలాలనూ, భయంకర జలచరాలనూ కల్గి యుంటాయనేగా? [లేక ప్రేమ ఉప్పగా వుండి, ఆస్వాదన అధికమైతే వికారాలు కలగవచ్చు, వెవిళ్లుగా మారవచ్చు అనా?]

ప్రేమ ప్రవాహం అన్నారు. ఆ పోలికా అంతంత మాత్రంగానే ఉంది. కొన్ని ప్రవాహాలు ఎండాకాలంలో ఇంకిపోవచ్చు. ప్రవాహానికిలాగా ప్రేమ ప్రవాహం కూడా ఎన్నో మలుపులు తిరగొచ్చు. ప్రవాహం ఎత్తు నుంచి పల్లానికి పారుతుందాయె. ఈ పోలిక ప్రకారం ప్రేమ 'వన్ వే' ట్రాఫిక్ కావాలి. అన్ని ప్రవాహాలూ చివరకు ఉప్పునీటి సముద్రంలో కలిసి పొయ్యేవే! సముద్రం పోలికలాగా ప్రవాహం పోలిక కూడా తృప్తిగాలేదు!

కొందరు ప్రేమను అగ్నితో పోల్చారు. మనవాళ్లే కాదు, పాశ్చాత్యులు కూడా: **Love is a radiator which keeps you warm** అన్నారు. ఇదీ చప్పగానే వుంది. రేడియేటరు 'కరెంటు' లేకుంటే ఎందుకూ పనికిరాదు. [ఇక్కడ కరెంటుకు బదులు కరెన్సీ అని కాసేపు అనుకుందాం.] ప్రేమాగ్ని చివరకు బూడిదగా మారాలి. రేడియేషను ఎఫెక్టు వల్ల అది సోకిన వాళ్ళు మంచమెక్కాలి. [జబ్బుతో పడొచ్చు అని నా అభిప్రాయమండోయ్!]

'అమర' ప్రేమ అని వింటూంటాం. వినకపోతే శరత్‌గారి నవలలు చదవలేదన్నమాట। మరణించే మానవులకు 'మర' ప్రేమలే గానీ, అంటే 'యాంత్రిక' ప్రేమలేగానీ, అమర ప్రేమలు అమరే ఆస్కారమే లేదు: అమరుల ప్రేమలు మాత్రం ఆదర్శవంతంగా వున్నాయంటారా? బృహస్పతి సతీమణి తార చంద్రుని ప్రేమించినట్లు, దేవలోకంలోని ఊర్వశి మానవుణ్ని ప్రేమించినట్టు వినలేదూ! తవ్వుకుంటూ పోతే ఎన్నో ఉదంతాలున్నాయ్. అసలు దేవతల రాజు ఇంద్రుని మీదనే పురాణాల్లో ఎన్నో క్రిమినల్ కేసులూ పాపం బ్రహ్మగారొకరే ఏకపత్నీవ్రతుడు! విష్ణుమూర్తి, ఈశ్వరుడు ప్రేమ వ్యవహారాల్లో ఎన్నో సార్లు తగులుకొన్న బాపతే! కాబట్టి ఈ పోలికా 'అమర'రేదు!

**Love is like a Mirror** అంటారు. ప్రేమ అద్దంలాంటిదట! విడాకులు విరివిగా పొందే వీలున్న విదేశాల్లో ఈ మిర్రర్ పోలికలూ, టెర్రర్ పోలికలూ హారర్ పోలికలూ .... .... ఇలాంటివే సహజమేమో! 'మిర్రర్' కూడా అంత నచ్చలా. ఒకసారి పగిలితే ఆతికించడం కుదరదు అనే అర్థంలో అన్నారే అనుకోండి. ఆ కాలంలో 'ఫెవికాల్' లాంటివి కనిపెట్టబడలేదు. ఆధునిక యుగంలో అద్దాలను శుభ్రంగా అతికించవచ్చు. పనీ జరుపుకోవచ్చు!

ప్రేమను మంటగా, జ్యోతిగా పోల్చినవారూ ఉన్నారు. ఇదీ అంతే. మంట ప్రక్క ఇళ్ళకు కూడా పాకి వాటిని దహించివేయవచ్చు. జ్యోతి

చిరుగాలికే చప్పున చల్లారవచ్చు. సంసారంలో కలహాలే చిరుగాలులు. జ్యోతి నూనె, పత్తి ఉన్నంతసేపే వెలుగుతుంది. అంటే డబ్బూ, నగా, నట్రా అని కాసేపు అనుకుందాం!

ప్రేమ లత అంటారు లత చాలా సున్నితమైంది. ఏదైనా కర్రకో, రాతిస్తంభానికో మరో జడ పదార్థానికో అల్లుకుపోయేదే. మరి ప్రేమకు చైతన్య శక్తి అవసరం! లతల మీద కాలు మోపితే నలిగి నశించిపోతాయికూడా!

ప్రేమ 'నౌక' అన్నవారూ ఉన్నారు. ఏ తుఫానో, గాలివానో వచ్చినా, లేదా సుడిగుండంలో చిక్కుకున్నా ఆ నౌక కాస్తా బుడుంగుమని మునిగి కూర్చుంటుంది. తలకిందులు కావచ్చు. జీవన సాగరంలో అపాటి తుఫానులూ భూకంపాలూ సహజం కదా!

ప్రేమను సాగరాలతో, నయాగరాలతో గానీ, అగ్నితో గానీ, అద్దంతో గానీ తీగలతో, తెవ్వలతోగానీ పోల్చటంలో ఏదో ఒక వెలితి కొట్టవచ్చినట్లు కనబడుతూనేవుంది.

పాశ్చాత్యుల దృష్టిలో ప్రేమ వేరు. పెళ్ళి వేరు. కలిమిలేములు, కష్ట సుఖాలు, మంచిచెడ్డలులాగా పరస్పర విరుద్ధార్థ ద్వంద్వసమాసాలు, మినహాయింపులుండొచ్చు. 'Love ends with marriage' ప్రేమ పెళ్లితో ముగుస్తుందన్నాడొకడు. If you are afraid of loneliness, don't marry అని వార్నింగ్ ఇచ్చాడు మరొకడు. ఏకాంతతకు జడుసుకునేవాడు పెండ్లి చేసుకోరాదట. Woman is woe of man అనే నిర్వచనమూ పాశ్చాత్యులదే. To marry is easy. To stay together is difficult And lifelong married life requires fine art! అంటాడు మరొక మహాశయుడు. జీవితాంతం సుఖంగా వైవాహిక జీవితం గడపడం అనేది వారి దృష్టిలో ఒక గొప్ప లలితకళట! ఇంకో పెద్దమనిషి మరికొంచం దూరం ఆలోచించి నట్లున్నాడు. కొంచెము ఇంగితజ్ఞానం వుంటే విడాకులనుండి తప్పించుకొన

వచ్చు, ఇంగితజ్ఞానమంటూ వుంటే అసలు పెండ్లినుంచే ఏకంగా తప్పించుకో వచ్చు" అని తెగేసి చెప్పాడు.

'పీత కష్టాలు పీతవి' అన్నట్లు విదేశీయుల కష్టాలు విదేశీయులవి ! వాళ్ల పద్ధతికి మనవాళ్ళ జీవన విధానానికి అతకదు. మనవాళ్ళకు ఇంకా అంతదాకా వ్యవహారం ముదరలా. మనవాళ్ల పెండ్లి ప్రేమకు లైసెన్సుగానే ఇప్పటికీ అమలులో వుంది. పాశ్చాత్యుల దృష్టిలో భారతీయులు భార్యతో జీవితాంతం వెనవేసుకు పోగలిగే లలితకళాప్రవీణులనే !

అలాంటి సరస లలితకళా సార్వభౌముడు అను బిరుదుకు అర్హుడైన వాడు మా చంద్రశేఖర్ ! వాడు IDL కంపెనీలో పనిచేస్తాడు.

"మాది ఐడియల్ (Ideal) ప్రేమ అంటే ఆదర్శవంతమైన ప్రేమ" అంటాడు. వాళ్ళ ప్రేమను 63తో గానీ, 37తో గానీ పోల్చాలట. ఎందు కంటే, 63 లాగా ఎదురెదురుగా వుండాలి. ఎడమొగం పెడమొగం కాకుండా. 37ను ఏ అంకె భాగించలేదుట. కాబట్టి వారు ఎవరివల్ల విడదీయబడలేరట. అదీ గాక 3+7 కలిపితే ఏక సంఖ్య. చివరకు ఒకటే అవుతుందిట. మహో త్కృష్ట ప్రేమకు ప్రతీక 38ట. మరేమో ఒకానొక ప్రెంచికవి "ప్రేమఅంటే ఒకరినొకరు ఎదురెదురుగా కూర్చొని చూసుకోవడం కాదు. ఇద్దరూ ఒకే దిశలో చూడటం" అన్నాడనుకోండి. అది వేరే విషయం.

రెండో రకం ప్రేమ HAL ప్రేమట ! అది IDL కంపెనీ కాదు. Hindusthan Aeronautics Limited కాదు. ప్రేమపక్షుల్లాగా విమానాల్లో విహారయాత్రలూ చెయ్యరు. HAL అంటే హాల్. వీరు హాల్‌తో ఉన్నంత వరకూ పదిమంది ఎదుట భేషుగ్గా ఉన్నట్లు కపివిస్తారుట, అతిథిదేవుళ్లు సాగి పోయిన తర్వాత దంపతులు తలుపులు వేసుకుంటూనే షరా మామూలేనట ! అవే కీచులాటలు, పోట్లాటలు, మూతివిరుపులు ! మూడోరకం ప్రేమ చూచారా !

అది HEL ప్రేమలు అంటే **Hindustan Electronics Ltd.** అనీ వారి జీవితాలు ఎలక్ట్రిక్ బల్బులలాగా వెలిసిపోతుంటాయనీ అనుకునేరు! **HEL** హెల్ అంటే నరకమట! ఇక్కడ అడపా దడపా అప్పడాల కర్ర విన్యాసాలూ, వంట పాత్రోచిత మర్యాదలూ బాహా బాహీలూ, పస్తులూ, భూశయనాలూ, దర్శనమిస్తాయట. మా వాడు దీనికి ముందుగా 36 ప్రేమరా' అంటాడు. అంటే "ఎడ మొగం పెడ మొగం ఏంటీ కత" బాపతు!

ఏ మాట కామాటే చెప్పుకోవాలి. మా చంద్రశేఖర్‌ది మాత్రం ఆదర్శ దాంపత్యం సుమండీ. వాళ్ళు బాగా చనువున్న ఫామిలీ ఫ్రెండ్స్, చాలసరదాగా వుంటారు. ఒకసారి వాళ్ళింటి కెళ్ళా.

భార్యను 'సభా! రాసభా! ఇలారా! ఆచార్లగారొచ్చారు' అని పిలిచాడు.

"ఇదేమి పిలుపురా, 'రాసభం' అంటే గాడిద గదా' అన్నా.

"అక్కడే వుంది మజా, సభా అంటే సగభాగము అని అర్థం" అన్నాడు.

ఆమె గారు మాత్రం ఏం తక్కువ తిన్నదా. సరసరస ఘోషణలో చతుర.

"వస్తున్నా! ఖరా! చంద్రశేఖరా! అనింది!

మరొక్కొక్కప్పుడు భార్యను 'కకుభ' అని పిలుస్తాడు.

"ఇదేమి పిలుపురా, 'కకుభ' అంటే 'దిక్కు, అని అర్థం! అనడిగాడు.

"అది మా కోడ్ లాంగ్వేజ్! కకుభ అంటే కట్టుకున్న భార్యట!

"నీ వన్నట్టు 'దిక్కు' అనుకున్నా చక్కగానే వుంది గదా. వయస్సులో మనము ఎలా ఏడ్చినా పట్టించుకోకుండా ముదిమి కాలంలో, మనలను ఎల్ల వేళలా నీడలా కనిపెట్టుకొని యుండి పెద్ది దిక్కు భార్యగానీ ఇతరులు కాదు గదా. కాబట్టి కకుభ సంబోధన కరక్టేనని సమర్థించాడు!

ఎప్పుడైనా మా వాడు విసుక్కొని 'వెధవ సంసారం' అంటే

"అవును అది తృతీయా తత్పురుష సమాసం! అని సర్మగర్భంగా త్రిప్పి కొడుతుంది. (వెదవతో సంసారం అనిట!)

ఒకసారి 'మీ ఇంట్లో ఎప్పుడూ కీచులాటలు రావా' అని అడిగా.

"అబ్బే, అలాంటివాటికి మేము చాలా చాలా దూరం" అన్నాడు.

"ఎలా! ఆ కిటుకేదో నాకూ చెప్పరాదూ" అని అన్నా.

"ఏముంది మేము ఇంట్లో పనులన్నీ ఏలాంటి గొడవలూ రాకుండా సమానంగా పంచుకుంటాం. మాటవరసకు టీ వీ చూడటం, నవల్సు, వార పత్రికలూ చదవటం, రేడియో వినడం, పత్రికలకు ఉత్తరాలు రాయటం, ఇలాంటి కష్టమైన, క్లిష్టమైన పనులన్నీ అవిడ చూసుకుంటుంది. మిగతా చిల్లరమల్లర పనులు అనగా వంటపని, అంట్లపని, బట్టలు వాషింగ్ మెషీన్‌లో వేసి ఆరేయటం, లాంటివి నేనే స్వయంగా చూచుకొంటా, వెరీ సింపుల్ అన్నాడు తాపీగా.

అద్గదీ! అది దాంపత్య సుఖజీవన రహస్యం, ఇచ్చి పుచ్చుకోపడంలో వుండే ఆనందాన్ని ఆస్వాదించడం ఒక లలితకళే.

మనకు ఆదర్శదేవుడు శ్రీకృష్ణుడు లేడూ! సత్యమ్మ మేడమ్‌గారు 'ఎడమ్' కాలుతో మాంచి 'కిక్' ఇస్తే హీరోగారు ఒక 'కిస్' ఇచ్చి ఆందోళన చెందకుండా హిందోళలో ఒక పద్యం అందుకుంటాడు.

"..................చెల్వాగు నీ పదపల్లవంబు మత్తను పులకాగ్ర కంటక వితానము తాకిన నొచ్చునంచునే ననియెద-అల్క మానవు గదా........"

గోవర్ధనగిరి ఎత్తిన గోపాలుడు గోప్యంగా ప్రేయసి తావున గోవు లాగా మారి ప్లేటు ఫిరాయించాడు! ఆ ఫీల్డులోని రూల్సు అంతే మరి.

''ప్రమదల గూడి' అని మరొక పద్యం గూడా ముక్తాయించాడు.

కాబట్టి శ్రీకృష్ణులవారొక్కరే మోస్ట్ సక్సస్‌ఫుల్ హస్బెండ్ : ఏమంటారు !

మహానగరాలైనా. సాగరాలైనా అట్లాసుకు అలుసైనట్లు, ఆర్థిక శాస్త్ర వేత్త అయినా, అమాత్య శేఖరుడైనా, అంతరిక్షగామి అయినా, అణుశాస్త్ర నిష్ణాతుడైనా ఆ మహావిష్ణువైనా అర్ధాంగికి అలుసు: అంచేత శ్రీవారి అలవాట్లకు. జరిగే పొరపాట్లకు కప్పిపుచ్చే ప్లాట్లకు సత్యమ్మ పెట్టే చీవాట్లకు అరవై మెగావాట్ల శక్తి !

ఏ మాట కామాటే చెప్పుకోవాలి. కలికి అలుకనుండే ఎన్నో రసవత్తర కావ్యాలుద్భవించాయి. కైకమ్మగారు అలక్కపోతే రామాయణ మహాకావ్యం మనకు దక్కియుండేదా ! సాత్రాజితి అలుకపాన్పు ఎక్కబట్టే గదా ! మనకు తిమ్మన్నగారి పారిజాతం దక్కింది ? గాన, అలగాలి. ఆ గాలి తగలాలి ? లాలించుకోవాలి. ఒకరి మీద ఒకరు వాలిపోవాలి : బోలెడు 'మనీ' తపీమని తగలేసి, తడవ తడవకూ హనీమూన్లనీ, వీకెండ్‌లనీ ఏ కాశ్మీర్‌కో, కోడై కెనాల్‌కో పరుగిడేబదులు, క్వార్టర్లీనో, హాఫ్ ఇయర్లీనో తీరిక చేసికొని చిలుకలకొలికి అలుక పాన్పు, (అది కటికనేల, ఈత చాప నులకమంచమైనా పరవాలేదు) అధిరోహిస్తే పంద హనీమూన్‌ల ఆనందం అనుభవించవచ్చు. 'మనీ' కూడా అట్టే ఖర్చుకాదు. అలిగితే ఆవేళంతా అయ్యగారికి ఒకపూట పస్తు ప్రాప్తించవచ్చు. విండ్ (Wind) భోజనంతో గడపాల్సి రావచ్చు. అయితే నేం అలుక తీరుతూనే ఆలుమగలకు వెన్నెట్లో వెన్నెల లేకుంటే ఉన్న యింట్లోనే విందుభోజనం బహుపసందు భోజనం.

అందుకనే అలుక ప్రేమకు పైలట్‌కారు అన్నాడొకడు. ప్రేమకు రిన్యూయల్ : రిన్యూయల్స్ లేని ప్రేమ ఒక ప్రేమా అంటాడు మా వితండేశ్వర్‌రావ్.

లార్డ్‌మాన్ క్రాఫ్ట్ అనువాడు ఆదర్శదాంపత్యానికి చక్కని నిర్వచనం ఇచ్చాడు. పడతిచెప్పిన మాటను గ్రహించి నడుచుకునేవాడు ఉత్తమ భర్త అయితే చెప్పకున్నా గ్రహించి నడచుకునే భర్త ఉత్తమోత్తమ భర్తట!

మరి మన వాళ్ళేమో 'ననారీ హృదయస్థితం' ఆడువారి హృదయము తెలుసుకోలేము అని తేల్చివేశారే!



# 6. పాపీ చిరాయుః

"తేతం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి"

అని 'గీత'లో నైన్త్ చాప్టర్‌లో రూల్ నెం. ట్వెన్టివన్‌లో ఒకే ఒక 'గీతలో' తేల్చి చెప్పారు. శ్రీకృష్ణ భగవానులవారు మహాభారతా 'వార్' కు ముందు కురుక్షేత్ర యుద్ధరంగంలో : 'పుణ్యానుభవం పూర్తి కాగానే పాపానుభవం కొఱకు మానవులు మర్త్యలోకంలో జన్మిస్తారు అని అర్జునునితో నెత్తిమీద ఫ్లూట్‌తో నాలుగు మొట్టి చెప్పాడు :

'ప్యారడైజ్' హోటళ్లూ, హెవన్ డోర్సు' హోటళ్లూ ఎన్ని వున్నా అసలు ఈ 'అర్త్' మర్త్యులకై ఏర్పాటు చేయబడిందే. 'అర్త్'వాసులు కనుకనే అర్థదాసులూ, పైకి చెప్పుకోకున్నా, ఒప్పుకోకున్నా అర్ధాంగి దాసులు : కాదంటే దాంట్లో మళ్లీ లెవల్సు, తర, తమ బేధాలుండొచ్చు :

పాపులే యీ మన భూలోకంలో పుడతారు. 'పాపులను రక్షించుటకై యేసు భూలోకమునకు వచ్చెను" అని వీధి వీధీ, వాడ వాడా, గోడలపై తాటికాయంత రాతలు మనకు నిత్యనూతనంగా దర్శనమిస్తూనే వుంటాయి. 'పాపులు' అనే పదములో నుండి ఉద్భవించినవే ఈ 'పీపులు' (People) పాపులేషన్‌లు (Population) పంకజనాభ (కమలోద్భవుడు) 'బ్రహ్మ' జనాభా సృష్టికి కారకుడయ్యాడు. పాపులను సృష్టించిన పాపానికే పాపం బ్రహ్మగారు, తనకంటూ ఒక దేవాలయం లేకుండా శాపగ్రస్తుడయ్యాడు : ? నా థియరీకి దాఖలాలు ఎన్నో వున్నాయి. చిత్తగిస్తానంటే సుత్తిగొడతా అవధరించండి. కాసేపు భరించండి :

వలానా 'రామనాథం' రాత్రి హెయ్యాట్ట అంటే !

అయ్యో పాపం - అలాగా అంటాం. అదేదో మనకు నూరేళ్లూ గ్యారంటీ అన్నట్లు ! 'వాడింట్లో నిన్న దొంగలు పడ్డారట అంటే 'అయ్యో ! పాపం ! అని అప్రయత్నంగానే అనేస్తాం !

పోనీ, మనసుకు కష్టం కలిగించే విషయాలకే 'పాపం' తలిగిస్తామా అంటే 'మా వాడు యమ్.ఎ. ఫస్టుక్లాస్‌లో పాసయ్యాడోయ్' అంటే

'అలాగా ! పుణ్యం అనం !

పెండ్లి చాలా బాగా జరిగింది అని అనగానే

అలాగా పుణ్యం అనం

పాపం బిచ్చగాడు అంటామే గానీ పుణ్యం శ్రీమంతుడు అనం

లాటరీ ప్రథమ బహుమతి లక్షవస్తే నాకు సగమిస్తావా ? అని మాట వరసకు అడిగామనుకోండి.

అమ్మా 'పాపం' ఎంత ఆశ అని ఆశ్చర్యార్థక ముఖం పెడతాం.

వాని పాపం పండింది అంటామేగాని వాని పుణ్యం పండింది అన రెందుకూ ?

పాపాలు అనుభవించుటకై పుడతాము కాబట్టే, అప్పుడే పుట్టిన బిడ్డను పాప, పాపాయి అని అంటాం. పాపారావులున్నారు, పాపిరెడ్లున్నారు, పాపే శ్వరరావులున్నారు వారిలో ఎందరో ధన్యజీవులున్నారు, పుణ్యజీవులున్నారను కోండి. అంతే గానీ పుణ్యారావులూ. పుణ్యేశ్వరరావులూ ఎక్కడా వినమే ? ఇంకొక విషయం. పుణ్యజనుడు అంటే రాక్షసుడు !

పరోపకారాయ పుణ్యాయ పాపాయ పరపీడనమ్

అని పాప పుణ్యనిర్వచనాలు ఒక్క ముక్కలో తేల్చి చెప్పేశారు తత్వవేత్తలు. నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం అని మహాకవి శ్రీ శ్రీ తేల్చివేశాడు అంటే ఈ రెంటినీ సమన్వయం చేస్తే తేలే సారాంశ మేమిటి?

మానవులు పరపీడనం చెయ్యకుండా వుండలేరు. తద్వారా పాపార్జన తప్పదు. దీనికి శిక్షగా మళ్ళీ భూలోకవాసమూ దప్పదూ అనేగా.

'నక్షత్రాణి దేవగృహాణి' అన్నారు. నక్షత్రాలే దేవతల గృహాలట. పుణ్యలోకాలు మాత్రమే మనకు కనబడకుండా పైన వున్నాయ్! పాపలోకం మాత్రం ఎక్కడో 'ఆర్బిట్' అవతల లేదు. ఈభూలోకమే ఒక పాపలోకము: కాదంటే ఒకేచోట గాకుండా వికేంద్రీకరణ సిద్ధాంతము అమలువఱచబడి ఎన్నో సెంటర్లలో వుంటున్నాయ్! మాటవరసకు ఆసుపత్రులు, ముఖ్యంగా ధర్మాసుపత్రులు, మునిసిపల్ ఆఫీసులు సబ్‌రిజిస్ట్రారు ఆఫీసులు, రైళ్లు, బస్సులు సిటీ బస్సులు, బస్సుస్టాపులు, రేషను క్యూలు ఇలా ఇలా వారి వారి పాప శేషాలను బట్టి వుంటాయి.

నవ్వుకోమంటే, పోనీ, సరదాగా నవ్వుకుంటామంటే ఎన్నాళ్ళనుంచో నన్ను పీడిస్తున్న రెండు అనుమానాలను మీకూ తగిలించుతా.

ఎలాగూ పాపములనుభవించుటకే మానవులు భూలోకమునకు వచ్చారని రుజువైంది గనుక ప్రప్రథమ పాపులు 'ఆడమ్‌గారు' మరియు ఆయనగారి ప్రక్క ఎముకలో నుంచి ఊడిపడిన 'మేడమ్' ఈవ్‌గారు: వారు ఒక తోటలో విహరిస్తుంటారు. దేవుడుగారు 'ఆరామ్'గా ఆరామములో తిరుగుతున్న వారిని చూచి దంపతులారా ఆ మూల ఒక ఫలవృక్షముంది ఆ పండ్లను మాత్రం తిన వద్దండి. డేంజరెస్ అని వార్నింగ్ కూడా ఇచ్చి వెళ్లాడు. తానొకటి తలిస్తే

'సైతాను' మరొకటి తలిచాడు. సదరు సైతానుగారు అదను చూచుకొని ఆది దంపతుల దగ్గఱకుపోయి, ఆ పండ్లు చాలా రుచిగా వుంటాయి. వాటిని తింటే మీరు తనంతటి గొప్పవారు అవుతారేమో అనే ఈర్ష్యతో దేవుడు మిమ్మలను తినొద్దని బెదిరించాడు. నిక్షేపంగా తినండి అని నోరూరించాడు. కక్కుర్తిపడి ఇద్దరూ ఒకటి రెండు నోట్లో వేసుకుంటారు అంతే, కొంపలంటుకున్నాయి. వారికి కామ వికారాలు పుట్టి, సంతాన కార్యక్రమమునకు శంకుస్థాపన చేశారట. నా 'డౌటు' అన్నానే. అది ఆ పండ్లచెట్టు 'బొప్పాయి చెట్టు అని ఎలా అంటారా, బొప్పాయిని వాండ్లు Papaya అంటారు ఇది చాలా బలకరమని డాక్టర్లు కూడా చెప్తారు. ఆ పండును తినగానే వారు 'మదనకామరాజు' లయ్యారు కనుక ఆ చెట్టును మన తెలుగులో 'మదనానబ' అని కూడా అంటారు. అ పండ్లను తిని వారు డిస్కో డాన్సు చేసుకుంటూ, పాడుకుంటూ వుండొచ్చు, ఆ పాటలు 'పాప్' మ్యూజిక్‌గా చలామణి అయ్యుండొచ్చు!

ఈ నా ప్రతిపాదనకు మరో సపోర్టు కూడా వుంది. రాయలసీమలోని కొన్ని ప్రాంతాల్లో, కర్ణాటక ప్రాంతంలో బొప్పాయికాయను పరంతప కాయ అని అంటారు. మరి శ్రీకృష్ణులవారు గీతలో అర్జునుణ్ని హే పరంతప! అని అనేక చోట్ల సంబోధిస్తాడు. అర్జునుడు అంటే నరుడేననీ శ్రీకృష్ణుడే నారాయణుడనీ పురాణాలు ఛాటుతున్నాయి. నరుడంటే పాపి అని ఇంతకుముందే ముచ్చటించుకున్నాం!

అది సరే, శ్రీకృష్ణుల వారేమో మనకు జన్మనిచ్చిన ఈ భూమిని పాపం అనుభవించుటకై ఏర్పాటు చేయబడిన లోకమని సెలవిచ్చారు. మరి శ్రీరాముల వారేమో జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసీ అని మాతృభూమిని, స్వర్గంతో పోల్చి, ప్రశంసించాడు.

పాపాలను అనుభవించుటకు హోల్ మొత్తం విశ్వంలో భూలోకం దప్ప ఎక్కడా మరొకచోటు లేదని తేలింది. ఈ భూలోకం శాశ్వతంగా, చిరంజీవిగా

వర్ధిల్లుతూ ఉండాలంటే మానవులు పాపాలు నిరంతరం చేస్తూనే వుండాలి. ఎందుకంటే, పాపాలు చెయ్యడం ఏనాడు ఠపీమని ఆగిపోతుందో, ఆ క్షణం నుంచి మరణానంతరం, మరలిరాము కమక, మానవజాతి అంతరించినట్లే! కాబట్టి, మానవజాతి సర్వనాశనం కావాలంటే అణుయుద్ధమే రానక్కరలేదు పాపాలు చెయ్యటం మానేస్తే చాలన్న మాట!

ఇంకా కాస్త దూరంగా, లేదా దగ్గరగా, బిగ్గరగా ఆలోచిస్తే పాపాలు చేయకపోవటం అన్నిటికన్నా ఘోర పాపం!? మానవజాతిని అంతరింప చేయడం పాపం కదూ! ఘోర పాపం।

ఈ భూలోకం ఏమైపోవాలి? యుగయుగాల మన సంస్కృతి ఏమైపోవాలి? యమలోకంలో యమధర్మరాజు మొదలు, చప్రాసీ వరకు కొన్ని వేల మందికి ఉపాధి కల్పించేదెలా? అందరూ స్వర్గానికే పోతే అక్కడ మళ్ళీ వసతి సమస్యలు, ఆహార సమస్యలు యోచించాల్సిందే.।!



# 7. నెత్తిమీద కెక్కడం

"ఏ మున్నది గర్వకారణం - నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం" అన్న శ్రీశ్రీ మహాకవి వాక్కు యుగాంతం వరకూ నిలబడే ఋక్కు. ఆ మాటకొస్తే నరజాతి చరిత్రయే కాదు సమస్త చరాచర సృష్టి తత్త్వమే అంత : ఆయన మహాకవి కాబట్టి 'పరపీడన పరాయణత్వం' అని అందంగా అన్నాడు, నేను మామూలు మనిషిని కాబట్టి పామర భాషలో అహోరించా : క్రర పెత్తనం, దబాయింపు జబర్దస్తీ .... .... ఇవన్నీ ఆ కోవవే. పెద్ద ప్రాణి చిన్న ప్రాణిని చంపుకొని తినడం, ఏడిపించటం, సృష్టి ధర్మమే అంత.

మన పెండ్లి మంత్రాల్లోనే వరుడు వధువుతో 'మూర్ధానం పత్యురారోహ, 'వధుః అమృతస్యలోకం' అని అంటాడు. (పురోహితుడు వరుని తరపున అనే స్తాడు లెండి. అందుకనే మనకు తెలియదు) దాని అర్థం "ఓ అర్ధాంగీ! నిన్ను దేవలోకమునకు తీసుకొని వెళ్తాను నా నెత్తి మీది కెక్కు" అని మరి ఇక నేం. ఈ నెత్తిమీది కెక్కడం వేద కాలం నుంచీ వస్తూంది!

మీరు ఏ రంగమైనా తీసుకోండి. కొద్దో గొప్పో వీలునుబట్టి ఈ నెత్తి మీది కెక్కడం జరుగుతూనే వుంటుంది. గుమాస్తాగారి మీద హెడ్ గుమస్తా ఆయన మీద మరో హెడ్డూ, అతగాడి మీద ఒక అధికారి, ఆ అధికారి మీద డైరెక్టరు సవారీ. డైరెక్టరుగారి మీద సెక్రటరీలు, సచివులు, సచివుల మీద, ముఖ్యమంత్రి, అందరి మీద ప్రతిపక్షాలు విరుచుకపడటం, అన్నీ రాజకీయ పక్షాల మీద ఎన్నికల సీజన్‌లో, ఓటర్లు, మళ్ళీ సదరు ఎన్నికల తంతు పూర్తవగానే ఆ ఓటర్ల మీదనే అదే ప్రభుత్వనేతలు! ఇది అంతే! చక్రభ్రమ ణం. దీనికి బ్రేకుల్లేవు! విద్యార్థుల మీద ఉపాధ్యాయులు, వారి మీద ప్రిన్సి పాళ్లూ, వారి మీద వైస్‌చాన్స్‌లర్లూ .... అలా అలా .... చివరకు ఏ స్ట్రయికు

పేరుతోనే విద్యార్థులు బస్సులు తగలబెట్టి, ధర్నాలు చేసి పైవాళ్లను ఘెరావ్ చెయ్యడం. చెయ్యి చేసుకోవడం .... ఇవన్నీ "మూర్ధానం పత్యురారోహ జాపతే. కొండొకచో, క్రిందివాడు పైవాడి మీద ఎక్కొచ్చు.

పూర్వార్థంలో అత్త కోడలిమీద, తండ్రి కొడుకులమీద, పెత్తనం చలాయిస్తే, ఉత్తరార్థంలో అత్తగారికి తత్తర పుట్టడం, కథ అడ్డం తిరగడం చూస్తూనే వుంటాం, వింటూనే వుంటాం. ఇది ఇంటింటా రామాయణమే!

తల్లిదండ్రులకు కొడుకులకు, ఏకాభిప్రాయం ఉంటుందనుకోడం భ్రమ. ఎవడో ఒక మహాశయుడన్నాడట, "Society moves by some degree of Patricide by which Children, on the whole kill if not their Parents, their ideas beliefs and arrive at new beliefs. This is what is called progress! "ఎంతో కొంత తలిదండ్రుల హత్య జరగందే ప్రగతి జగతిలో జరగదట. ఆదేమయ్యా అంటే తలిదండ్రులు నమ్ముకున్న సిద్ధాంతాలతో ఏకీభవించకుండా, వారివి ఛాందాసభావాలంటూ ఖండిస్తూ, కొత్త పోకడలను తొక్కడం పరోక్షంగా వారిని హత్యచేసినట్లే గదా?" అన్నాడట.

మన జ్యోతిష శాస్త్రములో, రవికి కొడుకు శని, చంద్రుని కొడుకు బుధుడు, రవి శనులు, బుధ చంద్రులు సహజ శత్రువులు! దశాబ్దాలుగా 'వడుగు' జాతివారు (బ్రాహ్మలు) 'బడుగు' జాతివారిని అణగద్రొక్కారనీ, హరిజనులను అరిజనులుగా చూచారనీ, ఇప్పుడు బడుగుజాతివారు, రాజ్యాంగ రీత్యా రిజర్వేషనులనీ, అవనీ, ఇవనీ, అవనిలో, అదే, భారతావనిలో 'వడుగు' వర్గాల వారిని అడుగుకు త్రొక్కి వారి నెత్తిమీది కెక్కాలని ఉద్యమిస్తున్నారు!

మత స్థాపకులనూ, మతాధిపతులనూ చూడండి. మొదట్లో వేదమత ముండేది. బుద్ధుడు అవతరించి, జనులను తరింపజేయుటకై బౌద్ధమతాన్ని స్థాపించి వేదమతము మీదికి "మూర్ధానం పత్యురారోహ" చేశాడు. వేదమతం

క్షీణించు దశలో, ఆదిశంకరులవారు అవతరించి బౌద్ధములోని అవకతవకలను ఎత్తి చూపించి యజ్ఞయాగాదులను పునరుద్ధరించి, బౌద్ధాన్ని భారత దేశము నుండి తరిమివేసేదాకా విశ్రమించలేదు. అద్వైతాన్ని స్థాపించి, దేశం నాలుగు చెరగులా పీఠాలను స్థాపించి, జగద్గురువులను ప్రతిష్ఠించి, హఠాత్తుగా అస్తమించాడు. మళ్ళీ కొంతకాలానికి శ్రీరామానుజులవారు విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని ప్రతిపాదించి, లక్షల సంఖ్యలో జనసామాన్యాన్నీ, రాజులనూ వైష్ణవ మతావలంబకులుగా మార్చారు. కర్ణాటక రాష్ట్రంలోని 'హళె బీడు' లో సుప్రసిద్ధ వైష్ణవ దేవాలయమును కట్టించిన విష్ణువర్ధనుడు జన్మతః జైనమతస్థుడు, తెనాలి రామకృష్ణుడు మొదట అద్వైతి। అప్పుడప్పుడు మతాధిపతులు తమ సిద్ధాంతమే మహోత్కృష్టమైందని పరస్పర విమర్శలు చేసుకోవడం సామాన్యమే, సహజమే. స్థూలంగా పరిశీలిస్తే వీళ్ల సిద్ధాంతాలన్నీ మరణించిన మనిషి ఏమౌతాడనే. ప్రత్యక్ష సాక్ష్యాలు లేవు. సగటు మనిషికి ఇవి సమస్యలే కావు! హిందువులు, ముస్లిములు, క్రైస్తవులు వారి వారి మతాన్ని ఇతర మతస్థులు స్వీకరించాలని ప్రచారం చేసుకోవడం, ఇదంతా నెత్తిమిద ఎక్కే లక్షణాలే।

రాజకీయాల్లో సరే సరి। ఒక పార్టీ మీద మరోపార్టీ మీదెక్కాలని నిరంతర ప్రయత్నం, ఒకే పార్టీలోనే ఎన్నో ముఠాలు, గ్రూపులు ఇవన్నీ దేనికి? అదే, మీదెక్కడం కోసం। కొన్ని దశాబ్దాలుగా రష్యామీద ఆధిక్యత సంపాదించడానికి ప్రయత్నించి, ప్రయత్నించి ఈ మధ్యనే అగ్రరాజ్యమైన అమెరికా విజయం సాధించడం, ఆ లగాయతు వరుసగా అన్ని దేశాల మీద ఎక్కి తన ప్రతాపాన్ని చాటుకునేందుకు తంటాలు పడుతూండటం చూస్తూనే వున్నాం గదా. ఐ.యమ్.యఫ్. అప్పుల ఆంతర్యం ఆలోచిస్తే అంతే!

సాహితీ రంగం మాత్రం? భిన్నంగా ఉందేంటి? మొదట్లో ప్రబంధ కవిత్వం బంధ కవిత్వం, చిత్ర కవిత్వం రాజ్యమేలింది. లెక్కలు, జాగ్రఫీలు గూడా పద్యాల్లోనే వుండేవి ఆ రోజుల్లో।? తర్వాత, తర్వాత కొంచెం స్థాయి

దిగి, పండిత పామరులకు కూడా అర్థం గావలెనను దృక్పథంతో తిరుపతి వెంకట కవులు, జాషువా, కరుణశ్రీ లాంటి మహాకవులు తమ పద్యాలతో ప్రజలకు దగ్గరయ్యారు. క్రమంగా గ్రాంధిక భాషపైన వ్యవహారభాషమీ దెక్కడం ప్రారంభమైంది. ఛందోబద్ధ కవిత్వం పలచబడి, ఒక్కొక్క మెట్టు దిగి, భావ కవిత్వం, వచన కవిత్వం, గేయ కవిత్వం మీదెక్కాయి. క్రమంగా, దిగంబర కవిత్వం, విరసం అర, సం (పాతిక, సం ?) అని అనేక రూపాలతో కవిత్వం వచ్చింది. వాటిని కూడా యాంత్రిక జీవనం చేసే జనసామాన్యానికి చదివే ఓపిక, గ్రహణ శక్తి క్షీణించిందని గ్రహించారు కాబోలు। ఒకటి, రెండు, మూడు, మహా ఉంటే నాలుగు అంగుళాల మినీ కవితలు మీదెక్కాయి. నవలా సాహిత్యం స్వైరవిహారం ప్రారంభమైంది. దీంట్లో కూడా, డిటెక్టివ్ సాహిత్యం, క్షుద్ర సాహిత్యం, 'సైన్సు ముసుగు' సాహిత్యం సెక్సు, క్రైం అన్నిరకాల సాహిత్యాలూ ఒకరి నెత్తిపైన ఒకరు ఎక్కి అన్నీ పత్రికలవారి పక్షు వ్యాపారదృష్టి పుణ్యమా అని జనం మీద ఎక్కుతున్నాయ్.

మా రోజుల్లో, తోలుబొమ్మలాటలకూ, వీధి నాటకాలకూ, బుర్ర కథలకూ, హరికథలకూ, బ్రహ్మాండమైన గిరాకీ ఉండేది, ఇసుకవేస్తే రాలనంత జనం. సురభి కంపెనీ నాటకాలు వచ్చి వీటి మీదెక్కాయి. మూకీ సినిమాలు సురభి మీద ఎక్కాయ్. టాకీ సినిమాలు మూకీ మీదెక్కాయ్. టెంట్లమీద థియేటర్లు, 35 MM లు, 70 MM లు బ్లాక్ అండ్ వైట్ లు, కలర్ పిక్చర్లు వరుసగా ఒకరి మీద ఒకరు ఎక్కాయి. సినిమాలమీద టీ. వీ. లు, వాటిపైన వీడియోలూ ! వీటిలో కూడా మొదట్లో సినిమాలకు, పురాణాలు, కాశీ మజిలీ కథలే ఊపిరిపోశాయి. తర్వాత సాంఘికాలు. సరే తొంభయ్యవ దశకం నుంచి 'ట్రెండే' మారిపోయిందనుకోండి।

ప్రాణం లేని జడపదార్థాలకు కూడా ఈ 'మూర్ధానం ఆరోహ' గుణం వుంది। పొగాకులో నుంచి పుట్టిన 'నశ్యం' మొదట్లో సభాగౌరవం పొందింది

వేదపండితులు కూడా నశ్యదాసులైనారని. నస్యముమీద సిగరెట్లమీదెక్కాయి. "పొగదాగనివాడు దున్నపోతై పుట్టున్" అనే దాకా ఎక్కాయ్. అవీ కూడా మంచి 'కిక్కు' ఇవ్వడం మానేసినట్లున్నాయ్. రకారకాల మత్తుపానీయాలు 'పొగ' మీద పగ చూపాయి. దేశవాళీ సరుకుమీద విదేశీ సరుకెక్కింది. "మంచి వద్యమా! ఫ్రెంచి మద్యమా?" "వచ్చావా! రాక్షసా! రా! తెచ్చావా ద్రాక్ష సారా!" "జిన్‌దాబాద్" అంటూ మహాకవులు వారిసెంతవరకూ ఎక్కింది. మాంచి, కిక్కించింది, దిగనంటూంది!

ఏ వూర్లోనైనా ఏ వీధిలోనైనా చూడండి - సినిమా పోస్టర్ల మీద, ఎలక్షను పోస్టర్లు! వాటి మీద ఏ ట్యూటోరియల్ కాలేజీవో, మరో బాపతు పోస్టర్లు! వాటి మీద మరోరకం! గుప్తరోగ నిపుణుల ప్రకటనలు! అన్నిటి కన్న ముందున్న, కాదు, అట్టడుగున పడియున్న బస్సుల రాకపోకల వివరాలు, రూట్ నెంబర్లు పాపం నలిగి చచ్చి పడి యుండటం నిత్యానుభవమే!

రైల్లో గానీయండి, బస్సులో గానీయండి, పాపమని ప్రక్కవాడికి, సర్దుకొని సీటిస్తే ఒక్కపావు గంటలో వాడు మీ మీద ఎక్కకుంటే వాడిమీద ఒట్టు! మీకు సీటు ఏకపృష్ఠానికే పరిమితమై పోవచ్చు!

పైకి ఎక్కాలనే ఉబలాటం ప్రతివాడి సహజగుణమేమో, ఏదైనా చార్ మీనార్లూ, కుతుబ్‌మినార్లూ, కోటలూ, ఎత్తైన కట్టడాలూ, కొండలు కానివ్వండి జైంట్ వీల్లూ, విమానాలు కానివ్వండి, చివరకు రంగులరాట్నం కానివ్వండి చూడగానే ఎక్కుదామనిపిస్తుంది గదూ! ఏ తలతిరుగుడు జబ్బు వాళ్లకోదప్ప! మనలో ప్రతి యొక్కరిలో ఒక ఎడ్మండు హిల్లరీ ఒక టెన్సింగ్ నార్కే దాగియుంటాడేమో?

త్రైలోకాల సంగతీ ? అది అంతే। దేవతలమీద రాక్షసులు, రాక్షసుల మీద దేవతలూ, పరస్పరం ఎక్కుతూనే వుండటం పురాణాల్లో వినడం లేదూ దశావతారాల వ్యవహారం అదేగా ?

ఏ మున్నది గర్వకారణం ?

మీ దెక్కడమే సృష్టి లక్షణం ! ?



# 8. తమసోమా జ్యోతిర్గమయ

కం॥ లోకంబులు, లోకేశులు
లోకస్థులు తెగిన తుది నలోకంబగు పెం
జీకటి కవ్వల నె వ్వం.
డే కాకృతి వెలుగు - న తని - నే - సేవింతున్,

ఎప్పుడూ, విడుపు లేకుండా, విలాసంగా వుండే భగవంతుని 'విలాసం' గూర్చి భాగవతంలో బమ్మెర పోతనగారు విశదీకరించారు. భగవంతుని గూర్చియే కాదు. పోతనను గూర్చి తెలుసుకోవాలనుకున్నా ముందుగా 'తనను' గూర్చి తెలుసుకోవాలి!

పోతనగారు చెప్పిన 'దేవుడి' గారి చిరునామా భావగతం కావటం కష్టమే. ఏదో కాశీమజిలీ కథల్లో 'స ప్తసముద్రాల అవతల మఱ్ఱిచెట్టు తొర్రలో ఉండే పక్షిలో, బ్రహ్మ రాక్షసి ప్రాణం వుంది' లా వుంది. సదరు అడ్రసులో పిన్‌కోడ్ చెప్పలేదు. పిన్‌కోడ్ వేసినా మన ఉత్తరాల బట్వాడా ఇలా అహో రిస్తున్నాయే! వెయ్యకపోతే ఎలా? మా చిన్నతనంలో పోస్టలు అడ్రసులా వుంది. "ఈ వుత్తరం ఊరి పెద్ద చెరువుకు అవలి గట్టున రావిచెట్టు ప్రక్కన ఉండే ఫలానా రామయ్యగారు చూచుకొని సుబ్బయ్యగారికి ఇచ్చేది" అని రాసేవారు.

సరే, 'పెంజీకటి కవ్వల' అన్నారు హైదరాబాద్‌లో లాలాగూడా (నార్త్) లాలాగూడా (సౌత్) మారేడుపల్లి (ఈస్ట్ మారేడుపల్లి (వెస్ట్) ఔట్ సైడ్ లాల్‌దర్వాజా ఇన్‌సైడ్ లాల్‌దర్వాజా లాగా. పెంజీకటి 'కావల' వున్నాడు. 'అవల' ఉన్నాడు కనుక భగవంతా, భగవంతా అంటే ముందుగా మనకు వచ్చేది ఆవలింత। ఆవలింత భగవంతుని చేత చీకటికావలనుండ

పంపబడే 'సైలెట్ కార్'। నా మాట కాదంటారా. నామజపానికి కూర్చోండి లేదా హరికథ వినండి। ఆవులింత రాకుంటే ఒట్టు।

దేవుడుగారిని ఈ పాడుకళ్లతో, సు,లోచనములు ఉన్నా సులోచనము లున్నా, మైక్రోస్కోపు, 'టెలిస్కోపు ఉన్నా చూడగలిగే 'స్కోపు' లేదు. హోప్' కూడా లేదు. మన నేత్రం కాదు. మనో నేత్రమే శరణ్యం. త్రికరణ శుద్ధిగా 'సరెండర్' కావాలి. 'సరండరే గతి। అదే వైష్ణవులు 'శరణాగతి' అన్నారు. మనోనేత్రం తెరుచుకోవాలి అంటే మన నేత్రములను మూసుకోక తప్పదు. కళ్లుమూసుకుంటే ఆరంభంలో ఆవలింతలు, ఆ తర్వాత నిద్రాదేవత ప్రత్యక్షం! సీతాకోక చిలుక పుట్టుకకు గుడ్డుదశ, గొంగళి పురుగు దశ, ప్యూపాదశల లాగా ఆయనగారిని తెలుసుకోవాలంటే ఆవులింత, పూర్వ నిద్రావస్థ, నిద్రావస్థ, గాఢ నిద్ర .... ఇలా ఒక్కొక్క మెట్టు ఎక్కాలి. "గాడ్" కనిపించేది 'గాఢ' నిద్రలోనే కొందరు నిద్రపట్టక నానా అవస్థ పడతారు. ఫోమ్ బెడ్డూ, పట్టె మంచం మనదైనా పట్టే నిద్ర మన చేతిలో లేదు. 'గాడ్' అనుగ్రహించనిదే గాఢనిద్ర పట్టదు!

ప్రాపంచిక కలలకు గాఢనిద్రలక్కర్లేదు. దేవుని కలలకు మాత్రం కావాలి! కలలో, మన ప్రాప్తం కొద్దీ, నలుపు తెలుపులోనో, ఈస్ట్‌మన్ కలరు, గేవా కలర్లలోనో ఒక్క మెరుపు మెరిసి పోతాడు. "విద్యుల్లేఖేవ భాస్వరా" అని మనవాళ్లు చెప్పనే చెప్పారు గదా! ఒక్క క్షణం మెసేజ్ ఫ్లాష్ చేసి తపీమని అదృశ్యమౌతాడు?

"నాకు రాత్రి పలానా దేవుడు స్వప్నంలో కనబడి చెప్పాడంటూ, చెప్పుకొని, కలవచ్చిన చందాన్ని వివరించి, గుడి కట్టించాలంటూ 'చందాల్ని వసూలు చేస్తూ వుంటారు కొందరు కారణజన్ములు! అవును కట్టించేవారు కారణజన్ములు. చచ్చి చెడి శ్రమించి, కట్టేవారు కార్యజన్ములు! అకారణ జన్ములు మాత్రం కాదు! ఇలాంటి 'గుడి' కలలు 'కలవారికే' వస్తుంటాయి.

అల్లాటప్పాగాళ్లకూ టామ్. డిక్కు హోరీలకు రావు గాక రావు! కారణాలు ఇక్క డొద్దు. బహుశా, కలియుగంలో కలవారికే 'గుడి కట్టించాలనే' కలలు వస్తాయి అని సమాధానపడదాము.

'నామ' జపము కన్న 'మన' జపము మిన్న. అనవరతము నరుడు 'నా' 'నా' అనుకుంటూ నానా తంటాలు పడుతూంటాడు. ఈ 'నా' జపం తగ్గించి 'మన' 'మన' అనే చింతన కావాలి, రావాలి. సర్వేజనా స్సుఖినో భవంతు' అనుకుంటూ "మా పక్కింటివాళ్లు దక్క" అనుకోకూడదు. నామ జపము మన ఉన్నతికి తోడ్పడుతుంది. 'మన' చింతన మానవోన్నతికి దోహదం చేస్తుంది. నామజపము మన ఉన్నతికి ఎలా సహాయపడుతుందంటారా? మన దేశంలో (ఆ మాటకొస్తే విదేశాల్లోనే ఎక్కువ) రక్తపోటు మందులకు, నిద్రమాత్రలకు, నరాల రోగాలకు కొన్ని కోట్ల రూపాయలు ఖర్చు అవుతున్నాయి. ప్రాణాయా మాలు, నామ జపాలు, పారాయణాలు నంబర్‌వన్ నిద్ర మాత్రలుగా పని చేస్తాయి. బి. పి. తగ్గిస్తాయి.

'గార్డినాల్' మాత్రలకన్నా సర్వ జగద్రక్షకుడైనా 'గార్డ్' నామజపం పైసా ఖర్చులేని దివ్యౌషధం. 'శ్రేయః ప్రాప్తికరౌషధమ్ పిబ మనః శ్రీకృష్ణ దివ్యౌషధమ్' అనేది అక్షరసత్యం. నిత్యపారాయణాలు, నామజపాలు వీటితో ప్రపంచవ్యాప్తంగా మానవులను పీక్కుతినే సగం రోగం కాని రోగా లను దూరం చేసుకోవచ్చు. అసలు, వయస్సు మీరగానే పయస్ (Pions) ఆలోచనలు రావాలి పైన్ 'ఆలోచనలు వస్తూంటే మనస్సుకు పీస్ వుండదు! ఆరోగ్యమునకు 'యా' వత్తు బీజము. ఆరోగ్యం యావత్తు భాగ్యములకు మూలము. ఆరోగ్యరహస్యం 'లైఫ్‌బాయ్' సబ్బుకాదు. హార్లిక్సు కాదు. హరి అనే లిప్స్! హరిజపం (హరజపం కూడా!) నిత్యం చేసుకుంటే అంత హరీ,గా హరీ అనడు! నిదుర లేవగానే దంతధావనం పిదప 'పీవా' అనో మాల్టోవా అనో అనేముందు దేవా' మాధవా అంటే పుణ్యం పురుషార్థం (స్త్రీ అర్థం అనలేదని వన్నధిక్షేపించవద్దని మనవి. ఉన్న ప్రయోగం ఉటంకించా అంతే.) ప్రాణ

మున్ముందువరకు బ్రతికి తీరుతాం. పాశ్చాత్య వైద్యులు 'క్రిమి' సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తే, ప్రాచీనులు కర్మసిద్ధాంతాన్ని నమ్ముకున్నారు. హేతువాదులు పైకి ఒప్పుకోకపోయినా, స్వానుభవం మీద, ఎప్పుడో ఒకప్పుడు, కర్మ సిద్ధాంతం కరెక్టేనేమో అని వాళ్ళ అంతరాంతరాల్లో పీకుతూంటుందనే నా నమ్మకము. కాబట్టి త్వరపడుడు. నేడే ప్రారంభించండి. మీ హృదయ వీణ ఆ దైవశక్తికి 'జోహార్ జోహార్' అని అనవరతం జపిస్తూనే వుంది. చెవులు మూసికొని ఆ వీణాగానం ఆలకించండి. ఏ నామజపం చెయ్యాలో నిర్ణయించు కోండి. లేదా, మీకు దగ్గర్లో వున్న ఏ గుళ్ళోనైనా ఉచితకర పత్రమునడగండి. ట్రింగ్. ట్రింగ్, అని రేడియోల్లో ప్రకటనలు రావాలి.

అయ్యా! ఆదిదేవుడు అగుపడతాడా అని అనుమానించకండి. "సంశయాత్మ వినశ్యతి" అని గీతావాక్యం. '**Faith is to believe what we do not see and the reward of faith is to see what we believe**" అని అగస్టిన్ అను ఆంగ్ల మహాశయుడు కూడా చెప్పాడు. మనకన్నీ వాళ్ళ శంఖంలోని తీర్థం పుచ్చుకుంటేనే మన శంకలు తీరుతాయి మరి!

కనిపించినా, కనిపించకున్నా ఐహిక లాభం, దైహిక లాభం అంటే ఆరోగ్యం ప్రాప్తిస్తుంది. అదీ గాక, అయ్యా, మన ప్రభుత్వ కార్యాలయాల్లో గుమాస్తాలే వాళ్లవాళ్ల సీట్లలో, సమయానికి కనిపించరే? వారు నింపాదిగా, కాఫీ, ఫలహారాలూ, కిళ్లీలూ, పార్టీ ఖర్చులమీద దట్టించి, సీట్లలో ఆసీనులయ్యే దాకా గంటల తరబడి మనం పడిగాపులు కాయటం లేదా? చిరుద్యోగులకే తీరికలేని పనులున్నపుడు శ్రీమన్నారాయణునికి ఎన్ని పనులుండాలి? ఎన్ని పర్యటనలుండాలి? ఫిబ్రవరిలో కూడా ముప్పై రోజుల 'టూరు' ఉండొచ్చు. అవును, ఆయనవి సంస్కృతం నెలలు! అదనంగా సెలవులు, యల్.టీ.సీలు, విదేశీ ప్రయాణాలు విశ్రాంతి సమయాలు వుండవా!

ఒక మాట, భగవంతుడు కనబడాలంటే చాలా చాలా త్యాగము చెయ్యాలి. 'పర' 'తమ' వ్యత్యాసము విసర్జించినపుడే 'పరమాత్మ దర్శనం

ప్రాప్తి! కలికాలంలో కావలసింది యాగముకాదు, త్యాగము! త్యాగరాజు లాగా! రామదాసు లాగా! అంతేగాని ఆస్తి అంతా అనుంగు బిడ్డలకు రాసిచ్చి "నా దగ్గరేముంది బూడిద"? అంటే 'ముడియాదు అనిత్యాని శరీరాణి - అందరి సొమ్మూ నాకే రానీ అంటే జాంతానై! దేవునితో ఇంటర్వ్యూ దొరకదు. అంతర్వ్యూ లభించదు. వెధవది 'మోపెడ్ లైసెన్సు కోసం, బ్రోకర్ల కాళ్లు బట్టుకొని, తైలం సమర్పించుకొని, సమస్తాలను, అధికార్లను 'సైలెన్సు' చేసి, మోపెడు డబ్బు తగలెడుతున్నామే. మోపెడుకే అంతైతే మోక్షప్రాప్తికి మరెంతకావాలి?

బస్సురూటు పర్మిట్‌కై లక్షలు గుమ్మరిస్తారే? భగవంతుని రూట్‌లో వెళ్ళటానికి 'భక్తి' తైలం ఎంత కావాలి? 'అవిచ్ఛిన్న తైలా ధారావత్ భక్తి' అన్నారు. తెగిపోని తైలా ధారవలె భక్తి ఉండాలిట. 'భక్తి అనే డిపాజిట్ కట్టాలి! ధారావతే! ధరావతు!

పోతే, అదే మనం పైలోకాలకు పోతే, మన కరెన్సీ ప్రక్కదేశంలోనే చెల్లదే! పరమాత్మ దేశంలో రద్దీ పేపరు క్రింద కూడా కొరగాదు. అక్కడ చెల్లాలంటే వేరే కరెన్సీ. అది సంపూర్ణ స్వార్థ త్యాగం. త్రికరణ శుద్ధమైన పరోపకారం! అనే డినామినేషనులలో వస్తుంది. అప్పుడే మన నామినేషను దాఖలు చేసుకునేందుకు వీలుపడుతుంది. ఆ 'మారక' ద్రవ్యం మన 'మారకం' పిదపనే లభిస్తుందండోయ్! ఏతా వతా, ఉపకారబుద్ధి లేని ఊర్ధ్వ పుండ్రములు అహం చంపుకోలేని ఆడబొట్టూ, మనసులో 'జెలసీ' మాల మెళ్లో తులసీ మాలలూ ఈ బాహ్యవేషాలతో మారక ద్రవ్యం లభ్యం గాదు గాక కాదు.

భగవంతుడు మన వెంట నిక్షిప్తంగా వచ్చే అంతరంగ ఫలకం చూస్తాడు. ఫలకం అంటే ఇంగ్లీషులో 'కార్డు' అనుకుందాం, అందుకనే నేమో హార్టుకు వచ్చే జబ్బులను కార్డియాలజీ వారికి చూపించాలి! ఆ 'కార్డు'లో మన చర్చ లన్నీ 'రికార్డు' అవుతాయి. పైన కర్మసాక్షి అయిన సూర్యుడు అనుక్షణం

సహస్ర కిరణాలతో గమనించి 'ఆడిట్' చేస్తూనే వుంటాడు. ఆడిట్ చేయు వాడు, పాపపుణ్యాల చిట్టాలో Add చేయువాడు గనుక 'ఆదిత్యుడు' (Adi-tya) అని వ్యాఖ్యానిస్తే మీ రొప్పుకోరనుకోండి. అసలు Pathology అంటేనే పాతకాల చిట్టా! మనకు ఎంతవరకు మారకద్రవ్యం అర్హత వుంటుందో, ... పంకం అనే క్రెడిట్ కార్డుమీద ఎప్పటి కప్పుడు కంప్యూటర్‌లా నమోదు అయ్యుంటుంది.

అన్నట్లు పెంజీకటి కవ్వల అనే పద్యానికి ఇంకా కొంచెం వ్యాఖ్య ఉందండోయ్. "ఆదిత్య వర్ణం తమసః పరస్తాత్" అని పురుషసూక్తం! పెను చీకటి తెరకు ఆవలివైపు దగద్ధగాయ మానంగా ఆసీనుడై వుంటాడు భగవంతుడు. 'తమసోమా జ్యోతిర్గమయ, అని కదా మన ప్రార్థన. అందుకే దేవుని నీలమేఘ శ్యామునిగా వర్ణిస్తాం. అజ్ఞానమనే చీకటిలోనుంచి జ్ఞానమనే వెలుగులోకి తీసుకొనిపొమ్మ అంటాం. కాబట్టి, 'తమ'స్సును తలక్రిందు చేసేదే 'మత'ము చీకటి కావలిగట్టుకు మనలను తీసుకొని పోలేనిది మతము మ్మ్యాట్రికీ గాదు. ఒక విధంగా దేవుడు శ్రీనివాసుడేగాదు Dark (చీకటి) Screen నివాసుడు, ఆ తెర, వాతెరతో, నిరంతరం భాష్యం ద్వారానే తొలుగుతుంది. ఆత్మకే కాదు, శరీరానికీ మతం చాల మంచిదనీ, నిత్యం పూజా పునస్కారాలు చేసేవారి ఆరోగ్యం ఇతరులకన్నా ఎన్నోరెట్లు మెరుగుగా వుంటుందనీ విదేశాలవారు సైతం అంగీకరిస్తున్నారు. అమెరికాలోని 'పర్ద్యూ' విశ్వవిద్యాలయానికి చెంది మెడికల్ సోషలాజిస్టు కెన్నెత్. యఫ్. ఫెరారో విస్తృతంగా ఎంతో మంది రోగులను పరిశీలించి సిద్ధాంతీకరించిన మాటలు! చూచారా మన పూర్వీకుల సిద్ధాంతం! ఏమంటారు!

—(●)—

# 9. సుబ్బారావూ - "బారు" పిచ్చి!

కొందరికి పేర్ల మీద అదోరకం పిచ్చి ఉంటుంది. 'పిచ్చి, అంటే 'దాన్ని' కలవారు నన్ను 'శుక్లాం బరధరం' అంటూ శుద్ధి చేసి అడ్రసులేకుండా చేస్తారేమోనని భయం. నిజానికి పిచ్చి కాదనుకోండి. 'ఫాన్సీ'!

'ఫాన్సీ' అంటే నాకేమో పరమ చిరాకు; ఒకసారి మా పక్కింటి మిత్రుడు "మా అమ్మాయికి ఫాన్సీ డ్రెస్సులో ఫస్టు ప్రైజ్ వచ్చిందంటోయ్" అని చెప్పాడు. మహా ఉత్సాహంగా తానే ఏదో యూనివర్శిటీలో ఫస్టు వచ్చినట్లు, నాకు కడుపులో దేవినట్లయింది. ఒక బిచ్చగాడి వలెనో, లంబాడీ వనిత లాగానో, కుష్ఠురోగి మాదిరిగానో, వేషం వేసుకొని, వాళ్లను, వాళ్లభాషను అనుకరించి ఈ 'కలవారి' కాన్వెంటు బిడ్డలు తామేదో ఘనకార్యం చేశామని అనుకొంటారు. వాళ్ళమీద సానుభూతి మాత్రం చిన్న మెత్తుండదు. ప్రథమ బహుమతి వచ్చిందని కులకటమే కానీ, ఆ వచ్చిన బహుమతిని ఆ లంబాడీ పిల్లకిచ్చినా కొంతమేలు! ఇది ఒక విధంగా వాళ్ళను అవహేళన చేయటం కాదా! ఈ పోటీల్లో ఆ అనుకరింపబడిన వాళ్లు పాల్గొనరు, పాల్గొనలేరు చూడలేరు, గనుక సరిపోయింది. చూస్తే మాత్రం లోలోపల ఎంత కుమిలిపోతారో!

మా స్నేహితుడొకడున్నాడు, వాడింట్లో అమ్మాయిలందరికీ వాణి, వీణ, వేణి అని పేర్లు. 'ణ' కార ఫాన్సీ, మరొకరింట్లో 'హేమ, రమ, ఉమ, ప్రేమ. ఇలా 'మ' కార మమకారం. ఇంకొకరున్నారు వాడి కూతుర్ల పేర్లు విమల, కమల, అమల ఇలా 'మల' పిచ్చి! క్షమించాలి. 'ల' కార్యవ్యవహారం; అబ్బాయిల విషయంలో కూడ అంతే. సురేష్, నరేష్, రమేష్. లేదా సునీల్, సుధీర్ ........ ఇం కొంచెం శ్రుతిమించిన వారింట్లో నర్మద, ప్రమద ఇలా 'మద' పిచ్చి, సారీ 'ద' పిచ్చి! ఇలాంటి పిచ్చి చాలా మందికి ఉంటుంది

న్యూమరాలజీ పిచ్చి, అక్షరాల పిచ్చి, సినిమా వాళ్ళకు చూడటం లేదూ. ప్రముఖ డైరెక్టరు విశ్వనాధ్‌గారికి, 'శ' కార. పిచ్చి ! సకార పిచ్చి ! ఆయన గారి సినిమాలపేర్లు శంకరాభరణం, శుభోదయం, శ్రుతిలయలు, సప్తపది, స్వర్ణకమలం ఇలా.

ఫాన్సీలో ఎన్నోరకాలు, ఆయా ఫాన్సీలు వాళ్ళ వాళ్ళ మనస్తత్వాలను తెలుపుతాయి.

లండన్ మహానగరం శివార్లలో నివసించే ఓ ఆసామి పొటాటో అని పేరు పెట్టుకున్నాడట. ఆయనగారు బంగాళా దుంపలను గూర్చి దక్క మరో విషయం ఆలోచించడట. వాటితో చేసిన వంటకాలను దప్ప వేరే వాటిని ముట్టడట. బంగాళా దుంపలతో చేసే వంటకాల వివరాలను సేకరించేందుకు 36 దేశాలు చుట్టి వచ్చాట్ట. వీడి 'దుంప' తెగ ? ఎంత ఓపికో ! అదేం వేలం వెర్రో. ఇలాంటి శాస్త్రీలు అన్ని దేశాల్లోనూ అవతరిస్తూంటాడు. ఈ ఫాన్సీలన్నీ ఒక యెత్తు మా సుబ్బారావు మిత్రుడిది మరొక ఎత్తు. వాడిది 'బారు' ఫాన్సీ, ఎలా అంటారా, చిత్తగించండి.

వాడి పేరు **Subba Rao** లో **BAR** ఉందట. అంచేత చిన్నప్పటినుంచి **BAR** అంటే ఇష్టం ! ప్లే గ్రౌండ్‌కు వస్తే హారిజాంటల్' బారు వదలడు. 'నా పేరులో **BAR** వుంది కాబట్టి 'లా' డిగ్రీ చదివి బార్‌లో కూర్చుంటానని పట్టుదలతో అడ్వకేట్ అయ్యాడు. వాళ్ళ నాన్న ఇంజనీరింగ్ చదవరా అన్నా వినకుండా. ప్రాక్టీసు అంటారా. ఏదోలా తంటాలు పడి ప్రాక్టీసు చేస్తూనేవున్నాడు. జీవితాంతం వైద్యులు, వకీళ్లు చేసేది ప్రాక్టీసు అంటే అభ్యాసమే గానీ వృత్తిలో నైపుణ్యం సంపాదించి నూరు శాతం పర్‌ఫెక్షన్ **Perfection** పొందేది ఉండదేమో ! ? కాలాంబర కవచధారులకు కాలం, ఖర్మం కలసి రావాలి మరి !

ఇంతవరకు బాగానే వుంది. కానీ కొన్ని అర్థం పర్థం లేని వాడి సెంటి మెంట్లతో పట్టింపులతో, వాదస్త్రాలతో మేము రెట్టింపుగా చస్తుంటాం.

ఆ మధ్య వాడొక బాంకులో అకౌంట్ ఓపెన్ చెయ్యాల్సి వచ్చింది. ఇంటి ప్రక్కనే అలహాబాదు బాంకు ప్రక్కవీధిలో మహారాష్ట్ర బాంకు వుంది. మహారాష్ట్ర అంటే ఏమిటో ఆష్ట్రే గుర్తొస్తుందట. అలహాబాదు, హైదరాబాద్ లలో చివర BAD అని ఉందట. కర్నాటకలో నాటకం వుందిట. ఇలా ఏవో కుంటి సాకులు చెప్పి రెండు కిలోమీటర్ల దూరం వుండే బరోడా బాంకులో చచ్చీ చెడి ఎరిగున్న వాడిని పట్టుకొని అకౌంటు తెరిచాడు. అసలు రహస్యం, Baroda లో 'BAR' ఉందిట ! మా సుబ్బారావు ఆ బార్ పదోచ్చారణలో పొందే థ్రిల్ చూడాల్సిందే. కూరలు, పచ్చళ్ల కంచంలో వున్నా భోజనం సాంబార్‌తోనే ప్రారంభోత్సవం చేస్తాడు. క్షవరానికి వెళ్లాలంటే సెలూను అని గానీ, మంగలిషాపు అని గానీ పొరపాటున కూడా అనడు బార్బరుషాప్ అంటాడు. రేషనుషాపుల్లో 'క్యూ'లో నుంచి ఎవడైనా దాటడానికి యత్నిస్తే బారులో నిలబడు ! అంటాడు. వరుసలో నిలుచో అని గానీ, క్యూలో, లైనులో అని గానీ అనడు.

మొత్తం ఇంగ్లీషు కాలెండర్లోని నెలల్లో సెప్టెంబర్ నుంచి డిశెంబర్' వరకే వాడికి లక్కీ నెలలట. చాతుర్మాస్యములని వాటికి ముద్దు పేరెట్టాడు. వాటిని పలికేటప్పుడు కూడా మా వాడు 'బ'కు దీర్ఘం సాగదీసి సెప్టెంబార్, అక్టోబార్' అని పలికి థ్రిల్ పొందుతాడు. అన్నట్లు వాడు పుట్టింది డిశంబర్లో!

ఇదంతా వదిలేద్దాం. వాడి వివాహం ఒక ప్రశ్నార్థకం అయి కూర్చుంది. కారణం అమ్మాయి పేరులో BAR అని విధిగా రావాలని కండిషన్. 'పోనీ నీవు అమ్మాయి పేరు మార్చుకోరా అంటే, అదేం కుదరదు. దొరక్కపోతే గదా చూద్దాం, అని దాటవేసేవాడు.

ఎన్నో కారణాలలో ఒక దశాబ్దంగా నాకు వాడి సమాచారాలు ఏవీ తెలియలేదు. ఆ మధ్య ఎపడో ఫ్రెండును రిసీవ్ చేసుకుందామని సికింద్రాబాదు స్టేషను కెళ్లా. అనుకోకుండా మా వాడు సతీసమేతంగా ప్లాట్ ఫామ్ మీద ఊడి పడ్డాడు. ఉక్కిరి బిక్కిరై ఆనందంతో చప్పట్లు కొట్టి పిలిచాడు. కుశల ప్రశ్న లతో ముంచెత్తాడు. తర్వాత తాపీగా మరి తమరి సతీమణి పేరేమిటో తెలుసుకో వచ్చా' అని అడిగా ! 'అరుణ' అన్నాడు ! 'హమ్మయ్య ! ఇన్నేళ్ళకు నీకు జ్ఞానోదయమై పేరు విషయమై నీ భీష్మ ప్రతిజ్ఞను గంగలో కలిపివేశావన్న మాట. థాంక్స్' అన్నా ధీమాగా.

అబ్బే ! అదంతా జాంతానై మా ఇంటి ఇనిషియల్ 'బి' కదా. ఇం కేం B. Aruna లో BAR వుంది కదా అంటూ కనుబొమ ఎగరేస్తూ కొంటెగా అరుణవైపు చూసి రెలెక్కేశాడు మా సుబ్బారావ్ !



# 10. మూడు !

'మూడు' అంటే నాకు మొదటి నుంచీ, మెదడు వికసించడం ప్రారంభ మైనప్పటినుంచీ చాల ఇష్టం. మరో గీత కాదంటోయ్ భగవద్గీత ! అక్కౌంట్స్ టెస్ట్ మేడ్ ఈజీ లాగా, కుక్కింగ్ మేడ్ ఈజీ లాగ, రెలిజియన్ మేడ్ ఈజీ! వేదాలూ, పురాణాలూ, ఉపనిషత్తులూ అన్నీ దానిలో త్రీ ఇన్‌వన్‌లా ఇమిడి వున్నాయి. కర్మయోగం, భక్తియోగం, జ్ఞానయోగం, మూడూ అందులోనే, దానవుణ్ని మానవునిగా 'మనీ' కి 'షి అతీతుడుగా మార్చి 'మనీషి,గా మలచ గల మహత్తర శక్తి అందులో వుంది. ఈ విషయం మన కన్నా జర్మనీ వాళ్లే బాగా గుర్తించా రంటారు. కొందరు 'గీత' ను నిత్యం పారాయణం చేస్తారు. మంచిదే, కానీ అది పఠించవలసిన గ్రంథం అనటం కన్నా నిత్యం పాటించ వలసిన గ్రంథరాజము అనడం పాడి.

శ్రీకృష్ణ భగవానుడు అందులో తాను ఎందులో వున్నాడు ఆయనగారి ప్రియులు, అత్యంత ప్రియులు, ఏ యే రూపాల్లో, ఎక్కడెక్కడ వున్నారో విభూతి యోగములో విశదీకరించారు. "మాసాల్లో మార్గశీర్షమును నే నే. మహర్షుల్లో భృగుమహర్షి నే నే, పాండవుల్లో అర్జునుణ్ని నే నే, ఋషుల్లో వేద వ్యాసుణ్ని నే నే, ఋతువుల్లో వసంత ఋతువును నే నే, అక్షరాల్లో 'ఓం' కారమును నే నే" అంటాడు. విష్ణుమూర్తిగారిని భృంగు మహర్షిగారు 'మహా హర్ష' గా ఒక్క తన్ను తంతాడు, అదీ 'హార్టు' పైన ! దేవుడు గారు ఎప్పుడూ అంతే. 'స్వామీ ! రక్షించు' అంటే ఒక పట్టాన కదలడు. వేల సంవత్సరాలు చూసీ చూడనట్లుండి. పెద్దగా పట్టించుకోడు. పాపం గజేంద్రుడు నా నా హైరానా పడ్డాడు గదా. అదే, హిరణ్యాక్షుడు, హిరణ్యా కశిపుడు, శిశుపాలుడు, దంతవక్త్రుడు, రావణ, కుంభకర్ణుల విషయం కేవలం 'మూడు' మూడే జన్మల్లో మోక్షం ప్రసాదించాడు! ఏ సిఫార్సులూ లేకుండానే।

నిజమైన భక్తులను దేవుడుగారు యమాగా సతాయిస్తాడేమో ! డోన్ట్ కేర్ బాపతు నాస్తికులకు లోలోపల జడిసి, వాళ్లను త్వరగా వదిలించుకుందామని చూస్తాడేమో ? దేవుని అడుజాడల్లో నడిచేది నిజంగా నాస్తికులే అంటాడు మా విప్లవ వాది వితండేశ్వరావ్. నాస్తికులు దేవుడు లేడంటారట. దేవుడు కూడా తాను దప్ప ఇంకో దేవుడు లేడంటాడు కదా అంటాడు !

"ఏది ఎట్లా వున్నా నాస్తికులు పైకి మేకపోతు గాంభీర్యం ప్రదర్శిస్తున్నా లోపల. లో లోపల లేడనుకున్న దేవుడు కొంపదీసి ఉంటే మనగతి ఏం కావాలి అని భయపడుతూనే వుంటారని నా సందేహం ! ఆ మాటకొస్తే ఆస్తికులకు, అర్థ ఆస్తికులకు పూర్ణ ఆస్తికులకు మరో రకంగా గుబులు ! ఆయనగారిని నమ్ముకొని భూలోకంలో చేతికందిన సౌఖ్యాలను జుర్రుకోకుండా త్యాగం చేస్తున్నామే. ఈ త్యాగాలకు పైలోకాల్లో ఫలితం వుంటుందో వుండదో అని వారి దిగులు !

సరే, అసలు విషయాని కొస్తాం. దేవుడుగారు తన బ్రాంచి ఆఫీసులు ఎక్కడెక్కడ వున్నాయో అన్ని రూపాలను చెప్పాడు. 'జూదాన్ని కూడా నేనే' అట ! గుర్రాల్లో ఉచ్చైశ్రవమును నేనే అట. ఇక నేం గుర్రం, జూదం ఆయనే అయినప్పుడు 'రేసు కోర్సులు, లాటరీలు, మట్కాలు ఎలా పోతాయి మన ఘ. వ. ప్రభుత్వం వారు ఎందుకు వాటిని నిషేధించాలి ?

ఇంచుమించు అన్నీ చెప్పాడు గానీ ఒక్కటి మరచినట్లున్నాడు. అంకెల్లో ఆయనగారి లంకె, లింకు లక్కీ నెంబరు ఏదో సెలవీయ లేదు. లేదా కనుక్కోండి అని మన కొదిలేశాడు ! నేను విస్తృతంగా పరిశోధించి ఒక నిర్ణయానికొచ్చా. అంకెల్లో 'మూడు' ను నేనే అని సూచించాడు ! అందుకే మూడవ వేదమైన సామవేదాన్ని నేనే, అన్నాడు. మూడు ఆకారంలో వుండే ఓం ను నేనే అన్నాడు. ఈ 'మూడు' కు ఒక ప్రత్యేకత వుంది. చాలా భాషల్లో ఈ అంకె స్వరూపం దాదాపు ఒకటిగానే వుంటుంది. సున్నా కూడా అంతే

గదా అంటాడు మా వాడు. అవుననుకోండి, ఆ సున్నా కూడా పరిపూర్ణత్వ మునకు, దైవత్వమునకు చిహ్నమే కదా.

త్రిగుణములు, త్రిమూర్తులు, త్రికాలములు తెలిసినవే. ఓం కారములో అకార, ఉకార, మకారములు మూడు ! వాత పిత్త శ్లేష్మములు మూడు। సన్యాసులను 'త్రిదండి' అంటారు. త్రిదండి, అంటే మనోదండము, వాక్ దండము, కాయ దండము అని - ఈ మూడింటిని అదుపులో పెట్టుకొనువాడు 'త్రిదండి' ఆధునిక సన్యాసులను, రాజయోగ సన్యాసులను, రాజకీయాల్లో వుండే సన్యాసులను వదిలెయ్యండి. పురాణా లెన్నివున్నా, భారతీయుల నిత్య జీవనంలో పెనవేసుకొని పోయినవి. అందరనూ ఏకం చేసినవీ రామాయణం, మహాభారతము, భాగవతమూ, మూడే మన ప్రయాణ మార్గాలు మూడు భూ మార్గము, జలమార్గము, ఆకాశ మార్గము. సైనిక విభాగాలూ అంతే. సూక్ష్మ జీవులు స్థూలంగా మూడే రకాలట : స్తంభాకారము **(cocci)** శంఖాకారము **(Spiralla)** కాడ ఆకారము **(Rod)** పరమాణువులో ఎలక్ట్రాన్, ప్రోటాన్, న్యూట్రాన్ అని మూడు భాగాలు ! శరీరం తల, మొండెము, కాళ్లు, చేతులు అని మూడు భాగాలు. శరీరానికి కావలసినవి ముఖ్యంగా మూడే. గాలి, నీరు, ఆహారం !

పోతే, నిత్యజీవితంలో కూడా ఈ మూడు డామినేట్ చేస్తున్న దాఖలాలు ఎన్నో పెళ్లిళ్లలో మూడు ముళ్లు, వేలం పాటలో మూడు సార్లు డాక్టరు గారు మాత్రలు రాసి **T.T.D.** అంటారు. **T.T.D.** అంటే తిరుమల తిరుపతి దేవ స్థానమనీ ఆ దేవునికి మొక్కుకోమనీ కాదు. త్రి టైమ్స్ ఎ డే అని ! అత్యంత గోప్యంగా చెయ్యాల్సిన పనిని 'మూడో' కంటికి తెలియకుండా చెయ్యాలి. శివుడు మూడో కన్ను తెరిచాడో భూగోళం బుగ్గి కావల్సిందే లేజర్ చూపులు ! ప్రభుత్వ నిబంధనల ప్రకారం కీలక స్థానాల్లో ఉన్న ఉద్యోగులను మూడు సంవత్సరాల కొకసారి మారుస్తారు ! మినిష్టరుగారి ఇలాకా అయితే మినహా యింపు లుండొచ్చు లెండి.

ప్రభుత్వ విద్యావిధానంలో అమలు పరచబడేది త్రిభాషా సూత్రం! విద్యాలయాలు కూడా స్థూలంగా మూడు రకాలు. హైస్కూల్, కాలేజీ, యూనివర్శిటీ, నేరస్థుల వద్ద నుంచి నిజం రాబట్టుకునేందుకు పోలీసులు ప్రయోగించే పద్ధతి' థర్డ్ డిగ్రీ మెథడ్ !

ఇలా జీవితమే మూడు తో నిండిపోయింది. చైనా భాషలో 'మూడు' అంటే జీవితం అనే అర్థం! జీవితం మూడునాళ్ళ ముచ్చట అంటారు. వేదాంతులు, మూన్నాళ్ళ ముచ్చటే గాదు. మూడునాడుల ముచ్చట!

మన ప్రపంచంలోని దేశాలను కూడ ఆధునికులు మూడు వర్గాలుగా విభజించారు! అభివృద్ధి చెందిన దేశాలు, అభివృద్ధి చెందుతున్న దేశాలు, అభివృద్ధి కావలసినవి (Third world countries!)

ఈ మూడు ఇలా మనలను నడుపుతూ వుంటే మరో మూడు కూడా మనలను ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఆడిస్తూంటుంధి.

సెలవు మంజూరు కావాలన్నా, ఇంక్రిమెంట్ శాంక్షను కావాలన్నా, ఇంకే పని కావాలన్నా పై అధికారి మంచి 'మూడు' లో వున్నపుడే కలవాలి పరీక్ష పేపర్లు దిద్దేవాడి 'మూడు' ఖరాబు అయిందా. గోవిందా, వృత్త వైశాల్యం సరిగా వ్రాసినా వృత్తం మార్కు పడవొచ్చు. రాజుగారికి ఆగ్రహము లేని 'మూడు' ను కనిపెట్టి గదా మన పూర్వీకులు అగ్రహారాలు, మడులు, మాన్యాలు కొట్టేసింది!

కొందరు మహాకవులకు, రచయితలకూ ఈ మూడు రావటానికి బలే చిత్రమైన నమ్మకశక్యం గాని అలవాట్లుంటాయట! ఒక జర్మను కవిగారు తన టేబిల్ డ్రాయర్ల నిండా బాగా కుళ్లిపోయిన ఆపిల్ పండ్లను పెట్టుకునేవాడట. షెల్లీ అనే ఇంగ్లీషు రచయిత మూడ్ కోసం ఎప్పుడూ ఏదో ఒకటి నమలుతూనే వుండేవాడట. బెర్నార్డ్ షా గారు మూడు కోసం బస్సుల్లో ప్రయాణం

చేసే వాడట. మన ఆర్టీసి బస్సులో ప్రయాణం చేసి యుంటే వచ్చిన మూడ్ ఎగిరి చక్కా పోయుండేది।

కొందరు చన్నీళ్ళ స్నానం చేసే వారట, కొందరు కప్పుమీద కప్పు తే నీరు త్రాగేవారట. కడప పట్టణంలో నాకు తెలిసిన ఒక కవి వుండేవాడు. ఆయన గదిలో ఎప్పుడూ ఒక తెల్ల పిల్లి వుండేది. నార్వే దేశంలో లాటెన్ పాప్లోన్ అనే సుప్రసిద్ధ రచయిత అలవాటు మరీ విడ్డూరం। పందుల కొట్టంలో కూర్చొని వాటి గుర గుర శబ్దాలను వింటూంటేనే అతనిలో భావావేశము పెరిగి బ్రహ్మాండమైన కథలు వ్రాసే వాడట. ఆయన్ను అందరూ వరహ రచయిత అనే వారట. ఊరక 'ట', 'ట' అనుకోవద్దండి. ఇవన్నీ పేపర్లో అప్పుడప్పుడు చూచిన వార్తలే సుమండి।

సాధారణంగా ఇలాంటి వింత అలవాట్ల సంగతి వదిలేస్తే, చాలా మంది కళాకారులు, కార్టూనిష్టులు, కలం వీరులు, 'మూడు' దేవత అనుగ్రహించ టానికి, ఆవహించటానికి, కారా కిళ్ళీలను ఆశ్రయించడం, సిగరెట్లకు దాసు లవటం, మరి కొంత మంది రస' జ్ఞులు 'చుక్క' ను, చక్కని చుక్కను ఆరాధించటం వారి వారి స్థాయిని బట్టి జరుగుతుంది. కొందరు ఆ స్థాయిని కూడా మరచిపోతారు.

ఇవన్నీ ఆలోపతి మందులు। డోసు ఎక్కువైతే 'మూడు' తలక్రిందై మనిషి 'డూమ్ (Doom) అయ్యే ప్రమాదం। మంచి పద్యమా ఫ్రెంచి మద్యమా అన్న మహా కవి మనకు లేడూ?

—(●)—

# 11. సతులు - సంబోధనలు

ఆ మధ్య తెలంగాణా ప్రాంతంలో ఒక పెళ్ళికి వెళ్లా. ఆ వూరు పూర్తిగా ఒక పల్లెటూరు, నా వెంట మా మిత్రుడు కూడా వచ్చాడు. వాడి పేరు బి. జె. శాస్త్రి చనువున్నవారు బి. జె. యస్. అంటుంటారు. దానికి సంకేతం 'బోడి జోకుల స్పెషలిస్టు!' అని.

పెండ్రి మంత్రాలు వల్లిస్తూ మధ్యలో పురోహితుడు "పిల్ల, పిల్లగాడు త్వరగా బట్టలు మార్చుకొని పీటల మీద కూర్చోవాలి" అని ఆదేశించాడు. మా బి. జె. యస్. గాడు నా చెవిలో "మార్చుకోవాలి అంటే ఒకరివి మరొకరు ఎక్స్ఛేంజి చేసుకొని కూర్చోవాలా" అని వాడి సహజశైలిలో ఒక జోకు వేశాడు.

"నోరు మూసుకోరా" అన్నా, విన్నాడు !?

ఇంతలో ఒకరు మాకు తాంబూలం ఇచ్చి వెళ్లారు. అరగంట తర్వాత మళ్ళీ మరొకాయన ఇంకొక తాంబూలం పాకెట్ అందించాడు. "ఇది ఇరకే ఇచ్చారండీ" అన్నా, అది విన్న పురోహితులుం గారు 'అది పిల్లది, ఇది పిల్ల గాడిది' అన్నారు. మా వాడు ఊరుకోకుండా 'పిల్ల గాడిది' అంటా డేమిట్రా అని మరో జోకు చెవిలో ఊదాడు, 'మహా ప్రభూ ! ఎవరైనా వింటే దేహశుద్ధి చేస్తారేమో ఊరుకో' అన్నా. శుభ్రంగా వధూవరులు అనో పెండ్లి కొడుకు పెండ్లి కూతురు అనో అనొచ్చుగా. 'పిల్లా, పిల్లగాడు' ఏమిటీ అని మళ్ళీ అనుబంధ ప్రశ్న వేశాడు. వీడి వెంట పెండ్లికి రావటం నాది తప్పు అనుకున్నా.

"నీవు ఇక్కడి మాండలీక భాషలను విమర్శించకూడదు. ఆ లెక్కన మన వైపు మాండలీకాలు వీళ్ళకు ఎబ్బెట్టుగా వుండొచ్చు, అదీ గాక 'పిల్లగాడు'

అంటే పెద్ద తప్పేముంది? మన సంప్రదాయంలో భర్త దైవ స్వరూపుడని గదా, పతియే ప్రత్యక్ష దైవం - గదా! కాబట్టి పిల్ల పాలిటి గాడ్ పిల్లగాడు లేదా పిల్లకు 'గార్డు' పిల్ల గార్డు పిల్ల గాడు!" అని నేనూ ఒక సద్ది జోకు వేశా. ఇక ఈ విషయం వదిలేద్దాం.

వివాహ మహోత్స వాహ్వాన పత్రిక అని ఆర్భాటంగా పత్రిక ముద్రించారే గానీ 'మహోత్సవము' గాదు. మాములు సాదా సీదా షాదీ! పెండ్లి పిలుపు అనో, పెండ్లి పత్రిక అనో సింపుల్‌గా ఎందుకు పెట్టరో అర్థం గాదు. మరి కొంత మంది ఇంకా ముందుకుపోయి "వివాహ మహోత్సవాహ్వాన శుభ పత్రిక" అని అచ్చు వేయిస్తారు. పెండ్లి అన్న తర్వాత శుభ పత్రిక గాక అశుభ పత్రిక అని మరో రకం కూడా ఉండదే! పెండ్లి వహ్వా అనేలా ఉండకున్నా యీ 'వాహ్వాన పత్రికలు వస్తూనే వుంటాయి, వి. ఐ. పిల ఇంట్లో పెళ్లిళ్లా, మంత్రుల ఇండ్లలో పెండ్లిండ్లా, కంట్రాక్టర్లూ, క్రింది తాబేదార్లూ అందరి చేతా చేతి చమురు వదిలించి అట్టహాసంగా 'స్టార్' హోటళ్ళలో చేసే పెండ్లిండ్ల సంగతి గాదు! నేను చెప్పేది సగటు మనిషి ఇలాకా పెండ్లి విషయం.

పెళ్లిళ్లలో ముఖ్యంగా వియ్యాల వారికి ఒక్కొక్కరికి ఒక్కొక్క రకం పట్టింపులుంటాయ్, ఏ పట్టింపులూ లేని వారు కూడా మగపెళ్లి సైడు వారు కాగానే అప్పటి కప్పుడు కొత్త కొత్త పట్టింపులు గాలిలో ఉసుళ్ళ లాగా పుట్టుకొస్తుంటాయ్. కాఫీ మొగము చూడని వాడు కూడా మూడో సారి కాఫీ రాలేదని దబాయిస్తుంటాడు. వియ్యానికీ. కయ్యానికీ ఎక్కడో చుట్టరికం వుందేమో!

పెండ్లి కుమారుని తండ్రితో సాధారణంగా పేచీ రాక పోవచ్చు, అనుకున్నంత కట్నం అణా పైసలతో సహా ఏ మదింపులు, కుదింపులు, బకాయీలూ లేకుండా ముందుగా ముట్టలేనే అనుకోండి, 'మనీ' ముట్టితే మన్ను తిన్న పాములాగా, సారీ 'మనీ' తిన్న పెద్ద 'మనీషి' లాగా ఆదేమని అడక్క

పోవచ్చు. వియ్యాల వారిలో కొంత మంది పాత తరం వాళ్ళకు ప్రాంతీయ ఆచారాల మీద, సంప్రదాయ పద్ధతుల మీద పట్టింపు లుండొచ్చు. వర రత్నం గారికి వీడియోలూ, ఫోటోలూ వెరీ ఇం పార్టెంట్, వెర్రి వ్యామోహం, పేకాట రాయుళ్ల బృందముంటే ఒక వర్గం వారికి అదే స్వర్గం! వాళ్లు భోజ నాల వేళకు హాజరై మళ్ళా కనిపించరు. కొందరు భోజన పరాక్రములు! వంటల పర్యవేక్షణ మిషతో ఏకంగా పాకశాల మీద దండయాత్ర సాగించి పిండి వంటలను లాగించేస్తారు. పౌర సరఫరా నిఘా అధికారుల లాగా! మరి కొందరు, పాపం ఆడ పిల్లల తలి దండ్రులు పెండ్లికి విచ్చేసిన వారిలో, వరుల చిట్టాలోకి ఎక్కిన, ఎక్కబోతున్న యోగ్యులున్నారా అని అన్వేషణా యజ్ఞంలో నిమగ్నులౌతారు! మరి కొందరు సాక్షాత్ నారద మునీంద్రుల వారి 'జీన్స్' పుణికి పుచ్చుకున్న వా రుండొచ్చు. చాకచక్యంగా మనస్పర్ధలకు బీజాలు నాటి అవి మొలక లెత్తే లోపలే చల్లగా జారుకునే రకం! వీరి వల్లే అడపా దడపా చిన్న సైజు, పెద్ద సైజు వాగ్యుద్ధాలు, భోజనాల మధ్య లేచి పోవడాలూ ( వేరే అర్ధం గాదు సుమా! ) అభాసూలూ కలుగుతూ వుంటాయ్. గ్రంధ సాంగులూ, రసికులూ (వీరినే 'రాస్కెల్స్' అందురు అంటాడు. మా బి. జె. యస్. తారసిల్లుతూనే వుంటారను కోండి.

మరి కొందరు ఇంద్రజాల మహేంద్రజాల, టక్కు టమార విద్యల్లో విద్వాంసులు! సహస్రాక్షులు! నగలు, నట్రా వగైరాలు అదృశ్యం చేయ టంలో నేమి, నూతన పాదరక్షా పరిగ్రహణ పద్దతుల్లో పద్మ విభూషణాది బిరుదార్హులు! తస్మా దియ్యా! తస్మాత్ జాగ్రత!

కాసేపు మహిళా విభాగం వైపు పరికిస్తే అమ్మ లక్కలకు, పట్టు చీరలు, నగలు, వాటి డిజైనులు, వీటిపైన శ్రద్ధ! సునిశిత పరిశీలనా ప్రక్రియ సల్పి, వారి వారి 'వారు' లతో చెప్పో, 'వార్' లేదా కోల్డువార్ ప్రకటించో, ఘారాం చేసో అలాంటి ఆభరణాల కొనుగోలుకై గోల చేసే పథకం వేసు కుంటారు. భర్తకు రాబోయే బోనస్ మైనస్!

మరొక ఏజ్ గ్రూప్‌వాళ్లు, వయసులోకి అడుగు పెడుతున్న వాళ్లు, వధూ వరుల వైపు మరదళ్లూ, పెండ్లి కూతుళ్ళ లిస్టులోని వారూ, కొత్త జంటతో పేర్లు చెప్పించుకొని, వేళా కోళం చేస్తూ ముసి ముసి నవ్వులతో, కిల కిలలతో వాతావరణాన్ని ఆహ్లాదకరంగా మారుస్తూంటారు.

ఇంకేం, పెండ్లిలో ఆ రసవత్తర ఘట్టం రానే వచ్చింది. పెండ్లి కొడుకే (పిల్లగాడే అనను !) ముందు పేరు చెప్పాలి అని అమ్మాయి వైపు వారు లేడీస్ ఫస్టు ప్లీజ్ అని వరుని వైపు వారు కాసేపు భీష్మించుకొని కూర్చున్నారు. చివరకు 'చీట్లు' వేసి తీర్మానించు కుందాం అని ఒకరు సలహా ఇవ్వగా, అబ్బాయి పేరు వచ్చింది. ఆ సలహా ఇచ్చినాయన ఏదో చిట్‌ఫండ్ ఏజంటు అట !

అబ్బాయిగారు కాసేపు బెట్టు చేసినట్లు నటించి, బోజనాల వేళయిందిరా' ఈ రోజు వంట అసలే ఆలస్యమయిందిరా. ఈ తొక్కిడిలో నా పట్టు ఉత్తరీయం పట్టు దప్పి క్రింద పడిందిరా అనీ, పోండి - మూడు సార్లు చెప్పా నన్నాడు. "ఎక్కడ చెప్పారూ అని ప్రశ్నిస్తే మూడు చోట్ల ఇందిరా అని వుందిగా అని ఎదురు ప్రశ్న వేశాడు.

ఇక అమ్మాయిగారి వంతు, ఆ నవలా మణి రసజ్ఞురాలు లాగానే ఉంది. కనీసం ప్రముఖ తెలుగు మేగజైనులకు, కొన్ని దిన పత్రికలకు పంచ ప్రాణాలైన సీరియల్ నవలా బాధితురాలై యుండొచ్చు.

సదరు నవలా మణి "శ్రీవారు ఇంత చమత్కారంగా కవితా పరంగా చెపితే నాకు మాత్రం సుకుమారంగా చెప్పటం రాదేంటి, చెప్తా, జరగం డర్రా కొంచెం దూరంగా," అనింది వయ్యారంగా. "ఆయన గారు మూడు సార్లు నా పేరు చెపితే నేను అయిదుసార్లు చెప్తా, చాలా" అనింది సరదాగా అందరం నవ్వు కున్నాం, వర రత్నం పేరు రంగారావు అని ఈ పాటికి అర్ధం కాకుంటే మీరు మార్చి, సెప్టెంబరు మార్కు, గజనీ, మహమ్మదులన్న మాట !

వివాహాల్లో నూతన వధూవరుల చేత పేర్లు చెప్పించడ మనేది అనాదిగా వస్తున్న వేడుక. భార్యా భర్తలు పరస్పరము పేర్లతోనే సంబోధించుకునే ఈ నవ నాగరికతా కాలంలో ఈ వేడుకకు ఇప్పుడు ప్రాముఖ్యత లేదను కోండి. మన పూర్వీకుల్లో భర్తను పేరుతో పిలిస్తే ఆయుక్షీణం అనే నమ్మకం. మూఢ విశ్వాసమే, అందుకని వివాహ సమయాల్లో చెప్పించడం ఒక ఛాప్టర్ అయింది. అప్పుడు దోషం లేదట.

మీరు వినే వుంటారు. మన నాన్నలు, తాతలు భార్యను ఏమేవ్ అనో, ఒసేవ్ అనో పిలిచేవారు. మొన్న మా బి. జె. యస్. గాడు మాటల సందర్భంలో ఈ సంబోధనలు స్త్రీలను కించ పరచేవిగా ఉన్నాయనీ అదిక్షేపించాడు. కాలక్షేపం కొరకు వాడిని ఉడికించడానికి.

"మిత్రమా! భార్య మనకు అహర్నిశలూ సేవ చేస్తూ వుంటుంది. అనులోమ, విలోమ సూత్రి ప్రకారం, అరవంలో 'ఉరల్' తెలుగులో రోలు అయినట్లు సేవ 'వసే' అయ్యుం డొచ్చు. లేదా భర్త వశములో నున్నది కాబట్టి 'వశ' వశే అయ్యుంటుంది" అని దబాయించా.

'ఏడ్చినట్లే వుంది, నీ బోడి సమర్థన. ప్రతినిధిని మిగ్రింగువాడు ప్రతినిధి అనీ, ఉక్కపోయు కాలమునకు ఆది కాబట్టి ఉగాది అనీ ఉమ్మరముతో కూడిన కాలము స + ఉమ్మర్, సమ్మర్ అని ఎవడో సెల విచ్చాడట. ఇంకా నయం, లావా దేవి అంటే లావుగా ఉండు దేవి అనో లేదా గుండెల్లో లావా పెట్టుకొని జీవించు దేవి అనో చెప్పలేదు, వస్తా" అని వుత్తరీయం దులుపు కొని చక్కా పొయ్యాడు!

వాడు వెళ్ళిన తర్వాత నాకూ అనుమానం వచ్చి 'ఏమే, వశేలు నిజంగా నీచార్థక సంబోధన లేనా అని నిర్ధారించు కుందామని తెలుగు నిఘంటువు తెరిచా.

ఏమే అంటే ఏ పూజ్యురాలు అని అర్థము ! వశ అంటే ఆడుది, ఆడే నుగు, పెండ్లాము ఆపు, కూతురు, గొడ్డు టావు ఇన్ని అర్థాలు !

ఆ కాలంలో ఈ పదాలు భార్యపట్ల గౌరవ సంబోధనలు గనే ఉన్నట్లు కనపడింది. కొన్ని ప్రాంతాల్లో భార్యను బైశాలి అని పిలుస్తారట. ఇది 'భాగ్యశాలి' కి వ్యవహారికం అయ్యుంటుందేమో పరిశోధకులు చెప్పాలి మరి.

ఏది యేమైనా 'వలపు' ఉండాలే గానీ 'పిలుపు' ఎలా వుంటే యేం ? వలపు లేనప్పుడు ఏ పిలువు అయినా సలుపు ! ఏ మంటారు ?



# 12. మనస్తత్వాలు-మాటల తీరులు!

ఒకే విషయంపై ఒక్కొక్కరిది ఒక్కొక్క అభిప్రాయం. ఒక్కొక్క దృక్పథం. ఉదాహరణకి, ఒక పాము పుట్టను చూచి ఒకడు భక్తి ప్రపత్తులతో పాలు పోసి పూజిస్తాడనుకుందాం. దాన్ని చూచి, హేతువాది "ఇదంతా మూఢ విశ్వాసం" అని హేళన చేస్తాడు. పాలకు నోచు కోని ఎందరో దౌర్భాగ్యులకు ఈ పాలు అందిస్తే ఎంత బాగుంటుందంటాడు. "విలువైన కొబ్బరి పాలను, ఆవు పాలను, ఇలా మట్టిపాలు చేసి, జాతీయ సంపత్తిని వృధా చేస్తూ పోయే దేశం ఎలా అభివృద్ధి చెందుతుంది అని వ్యధ చెందుతాడు ఆర్థిక శాస్త్రవేత్త! "కష్టపడి చీమలు పుట్టలను నిర్మిస్తే, ఏ కష్టమూ పడకుండా, హాయిగా, పాములు, వాటిని ఆక్రమిస్తాయ్. కష్టమొకరిది, కలిమి మరొకరిదిగా వుండే మన వ్యవస్థ మారాలి, మారాలి. అంటాడు ఒక గడ్డం మార్క్ విప్లవ వాది!

"ఏ పని ముట్టూ లేకుండా అంత అల్ప జీవులు మట్టితో పుట్టను ఎంత బాగా నిర్మించుకున్నాయ్? యేమి అద్భుత శిల్పం? యెంత అందము?" అని నివ్వెర పోతాడు శిల్ప కారుడు.

"మానవుడు ఏర్ కండిషన్ పద్ధతిని చీమల నుండే నేర్చుకున్నాడు" అంటాడు మరొక ఆధునిక శాస్త్రజ్ఞుడు.

"నాయనా! ఒక ఔన్సు పాలు మట్టిలో పోశామని అంత విల విల లాడి పోతావే. నేడో రేపో, మన మందరమూ మట్టిపాలు కావలసిన వారమే గదా" అంటాడు వేదాంతి! ఇలాగే అణ్వాస్త్ర నిర్మాణం దగ్గిరనుంచీ, ఆధునిక అశ్వ మేధ యాగాల (గుర్రపు పందాలు) వరకూ ప్రతి వ్యక్తిదీ ఒక్కొక్క దృక్పథం!

భావాల్లో భిన్నత్వ మున్నట్లే, భావ వ్యక్తీకరణ విషయంలో, మాటల తీరులో కూడా అంతటి విభిన్నత్వం తప్పదు. కొందరి మాటలు పైడి మాటలు కొందరివి, వాడి ములుకులు.

మా వూర్లో ఇద్దరు ఉద్దండ జ్యోతిష్కులు ఉండేవారు. అన్న దమ్ములు, తమ్ముడేమో మాంచి లౌకికుడు. అన్నగారు నోరెత్తితే ఎదుటివాడు తారెత్తి పోవల్సిందే! మాట వరసకి ఆయుర్దాయ విషయము అడిగారనుకోండి. తమ్ముడు "మీకు సంపూర్ణ ఆయుర్దాయ మండీ తొంభైకి పై మాటే' అనే వాడు. ఆ వచ్చినాయన సంబరపడి అయిదు ఇవ్వవలసిన వాడు వది ముట్ట చెప్పి వెళ్ళేవాడు.

అదే అన్నగారి దగ్గర అడిగాడో, "ఆయుర్దాయాని కేం బ్రహ్మాండంగా వుంది. నీ ముందరే నీ కొడుకులు, కోడళ్ల అంతా చస్తారు. ఎంత మంది ఆత్మీయుల చావో చూచి గానీ నీవు పోవు!" అని కట్టె విరిచినట్లు తెగేసి చెప్పే వాడు!

ఇద్దరు చెప్పిందీ ఒకటే అయినా మాటల తీరులో ఎంత తేడా.

ఇలాగే మరికొన్ని మనస్తత్వాలను చెప్పుకుందాం.

ఒక వూర్లో మూడు పూల తోట లున్నాయట, ఒకటి ఆంగ్లేయునిది, ఇం కొకటి జర్మనీ వాడిది మరొకటి ఫ్రెంచి వాడిదట.

ఇంగ్లీషు దొర 'ఇచ్చట పూలు కోసినవారు ప్రాసిక్యూషను చేయబడు దురు' అని బోర్డు తగిలించాడట.

జర్మనీ పౌరుడు "హెచ్చరిక, పూలు కోయుట నిషేధించబడినది" అన్నాట్ట, ఫ్రాన్సు దేశస్థుడు "ప్రకృతిని ఆస్వాదించే రసజ్ఞులు పూలను కోయరు, చెట్లకే విడిచి పెడతారు" అని వ్రాశాడట. ఫారిన్సు దేశీయుని బోర్డుకే

ప్రజలు స్పందించి వాడి తోటలోని పూలను విడిచిపెట్టే వారని వేరే చెప్ప నక్కర లేదు.

అదే మన పదహారణాల ఆంధ్రుడు అయ్యుంటే బహుశా "పూలు కోస్తే దెబ్బలు, ఖబడ్దార్" అని వ్రాశేవాడేమో.

చెప్పొచ్చే దేమంటే చెప్ప దలచుకున్న విషయ మొక్కటే అయినా చెప్పే తీరులు ఎన్నో రకములని!

ఇద్దరు రైల్లో ప్రయాణిస్తున్నారట, అందులో ఒకడి పర్సు కనబడ లేదు. పర్సు పోగొట్టుకొన్న వాడు, పక్కవాడిని 'పర్సు నీవే తీశావు' అని పరుషంగా మాట్లాడి, గోల చేసి. జనాన్ని ప్రోగుచేసి, వాడి జేబులు, సూటు కేసు వెదికాడు. చివరికి ఆ పర్సు అసలు పోగొట్టుకున్న వాని దగ్గరే వుంది. ఎక్కడో పెట్టేసి. ఎక్కడో వెదుక్కొని, ప్రక్క వాణ్ని అనుమానించి, మర్యాద పోగొట్టుకున్నాడు. కొంచెం తేరుకున్న తర్వాత "క్షమించాలి, సారీ" అన్నాట్ట.

ఇదే సంఘటనకు ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా స్పందిస్తారు.

"సారీ, అట - వెధవ సారీ ఎవరికి గావాలి, నీ మీద పరువు నష్టం దావా వెయొచ్చు, కొంచెం బుద్ధుండక్కర్లా, ఎదుటివాడు ఎలాటి వాడనే ఇంగిత జ్ఞానం లేకుండా సోదా చేస్తా వుట్రా, వుండాకోర్" అని గర్జించ వచ్చు.

"తను దొంగ అయితే పొరుగును నమ్మడు అని సామెత ఊరికే అన్నారా. నీ బుద్ధి బయట వేసుకున్నావ్. పాంటు, షర్టు వేసుకొని నాలుగు ఇంగ్లీషు కూతలు నేర్చుకోగానే సరా! సంస్కారం ఎక్కడి నుంచి తెస్తాం?" అని కూడా అనొచ్చు.

"చూస్తా వేం రా, నాలు గంటిచ్చాక, వచ్చినోడా. ఆయన్ను అనుమా నిస్తావుట్రా?" అని గర్జిస్తుడువమ వచ్చు.

కానీ ఆ సోడా చేయించుకున్న పెద్ద మనిషి.

"అబ్బే దాని దే ముంది లెండి, మీరు వస్తువు పోగొట్టుకున్నా ననుకు న్నారు. నన్ను దొంగ అనుకున్నారు. నేను మిమ్మల్ని పెద్ద మనిషి అనుకు న్నాను ఇద్దరం పొరపాటు బడ్డాం। అంతే' దట్సాల్ రైట్" అన్నాడు. పర్సు వాడి మొఖాన నెత్తురు చుక్క లేదు।

అలా సున్నితంగా చెప్పు దెబ్బ కొట్టడం ఒక లలిత కళ సుమండీ। కొందరు 'ఖస్' అని మాట్లాడుతారు. మరి కొందరు 'ఖస్ ఖస్ వేళ్ల మీద నీళ్లు చల్లినట్లు మాట్లాడుతారు, హాయిగా.

ఒకా నొక పెద్ద మనిషికి ఒక చిన్న మనిషి బండ బూతులు తిడుతూ ఒక ఉత్తరం వ్రాశాడు. ఆ పెద్ద మనిషి చాల బాధ పడ్డాడు, ఎలా సమా ధానం ఇవ్వాలా అని ఆలోచించాడు. నేటి రాజకీయ నాయకుల్లాగా త్వం శుంఠ అంటే త్వం శుం ఠన్నర అని తిట్ట లేదు.

"అయ్యా। నేను సంస్కారం వంతుణ్ణి గనుక, నీవు వ్రాసిన విధంగా వుత్తరం వ్రాయడం భావ్యం కాదు. పోనీ, మా స్టెనో గ్రాఫరుకు డిక్టేట్ చేస్తామా అంటే ఆమె గారు స్త్రీ గనుక ఆ పదజాలమును వ్రాయుటకు సిగ్గు పడుచున్నది. తమరు ఈ రెండు వర్గాలకు చెందినవాదు కాదు కాబట్టి నేను వ్రాయదలచుకున్న దేదో తమరికి అర్థం అయిందను కొందును" అని ఒక కార్డు ముక్క వ్రాశాట్ట!

ఇంగ్లీషులో 'రి పార్టీ' అనే పదముంది, దానికి అర్థము ఎదుటి వాడిని ఆట్టే నొప్పించకుండా సున్నితంగా దెబ్బ కొట్టడం, రి పార్టీకి సరియైన తెలుగు

అనువాదము ఏదో తెలియదు గానీ, మనకు కూడా, పురాణ గ్రంథాల్లో పూర్వ కవుల రచనల్లో, ముఖ్యంగా సంస్కృతంలో ఎన్నో వున్నాయి. లక్ష్మీదేవి తాను శ్రీమంతురాలినని తల బిరుసుతనంతో పార్వతీ దేవితో 'ఈ వేళ అన్న గారు (శివుడు) బిక్షకు ఏ సీమకు వెళ్లారు ?' అని అవహేళన చేస్తే బలిచక్ర వర్తి వద్దకు అని పార్వతి రుసిమని జవాబిచ్చిందట !

ఇలా సున్నితమైన హాస్యమున్న రెండు మూడు జోకులు చెప్పి వ్యాసం ముగిస్తా. మరీ బోరు కొట్టించను లెండి !

ఒక పార్కులో రెండు రాతితో మలచిన కుక్క శిల్పాలున్నాయి. మా ఫ్రెండు అక్కడ ఉన్న తోట మాలితో 'ఇవి ఇంతగా బలిసి వున్నాయే ? రోజూ ఏమి తింటాయ్ ! ఎప్పు డెప్పుడు తిండి పెడతావ్ ?' అని పరియాచకంగా అడిగాడు. ఆ ముసలి తోటమాలి "ఏం తెలివిగా మాట్లాడుతున్నా ననుకున్నావా? నాతోనా నీ పరియాచకాలు ?' అని రుస రుస లాడలేదు. 'మరే నండి, అవి మొరిగి నప్పుడల్లా అన్ని మాంసం ముక్కలు పడేస్తానండి." అని నవ్వుతూ సమాధాన మిచ్చాడు ! మా వాడి ముఖం అప్పుడు చూడాలి. ఈ అనుభవం నాకే జరిగి యుంటుంది. అనీ, ఫ్రెండును అడ్డం పెట్టుకుని చెప్పాననీ మీకు అప్పుడే అనుమానం వచ్చి యుంటుందేమో అని నా అనుమానం.

ఒక పల్లెటూరి ముసలాయన హైదరాబాదులో సెలూన్‌కు వెళ్లాడు. మంచి లౌక్యుడు లెండి. ఆయనకు వాళ్ళ వూర్లో బాగా గడ్డము ఎదురుగీయించు కునే అలవాటు, మన సిటీ షాపుల్లో గిరాకీలు ఎక్కువ. అంచేత ఓపిగ్గా గడ్డము ఎదురు గీస్తూ కూర్చుంచే గిట్టుబాటు కాదు. బర్ బర్ అని గీసేవారే 'బార్బర్లు !' అలాగే చేశాడు. మన ముసలాయనకు అది నచ్చలా, మళ్ళీ గీయ మని అడగాలంటే నామోషీ, పైగా నే నెక్కడ విసుక్కుంటానోనని బెరుకు బహు లౌక్యుడు గాబట్టి "మళ్ళీ ఎదురు చెయ్య వయ్యా !" అని గానీ, గడ్డము ఇలాగేనా చేసేది మీ వూళ్ళో ? అని గానీ, కొత్తగా నేర్చుకుంటున్నావా అని

గాని డైరక్టు అటాక్ ఇవ్వాలా, ఏమన్నాడో చిత్తగించండి, 'బాగుందయ్యా, చాలా బాగా గడ్డం చేశావ్, అసలు మొన్ననే సెలూన్‌కు వస్తామనుకున్నా అమావాస్య, తర్వాత రోజు మంగళవారం! అందుకని రాలేక పొయ్యా. పోనీలే ఇప్పుడేమయింది. గడ్డం మొన్న గీయించుకున్నట్లే ఉంచెలే అని అదోలా నవ్వుతూ అన్నాడు. సదరు రసిక క్షురక వరేణ్యుడు ఆ జోకుకు విరగబడి నవ్వి 'ఏం సామీ! పెద్ద దెబ్బ కొట్టారే, మళ్ళీ గీస్తా తల యెత్తండి' అని అన్నాడు, తల దించుకుంటూ.

ఒక లావుపాటి ఆసామీ కొత్తగా ఒక సెకండు హేండు డొక్కుకారు కొన్నాడు. అది లగాయతూ మహాగా కోతలు కోయడం మొదలెట్టాడు. ప్రక్కనున్న మిత్రునితో, ఆయన ఆ బోరు భరించలేకుండా వున్నాడు. కారు శాస్త్రీ మాటలు కట్ చెయ్యాలని "మీరు ఎన్ని చెప్పండి. కారు కన్నా ఎద్దు బండి నయం అంటా, పైగా పెట్రోలు ఖర్చు లేదు!" అన్నాడు. కారాయనకు కోపం వచ్చి 'నీకు, కారుకూ, ఎద్దు బండికీ తేడా తెలిసినట్లు లేదే; అవును లే, ఎప్పుడైనా తిరిగిన మొఖమైతే గదా!' అని అవహేళన చేశాడు. ఆ మిత్రుడు "ఆ, ఆపాటి తేడా తెలుసు లెండి. ఎద్దు బండిలో ఎద్దు బయట వైపు వుంటుంది లెండి" అన్నాడు తాపీగా, అంతే కారయ్యకు నీరు కారింది!

మా ఫ్రెండు ఒక డుండేవాడు, ఎప్పుడూ మన సమాజం మారాలి! మారాలి! అని పిడికిలి బిగించి అనవరతం 'మార్పు' జపం చేస్తూండే వాడు, అవివాహితుడు. పెండ్లి చేసుకోవా, అని అడిగితే "భార్యా భర్తల్లో విభిన్న ప్రవృత్తులుండాలి. అప్పుడే ఆనందం, అందుకోసం నిరీక్షిస్తున్నా అని దాట వేశేవాడు. ఒక సారి నేను సరదాగా నాకు మంచి సంస్కారం, అందం చదువు, తెలివి అన్నీ ఉన్న అమ్మాయి కావాలి! అని డైరెక్టుగా చెప్పరాదూ' అని అన్నా.

ఇలా సున్నితంగా చెపితె వాడికి అర్థమైందో లేదో మరి!

# 13. దోషైక దృష్టులు!

'నోరు మంచిదైతే ఊరు మంచి' అని మనకొక సామెత. ఆణిముత్యం లాంటి ఈ సామెత అర్థం అందరికీ తెలుసు. యదార్థవాదీ, లోక విరోధీ అనీ, 'మౌనేన కలహం నాస్తి' వీటి అర్థాలు కూడా అందరికీ తెలుసు. కొద్ది పాటి ప్రయత్నంతో, సువర్ణ సూత్రాలైన ఈ సలహాలను పాటిస్తే సగానికి సగం కలహాలు తగ్గవూ! కానీ ఎందరు పాటిస్తున్నారు?

కొందరితో మాట్లాడుతూంటే మనకు ఏ 'స్పేస్ షిప్' లోనో భూమి కక్ష్య దాటి పోతున్నట్లు శరీరం చాలా తేలిక పడి హాయిగా వుంటుంది. గిరీశం సెలవిచ్చినట్లు వాళ్ళతో మాట్లాడడమే ఒక ఎడ్యుకేషన్!

తమాషా యేమిటంటే "పరుష వాక్ప్రవక్తలు" అందరూ చెడ్డవారు కాకపోవచ్చు. "మధుర వాక్ స్పెషలిస్టు" లందరూ మంచి వారూ కాకపో వచ్చు. కొందరు మృదు మధుర కవితలు వ్రాసే వాళ్ళ నోళ్ళలోంచి గళం విప్పితే వడగళ్ళ విసుర్లే! మరి కొందరి మాటలు మహా కఠినంగా వుంటాయ్. కానీ వారి రచనలు లలిత పద భూయిష్ఠమై, యిష్టంగా, స్పష్టంగా, అహ్లాదకరంగా వుంటాయ్.

సమాజము నిభిన్న మానవ స్వభావాలు ప్రదర్శన శాల. ఒక ఆంగ్ల మహాకవి అన్నాడట "మానవ స్వరూప స్వభావాలను సమగ్రంగా అధ్యయనం చేయుటకు జంతువుల కొఱకై యేర్పాటు చేయబడిన చోటునే 'జూ అందురు" అని, అక్షరాల నిజం! అమాయకులు, తెలివిగల వారు, మోసగాళ్లు, స్వార్థ పరులు, సంశయాత్ములు, సోమరులు, ధీరులు, భీరువులు, ఆశావాదులు, నిరాశా వాదులు, విమర్శక స్వభావులు, కువిమర్శకులు ఇలా ఎందరో మహాను భావులు. అందరూ ప్రతి సమాజంలో వుండి తీరుతారు! వీళ్లల్లో కూడా మళ్ళీ ఎన్నో గ్రేడులు వుండొచ్చు.

మా సుబ్బారావు ఫ్రెండు సంగతే తీసుకుందాం. వాడి మనసు చాలా మంచిదే, కానీ యేం లాభం. నోరు విప్పితే గబ్బు ! పాపం ఎన్ని రకాల టూత్ పేస్టులు, వళ్ళ పొడులు న్యాయో అన్నీ వాడి చూచాడు. చివరికి వాడి జబ్బుకు మందే లేదన్నారు. పోనీ నోరు మూసుకోని పడియుండరా అంటే తిట్టే నోరూ, తిరిగే కాలూ అని ఒక సామెత యేడ్చిందాయె !

మా వాడు ఎప్పుడూ రాంగ్‌సైడ్‌లోనే ఆలోచిస్తాడు. బహుశః వాడి జాతక చక్రంలో వాక్ స్థానాధిపతి వక్రించాడో ఏమో మరి. ఉదాహరణకి ఎక్కడో దారిలో తారసిల్లినపుడు ఎవడైన మిత్రుడు ఖర్మకాలి పలకరించి మాటల సందర్భంలో "ఆ ఇంట్లోనే వుంటున్నావా ?' అని అడిగాడనుకోండి.,,

''అంటే ? ఆ అడగడంలో నీ వుద్దేశ్యం ఏమిటీ అంట. నేను రోజుకో.. ఇల్లు మారతాననా ? లేక రెండు. మూడు ఇళ్ల నాకీ వూర్లో ఉన్నాయనా ? అని ఎదురు ప్రశ్న !

"అన్నం తిన్నావా ?' ని అడిగామనుకోండి.

'అలా అడగడంలో నీ అభిప్రాయం ఏమిటీ అంట'

అన్నం కాక గడ్డీ, గాదము తింటాననా అదీ దొరక్క వస్తున్నా ననా ? అని ఎదురు ప్రశ్న !

"సినిమా బాగుందా ?,, అని అడిగితే 'నన్నెందుకు అడగడం ? ఎవరి అభిప్రాయం వాడిది, నీకు డాన్సులు నచ్చొచ్చు, నాకు నచ్చకపోవచ్చు. కొందరికి ఫైట్స్ కావాలి. మరి కొందరికి అవె బోరు కొట్టొచ్చు. కామెడీ ఒకరికి ఇష్టం. ట్రాజెడీ మరొకరికి ఇష్టం. కాబట్టి సినిమా చూడ దలచుకుంటే వెళ్ళి చూడు, అంతే గానీ నన్నడక్కు ఇది వాడి ఉపోద్ఘాతం.

"ఘంటసాల' చాల బాగా పాడుతాడు" అన్నారనుకోండి.

"అతనిని మించిన గాయకులు ఎందరో వున్నారు. నీ కేం తెలుసు వాళ్ళను సినీ రంగంలో పైకి రానీయకుండా చేశాడు." అంటాడు.

పోనీ "ఘంటసాల" ను మంచి గాయకుడు గాదని అన్నామనుకోండి,

'ఏదీ నీ వొక పాట పాడు చూద్దాం. గొంతెత్త లేవు గానీ నీకు విమర్శించే స్తోమత ఎక్కడుందీ' అని మళ్ళీ అటు నుంచి నరుకొస్తాడు.

ఎదుటివాడు చెప్పిందాన్ని కాదనడమే వాడి నైజ గుణం. సూర్యుడు తూర్పున ఉదయించును అన్నా కాదనే రకం : వాడి మాటల తీరే అంత-

మా జె. సుబ్బారావు మదికి అందేవి ఎదలో నిలిచేవీ లోపాలే. తప్పులే, చేట లాగా మంచిని గ్రహించి, చెత్తను వదలి పెట్టడు, చెడ్డను గ్రహించి, మంచిని వదలి పెట్టే జల్లెడ బాపతు. అందుకనే వాడిని "జల్లెడ సుబ్బారావు అని అనుకుంటాం వాడు లేకుండగా సుమండీ.

మా మిత్రుడు చంద్రశేఖర్రావు ఉరఫ్ చంద్రం నిజానికి చక్కని కవితలు, కథలు వ్రాస్తుంటాడు. ఇంకా యేవీ అచ్చుకాలేదు. పత్రికల్లో పడలేదనుకోండి. దానికి వాడి తప్పు సుతరామూ లేదు.

"అచ్చుకాని రచనైనా అందరికీ నచ్చవచ్చు పత్రికల్లో బడ్డ రచన పరమ చెత్త కావచ్చు. ధర్మపరుల కెన్నికల్లో ధరావతు తన్నవచ్చు. స్మగ్లరు సార్వభౌముడు, సచికోత్తముడే గావచ్చు, న్యాయవాది కేసు ఓడినా న్యాయవాదే అయినట్లు, కవిత స్వీకరింప బడకున్నా నేను కవిని గాక పోను అంటాడు. మా చంద్రం, నిజమే మరి. అందుకని నేనేమో వాడిని ప్రోత్సహిస్తూనే వుంటా!

ఒక సారి మా సుబ్బారావుతో 'చంద్రం : నీవు చంద్రానివే కాదు, కవి చంద్రుడన్న బిరుదుకి అర్హుడి వోయ్' అన్నా, మా సుబ్బారావన్నాడు

చూడు చూచారూ ! (ఎలా చూస్తారు లెండి నేను చూపించండే పేరు కూడా మార్చేశాగా !) "అవునోయ్, నిజంగా వాడన్నట్టు నీవు కపి చంద్రుడివే. ఎందుకంటే చంద్రుడికి స్వయం ప్రకాశత్వం లేదు కదా, చంద్రుని నిండా గోతులే కదా, నెలలో పదునైదు రోజులు క్షీణదశ గదా" అని వెటకారంగా వాడి ప్రతిభను నీరు కార్చాడు !

ఇంకొక సారి కవితను విని 'ఓ హో ! పానకం లాంటి కవిత్వమోయ్. అన్నా "అంటే అర్థం రేపటికి పులిసిపోతుంది" అనేగా నీ భావం అని నిలదీసి ఇహిహీ అని ఇకిలిస్తాడు, మా జల్లెడ సుబ్బారావు.

నీ కవిత తెలుగు తల్లికి కర్పూర నీరాజనం అన్నామనుకోండి. అంటే కాసేపట్లో చప్పున చల్లారి పోతుందనే నా ? అని అదోలా మొహం పెడతాడు.

"తాలకరి జల్లు" తో పోలుస్తామనుకోండి.

"అంటే కాళ్ల తడుపుకో వచ్చేమో గానీ, స్నానయోగ్యము కాదన్న మాట" అంటాడు.

'కోకిల' తో పోలిస్తే "అంతే, కాకి గూట్లో పెట్టుకోవాల్సిందే', అని వెటకారం !

గంగా ప్రవాహంతో పోల్చినా సరే. "అంతే హిమాలయాల్లో పుట్టి చిట్ట చివరకు అధః పాతాళానికి దిగజారి పోయిందన్న మాట'. అని అవహేళన చేస్తాడు.

ఎలా వీడితో వేగడం !

ఒక సారి యేమైందంటే, మా చంద్రం హడావిడిగా వచ్చి, 'మొన్న సోమవారం మాకు అబ్బాయి పుట్టాడోయ్. పునర్వసు నక్షత్రం. ఇప్పుడే జాబు వచ్చింది' అన్నాడు. మహా సంబర పడిపోతూ,

''గుడ్' కంగ్రాట్స్, పునర్వసు నక్షత్రం చాల మంచిది. శ్రీరాముని జన్మ నక్షత్రం. కాబట్టి 'రామ' అని వచ్చేటట్లు పేరు పెట్టు అబ్బాయికి అన్నా ఊరికే వుండకుండా.

మా సుబ్బారావు నోరు ఊరుకుంటుందా. "ఇంకేం. నీకు పదహారేళ్ల లోపే పుత్రునితో విరహం. ఆ తరవాత వానికి వనవాస ప్రాప్తి. ఆ తర్వాత నీకు ... ... ...అదీ గాక అబ్బాయిగారు పెద్దయ్యాక గడియ గడియకూ అర్ధాంగిని అగ్నిప్రవేశం చెయ్యమని పట్టుబడతాడేమో జాగ్రత్త"! అని పకిలించాడు.

ఇలాంటి వాళ్లను ఎలా వదిలించుకోవాలో? తోచడంలేదు.



# 14. భిన్నత్వంలో ఏకత్వం !?

అన్ని సబ్జక్టుల కన్నా లెక్కలంటే నాకు ఇష్టం. నూటికి నూరు మార్కులు కొట్టెయ్యగల సబ్జక్టు అదొక్కటే! ఎంత బాగా వ్రాసినా మిగతా వాటిల్లో పూర్తి మార్కులు పడెయ్యటానికి ఆ దిద్దే టీచరుకు బుద్ధే పుట్టదు! అలాంటి లెక్కల్లో ఆల్‌జీబ్రా కన్నా అర్థమెటిక్స్ అంటే మరీ ఇష్టం. దానిలో కూడా భిన్నాల లెక్కలంటే నాకు చిన్నతనం నుంచీ బలే ఇష్టం! మనవాళ్ళు కూడా, ఏ సబ్జక్టుకూ లేని గౌరవ ప్రపత్తిని 'భిన్నాల' కిచ్చి పూలహారం వేసి సత్కరించారంటూ. ఎలా అంటారా లవము, హారము అని ఒక్క భిన్నాలల్లోనే చూస్తాం! అవెగాక "లోకో భిన్న రుచిః" అని నానుడి ఉండనే ఉందాయె! మత ప్రవక్తల దగ్గరనుంచి మండల నాయకుల వరకు ప్రతివారూ ఎప్పుడో ఒకసారి 'భిన్నత్వంలో ఏకత్వం' సిద్ధాంతానికి మన పవిత్ర భారతదేశం ఆదర్శమని ప్రవచిస్తూనే వుంటారాయె! మన దేశంలో వున్నన్ని భాషలు, మతాలు. సంస్కృతులు, ఏ ఇతరదేశంలో లేవు! రాజకీయ నాయకుల సంగతి సరేసరి. మీకు నచ్చింది నాకు నచ్చదు, నాకు నచ్చినది మీకు నచ్చదాయె. మనిద్దరికి నచ్చింది ప్రక్కవానికి సుతరామూ నచ్చదు! భిన్నత్వంలో ఏకత్వం!

చూచారా! ఈ 'భిన్నత్వం' ఏ విధంగా మన సమాజాన్ని అనాదినుంచి ప్రభావితం చేస్తూందో ఇదంతా ఆ భిన్నాల ప్రభావం!? అందుకేనేమో మీరు ఏ విషయం తీసుకోండి. దానిమీద ఏకాభిప్రాయం కుదిరితే ఒట్టు. అన్నీ భిన్నాభిప్రాయాలే.

దేవుడున్నాడా లేడా? మంత్ర తంత్రాలు బూటకమా? జ్యోతిష్యం, వాస్తు శాస్త్రము ఇలాంటివి నమ్మదగినవేనా? స్త్రీలకు ఆస్తిలో వాటాలుండాలా! ఉద్యోగములో రిజర్వేషన్లు కులాల ప్రాతిపదిక మీద ఉండాలా ఆర్థిక ప్రాతి పదిక మీదనా? ఉమ్మడి కుటుంబం వల్ల సమాజానికి మంచిదా చెడ్డదా? 18 సంవత్సరాలు దాటిన వారికి ఓటుహక్కు సరియైనదా కాదా. సబ్సిడీల పథకాలు

దేశాని మంచివా లేక, భవిష్యత్తులో దేశానికి నష్టదాయకమా? టాంక్‌బండ్ పైన విగ్రహాలు ప్రతిష్ఠించడం, హుస్సేన్‌సాగర్ మధ్యలో, బుద్ధుని విగ్రహాన్ని నెలకొల్పటం, కోట్లు కోట్లు తగలెయ్యటం సబబా? స్వాతంత్ర్య యోధులకు, శాసన సభ్యులకు, పార్లమెంటు మెంబర్లకు పింఛను ఇవ్వటం ఎందుకు? ఇంగ్లీషు భాష మనదేశంలో ఇంకా కొనసాగాలా? జంటనగరాలలో గణేశ్ ఉత్సవాలను నడివీధుల్లో నిషేధించాలా వద్దా. ఇలా ఏ విషయమైనా సరే అటూ ఇటూ గంటలకొద్దీ వాదించవచ్చు.

గాంధీ, నెహ్రూ మన దేశాన్ని భ్రష్టు పట్టించారని అనేవారూ ఉన్నారూ. వారికి బ్రహ్మాండంగా నీరాజనాలు పట్టే జనాలూ ఉన్నారు. సత్యజిత్‌రే పిక్చర్లను విమర్శించినవారూ ఉన్నారు. వేనోళ్ళ పొగిడే వారూ ఉన్నారు. నక్సలైట్ల సమస్య గానీయండి, నాయకుల చితాభస్మాన్ని నాలుగు మూలలా వెదజల్లే విషయం గానీయండి, ఎవరి అభిప్రాయం వారిది.

అయోధ్యలో రామమందిర నిర్మాణం విషయమైతేనేమి? జనతా వస్త్రాల పథకమైతేనేం, మరణశిక్ష రద్దు విషయం దగ్గరనుంచి మెర్సీ కిల్లింగ్ ఆత్మహత్య చేసుకునే హక్కు వరకు ఎంతసేపు వాదోపవాదాలు చేసుకున్నా ఒక కొలిక్కిరాదు. ఇంతెందుకు ఎమర్జన్సీని సమర్థించినవారూ ఉన్నారు, విమర్శించినవారూ ఉన్నారు.

మనదేశంలో అధ్యక్షపాలన కానీయ్యండి, డంకెల్ ప్రతిపాదన కానీవ్వండి. వాదోపవాదాలు వారి వారి వచో నైపుణ్యప్రదర్శనకు మాత్రమే పనికొస్తాయి గానీ సత్యశోధనకు గాదు. నిరంతర అంతర్మథనం వల్లనే అది సాధ్యం.

అందుకనే Thomas Carlyle అనువాడు అంటాడు. "Man lives by believing Something and not debating or arguing" వాదోప వాదాలు వినేదానికి వినోదానికే:, మనిషిని శాసించేది విశ్వాసం మాత్రమే.

ఆ మధ్య ఒక స్నేహితునికి వీడ్కోలు సందర్భంగా స్టేషనుకెళ్లా. ప్లాట్‌ఫాం మీద పాసింజర్ల కొరకై నిర్దేశింపబడిన సీట్లున్నాయి. వాటిని కదిలించడానికి వీలులేకుండా బిగించబడ్డాయి. ఏసీటుకు ఆసీటు ప్రత్యేకం. అయిదు సీట్లుంటే అయిదుగురే కూర్చోవాలి. ఆరోవాడు కూర్చునేందుకు కుదరదు.

మా మిత్రుల్లో ఒకడు అన్నాడు ఈ రైల్వేవాళ్లకు బుర్రలేదోయ్, ఆధునికత పేరుతో బోలెడు డబ్బు తగలేసి, ఇలాంటి షోకు కుర్చీలు ఏర్పాటు చేసే బదులు, ఏకంగా పొడవైన సాదా బెంచీలు వేయిస్తే దాంట్లో సర్దుకొని ఇద్దరు, ముగ్గురు అదనంగా కూడా కూర్చోవచ్చు కదా?" అని రిమార్కు చేశాడు!

వాడు చెప్పింది నిజమేననిపించింది. వాళ్ళు ఏర్పాటు చేసిన సీట్లలో సీటుకు సీటుకు మధ్య ఖాళీ జాగా వృధా అయినట్లు తెలుస్తూంది. సొంపు ఎక్కువ. సౌకర్యం తక్కువ.

ఆ మాటలు విని ప్రక్కనున్న మరొకడు "ఇలాంటివే మేలండీ. లాంగ్ బెంచీ అయితే మొత్తం బెంచీనంతా టోకుగా ఆక్రమించేసి ప్రతివాడూ పడుకుందా మనుకోవచ్చు. బిచ్చగాళ్ళు అనంతశయనులయ్యే అవకాశం వుంది వాళ్ల రొంగ నిద్ర నుండి లేపటం కష్టం! ఎక్కడ చూచినా రౌడీ వెదవలే రాత్రికి రాత్రే బెంచీలు మాయమవచ్చు! అన్నాడు.

ఇతగాడు చెప్పేందాంట్లో కూడా నిజముందనిపించింది.

నరంలేని నాలుకతో మెలికలెన్నైనా తిప్పొచ్చు. ప్రతిపక్షంలో వున్న ప్పుడు ఒకమాట. అధికార పక్షంలో వున్నప్పుడు మరొకమాట. మనకు అను భవమే అదా.

దేవాలయ నిర్మాణానికి చందాకోసం వచ్చారనుకోండి. అది మంచి పని అనే వాళ్ళుంటారు. "దండగ. పాతబడి, శిథిలమైన ఆలయాలను పునరుద్ధరించ వచ్చుకదా, మళ్లీ కొత్తవి ఎందుకూ? ఈ మారిన విజ్ఞాన యుగంలో కావలసినవి బడులు గానీ గుడులు కావు" అని వాదించేవారూ ఉండొచ్చు ఇద్దరిది కొంత కరక్టే అనిపిస్తుంది!

వార పత్రికల్లో సీరియల్‌గా నవలలు వస్తున్నాయిగదా. దాని వల్ల రచయితకు లాభమా గాదా, ముందుగనే మంచి పేరు వస్తుంది గనుక, రేపు గ్రంథంగా విడుదల అయితే బాగా పుస్తకాలు 'అమ్ముడు పోతాయి' అంటా డొకడు. మరొకడేమో "అక్కడేనండి మీరు పొరబడుతున్నారు గ్రంథం విడుదల కాకముందే, నవలను పాఠకులు ఎప్పుడో చదివేసి వుంటారు కథ యావత్తూ తెలిసి వుంటుందాయె. సస్పెన్సు పోతుంది. అంచేత పుస్తకాలను మళ్లీ డబ్బెట్టి ఎవడు కొంటాడండీ" అంటాడు ఇద్దరిదీ ఒక విధంగా రైటే అని పిస్తుంది మరి!

తుపానులో, వరదలో వచ్చాయనుకోండి, బీదా బిక్కీ ప్రజలు తుఫాను భీభత్సానికి గురై కూడు లేక, గూడు లేక, కట్టుకునేందుకు బట్టలేక అలమ టించుతూ వుంటే 'ముఖ్యమంత్రిగారు రాలేదు' చూచారా అని అభియోగం వెయ్యొచ్చు. అదీ కరక్టే!

ఆయనగారు వచ్చారే అనుకోండి. ప్రధాన మంత్రిగారొచ్చి వంగి తొంగి చూడలేదు చూశారా? అని ప్రచారం చెయ్యొచ్చు, (రానిదే ఎలా చూడటం?)

ప్రధాన మంత్రిగారు ఆలస్యంగానైనా వచ్చారే అనుకుందాం. "మా కష్టాల్లో మేముంటే చావు బ్రతుకుల మధ్య కొట్టుమిట్టాడు"తూంటే వీరంతా ఇప్పుడు వచ్చి ఏం వుద్ధరిస్తారు? వీరంతా ప్రచారానికి ఫొటోలతో టి. వి. లో, పేపర్లో పడటానికి వచ్చారే దప్ప,ఏంలాభం. ఇక్కడ మాకు, కొద్దో గొప్పో, సహాయ కార్యక్రమాలు అందించే అధికార బృందం అంతా పోటీలుపడి, వంది వంధిమాగధుల్లాగా, ఒకసారి ముఖ్యమంత్రి వెంట, ఒకసారి ప్రధాన మంత్రి వెంట, మరొకసారి గవర్నరుగారి వెంట, ఇంకొకసారి కేంద్ర పరిశీలక బృందం వెంటబడుతూంటే ఈ కాస్త సహాయం అందటంలో నత్తనడక నడుస్తుంది. అసలు వీరందరికీ, మా ఓట్లమీద దప్ప, మా పొట్లమీద దృష్టి ఉందా? అందరూ కొంపలంటుకున్నప్పుడు చుట్టలు అంటించుకునే బాపతే. మాపేరు చెప్పి లక్షలకు లక్షలు దిగమ్రింగడానికే. అనీ అనుకోడం వింటుంటాం. ఇందు లోనూ నిజముంది మరి!

మొన్న మా మిత్రుడొకడు హడావిడిగా వచ్చి ,అర్జంటుగా ఓ అయి దొందలు సర్దు గురూ. పిల్లలకు స్కూలు యూనిఫారాలు కొనాలి. జీతం రాగానే ఇచ్చేస్తా' అని అన్నాడు.

'ఏమిటీ ఇచ్చేస్తావ్. యూనిఫారాల్నా, అయిదొందలనా'

',జోకుకేం గానీ, ముందు డబ్బు కావాలి" అన్నాడు.

నాప్రక్కనున్న వితండేశ్వర్రావు ఊరుకుంటాడా?

"అసలు ఈ స్కూలు యూనిఫారాలు ఎందుకు? శుద్ధ దండుగ. వ్యాపారస్థులు స్కూలు యజమానులు దండుకునేందుకు! అన్నాడు.

'ఎందుకేమిటి! యూనిఫారాలను చూచి వాళ్ల ఫలానా స్కూలు పిల్లలు అని సులభంగా తెలుసుకోవచ్చు. అందరికీ ఒకే రకం దుస్తులు కాబట్టి, ఒకరి నొకరు చిన్నచూపు చూచే అవకాశం లేదు. సర్వమానవ సమానత్వ, సౌభ్రాత్రపు బీజాలు విద్యార్థి దశనుంచే వాళ్ళలో నాటుకుంటాయ్" అన్నాడు.

యూనిఫారాల ఊసెత్తితే చాలు. మా వితండేశ్వర్రావు శివ తాండవం చేసాడు! ఒక ఉపన్యాసం ఇస్తాడు.

వాడు అందుకున్నాడు.

"విద్యార్జనకు ఈ యూనిఫారాలూ, టైలూ, బూట్లూ ఎందుకటా? ఎంబ్లెమ్‌లు ఎందుకట? ఈ వేషాల్లో విద్య బాగా వస్తుందేమో అని భ్రమపడి పామర జనం మోజుపడి, వేలువేలు అప్పో, సొప్పో చేసి తల తాకట్టు పెట్టి, వారి బిడ్డలను ఈ స్కూళ్ళలో చేరుస్తారు ఈ హంగామాలతో సగటు మనిషి క్రుంగి పోతున్నాడు. పంచె డాబు కన్నా, అంచు డాబు ఎక్కువా? తలుపులు కన్నా కిటికీలు పెద్దవా? అసలు పద్యం అరనిముసం. ఆలాపన అయిదు నిముసాలా? చేతి గాజుల కన్న చెవి రింగులు పెద్దవా? పాటలు పావుగంట. ప్రకటనలు అరగంటా?

అయ్యో! అన్నదానము, విద్యా దానము అనాదిగా గల మన భారతీయ సంప్రదాయములో, విద్య గజపుట వ్యాపారమా? అదీ నల్లబజారు వ్యవహారమా? జీతము ఏ అయిదొందలో ఇచ్చి పదునైదు వందలకు సంతకాలా?

వ్యాపార దృష్టే లేకుంటే, కొన్ని స్కూళ్లు ఏకంగా, యూనిఫారాలూ, పుస్తకాలూ, నోటు బుక్కులూ, తమ స్కూల్లోనే కొనాలని నిబంధన లెందుకండీ! ఆ స్కూళ్ళ యాజమాన్యానికి, పబ్లిషర్లకూ, లాలూచీ వ్యవహారం లేదని గుండెమీద చెయ్యి వేసికొని చెప్పగలరా?

మీరు అభిప్రాయ పడ్డట్టు, పిల్లల్లో సమానత్వ భావాలు పెంపొందు తాయనే మాట వరసకు అంగీకరిద్దాం మంత్రిగారి పుత్రరత్నం ఒక చిన్న ఉద్యోగస్తుని కుర్రాడితో నేస్తం కట్టినట్లు విన్నామా? కార్లలో వచ్చే ధనిక విద్యార్థులు కాలి బాట మీద నడచి వచ్చే స్టూడెంట్సుతో చేతులు కలుపుతారా?

దేశ సమైక్యతా భావమే నిజమైన ధ్యేయమైతే దేశ వ్యాప్తంగా మొత్తం విద్యార్థి లోకానికంతా ఒకే రకమైన యూనిఫారాలు పెడితే ఇంకా క్షేమగ్గా వుంటుందే! ఒక్కొక్క స్కూలుకు ఒక్కొక్క రకమెందుకు? కొన్ని యూని ఫారాలు చాలా ఖరీదైనవిగా మరికొన్ని స్కూళ్ళవి సాదాగా వుంటాయే? మరి గాడీ యూనిఫారాలగాళ్లు సాదాగాళ్ళను చిన్నచూపు చూడకుండా వుంటారా? శనివారం యూనిఫారం అక్కర్లేదట ఆ రోజు వారివారి దుస్తుల తడాఖా చూపించుకోకుండా వుంటారా? మరి కాలేజీ విద్యార్థులకు యూనిఫారాల నిబం ధన ఎందుకు లేదు. వారిలో సమైక్యతాభావం అక్కరలేదా. లేక అదివరకే ఆరడుగుల లోతు నాటుకొని పోయిందా?

మిలిటరీ, పోలీసు, పైలెట్లు, నర్సులులాంటి వృత్తుల్లో వుండే వారికి గుర్తింపునకై యూనిఫారాలు అవసరం గానీ, విద్యార్థుల కెందుకు?

మహానుభావా! కేవలం దుస్తుల్లో ఏకత్వం దోస్తులుగా మార్చడానికి దోహదం చేసేదాంట్లో సత్యమే ఉంటే ఈ నాలుగు దశాబ్దాల కాలంలో సమై క్యత మూడు పూవులు ఆరు కాయలుగా వర్ధిల్లి యుండేది! అదే నిజమైతే మొత్తం భారతీయ ప్రజలందరికీ ఒకే యూనిఫారం విధింపబడితే.... .... .... ఐడియా బ్రహ్మాండం గదూ!

పాపం అశం శుభం ఎరుగని విద్యార్థులు ఏం చేస్తారు? హోదాల బీజాలు అసమానత్వ దృక్పథాలు మచ్చుకైనా లేని పిల్లల లేత మనస్తత్వాల్లో ప్రప్రథ

షంగా నాటబడుచుండేది తలిదండ్రులతో, పెద్దతరం వారితో!? కట్టుకున్న వస్త్రలను చూచి, పెట్టుకున్న నగలను చూచి ఎదుటి మనిషిని అంచనా వేసి మెలగటం నేర్పేది ముమ్మాటికి పెద్దలు! ఈ పెద్దల్లో మార్పు రానంతకాలం మానిహారాలు ఒక ఫార్సు! ఇదొక దోపిడీ వ్యవస్థ కనిపెట్టిన కిటుకు! ఈ ధనస్వామ్య సమాజంలో రాష్ట్ర పాలకులు ధృతరాష్ట్ర పాలకులైనప్పుడు పట్టించుకునే నాధుడెవడు?!

ఇదండీ మా వితండేశ్వరరావు వాదం! మరి మా వాడి అభిప్రాయంతో ఏకీభవించని వారు బోలెడు మంది! ఏమంటారు?

ఇంతవరకు చదివేటప్పటికి బోర్ కొట్టిందా? అయితే 'రిలీఫ్' కొరకు ఈ 'జోక్' వినండి! బోర్ కొట్టలేదా? అయితే ఇంకేం. ఈ జోక్ వినాలి! విని తీరాలి!

ఒక పరధ్యానం జడ్జి. అసలే కొత్త. కోర్టులో కేసు జరుగుతూంది. వాది. న్యాయవాది బల్లగుద్ది వాదిస్తున్నాడు. ఆ వాద పటిమకు జడ్జి "మీరు చెప్పింది అక్షరాల నిజం. కేసు గెలిచారు" అన్నాట్ట ఆ మాటలకు ప్రతివాది వక్కీలు "గౌరవనీయులైన న్యాయమూర్తి నా వాదము వినకుండా తీర్పు చెప్పడం న్యాయంకాదు" అని కొత్త జడ్జికి విన్నవించుకున్నాడు జడ్జి తమాయించుకొని "సరే మీ వాదం ప్రారంభించండి" అన్నాడు. ఆయన తన ఎదిరి న్యాయవాది కన్నా బల్లగుద్ది, అడపా దడపా గుండెలు కూడా గుద్దుకుంటూ హావభావాలు ప్రదర్శిస్తూ అరగంట పైగా అనర్గళంగా సినిమాల్లోలాగా, తన వాక్ చాతుర్యాన్ని ప్రదర్శించాడు. ఆ ఆర్గుమెంటుకు విస్తుపోయి జడ్జి "అవును ఈ సారి వాదములో ఎన్నో కొత్త పాయింట్లున్నాయి. ప్రతివాదిదే న్యాయంగా కనబడుతూంది" అన్నాట్ట!

ఇంకేముంది! కోర్టు హాల్లో కలకలం! పరధ్యానం కొత్త జడ్జితో వేగేదెలా అని! ఒక సీనియర్ న్యాయవాది లేచి "మీరు ఇరువైపుల వారి వాదోపవాదాలు విన్న తర్వాత క్షుణ్ణంగా ఆలోచించి లోతుపాతులు పరిశీలించి ఈ కేసులో ఎవరిది అన్యాయం, ఎవరిది న్యాయం అది ఏ విధంగా న్యాయం అని సకారణంగా విమర్శించి, విశ్లేషించి తుది తీర్పు ఇవ్వాలి. అంతేగాని, వాది, ప్రతివాది ఇరువురూ గెలవడం అంటూ వుండదు" అని లౌక్యంగా నచ్చ చెప్పాట్ట!

జడ్జికి ఏమీ పాలు పోలేదు. "ఇదంతా వింటుంటే నా బుర్ర వేడెక్కి పోతూంది. ఈసారి మీ పక్షాన న్యాయం ఉన్నట్టు ప్రకటిస్తున్నాను" అని ఇహిహీ అని నవ్వి తన ఛేంబర్స్‌లోకి దారి తీశాడట. తర్వాత ఆ "స్క్రూ లూజ్" జడ్జిని కక్షిదార్ల పుణ్యమా అని మెంటల్ ఆస్పత్రిలో చేర్పించారని తెలిసింది!

జోకు చాలా పెద్దదయిందా? అదిమీ దురదృష్టం!



# 15. సమస్యల 'తో' రణము

ఆ మధ్య ఎప్పుడో పేపర్లో వార్త: పశ్చిమ బెంగాల్లో ఒక ప్రాజెక్టును ప్రారంభించటానికి కేంద్ర ప్రభుత్వం వారు ససేమిరా డబ్బు లేదన్నారట. మన తెలుగు వల్లభుని (?) ఉల్లూకపు పట్టులాంటి పట్టుదల గల పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం వారు "బిచ్చమెత్తైనా సరే నిధులు సేకరించి ప్రాజెక్టును అమలుచేసి తీరుతాం'' అని భీష్మ ప్రతిజ్ఞ చేశారు. అందులో భాగంగా ఉచిత రక్తదాన శిబిరాలను నిర్వహించ దలచారు. బేష్! పౌరుషమంటే అలా వుండాలి', అని ప్రశంసించారు. మేధావులు! 'ఐడియా వండర్ ఫుల్' అన్నారు మరి కొందరు. రాష్ట్ర ప్రభుత్వం ప్రకటనలను గుప్పించింది. దానికి కొన్ని లక్షలు ఖర్చు! సదరు ప్రకటనలను చూచి దేశభక్తి గల రక్త దాతలు, వందలు, కాదు, వేల సంఖ్యలో ముందుకు రావటం ప్రారంభించారు. పాలకుల అంచనాలు తలక్రిందులయ్యాయి. అన్ని వేల లీటర్ల రక్తాన్ని ఎలా భద్ర పరచాలో పాలకులకు పాలుబోలేదు. పెద్ద సమస్య ఎదురైంది. ఇదిలా వుండగా రక్త దాతల్లో ఎయిడ్స్ వ్యాధి లేకుండా జాగ్రత్త పడేందుకు క్షుణ్ణంగా పరీక్షలు జరిపి తీరాలి అని డాక్టర్లు ఖరాఖండిగా తేల్చి చెప్పారు. అందుకుగాను పతి, పదునైదు ప్రత్యేక కేంద్రాలను, యుద్ధ ప్రాతిపదిక మీద నెలకొల్పి, ఇరవై లక్షల చేతి చమురు వదిలించుకోవాల్సి వచ్చిందట. అంతటితో సమస్య తీరిందా? ఊహూ! ప్రారంభమైంది! ఈ సేకరింపబడ్డ రక్తాన్ని పౌడరు రూపంలో మార్చకపోతే చాలాకాలం నిలువ వుండక పోవచ్చు అన్నారు నిపుణులు! దాని కోసం మరో ఇరవై లక్షలు తగలేసి అమెరికా నుంచి ఒక ఆధునిక యంత్రాన్ని దిగుమతి చేసుకున్నారట. ఆ యంత్రము ఏదో విడిభాగాలు లేక చెడిపోతే మళ్లీ ఒక సమస్య రావచ్చు. ఇంతటితో ఈ విషయం నిలిపేస్తా.

సమస్య అనేది ఒక ప్రబలమైన శక్తి లాంటిది. 'ప్రబలము. అన్న పదములోంచే "ప్రాబ్లమ్" వచ్చి యుండొచ్చు! ఎప్పటికప్పుడు వేషం మార్చ

కాని మోసం చేస్తుంటుందేగాని, సమస్య సమసిపోదు, సరిక్రొత్త సమస్యలు పుట్టుకొస్తూనే వుంటాయి. 'ఆత్మ'కు చావు లేదు. అది అగ్నిలో కాలదు. వానకు తడియదు. అని గీతలో చెప్పినట్లు సమస్యకు కూడా అంతం అంటూ లేనేలేదు!

ఈ రంగం ఆ రంగం అని లేదు, ఏ రంగమైనా సరే. షరా మామూలే. మనిషి మెళ్లో సమస్యల మాలే. నెత్తిమీద సమస్యల చుమాలే! ప్రపంచమే ఒక సమస్యల వలయాల నిలయము!

అమ్మాయికి పెండ్లి కాలేదని సమస్య! అయినవాడి నుంచి, అల్లుడితో సమస్య! లేదా సంతానం లేదని సమస్య! చదువుల సమస్య! డొనేషన్లు! ఉద్యోగ సమస్యల తర్వాత......అదే పెళ్లి సమస్య! అత్తపోరు సమస్య! అది వదుచుల సమస్య! ఆత్మహత్యలు, కిరోసినాయిలు చావులు! చూస్తూనే వున్నాం.

వేళకు రాని సిటీ బస్సులతో నిత్యం వేగలేక ఏ మోపెడో, స్కూటరో మోపెడు తగలేసి తీసుకున్నామనుకోండి. పెట్రోలు ధర పెరుగుదల! హెల్మెట్ల ధారణ! పోలీసు మామూళ్లు!

అలోపతి ఔషదాలకు 'ఆఫ్టర్ ఎఫెక్ట్'ల సమస్య! ఆయుర్వేద మందులకు కఠిన పథ్య సమస్య! ప్రకృతి వైద్యంలో పస్తుల సమస్య!

ఆసుపత్రి లేని సమస్య! ప్రసూతి ఆసుపత్రి కావాలని సమస్య. మందులు లేవని, డాక్టర్లు లేరని, ఉన్నా రారని సమస్యలు! పోలీసు స్టేషనూ అంతే. లాకప్ మరణాలు, "రేప్" గొడవలు అదనపు సమస్యలు!

ఊరికి బస్సు లేదని కొన్నేళ్ల సమస్య! వచ్చింది. వేళకు రావటం లేదని, స్టేజీల దగ్గర ఆగటం లేదని, ఒకే ఒక బస్సు చాలదని, కండక్టరు టికెట్టు

ఇప్పటికింకా డబ్బు దండుకుంటున్నారని ఆగడం! బస్సు షెల్టరు లేదనీ, సంవత్సరంలోపే రెండుసార్లు రేట్లు పెంచారనీ, మా వూరి ముందర రోజుకో పడవ వస్తూందనీ ఇలా ఇలా వుంటూనే వుంటాయ్.

విద్యాలయాల్లేవనీ, ఉంటే అన్ని హంగులూ లేవనీ, విద్యా ప్రమాణాలు దిగజారాయనీ, కాలేజీలు పెరిగితే నిరుద్యోగుల సంఖ్య ఇంకా పెరిగిందనీ, కాపీలు ఎక్కువయ్యాయనీ, సమస్యలు! క్వొశ్చన్ పేపర్ల లీకేజీలు, యూని యన్ల రాజకీయాలు, స్పర్ధలు, హత్యలు! బంద్‌లు. బస్సు తగలెట్టడాలు. రాళ్లు విసరడాలు, రాగింగ్‌లు........ఎన్నో.

కొన్ని దేశాల్లో జనాభా పెరుగుదల సమస్య. మరికొన్ని దేశాల్లో తగ్గు దల సమస్య! ఇండ్ల కొరతను తీర్చటానికి వ్యవసాయ భూములను, అడవు లను తగ్గించాలి. తత్ఫలితం ఆహార కొరత! అనావృష్టి సమస్య! రోడ్డు ప్రమా దాల నివారణకై వేసిన స్పీడ్ బ్రేకర్లే అక్కడక్కడ సరిగ్గా కనబడక రోడ్డు ప్రమాదాలకు కారణాలా?

ఉత్పత్తులు తగ్గితే కరువు సమస్య, హెచ్చితే గోడౌన్ల సమస్య! గిట్టు బాటు ధరల సమస్య!

నిరుద్యోగ సమస్యను తీర్చటానికి ఫ్యాక్టరీలు పెడితే వూళ్లో శబ్ద కాలుష్యం! విషవాయువులు, కార్మికుల సమ్మెలు! లాకౌట్లు! శ్వాశకోశ వ్యాధులు!

మా వూళ్లో ఎలక్ట్రిసిటీ లేదు మొర్రో అంటే రెండు దశాబ్దాల తర్వాత వచ్చిందనుకుంటే పవర్ కట్లు! హై వోల్టేజీలు! లో వోల్టేజీలు! షార్టు సర్క్యూట్లు! విద్యుత్ చౌర్యాలు! దొంగ బిల్లులు!?........

ఎండ కాలాన్ని ఎదుర్కోవాలని ఏ. సి. గదులు పెట్టుకొంటే సమస్య తీరిందా? ఏ.సి, గదుల్లో చాలసేపు గడిపితే కీళ్ళ వ్యాధులొస్తాయట! ఏ.సి.లు, ఫ్రిజ్‌లు ఎక్కువ కావటంతో వాతావరణంలో ఓజోన్ పొర క్షీణించి సరి క్రొత్త రోగాలు వస్తున్నాయి! బాబోయ్! కట్టెల మంటలో వంట సమస్యను వదిలించుకోటానికి కిరొసిన్ స్టౌలు! వీటితో కండ్ల వ్యాధులు! కిరొసిన్ కొరతలు గాస్ పొయ్యిలకు సిలిండర్ల కొరత ప్రమాదాలు! చిటికెలో వంట అయిపోతూం దని సంబరపడి మైక్రో ఓవెన్‌లు కొంటే వాటిల్లో వండినవి తింటే కాన్సరు వచ్చే అవకాశాలు ఎక్కువట! తస్మాత్ జాగ్రత్త! అని శాస్త్రజ్ఞులు వార్నింగ్‌లు! అలాగే అధిక సంతాన సమస్య పరిష్కారానికై గర్భ నిరోధక మాత్రల వాడకం వల్ల కాన్సరు, ఎయిడ్స్‌లాంటి వ్యాధులు వచ్చే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయని ఈ మధ్య పేపర్లో వార్తలు!

దరిద్రులకు డబ్బు లేక సమస్య. ధనికులకు దాచుకునే సమస్య! ఆకలి కావటం లేదని ఒకరి సమస్య! తిండిలేదని మరొకరిది. ఎవరో అన్నాట్ట! "అకల్‌మంద్" కావాలని (అకల్‌మంద్ తెలివి గలవాడు) మందు వేసుకొంటే ఆకలి మందగించిందట.

ఆర్థిక సమస్యలను పరిష్కరించటానికి ఆడువారు కూడా ఉద్యోగాలు చేస్తారు. తీరిందా. ట్రాన్స్‌ఫర్ల సమస్య. వేరువేరు కాపురాలు, పిల్లల పెంపకాలు! మానసిక వత్తిళ్లు, మనస్పర్ధలు! నరాల బలహీనతలు! ఎన్నో!

రాక పోకల ఖర్చులు, విలువైన సమయం వృధా కాకుండా వుంటుం దనీ, హాయిగా వుందామనీ, ఫోను పెట్టుకుంటే, రాంగ్ నంబర్ల సమస్యలు, తప్పుడు బిల్లులు! లైన్లు దొరకని సమస్యలు! ఇరుగు పొరుగు వారితో అనలేని అనుభవించలేని తీరని సమస్యలు! మూతి ముడుపులు!

ఆ మధ్య ఒక తమాషా వార్త పేపర్లో వచ్చింది. అమెరికాలో ధూమ పాన నిషేధాన్ని గూర్చి యుద్ధ ప్రాతిపదిక మీద ప్రచారం చేయటం వల్ల

ధూమపాన ప్రియుల సంఖ్య గణనీయంగా పడిపోయిందట. అందరూ ఆహా! ఓహో! అనారు. ఇప్పుడిప్పుడు ప్రభుత్వం వారికి ఇదొక పెద్ద లనొప్పి సమస్యగా తయారైందట. పొగ త్రాగడం మానివేయడం వల్ల వృద్ధ మర ణాల సంఖ్య రాను రాను తగ్గటంతో. వారికి చెల్లించవలసిన పింఛనులు. వృద్ధావ్యభత్యాలు పీటిక్రింద పడ్డు విపరీతంగా పెరిగి, అమెరికా వారి ఆర్థిక వ్యవస్థ బాగా దెబ్బ తింటూందట పోతే, సిగరెట్ కంపెనీలు మూతపడి, నిరుద్యోగులు వీధిన పడ్డారట. వారికి అదనంగా అలవెన్సుల క్రింద బడ్జెట్ మరీ పెరిగిందట! కాబట్టి ధూమపాన దాసులు చస్తే చావనీయండి. వారు చస్తే ప్రభుత్వానికి ఆదా అయ్యే డబ్బుతో! మిగిలిన ఆరోగ్యవంతుల ఆరోగ్య రక్షణ కైనా ఖర్చుచేస్తే దేశం బాగుపడుతుంది. ఈ ముసలి పీనుగులు, రోగిష్టి వెధ వలు ఎంతే ఎంత చస్తే ఎంత? అనే మీమాంసలో అమెరికావారు పడారుట! మద్యపానం వల్ల కొన్ని సమస్యలు, మద్యపాన నిషేధం అమలు పరి మ కొన్ని సమస్యలు!

చూశారా! అష్టావధానాల్లో సమస్యాపూరణం అంత కష్టంగాదు. జీ తంలో మాత్రం ఈ సమస్యల తోరణం సమస్యలతో రణం! చక్ర భ్రమణం. మానవునికి దేవుని అస్తిత్వము ఒక సమస్య! దేవునికి మనిషి తత్వమే కొరు కుడు పడని సమస్య!

మరి ,కాపీన సంరక్షణార్థం‚ అనే శ్లోకం మనవాళ్ళు ఊరికే చెప్పారా! మనవాళ్ల సూక్తులు మనవళ్లకూ మనవరాళ్లకూ శాశ్వతంగా అందించవలసిన సువర్ణసూత్రాలు!

# 16. బి. పి. కి సరికొత్త చిట్కా

మా పక్కింటి వెంకటపతి పాపం రెండు సంవత్సరాలుగా బి. పి. తో బాధపడుతున్నాడు. మందులు వాడుతూనే వున్నాడు. ఉప్పు తగ్గించటమేగాదు పూర్తిగా మానేశాడు. డాక్టర్ల సలహా ను పాటిస్తూనే వున్నాడు. తగ్గినట్టు తగ్గుతూనే వుంది. ప్రతినెలా డాక్టరు బిల్లు ఇతర ఖర్చులు చూచే సరికి మళ్లీ యథా ప్రకారమే. డాక్టర్లకు కూడా అంతు చిక్కడంలేదు! 'ఏం వెంకటపతీ. బి పి. ఎలా వుంది' అని ఎప్పుడైనా అడిగితే "బాబూ ఈ శరీరం ఒక పడవలాంటిది ఏదో సినిమాలో 'హైలో హైలో' అనే పడవ పాటలాగా వుంది' అనేవాడు.

అంటే? అని అడిగా

హై-అంటే హై బి. పి. అంటా, లో-అంటే లో బి. బి! అట!

ఇటీవల వేసంగి సెలవుల్లో వాళ్ళ ఊరెళ్లి మొన్ననే వచ్చాడు! పొలా లేవో అమ్ముకొని రావటానికి, మరి డాక్టర్ల మొహాన కొట్టటానికి ఎంత డబ్బైనా చాలటం లేదాయె. వాడి ఊర్లో రెండు నెలలు హాయిగా గడిపి నన్ను చూచి వెళ్దామని మా యింటికి వచ్చాడు. చిత్రమైన చల్లని కబురు చెప్పాడు. వాడి బి. పి. నార్మల్లోకి వచ్చి ఆరోగ్యం పూర్తిగా చక్కబడిందట!

ఏం మందులు వాడావ్? హోమియోపతీయా! అల్లోపతీయా, నేచురో పతీయా? అడిగా.

"ఏ పతీ గాదు". ఆ రమాపతి సింపతీ!

,ఎవరా రమాపతి,?

"ఉమాపతి బావమరిది!"

,ఉమాపతి ఎవరు'?

రమాపతి బావ అన్నమాటేగా!

"వెంకటపతీ! నీ జోకు చాలా సద్దిదిగానీ వేళా కోళాలు కట్టిపెట్టి ఏం మందులు వాడావో చెప్పు. నాకూ ఈ మధ్య బి. పీ, పెరిగిందని డాక్టరు చెప్పాడు. నేనూ ఆ మందులేవో వాడుతా ఎంత ఖర్చైనా పర్వాలేదు" అన్నా.

"తప్పు! అట్టే డబ్బు పైసా కూడా అక్కరలేదు. డబ్బాలు డబ్బాల మందులూ అక్కరలేదు. పైగా మనకే బోలెడంత డబ్బు గ్యారంటీగా ఆదా" అన్నాడు.

కఠిన పథ్యము చెయ్యాలి కాబోలు"! అని అన్నా!

"అలాంటి దేమీ లేదు. కానీ కొన్ని రూల్సు ఖచ్చితంగా పాటించాలి!"

"బాబ్బాబూ! ఆ చికిత్సేదో త్వరగా అఘోరించవయ్యా!"

"వెరీ సింపుల్! రేపటి నుంచే ప్రారంభించు".

"నెంబర్ వన్ ముఖ్యాతి ముఖ్యం. ముందు ఏలాంటి దినపత్రికనూ తెప్పించుట, చూచుట, ఒకరు చదువగా వినుట పూర్తిగా మానెయ్యాలి!"

"అదేమిటీ"!

"ఆ. అక్కడే వుంది చిట్కా వైద్యం కిటుకు".

ఏ దినపత్రిక తిరగేసినా, ఏ రోజు తిరగేసినా ఏమున్నది నాయనా గర్వకారణం! ఫలానా ఊర్లో ఆర్టీసీ బస్సు దోపిడీ! పట్టపగలు బ్యాంకు లూటీ; నలుగురు పోలీసు అధికార్లు నక్సలైట్ చేతుల్లో బందీ, నగర శివార్లలో హత్య, హంతకులు పరారీ, ప్రారంభోత్సవానికి ముందే వంతెన కూలి, కూలీలు యాభైమంది దుర్మరణం. పదో తరగతి నుంచి పై తరగతుల దాకా కాదు, సివిల్ సర్వీసు పరీక్షల దాకా పరీక్ష పేపర్ల లీక్! అధికారుల అసమర్థత;

కాలేజీ విద్యార్థుల సమ్మె. చండీఘడ్‌లో పదిమంది పోలీసు అధికారుల మరణం! ఇద్దరు టెర్రరిస్టుల పట్టివేత; శ్రీనగర్ కాల్పుల్లో ఇరవై మందికి పైగా హతం; నిరవధిక కర్ఫ్యూ! ఇంతేనా! సిలోన్‌లో మారణ హోమం, అస్సాంలో మారణహోమం పాకిస్తాన్‌తో ముంచుకొస్తున్న యుద్ధ ప్రమాదం; కోస్తా జిల్లాల్లో తుఫాను బీభత్సం. హరిజన వాడల్లో అగ్ని ప్రమాదం విద్రోహ చర్యలు, అగ్రవర్ణాల హస్తము, హుస్సేన్‌సాగర్‌లో ప్రేమికుల ఆత్మహత్యలు! పోలీసు స్టేషనులో లాకప్ మరణాలు! మైనర్ బాలిక మానభంగాలు!

జైలునుంచి దొంగల పరారీలు, పోలీసుల లాలూచీలు! ఇంతేగా! గుండె నిలిచి పొయ్యేదానికీ, అదృష్టవశాత్తూ నిలిచి పోకపోతే జారుకునే దానికీ ఇవి చాలవా?

"అన్నీ వార్తలు అలాంటివి కాదుగా. మిగతా విషయాల సంగతి సందర్భం తెలుసుకోవాలిగా"

"తెలుసుకొని ఏమిటి చెయ్యగలం ?

కోట్ల కోట్ల అప్పుల ఊబిలో శాశ్వతంగా ఇరుక్కుపోతున్న మనదేశ ఆర్థిక వ్యవస్థను చక్కబఱచగలమా? అనునిత్యం అధినేతల భూమి కబ్జాలను ఆపగలమా? బస్సు చార్జీల పెంపుదలలను నీటి పన్నుల పెంపుదలలను ఆప గలవా? పెరిగే కడలి తరగలను ఆపగలవేమో గానీ, పాల రేట్లను, తపాలా రేట్లనూ, ఇంటి పన్నులనూ ఆపగలవా? వరకట్న పిశాచి కరాళ నృత్యాలను ఆపగలవా? అసెంబ్లీలో ముష్టి యుద్ధాలనూ మైకులు విరగ్గొట్టడాలనూ, శాసన సభ్యుల అసభ్య పదభూయిష్ఠ పరస్పర దూషణలనూ అరికట్ట గలవా?

తెలుసుకోవాలిట! తెలుసుకోవాలి!

స్మగ్లరు, సార్వభౌముల, మాఫియా గాంగుల స్వైర విహారాలకు కళ్లెం వెయ్యగలవా? రాజకీయ నేతల ప్రచ్ఛన్న హస్తాలను నరికి వెయ్యగలవా? పోలింగ్ స్టేషనులలో బాలెట్ పెట్టెల అపహరణలను నిలుపగలవా? ఎన్నికల్లో హత్యలను అంతం చెయ్యగలవా? గద్దెమీద బుద్ధితో ఎగ్గు సిగ్గులను గాలి కొదిలి, ఒకరిమీద ఒకరు విసురుకునే పేడ ముద్దలను అలికి వేయగలవా? పదవిలో ఉన్నప్పుడు కప్పను మింగిన పామువలె పెదవి విప్పనివారు, పద గోవింద కొట్టగనే........అనునిత్యం పరస్పరం బురదతో ఆడే వసంత వేడుకలకు అడ్డుకట్ట వేయగలవా?

అమ్మో! అమ్మో! వేదాంత ప్రవక్తల ఇండ్లలోనే విదేశీ మద్యం సీసాలు లభ్యమా! అమ్మలు బాబాల కొంపల్లో బ్లూ ఫిల్ముల పట్టివేతా? వ్యభిచార గృహాల వ్యవహారములలో మంత్రి గారి ప్రమేయమా! అవినీతి ఊబిలో అరడుగుల లోతున ఇరుక్కుపోయి అప్రతిష్టులైన అమాత్య శేఖరులకు, దేశ ద్రోహులకు, అమెరికాలో ఆరేడు లక్షలు సర్కారు ఖాతాలో శస్త్రచికిత్సలా? సామాన్య ప్రజానీకం సకాలంలో చికిత్స అందక సర్కారీ దవాఖానాలలో అకాల మరణాలా? ఛీ.ఛీ: ఇలాంటి వార్తలు ఒక రోజా, రెండ్రోజులా? ఒక పేపరా. రెండు పేపర్లా, ఏరోజు చూసినా, ఏ పత్రిక త్రిప్పినా ఏమున్నది నాయనా తలయెత్తుకోగల్గిన వార్త? సర్వే సర్వత్రా షరా మామూలే!

మురికి వాడల నిర్మూలన పథకం క్రింద మంజూరైన నిధులు కోట్లు కోట్లు స్వాహాలట! మురికి వాడలు పాపం అవేం జేస్తున్నాయ్? పందులను, దోమలను, వీధి కుక్కలనే గాక, పార్టీ నేతలను కూడా శాశ్వత ప్రాతిపదికగా పోషిస్తున్నాయే? గుడిసె లిప్పిస్తామని, స్థలాలిప్పిస్తామని, దాదాగిరీ దలాయిస్తూ డబ్బు దండుకుంటున్న కుహనా నాయకులు కోకొల్లలు! మురికి వాడలను వీరా నిర్మూలించేది? బోఫోర్సు విరజిమ్ముతున్న కల్మషం కన్న జలాంతర్గాముల, ఏర్ బస్సుల కంపుకన్నా బీదా బిక్కి ఉండే మురికివాడలు దేశానికి తలవంపులు తెస్తాయా? దేశ ప్రతిష్ఠను దిగజార్చుతాయా?

మహా నగరాల్లో పెలసిన మురికి వాడలకన్న ముందు, మహానేతల మనసుల్లో పేరుకున్న మురికిని మొదలంటా వదిలించుకోవాలి! ఇది ఏ నాడో జరగవలసిన తక్షణ కర్తవ్యం.

కేవలం అయిదేళ్లో, పదేళ్లో దేశ సేవ ముసుగుతో ప్రజలను మభ్యపెట్టి అయినకాడికి దోచుకుని తినింది చాలక, ఉత్తపుణ్యానికే శేష జీవితమంతా పింఛనులు మ్రింగుతూ దేశాన్ని కుదువబెట్టజూచే యీ క్రొత్తరకం దేశభక్తుల కన్న, పాపం....తమ బాధ్యతలను గుర్తించి, ముక్కుపచ్చలారని పసితనం లోనే, అమ్మానాన్నలకు ఆర్థికంగా సహాయపడుతూ, దేశ ఆర్థిక వ్యవస్థను బాగు పరచడంలో ఉడతా భక్తితో సాయపడే బాల కార్మికులు ఒక సమస్యా!

ఇలా చెప్పుకపోతే ఒక గ్రంథం చాలకపోవచ్చు. నాకు మళ్లీ బి. పి పెరగొచ్చు. ఇలాంటి అమంగళకర వార్తలను ప్రతినిత్యం పనిగట్టుకొని, పఠిస్తూపోతే, ప్రజానీకానికి రక్తపోట్లు రాక రాజయోగాలు వస్తాయా? ఒక్క బి. పీ యేం ఖర్మ? ఎన్ని నరాల బలహీనతలు? మానసిక వ్యాధులు? అంతు చిక్కని రోగాలు? దేశం ఎటువైపు పోతూందో, తిరోగమిస్తుందో తలచు కుంటే హార్ట్ అటాక్‌లూ రావచ్చు. అతిసార విరేచనాలూ రావచ్చు!

ఒకరోజు ఉదయాన్నే పేపరు రాకపోయినా ఒక్కగంట ఆలస్యంగా వచ్చినా ఇల్లు పీకి పందిరేసి అందరి మీదా ధాం. ధూం అని ఎగిరిపడి అనవస రంగా బి. పీ పెంచుకునే మేధావులున్నారు!

కాబట్టి...నన్ను అట్టే వాగించక దినపత్రికలు చదవనని, విననని ఒట్టే సుకో. నీ ఆరోగ్యం కుదటబడకుంటే నీమీద ఒట్టు!

"అబ్బ! బాగా చెప్పావోయ్! అంతేనా. ఇంకా ఏమన్న చెయ్యాలా":

—ంబర్ టూ రేడియో, టి. వీలు కట్టేయ్!''

'అవేం జేశాయ్? '

"అవి మాత్రం తక్కువ న్యూసెన్సు కలిగిస్తున్నాయా? పంచె కన్నా అంచు పెద్దదైనట్లు. తలుపులకన్నా కిటికీలు పెద్దవన్నట్లు, పాటకన్నా ఆలా పన అధికమైనట్లు, అసలు గ్రంథంకన్నా సమీక్షలే ఎక్కువన్నట్లు, అభినం దనల 'సావనీరు'లో మేటరు పదిపేజీలు, అడ్వర్టయిజ్‌మెంట్లు ఆరవైలాగా అందులో వచ్చే ప్రోగ్రాములకన్నా ప్రకటనలే మిన్న!

ఈ వెధవ ప్రకటనలను విని విని, చూచి చూచి, అభం శుభం ఎరుగని అర్భకుల మనస్తత్వాలు కలుషిత మౌతున్నాయ్. సంపన్నుల ఇండ్ల సంగతి వదిలేద్దాం. మధ్య తరగతి కుటుంబాల్లో ఒకటే గోల. నన్నడితే అడ్వర్టయిజ్ మెంట్లు మానేస్తే అధిక ధరలు తగ్గి తీరుతాయి.

'నాకు 'రసనా' కావాలి అని ఒక వెధవ యేడుస్తే 'బూస్ట్' కోసం మరొకడు ఏడువు'!

'ఫలానా' సబ్బు కావాలి, ఫలానా టూత్‌పేస్ట్ కావాలి, అని ఇలా తలా ఒకరకం కావాలని మారాం జేస్తూంటే నేను తల పట్టుకుని కూర్చోవాల్సి వచ్చేది 'విమల్' అని ఒకరూ 'రాజ్‌కమల్' అని మరొకరూ అని దుంప తెంచేస్తారు:

'తెలివి గలవారు' సర్ఫునే ఉపయోగిస్తారట. తెలివికి ఇదే కొలమానం అయితే మనదేశం తెలివి ఏనాడో ఉవ్వెత్తున ఎగిరి యుండేది ఆ సర్ఫు నురుగు లాగా?

నాకు తెలీక అడుగుతా. గీసుకున్న గడ్డాన్ని చూచి, పూసుకున్న పౌడరు స్నోలను చూచి, తీసుకున్న పానీయాలను చూచి, వేసుకున్న వేషాన్ని చూచి, ఉద్యోగానికి ఇంటర్వ్యూలలో సెలక్టు అయితే నిరుద్యోగ సమస్య మనదేశంలో ఈ పాటికి ఎప్పుడో ఉడాయించి యుండేది!

ఆరోగ్యానికి రక్ష లైఫ్‌బాయ్ సబ్బో హార్లిక్సో అయితే దవాఖానాలు ఎందుకు డాక్టర్లు ఎందుకు? అక్షింతలు తీసికొని ఆశీర్వదించినంత మాత్రాన ఆయురారోగ్య ఐశ్వర్యాలు ప్రాప్తిస్తే, ఆసుపత్రులన్నింటికీ శాశ్వతంగా తాళాలు వెయ్యొచ్చు.

ఇదంతా ఒక పెద్ద విషవలయం!

మొన్న అయిదేళ్ల మా మనుమడు ఏం అడిగాడో తెలుసా? "తాతయ్యా! నాకొక నిరోధ్ కొని పెట్టవూ'' అన్నారు! నీవు ఆపరేషన్ చేయించుకున్నావా అని అడిగాడు! వెధవ డబ్బుకోసం ప్రభుత్వం వారు ప్రకటనలను ప్రసారం చేస్తున్నారే కానీ, ఇవి మద్యపానం కన్నా యువతరం వారి మనస్తత్వాల్లో మత్తు ఎక్కిస్తున్నాయని, భావి పౌరులను పెడదారి పట్టిస్తున్నాయని ఎన్నడైనా అనుకున్నారా?

పోనీ! మంచి సినిమాలైనా చూపించి ఏడుస్తున్నారా అంటే గబ్బు పిక్చర్లు చూపించి, మనలను ఆడిపించి, ఏడిపిస్తున్నారు! అసలు మంచివి ఎక్కడ ఏడ్చాయి గనుక. ఏ పిక్చరు చూసినా, రేపులు, బాతురూము సీనులు స్విమ్మింగ్ డ్రస్సులు, పొర్లింతలు; ఇకిలింతలు; చకిలింతలు; కౌగిలింతలు! అంతే దట్సాల్. కథ అంటూ వుందా? సందేశం ఉందా? నీతి ఉందా? విజ్ఞానం ఉందా. వినోదం తగలడ్డదా?

"మరి కాలహరణం ఎలా?''

"అబ్బో కాలాన్ని హరించగల దిట్టవా":

అసలు కాలాన్ని హరించగలగాలి అనుకోవటం అజ్ఞానం. కాలమే నిన్నూ, నన్నూ అందరినీ నిత్యం హరిస్తూనే వుంది. శుభ్రంగా, దేవుడూ దైవమూ, పూజలూ, పురస్కారాలూ వీటిలో మనస్సును లగ్నం చేస్తే పుణ్యం పురుషార్థం! ప్రతినిత్యం నిద్ర లేస్తూనే స్తోత్ర పాఠాలు వల్లించు. అసలు అన్నిటికన్నా బి. పీ. కి అమోఘమైన చిట్కా బి. పీ. లోనే ఉంది!

"అదేమిటీ"

'బి' అంటే భగవద్గీత

'పి' అంటే పారాయణం!

పారాయణం అంటే ఒక జోకు గుర్తొస్తుంది. నా చిన్న తనంలో మా తెలుగు మాస్టారు నాక్లాసు నోటుబుక్కులో ఒకసారి 'అక్షరములను వ్రాయునపుడు శ్రద్ధగా 'మ' 'య' లకు భేదమును గుర్తించి వ్రాయునది' అని వ్రాశాడు. ఆ రోజుల్లో చూపెంచిన తప్పులకు పది, ఇరవై సార్లు ఇంపోజిషన్ వ్రాసే వాళ్లం, ఆ బాపతే అనుకోని మరురోజు అక్షరములను వ్రాయునపుడు 'మ' 'య'లకు భేదము గుర్తించి వ్రాయవలెను అని ఇరవైసార్లు వ్రాసి మాస్టారుకు చూపించా. మాస్టారు ఒకటే నవ్వు! ఇంపోజిషన్‌లో కూడా మ, "య" లు ఒక్కటిగానే వ్రాశా!

అలాగా కుండా, పారాయణం అంటే ఇంపోజిషన్‌లా పరధ్యానంగా పఠించడం గాదు. అందులో చెప్పింది పాటించడం! ఇప్పటికే ఆలస్యమైంది. వస్తా అంటూ హడావిడిగా వెళ్లిపోయాడు వెంకటపతి!



# 17. ఇంటిపేర్ల పరిహాసం

విశిష్టాద్వైత సంప్రదాయ స్తోత్రములలో ఆళవందార్ స్తోత్రము ప్రసిద్ధి చెందినది. దానిని రచించినది శ్రీ యామునా చార్యుల -రు. పాండ్యరాజు వద్ద 'కోలాహలుడు' అను ఉద్దండ పండితుడుండేవాడు. బహు గర్విష్టి. రాణిగారికి కోలాహలుడంటే మంట! ఇతగానికి గర్వభంగము జరుగ వలెనని ఆమెకు చిరకాలంగా తీరని కోరిక యుండినది. ఇది యిలా వుండగా ఒకనాడు యామునాచార్యుల వారు తన పంద్రెండవ యేటనే సకల విద్యలు పూర్తిచేసి తాను కోలాహల పండితుని వాదమున ఓడింతునని ప్రకటించి రాజుగారి ఆస్థానంలోకి ప్రవేశం కోరాడు. కోలాహలుడు పైకి పరిహాసం చేసి, లోలోన భయపడి ఆచార్యుని ప్రవేశమునకు అడ్డుపుల్ల వేశాడు. చివరకు రాణిగారి ప్రోద్బలంతో ప్రవేశం లభించింది. రాణిగారి పట్టుదల తెలుసుకొని "ఆళవందారా" అని రాణివైపు చూచి అవహేళన చేశాట్ట. దాని అర్థం ఈ చిన్న కుర్రవాడా మిమ్ములను రక్షించుటకు వచ్చింది? అని సరే. పండిత చర్చ జరిగింది. ఆ వివరాలు ఇక్కడొద్దు ఎలాగైతేనేమి కోలాహలుడు చిత్తుచిత్తుగా ఓడిపోయినాడు. అది విని మహదానందంగా, రాణిగారు చప్పట్లు కొట్టి "ఆళవందార్! ఆళవందార్! అని అరచినదట! అనగా నన్ను రక్షించుటకే వచ్చాడు! అని ఆనాటినుండి యామునాచార్యుల వారికి 'ఆళవందార్' అను నామము స్థిరపడి పోయిందట.

ఇలాగే వర్తమాన కాలంలో, పేర్లు ఇంటిపేర్లు మారిన ఉదంతాలు ఎన్నో!

మా వూర్లో నా చిన్నతనంలో భాగవతుల సుబ్బయ్యశాస్త్రి అని ఒక ఆయన వుండేవాడు. పంచాంగకర్త. పరమనైష్ఠికుడు ఇప్పుడు కీర్తిశేషుడు. గనుక ఆయన బయోగ్రఫీ చెప్పటానికి భయంలేదు. పాపం ఎప్పుడో ఆయన

కు పాతికేళ్ల వయసులో రైల్లో పక్కనున్న పాసింజరు సూటుకేసు నిద్రపో తూండగా సంగ్రహించి ఎంచక్కా రైలు దిగేసి, ఉడుపేరుకోవటం, పక్క స్టేషను రాగానే ఆ సూటుకేసు పెద్దమనిషి, తెలుసుకొని పోలీసు రిపోర్టు ఇవ్వటం. వెంటనే పోలీసులు రంగంలోకిదిగి స్టేషను మాస్టరును, బండివాళ్లను రిపోర్టర్లను విచారించడం, కూపీలాగడం, ఆ రోజుల్లో సూటుకేసు శాల్తీలు తక్కువ కావటం మూలాన, మా సుబ్బయ్యశాస్త్రి, మరునాడే పట్టుబడడం, జైల్లో పెట్టబడడం జరిగింది. మా కాలంలో, పిసరంత నిజాయతీ ప్రతిభ పోలీసుల్లో వుండేవి. స్వాతంత్రపు పూర్వరోజులు, ఛోటా, బడా రాజకీయనేతల జోక్యాలు మచ్చుకైనా లేని రోజులు కాబట్టి దొంగ దొరికాడు. పోనీయండి. మావాడి ఖర్మ, ఎంత మంది పోలీసులకు దొరక్కుండా, తప్పించుకొని దొర ల్లాగా తిరగటం లేదు గనుక! ఇహ ఆసంఘటన ఊరంతా పొక్కింది. వాళ్ల ద్వారా వీళ్ల ద్వారా పక్క వూళ్లకు కూడా పాకింది, నాటి లగాయతు మావాడి నామధేయం 'సూటుకేసు సుబ్బయ్య'గా మారి కూర్చుంది.

అందరికీ శకునాలు చెప్పే బల్లి కుడితిలో పడ్డట్టు మరి మావాడి జ్యోతిష విజ్ఞానం స్వంత విషయంలో బోల్తా కొట్టించింది. ఈ చరిత్ర జరిగి అయిదు దశాబ్దాలైనా సూటుకేసు సుబ్బయ్యగానే వాడి వ్యవహారం నామం అయింది అంతవరకూ ఫరవాలా. వాడి కొడుకును కూడా 'ఆ వెళ్లేవాడు సూటుకేసు సుబ్బయ్య కుమారుడురా' అని చెప్పుకునేవాళ్లం. మళ్లీ ఎప్పుడూ సుబ్బయ్య శాస్త్రి అలాంటి వెధవ పని చెయ్యలా. పాపం ఏదో ఒక విషఘడియలో వాడి ఖర్మ కాలి చేసిన పనికి వంశానికే మచ్చ ఏర్పడి ఇంటి పేరే మారిపోయింది అనధికారికంగా!

ఇలాగే. కొందరికి ధీమాగా తలయెత్తుకొని తిరిగేలా, ఇంటి పేరు మారు తుంటాయ్! బ్రిటిష్ దొరల కాలంలో. ఏ కలక్టరుకో ఎండ ప్రొద్దున దాహ-తీర్చటానికి రెండు గ్లాసులు నిమ్మకాయ మజ్జిగ ఇచ్చారుట ఒక కుటుంబము వారు. వారు 'చల్లా' వారయ్యారు. బ్రహ్మాండంగా పురాణాలు చెప్పి ఖ్యాతి

తెచ్చుకున్నారు 'పురాణం' వారు! నిరంతరం అన్నదానం చేసి కీర్తి సంపాదించినవారు 'అన్నదాత' వారు ఇలాగే 'వచ్చలక్ష' వారున్నారు. ఎందరో వున్నారు ఇవన్నీ అధికారికంగా అనగా రికార్డులలో కూడా మారినట్టివి.

పోతే అనధికారికంగా అనుకోండి. మరోలా ఇంటి పేర్లు మారి. నలుగురిలో చలామణి అయిన దాఖలాలు ఎన్నో, మా బంధువు తాత - రు నక్కచే కరవ బడి మృతి చెందారు. అదేం ఖర్మో రెండు తరాలుగా వారి యింటి పేరు 'నక్కాగా' నలుగురి నోళ్ళలో నానిపోతూంది. ఒకామెకు కుక్కలంటే చాలా ఇష్టం. వాళ ఇంట్లో అయిదారు కుక్కలుండేవి. అప్పుళ్లో ఆమెను అందరూ కుక్కల సుందరమ్మ అనేవారు. మరి కుక్కలను ఎంత మంది పెంచటం లేదు?

మరి కొన్ని చిత్రాలు జరుగుతుంటాయ్. మా ఆఫీసులో 'శర్మ' అనే పేరుండేవాళ్లు నలుగురుండేవారు. డైరక్టరుగారికి, వారిని పిలిపించాల్సి వస్తే కాస్త ఇబ్బందిగా వుండేది. అంచేత సులువుగా వుండెందుకు వారు వారు పని చేసే సెక్షన్ల పేరుతో పిలిపించేవారు క్రమేణా వారు 'సుగర్ కేన్ శర్మ'గా ఒకరు ఫర్టిలైజర్ శర్మగా మరొకరు. ఎస్టాబ్లిష్‌మెంట్ శర్మగా వేరొకరు ఆయిల్‌సీడ్స్ శర్మగా ఇంకొకరు స్థిరపడిపోయారు (పాపం ఈయన్ను అందరూ జిడ్డు శర్మ అనేవారు) తమాషాయేమిటంటేవారు ఆ సెక్షను మారి కొన్ని యేండ్లైనా గృహ నామధేయాలకు సవరణ లేదు. మా యింటి ప్రక్కన నరసింహం డిప్యూటీ కలక్టరాఫీసులో టైపిస్టుగా చేరాడు. అదే ఇంట్లో పాతికేళ్లు వున్నాడు. చివరకు ఆయన డిప్యూటీ కలక్టరుగా రిటైరైనా, టైపిస్టు నరసింహంగారికి డిప్యూటీ కలక్టరు ప్రమోషన్ వచ్చిందట. అనేవారు యన్. యస్. వరదాచారి అని గాంధేయవాది ప్రాజెక్టు డైరక్టరుగా వుండేవారు పెద్ద కాన్ఫరెన్సులకు కూడా ఆయన చొక్కా లేకుండా పంచె ఉత్తరీయంతోనే హాజరయ్యేవారు. ఆయన్ను అందరూ 'నో షర్టు'(N.S.)వరదాచారిగా వ్యవహ

రించేవారు. రామారావు అను మిత్రునికి నాలుగైదు ఇనిషియల్స్ వుండేవి. వాడు అందరిలో ఏ టు జడ్ రావ్ గా నానిపొయ్యాడు.

మా వూర్లో పాండురంగయ్య అనే ఒక పంచాయతీ బోర్డు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు E. O. (P), అనేవారు. ఆయనకు మాట మాటకూ 'ఇక్కడొక పాయింట్ వుందండోయ్' అంటూండేవారు. ఆయన గారిని పాయింటు పాండురంగయ్య అనేవారు!

ఇలా వృత్త పుణ్యానికి కొందరికి, వృత్తివరంగా కొందరికి, తప్పుచేసి కొందరికి, ఒప్పుచేసి కొందరికి, ఇంటి పేర్లు మారితే చేజేతులా, ....కాదు నోటి తీటతో, మార్పు కొని తెచ్చుకున్న ఘనులూ వున్నారు. వారి ఊత పదాలు వారి కొంప ముంచాయి. ఒకాయన పది నిమిషాల సంభాషణలో, పదహారు సార్లు 'పరిస్థితి, పరిస్థితి' అని అవసరమున్నా లేకున్నా వాడేవాడు. ఆయన పరిస్థితి పరంధామయ్య! ఇంకొకాయన మాట మాటకు 'ఏం సమాచారం! ఏం సమాచారం! నీ సమాచారం నాకు తెలుసులే, అక్కడి సమాచారం ఎట్లుందో!....' ఇలా సాగేది. అయన సమాచారం శంకరయ్య! 'ఏమంటావ్ ఈశ్వరయ్యలూ, 'మాటవరసకు' మల్లయ్యలూ, 'అసలు సిసలు' ఆనందరావులూ, ....ఇలా ఎందరో మహానుభావులు!

ఇంటి పేర్లు ఇంకొక విధంగా మారిన దాఖలాలు కూడా వున్నాయి. వాళ్ళు నివాసమున్న స్థలాల్ని బట్టి కూడా మారడం కద్దు. 'వడమటింటి' పాపయ్య, కొండమీది గోవిందరావు, కొనింటి కూర్మయ్య ఇలా. ఒక పెద్ద మనిషికి నలుగురు కొడుకులు. నలుగురూ బాంకు ఉద్యోగస్థులు. ఇంకేం? ఆయన బాంక్ బలరామయ్య! వాళ్ళను ఈ విధంగా అందరూ పిలుస్తారనీ వారికి తెలుసు. చాల మంది ఏమీ అనుకోరు కూడా. ఎటొచ్చీ 'మచ్చ'పడిన 'సూటుకేసు' బావతు దవ్వ!

రించేవారు. రామారావు అను మిత్రునికి నాలుగైదు ఇనిషియల్స్ వుండేవి. వాడు అందరిలో ఏ టు జడ్ రావ్ గా నానిపొయ్యాడు.

మా వూర్లో పాండురంగయ్య అనే ఒక పంచాయతీ బోర్డు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు E. O. (P), అనేవారు. ఆయనకు మాట మాటకూ 'ఇక్కడొక పాయింట్ వుందండోయ్' అంటూండేవారు. ఆయన గారిని పాయింటు పాండురంగయ్య అనేవారు!

ఇలా వృత్త పుణ్యానికి కొందరికి, వృత్తివరంగా కొందరికి, తప్పుచేసి కొందరికి, ఒప్పుచేసి కొందరికి, ఇంటి పేర్లు మారితే చేజేతులా, ....కాదు నోటి తీటతో, మార్చు కొని తెచ్చుకున్న ఘనులూ వున్నారు. వారి ఊత పదాలు వారి కొంప ముంచాయి. ఒకాయన పది నిమిషాల సంభాషణలో, పదహారు సార్లు 'పరిస్థితి, పరిస్థితి' అని అవసరమున్నా లేకున్నా వాడేవాడు. ఆయన పరిస్థితి పరంధామయ్య! ఇంకొకాయన మాట మాటకు 'ఏం సమాచారం! ఏం సమాచారం! నీ సమాచారం నాకు తెలుసులే, అక్కడి సమాచారం ఎట్లుందో!....' ఇలా సాగేది. అయన సమాచారం శంకరయ్య! 'ఏమంటావ్ ఈశ్వరయ్యలూ, 'మాటవరసకు' మల్లయ్యలూ, 'అసలు సిసలు' ఆనందరావులూ, ....ఇలా ఎందరో మహానుభావులు!

ఇంటి పేర్లు ఇంకొక విధంగా మారిన దాఖలాలు కూడా వున్నాయి. వాళ్ళు నివాసమున్న స్థలాల్ని బట్టి కూడా మారడం కద్దు. 'పడమటింటి' పాపయ్య, కొండమీది గోవిందరావు, కొనింటి కూర్మయ్య ఇలా. ఒక పెద్ద మనిషికి నలుగురు కొడుకులు. నలుగురూ బాంకు ఉద్యోగస్థులు. ఇంకేం? ఆయన బాంక్ బలరామయ్య! వాళ్ళను ఈ విధంగా అందరూ పిలుస్తారనీ వారికి తెలుసు. చాల మంది ఏమీ అనుకోరు కూడా. ఎటొచ్చీ 'మచ్చ'పడిన 'సూటుకేసు' బాపతు దవ్వ!

ఒక విషయాన్ని చాలా విపులంగా చెపుతుంటే ఈ రామాయణం 'అంతా ఎవరికి కావాలయ్యా! ఏదో అడిగితే 'భారతం' మొదలెట్టావేంటి అని పవిత్రమైన మన పురాణాలను పరోక్షంగా అపహాస్యం చేస్తాం. నమ్మదగని విషయాన్ని 'పురాణం' చెప్పకు, అనీ, హరికథ చెప్పకూ అని అవహేళన చేస్తాం. పాపం. పవిత్ర పదాలకు కూడా కాలప్రవాహంలో పెడార్థాలు ప్రాప్తించడం సహజమేనేమో! రాజకీయాలు, దేశభక్తుడు, డిప్లొమేట్, సిండికేట్ వీటికి పెడార్థములు రావటం లేదా?

చివరగా ఒకమాట. వంశ నామమునకు 'ఇంటి పేరు' అని మనం వాడుతున్నాము. వంశము కాస్తా ఇల్లు ఎలా అయిందో మరి పరిశోధకులు చెప్పాలి. ఈ ఇంటిపేర్ల తతంగం ఆంధ్రులకే వున్నట్టుంది. తమిళులకు ఉన్నట్లులేదు. వారు ఊర్ల పేర్లమీదనే వ్యవహరింపబడుతున్నారు చిత్తూరు సుబ్రహ్మణ్యం, శ్రీరంగం గోపాలరత్నం, మదురై మణిఅయ్యర్, కోలార్ కృష్ణయ్యర్, పాలఘాట్ కృష్ణన్, మహారాజపురం సంతానం ఇలా. యూరోపియన్లకు కూడా ఈ ఇంటిపేర్ల సంప్రదాయమున్నట్లు వినకిడి. పరిశోధించాల్సిందే—

—: o :—

# 18. నామకరణ ప్రహసనం!

బర్మాలో నివసించే టుమాండల్ ఆదివాసి తెగలో అప్పు కావలసిన వారు పుచ్చుకునే వారి దగ్గర తమ పేరును తాకట్టుపెట్టే సంప్రదాయం వుందిట అంటే ఆ అప్పు తీరేవరకు ఋణగ్రహీత తన పేరును వాడుకోనని హామీ పత్రం వ్రాసి ఇవ్వాలి. అప్పు తీరేవరకూ అతగాడి పేరును పూర్లో ఎవరూ ఉపయోగించరట. తీర్చిన తర్వాతనే అతని పేరు అతనికి దక్కు-తుందిట! బలేగా వుంది గదూ?

మన న్యాయవాదులు ఎవరూ ఆ ప్రాంతాలను చూచినట్లు లేదు! సరే. ఆ సంగతి వదిలేద్దాం.

మొన్న మాకొక పెద్ద సమస్య వచ్చిపడింది. ఆర్థిక సమస్య అయితే, అప్పో సొప్పో చేసి లేదా, అడ్వాన్సుకు అప్లై చేసి పరిష్కరించ వచ్చు. మా సమస్య ముందు కుర్రాళ్ళను కె జీ. లో, నర్సరీలో చేర్చటం పెద్ద సమస్య కాదు. మహానగరాల్లో ఫ్యామిలీ పోర్షను దొరికించుకోవడం సమస్య కాదు. వీసా సంపాదించడం పైసాలుంటే సమస్యే కాదు. అప్పులు తీర్చటం అసలు సమస్య గాదు. బెగ్, బారో, స్టీల్ అనే స్టీలు లాంటి ధర్మసూక్ష్మ ప్రకరణ క్రిందనో ముళ్ళపూడి, మునిమాణిక్యం గార్ల ఫార్ములాను అమలుపరిచో అనాయాసంగా అప్పు తీర్చి పారెయ్యొచ్చు! పాల సమస్య, పనిమనిషి సమస్య, ఇంటి సమస్య, ఇంతి సమస్య, నీటి సమస్యలకన్నా 'నాటీ' knotty సమస్య!

నేను ఒక నియంతను కాకపోవడం వల్ల కొంత చిక్కొచ్చింది! మా ఇల్లు ప్రజాస్వామ్యానికి ప్రతీక! శాంతియుతంగా ఏకాభిప్రాయ సాధనకు నేను చేసే కృషి పంజాబ్, కాశ్మీర్, అస్సాం, శ్రీలంక సమస్యల్లాగా, అడుగడుగునా అడ్డంకులతో విఫలమౌతూంది.

మరేమోనండీ మొన్ననే, కొత్తగా జనాభా పద్దులో చేరిన మా మనుమడికి, మనుమరాలికి చక్కని పేర్లు దొరకక్క, ఏకాభిప్రాయం కుదరక బుర్ర నిప్పులు చెరిగే ఎండలో హెల్మెట్ పెట్టుకున్నంత వేడెక్కిపోతూంది. ఇదీ ఒక సమస్యేనా అని మరీ తీసిపారెయ్యకండి. నవ్వుకోకండి. పరిస్థితి అర్థం చేసుకుంటే మీరు నిజమేనండోయ్ అని అంగీకరిస్తారనే నా విశ్వాసం.

మాది ఉమ్మడి కుటుంబం. మడికట్టుకునే మా అమ్మకూ, మహిళా మండలిలో సెక్రటరీలు, సభ్యురాండ్రూ అయిన మా కోడలమ్మలకూ భావసారూప్య సాధన బహుకష్టం. అత్తాకోడండ్లు సరేసరి. వాళ్ళు జాతక చక్రంలో రాహు-కేతువులు ఒక ఇంట్లో ఉండడం దుస్సాధ్యం. ఎప్పుడూ ఆపోజిట్ పొజిషన్!

ఈ జటిల సమస్యను ఒక కొలిక్కి తేవటానికి, మొన్న శని, ఆది వారాలు సెలవు లవటం మూలాన, శుక్ర, సోమవారాలు కూడా - ఏనాడో టపా కట్టేసిన మా నాయనమ్మకు జబ్బుగా వుందని సెలవుచీటీ గీకేసి, ఆఫీసరు ముఖాన పారేసి (వినయంగా నసుగుతూనే ఇచ్చాలెండి!) గురువారం సాయంత్రం నాలుగ్గంటలకే చెక్కేసి, ఇంట్లో అందరు సభ్యులనూ అత్యవసరంగా సమావేశపరచి నామకరణ పూర్వమహాసభకు ఇబ్బంది లేకుండా రిబ్బను లేకుండానే ప్రారంభోత్సవం చేశా!

సీనియారిటీ ప్రకారం ముందు మనుమరాలి పేరు నిర్ణయించాలి. అజెండాలో వస్తు ఆయిటం అదే! లాంఛనంగా పెద్దావిడ గనుక మా అమ్మను అడిగా.

"దీనికెందుకురా ఇంత ఆలోచన! ప్రథమ సంతానం సలక్షణంగా శుక్రవారం పుట్టింది. 'లక్ష్మి' అని పెట్టుకుందాం. మీ తాతగారి పేరు కూడా కలసి వచ్చేటట్లుగా 'వెంకటలక్ష్మి' అని నామకరణం చేస్తే ఆయనగారి ఆత్మ సంతోషిస్తుంది. మీకు ఫాషన్లు కావాలి కాబోలు! అయితే 'వెంకట శ్రీలక్ష్మి' అని

పెట్టుకోండి"అని తన మనసులోని మాటను దాపరికం లేకుండా ప్రతిపాదించింది మా అమ్మ, చెఱగుతో కన్నులొత్తుకుంటూ.

'ఏంటోయ్, ఏమంటావ్' అని మా అబ్బాయివైపు కనుబొమలు పైకెత్తి ప్రశ్నార్థకంగా చూచా. మరి వాడే కథానాయకుడు! వాడు అందుకున్నాడు:

"తాతయ్య మీద నాకు కూడా చాల గౌరవం. కానీ ఈ కాలంలో పేర్లు ఆధునికంగా వుండాలి. అరుదైన పేరుగా వుండాలి. మనం ఇరవై ఒకటో శతాబ్దం లోకి అడుగిడబోతున్నాం. ఈ లక్ష్మి, సుబ్బారావు, వెంకట్రావు ఇలాంటివి చాలా, చాలా పాతవి. అదీగాక పేర్లు పెట్టడంలో చాలా జాగ్రత్తగా వుండాలి. దూరదృష్టితో ఆలోచించి, ఆ పేర్లు ఎలాంటి అవహేళనకు 'నిక్ నేమ్సు' పెట్టేందుకు ఏమాత్రం వీలుండకూడదు. మా ఆఫీసులో ఆంజనేయులు అని ఒకాయన ఉన్నాడు. ఆయన్ను పరోక్షంగా అందరూ ఇంజనాయిలూ అని పిలుస్తారు. మా బాస్ పేరు 'పుల్లకూర విరూపాక్షయ్య' ఫైర్ బ్రాండ్! ఆయన్ను చాటుగా 'పుల్ల విరువయ్య' అనుకుంటాం. మరొకాయన కుటుంబ రావు. పిల్లల్లేరు! 'కస్తూరి' అనే పేరుగలాయన దగ్గరికెళ్ళితే చెమటకంపు!

"నా క్లాస్‌మేట్ 'పావని' అని ఒకామె ఉండేది. వాళ్ళింటి పేరు 'పీన పాటి'. ఆమెను 'పీ, పా' అని పుడికించేవారు. పేరుకు తగ్గట్టే వుండేది! 'జి' అనే ఇంటి పేరుండేవారు గురుమూర్తి అని పేరెట్టుకుంటే జిగురుమూర్తి అవు తాడు. ఎ. సత్యనారాయణశర్మ అని వుండేవాడు వాడిని ASS అని వేళా కోళం చేసేవారు. అలాగే 'కా' అని ఇంటిపేరు కలవారు 'కిరీటి' అనో కిషన్ రావు అనో పేరు పెట్టుకుంటే వాడు 'కాకి' అయి కూర్చుంటాడు! అందరూ ఎద్దేవా చేస్తారు. పేరు ముచ్చటగా 'రత్నావళి' అని పెట్టుకొని 'రత్తి' అని పిలుచుకోడం వింటుంటాం. ఇలాంటి అవకాశం లేకుండా పేరు పెట్టుకోవాలి" అని నామకరణ సూత్రాలను సూచిస్తూ ఒక చిన్న ఉపన్యాసం ఇచ్చాడు, కొంచెం యూనియన్ లీడరు లక్షణాలు పట్టు బడ్డ మా పెద్దబ్బాయి.

"ఆ కాడికి నన్నెందుకూ అడగడం! నా మాటకు ఈ ఇంట్లో విలువంటూ ఉంది గనుకనా? ఏ పేరైనా పెట్టుకోండి. ఎలాగైనా అఘోరించండి!" అంటూ వంటింట్లోకి వెళ్ళిపోయింది మా అమ్మ, అసెంబ్లీలో ప్రతిపక్ష నాయకునిలాగా!

"పోనీ. నీవే ఒక పేరు చెప్పరాదూ? దాన్నిగూర్చి సభాసదుల సదభిప్రాయం తెలుసుకుందాం" అన్నాడు ఒక సభ్యుడు.

వాడంతకుముందే 'పారెక్స్' కాటలాగ్ ఒకటి సేకరించి నట్లున్నాడు ఈ కాలం కుర్రాళ్ళు జాగ్రత్త వరులు. 'PAIR' అయింది. మొదలు పుట్టబొయ్యే వాళ్ళకు పేరు రెడీ చేసి పెట్టుకుంటారు!

'మానస' అనే పేరు బాగుండదా' అన్నాడు.

"అవును. మాడరన్‌గా వుంది. మొన్న ఒక నవల్లో ఆ పేరు వచ్చింది." సీరియల్ నవలా బాధితురాలైన పెద్ద చెల్లెలు చెప్పింది.

"ఇందాక 'ఆంజనేయులు' అంటే 'ఇంజనాయలు' అని ఎగతాళి చేసినట్లే 'మహానస' కాకూడదా. లేక 'మైనస్' కాకూడదా?" అని ఎత్తి పొడిచింది ఇంట్లోనే వుంటూ 'ఓపెన్ యూనివర్శిటీ'లో ఇంటర్ రెండుసార్లు తప్పి, వచ్చే వింటర్‌లో ప్రైవేట్‌గా పరీక్ష ఇవ్వబోతున్న మా రెండో అమ్మాయి. పేరు 'సరస్వతి' చదువుల తల్లి!

"అవునోయ్, సరస్వతి బుద్ధి చదువులో పనిచేయకపోయినా 'నిక్‌నేమ్ స్పెషలిస్టు' అయిందే" అని మా పెద్దమ్మాయ్ వ్యాఖ్య!

"ఏమండీ! ఇలా జల్లెడ దృష్టితో వెదికితే అన్ని పేర్లలో ఏదో ఒక వంక కనబడవచ్చు. 'సంధ్య' అంటే 'వంధ్య'! 'హిమబిందు' అంటే 'మంచు

బిందె'! బాలాజీ అంటే బహులేజీ! అనిరుద్ధ్ అంటే 'అన్నీరుద్దు'! బృంద అంటే బొండ! సవిత అంటే సవతి అనో లేదా వసతి అనో, ఇలా ఎన్నెన్నో చెప్పొచ్చు" అని అందాకా పూరుకున్న మా సతీమణి స్వెట్టరల్లుకుంటూనే సలహా ఇచ్చింది.

'సరళ అంటే? మరో అబ్బాయి ప్రతిపాదన. అబ్బే సరళ రేఖలూ, వక్ర రేఖలూ, జ్యామిట్రీ వ్యవహారం. 'గజడదబ' అని నిక్‌నేమ్‌కు ఆస్కారం' పక్కవాడి ఎదురు వ్యాఖ్య. 'మయూరి' అంటే - మరొకసారి సలహా. 'పెద్దయ్యాక నృత్యం రాకపోగా గున్నయేనుగు లాగా తయారైతే ఎబ్బెట్టుగా వుండొచ్చు ' 'మయూరి' అంటే ఆడు నెమలి. నృత్యం చేసేది 'మయూరము' అంటే మగనెమలి' అన్నాడు B O L వెలగబెడుతున్న మరొకడు. 'సరే ననుకో. ఆ పేరంత నచ్చలా. మయూరి సినిమాలో హీరోయిన్ కాలు విరిగింది. అందుకని సెంటిమెంటల్‌గా ఆ పేరు నాకు వద్దు' అన్నాడు మావాడు.

'జయంతి అంటే?'

'చ ఛ. జంతికల్లాగా జయంతి, వైజయంతి....ప్చ్! బాగా లేదు.'

"సుమతి, శ్రీమతి? బాగుండదా?" అబ్బే. ఎగుమతి, దిగుమతి లాగా అదీ గాక మతి ఉండాల్సింది మనిషికి గానీ పేర్లకు గాదు.

'సురభి, సుభాషిణి, సుహాసిని ఎలా వున్నాయ్?'

'సురభి అంటే ఆవు. ఎవరైనా రోమియోలు కొంచెం పాలున్నాయా? సుర వుందా అనో అల్లరి పట్టించవచ్చు. ఎవరు చూడొచ్చారు. రేపు సుభాషిణి అవుతుందో, దుర్భాషిణి అవుతుందో. ముసోలిని ముఖంపెట్టి ముఖారి రాగం పాడుతుందో?'

'చారులత?'

'నథింగ్ డూయింగ్. చారు పులుసు! ఈ మధ్య ఈ 'లత' పిచ్చి, 'వతి' పిచ్చి ఎక్కువ అయినట్లుంది. సూర్యలత, విజయలత, సూర్యావతి

లక్ష్మిస్వప్న వర్ణమాల మౌనిక, నీతిక ఇలా అతకని పేర్లు అతికించు కుంటున్నారు!"

'తరులత?!'

'తలరాతలా వుంది. ఊహూ!'

'వెంకటేశ్ అంటే ఎలా వుంది?'

ప్చ్. బాగాలేదు. అచ్చులో అది వెంటకేశ్ అయితే అభాసు!

ఇలా తలా ఒక వ్యాఖ్య చెయ్యటంతో ఏకాభిప్రాయం కుదరక "సరే. అమ్మాయి పేరు బాగా ఈ రాత్రికి ఆలోచించి రేపు నిర్ణయించుకుందాం. అబ్బాయి పేరు విషయం చర్చిద్దాం" అన్నాడు మావాడు.

"టాగూర్ అని పెడదాం." అని ఒక అయాచిత సలహా.

మళ్ళీ గొంతు సవరించుకొని మావాడు ఉపన్యాసం మొదలెట్టాడు:

"మన తెలుగువాళ్ళకు ఒక తెగులు! అనుకరణ జాడ్యం. తెలుగు వాళ్ళలో, సుబాస్‌లున్నారు. దిలీప్‌కుమార్ లున్నారు. నెహ్రూలు ఉన్నారు. శరత్‌లున్నారు. ఉత్తర హిందుస్థాన్‌లో ఎక్కడైనా ఒక్క, కనీసం ఒక్క వేమన, త్యాగరాజు, వీరేశలింగం, రుద్రమదేవి ఉన్నారా?" విశ్వకవి టాగూరు కావచ్చు. కానీ మన పేర్లను వాళ్ళు ఒక్కరూ పెట్టుకోనప్పుడు మనం వాళ్ళ పేర్లకై ఎగబడడం ఎందుకు? రామారావ్‌లు వాళ్ళలో లేనప్పుడు రాజేశ్ ఖన్నాలు మనలో ఎందుకుండాలి? వాళ్ళ పంజాబీ దుస్తులు, చుడీదార్లూ మనం దిగుమతి చేసుకున్నాం. మన పంచకట్లు, చీరకట్లు వాళ్ళు అనుకరిస్తున్నారా? ఎన్నికలప్పుడు రాజకీయ నేతలను వదలండి! మన తెలుగు సినిమా పత్రికల్లో, ఇతర వారపత్రికల్లో హిందీ నటులనుగూర్చి శ్రుతిమించిన పబ్లిసిటీ ఇస్తాం. తెలుగు నటులనుగూర్చి, దక్షిణాది తారలను గూర్చి, వాళ్ళు అంతగా బాకా ఊదుతున్నారా? మన తెలుగువాళ్ళంటే అందుకే ఉత్తర దేశమంతా అంత చులకన. వాళ్ళు ఆంధ్రులను మద్రాసీలనే ఇప్పటికీ వ్యవహరిస్తారు" అని ఆవే శంతో ఊగిపోతూ చెప్పాడు. వాడు ఆ మధ్యనే తెలుగుదేశం పార్టీలో చేరి,

గిట్టుబాటుకాక, ఈ మధ్య కాంగ్రెస్ టికెట్ క్రిందా మీదా పడుతున్నాడు లెండి. "నీదేపార్టీ" అని ఎవరైనా అడిగితే, "ఎవరు టికెట్ ఇస్తే వాళ్ళ పార్టీ. కావలసింది పదవి కానీ పార్టీకాదు"అని పాపం ఒప్పేసుకుంటాడు ప్రయివేట్‌గా!

"ప్రసాద్ పేరు బాగుంటుందేమో?"

"ఓ మోస్తరుందనుకో. కానీ ఇంగ్లీషులో వ్రాస్తే చివర SAD వస్తుంది. ఆ ట్రాజడీ పేరు వద్దులే."

"తెలుగు తెలుగు అంటావ్, ఇంగ్లీష సంగతెందుకూ?" మరొక గొంతు.

"అవుననుకో. ఇంగ్లీష ప్రపంచ భాష. మనదేశం నుంచి ఎన్ని శతాబ్దాలైనా పోదు!"

"దయానంద్ ఎలా వుంది?"

"ఉహూ! DAYANAND ను విరిస్తే DAY ANAND అవుతుంది. పగలు మాత్రమే ఆనందుడు కావచ్చు."

'రవికుమార్ ?'

'పైరవికుమార్' అనే నిక్‌నేమ్‌కు అర్హుడు కావచ్చు. అదీగాక, సూర్యుని కొడుకు శని. శనిగాడొస్తున్నాడు అంటారు!'

"దండపాణి అని పెడితే? మన ఇంటి పేరు కోవల్లె. కోదండపాణి అని శ్లేషగా కూడా పిలవ్వొచ్చు."

'అది ఇంగ్లీషులో K. D అవుతుందే?"

అయ్యో! ఇదండీ మా సమస్య!

కొంతమంది క్రొత్త పత్రికలు ప్రారంభించే ముందు పత్రికకు ఒక మంచి పేరు సూచించిన వారికి బహుమతి అని ప్రకటిస్తుంటారు. అలా మేము కూడా ఇస్తే బాగుంటుందేమో అని ఆలోచనలో పడ్డాం.

ఈ లోగా, తుది నిర్ణయం తీసికునేవరకూ మనుమడిని 'నానీ' అనీ, మనుమరాలిని 'జానీ' అనీ పిలుచుకునేందుకు ఏకగ్రీవంగా నిర్ణయించుకున్నాం. పేరు సూచిస్తారు కదూ!

—: o :—

# 19. ముద్రారాక్షస ప్రహసనం

ఆ మధ్య, ఒక కార్టూన్ చూశా. ఒక పత్రికాధిపతి వద్దకు కొంతమంది ప్రూఫ్ రీడర్ ఉద్యోగానికి వెళ్లారు. ''మేము ఖాళీలున్నాయని పత్రికా ప్రకటన ఇవ్వలేదే?" అంటాడు సంపాదకుడు. "నిజమే అనుకోండి అపూర్వమైన మీ పత్రిక క్షుణ్ణంగా చదివి, మేమే హడావిడిగా వచ్చాం!" అంటారు అభ్యర్థులు. ఈ కార్టూన్ అర్థం కాలేదా? నమస్కారం!

తంజావూరు తాళపత్ర గ్రంథాల్లోని వ్రాతల్లో తప్పులు దొర్లాయో, లేదో తెలియదు. కానీ, ఈ అచ్చుయంత్రాలు వచ్చినప్పటి నుంచి అచ్చు తప్పులు ఒక న్యూసెన్సు. తప్పొప్పుల పట్టిక లేని పుస్తకమంటూ సామాన్యంగా వుండదు. సదరు పట్టికలలో కూడ అచ్చు తప్పులుండటం కద్దు! కొన్ని తలనెప్పి తెప్పిస్తే, కొన్ని నవ్వు పుట్టిస్తాయ్. చిన్న, చిన్న తప్పులైతే చూడగానే స్ఫురిస్తాయ్. అవి అమాయకంగా దొరికిపోతాయ్. కాబట్టి వాటితో సర్దుకపోవచ్చు.

వచ్చిన తిప్పలు రెండో రకం తప్పులతోనే.వీటికి 'దొర తప్పులు' అని ముద్దుగా పేరెట్టా! ఘరానా పెద్దమనుష్యులు! మారువేషాల్లో వుంటాయ్. మన దుంప తెంచుతాయి. ఎందుకంటే, అవి కూడా నిర్దుష్టమైన, స్వతంత్ర పదాల్లా గానే కనిపించి చస్తాయ్, కాదు, పాఠకులను చంపుతాయి- చప్పున స్ఫురించని అసలు సిసలు ముద్రారాక్షసులు!

'రవిగాంచని చోట కవిగాంచునే కదా,అని ఒక కవి అన్నాడే గాని అచ్చు తప్పుల విషయములో మాత్రం ఆ సూత్రం "అప్లై" కాదు. రవియేకాదు సహస్రాక్షుడైన ఇంద్రుడు కూడ ముద్రారాక్షసులను పసిగట్టలేడు! ద్వినేత్రులు,

చతుర్నేత్రులు, అయిన, రచయితలు, త్రులు, కవులు, వయిత్రులు ఒక లెక్కా?!

ఇటీవల ఒక ప్రముఖ దిన పత్రికలో "ఫలానా ప్రసిద్ధ సినీ నటి (పేరు వద్దు) తిరుమల కొండపైన దేవాలయం లోపల అంగ ప్రదర్శనం చేశారు" అని పడింది. పోనీ ఏ "స్ట్రీకింగ్" బాపతో అనుకుందామా అంటే పవిత్ర దేవాలయ మాయె. అయ్యో, అది "అంగ ప్రదక్షిణం" నకు వచ్చిన అవస్థ!

ఒక సుప్రసిద్ధ గాయక సార్వభౌముని సత్కరించే సన్మాన పత్రంలో 'ఓ గాన కళా గర్వాంధా!' అని సంబోధన! ఇది 'గంధర్వా'కు పట్టిన శని!

ఒక పేపర్లో ఫలానా మంత్రిణి గారికి ఫలానా ఫూర్లో రాత్రి 'కామం' ఏర్పాటుచేశారు.రహదారి బంగళాలో అన్ని హంగులు 'పడక్బందీ'గా అమర్చారు అని అక్షరాలా వుంది. పాపం శమించుగాక! అది 'మకాం'కు 'పకడ్బందీ'కి పట్టిన ఖర్మ!

ఒక సీరియల్ కథలో "మీ పొగాకు భార్యను ఒక నెల రోజుల పాటు అద్దె కిస్తారా?" అని అడుగుతాడు ఒకడు.పొగాకు "బ్యారను" అవిధంగా ముద్రా రాక్షసునిచే సత్కరించబడింది! మరొక చోట ఒక పెండ్లికాని అమ్మాయి తన బాయ్ ఫ్రెండును పరిచయం చేస్తూ "ఇతడు మిస్టర్ శరత్ అని పెద్ద కంపెనీ మేనేజరు. అయిదు వేల రూపాయిల జతగాడు' అని అంటుంది. (జీతగాడికి పట్టిన గ్రహణం!)

సినిమా తారలను కూడ ఎన్నికల బరిలోకి దింపుతున్న రోజులివి. ఒక చోట "భారతీయ జనతాపార్టీ కాంగ్రెసు 'కన్నాంబ'ల పొందింది.అని పడింది. అయ్యో! కాంగ్రెసు కన్నా, బలం పొందింది అని భావం!

ఒక వివాహ మహోత్సవాహ్వాన పత్రికలో "…. …. …. అను కన్యా రత్నమును ఫలానా నరునకు ఇచ్చి" అని అచ్చు అయింది. నరులకు గాక వానరులకూ, గంధర్వులకూ, కిన్నర కిం పురుషులకూ ఇస్తారా అనుకున్నా.

అదే పత్రికలో, కన్యారత్నం ఇండియన్ ఓవరీస్ బాంకులో పనిచేస్తున్నట్లు అచ్చు అయింది ఖర్మ! 'ఓవర్సీస్' బాంక్! "ఓవరీస్" అంటే అండాశయములు అని అర్థం!?

ఒక తెలుగు పాఠ్యగ్రంథములో "ఎవ్వనిచే జనించు" అనే పద్యములో "జవ్వనిచే జనించు" అని గానీ, బాలేందువదన అనుటకు బదులు "బ్రాలెందు వలన!" అని గానీ, కృష్ణదేవరాయలు భోజుని వంటివాడు అనడానికి "వంట వాడు" అని అచ్చయ్యాయనుకోండి. పాపం, ఆ తెలుగు మాస్టారి అవస్థ ఊహించండి!

ఒక పుస్తక సమీక్షలో ఫలానా గ్రంథకర్త రచనల్లో "వైవిధ్యం ఉంది"కి బదులు వైధవ్యం అని అచ్చయిందండీ! గోవిందా, ఎంత అబాసు!

"అయ్యా! ఇంటిల్లపాదీ మా కంపెనీవారు తయారు చేసిన బలవర్ధక ఔషధాన్ని సేవించండి" అని ప్రకటన! ఆ 'యా' వత్తుతో యావత్తు ప్రకటన వృథా!

ఎన్నికల జాబితాను కాంగ్రెసు కమిటీ 'పిసికి' పంపించారట! బాబూ! పి.సి.సి.కి అండీ!.

ఒక రాజకీయ నాయకుడు ఎన్నికల ప్రసంగంలో మన మురికివాడల పెరుగుదలకు శాయశక్తులా కృషి చేస్తానని వాగ్దానం చేసినట్లు వార్త. 'మెరుగుదల' 'పెరుగుదల' అయింది. తలకెక్కటం ఎలా!

ఫలానా జిల్లా అధికారి తమ 'కీపు'ను ప్రభుత్వ అనుమతి లేకుండా పొరుగు రాష్ట్రానికి తీసికెళ్ళారట! అందులో పెద్ద తప్పేముంది అనుకున్నా కాని, అది 'జీపు'! బాబూ!

క్షమించండి. ఒకసారి పేపర్లో మంత్రిగారు శ్రీశైలం జలవిద్యుత్ కేంద్రమును దర్శించారు అనుటకు బదులు 'శై' తర్వాత స్పేస్! 'జ' కు ఇవతల 'స్పేస్' లేకపోవడం! రామ రామ! నేను చెప్పను ఊహించుకోండి!

మరొకచోట, మంత్రిగారు రిపబ్లిక్ దినోత్సవ సందర్భంగా బ్రహ్మాండ మైన బహిరంగ సభలో ప్రసంగిస్తూ కాంగ్రెసు పాతకాన్ని గూర్చి సింబాలిక్‌గా విశ్లేషించారని వార్త. పాపం, పతాకానికి పాతకం అంటగట్టాడు కంపోజిటరు. "మంత్రిగారికి అంటగట్టియుంటే" అదొక ఊరడింపేమో!

ఫలానా కలెక్టరుగారిని ఫలానా జిల్లా నుంచి ఢిల్లీకి 'బలి' చేశారట (బదిలీ!)

వెంకట "రమణ"మూర్తిని వెంకట "మరణ"మూర్తిగానో, ఆహ్వాన పత్రికలో 'సకుటుంబముగా' రావలెను అనుటకు 'నకుటుంబముగా' అనో పడిందా- ఎంత తలవంపులు! 'జి గురుమూర్తి' లో ఆ 'ఫుల్‌స్టాప్' కు ఎంత విలువో గమనించారా?

ప్రధాన మంత్రిగారు ఒక బ్రహ్మాండమైన సభలో ఉపన్యసిస్తూ 'మన దేశంలో మాదకద్రవ్య పరిస్థితిని బాగా అభివృద్ధి చేసికోవా'లని ఉద్ఘాటించినట్లు వార్త! అర్థమైందా? "మారక" ద్రవ్యమండీ!

ఒక వ్రతకథల పుస్తకంలో 'ఈ వ్రతమాచరించుట వలన ప్రజలందరు ఆయురారోగ్య ఐశ్వర్యములను సుఖరోగములను పొంది, మరణానంతరము ముక్తిని పొందెదరు' అని ఉందండీ. తప్పు ఎక్కడుందో కనుక్కోండి! మహా ప్ర'భో'!

పార్లమెంటులో ఒక సీనియర్ సభ్యుడు 'తాగి' స్పీకరువద్ద బైఠాయించాడట! తప్పు కనపడిందా? (త్యాగి గారట!)

పెండ్లికొడుకు గారు గోద్రెజ్ బీరువా, టి.వి. వంది మంచము కావాలని వట్టుబట్టాడట! అ.... బోధవడిందా?

ప్రధాన మంత్రిగారు అసందర్భంగా ప్రవసంగించారట. (స్వామీ.... ఆ సందర్భంగా.)

ఇరిగేషను మంత్రి అనడానికి ఇరిదేషను మంత్రి అనీ, **Minister for Scheduled Tribes** కు బదులు **Scheduled bribes, Andhra Pradesh grape growers Association** కు బదులు **grave growers Association** అనో కాంగ్రెసువారు ఉదార స్వభావులనుటకు 'ఉదర' స్వభావులు' అనో, ఆనరబుల్ మినిస్టర్ అనడానికి ఆ నర బుల్ మినిష్టరు అనో, కరకమలములచే ప్రారంభించబడినది అనటానికి కరక మలములచే అనో పడిందనుకోండి- కొంపలంటుకోవూ!

ఇలా రాసుకుంటూ పోతే ఒక గంథము, సారీ, గ్రంథము అవుతుంది. ఈ అచ్చుతప్పుల ప్రవహసనం మన సహనమును వరీక్షిస్తాయి. చదివేవారికి నెలతప్పి, సారీ తలనెప్పి!

—: o :—

# 20. అధికార భాషా ప్రహసనం!

నేను రిటైరైన కొత్తల్లో ప్రభుత్వం వారి వద్ద నుండి నాకొక లేఖ వచ్చింది. "గోపనీయము" అని దానిపైన ఎర్ర సిరాతో వ్రాశారు. లేఖలోని సారాంశమిది:

"మీరు డిప్యూటీ డైరెక్టరుగా కొలువులో వుండగా మీ క్రింద పనిచేసిన ఈ క్రింది ఉద్యోగుల 'రహస్య పత్రము'లను పంపలేదు. ఇప్పటికి మూడు స్మృతిపత్రములను పంపితిమి. వెంటనే పంపవలెను.

1. .... .... .... .... పర్యవేక్షకుడు
2. .... .... .... .... ఉ.శ్రే.స
3. .... .... .... .... ది.శ్రే.స

సంతకము
మండలాభియంత

మండలాభియంతలో రైపులో 'మ' కు కొమ్ము పడిందనుకోండి. ఆ కొమ్ము మనకొద్దు!

సదరు లేఖను చూచి, ఇంగ్లిష మీడియంలో చదువు వెలగబెడుతున్న మా మనుమడు ఒకటే నవ్వు. 'ఏమిట్రా?' అన్నా. గోవనీయము స్మృతిపత్రము ఉ.శ్రే.స. ఎట్సెట్రాలకు 'మీనింగ్' వివరింపుడు' అన్నాడు.

'గోపనీయము' అంటే కాన్ఫిడెన్షియల్ అనీ 'స్మృతిపత్రము' అంటే 'రిమైండర్' అనీ 'మండలాభియంత' అంటే 'రీజనల్ డైరక్టర్' అనీ, 'పర్య వేక్షకుడు' అంటే సూపరింటెండెంటు అనీ విశదీకరించా.

"అది సరే. 'ఉ.శ్రే.స.' 'ది. శ్రే స.' అంటే?" అని అనుబంధ ప్రశ్న వేశాడు. నాకూ వెంటనే స్ఫురించలా. బుర్ర బద్దలు కొట్టుకుంటే (అంటే బాగా ఆలోచిస్తే అని అర్థం!) అవి అప్పర్ డివిజను అసిస్టెంటు, లోయర్ డివిజన్ అసిస్టెంట్లకు అనువాదాలు అని అర్థమైంది. ఉ.శ్రే.స. అంటే ఉన్నత శ్రేణి సహాయకుడు! ది.శ్రే స. అంటే దిగువ శ్రేణి సహాయకుడు!

ప్రభుత్వ పారిభాషిక పదకోశమును మన పండిత ప్రకాండులంతా, మెదడు చించుకొని, కాళ్ళు కడుగుకొనుట అంటే పాద ప్రక్షాళన అని అనువదించినట్లు తయారు చేశారు! మాతృ భాషలోనే ఆఫీసు కరస్పాండెన్సు (కార్యాలయోత్తర ప్రత్యుత్తరములు!) జరగాలి అనే దీక్ష,ధ్యేయము అభిలషణీయమే, వచ్చిన చిక్కల్లా ఈ ఆర్భాట భూయిష్ఠ పదకోశముతోనే! పదహారణాల ఆంధ్రునికి కూడ స్ఫురించని ఫక్కీలో (నూరు పైసలు అనాలని స్ఫురించింది లెండి.) నా మటుకు నాకు "పదహారణాల ఆంధ్రుడు"లో వున్న ఠీవి 'నూరు పైసలాంధ్రుడు'లో పైసలవుతుందని అనుమానం.) ఈ పదకోశము అనువాదకుల పాండితీ ప్రకర్షను ప్రకటిస్తుందేమోగానీ, సగటు మనిషికి వెగటు పుట్టించవచ్చు!

రైలు అంటే పల్లె కుర్రవానికి కూడా తెలుసు. ధూమ శకటము అని పారిభాషిక పదకోశములో అసలు ఎందుకు చోటు చేసుకోవాలి? మరి 'ధూమం'తో పోకుండా డీజెయిల్‌తో పోయ్యే రైలు ధూమ శకటం అవుతుందా?

డైరక్టరు అంటే నిరక్షరాస్యులకూ కూడా తెలుసు. "సంచాలకుడు" అని ఒకరూ "దర్శకుడు" అని ఒకరూ 'అభియంత' అని మరొకరూ 'నిర్దేశకుడు' అని ఇంకొకరూ హడలగొడితే ఎలా?

తమిళనాడులో ఈ భాషా (దుర)భిమానం ఎక్కువ. ఉత్తర హిందూ స్థానం సంగతి సరేసరి! వైర్‌లెస్ అసిస్టెంటు అంటే 'వితంతు సహాయక్' అట. PTO అంటే 'పృష్ఠ్ దేఖియే' అంటారు! తప్పొప్పుల పట్టికలో 'శుద్ధరూప్, అశుద్ధరూప్' అంటారు! ఎంత వికారం!

ఒకచోట 'జిల్లా పోలీసు సూపర్నెంటు 'వారి' కార్యాలయము, ఫలానా వలయము అని బోర్డు ఈ "వారి" జబ్బు తెలుగు వారి కెక్కువ. వార్లు, గార్లు అసలు ఎందుకు? అసలు 'ఆఫీసు'ను కార్యాలయము అనడం తప్పు. అది ఆలయమూ కాదు; వారు కార్యాల్లో లయమైపోరు.

"పనులుగావు నేడు ఫైళ్ళలో, బరువులన్
పెట్టుకున్న - కాక పట్టుకున్న!"
ఎందుకొచ్చిన అవస్థ? కార్యస్థానము అంటే చాలదా?

పోతే, పై బోర్డులో 'పోలీసు'ను దింపుకున్నారు. 'సూపరింటెండెంటు'ను 'సూపర్నెంట్'గా భ్రష్టు చేసినారు. అలాగే 'సర్కిల్'ను దింపుకుంటే కొంపలంటుకుంటాయా? మధ్యలో 'వలయము' ఎందుకు? మరి 'సర్కిల్ ఇన్స్పెక్టర్'ను 'వలయ' తనిఖీదారు అంటే హాస్యాస్పదంగా వుండదా?

ఒకచోట ప్రౌఢ శిక్షణ పరీక్షామండలి అని బోర్డు! అది యేశాఖో ఇప్పటికీ అర్థం కాలేదు. 'గ్రౌండ్ వాటర్ డిపార్టుమెంటు'ను 'భూగర్భజల శాఖ' అని ఒకచోట, అంతర్జల విభాగము అని మరొక చోట వ్రాశారు!

'డిపార్టుమెంట్ ఆఫ్ కల్చరల్ అఫ్ఫైర్స్' అంటే 'సాంస్కృతిక శాఖ' అంటే సరిపోదూ? లేదా సాంస్కృతిక కార్యక్రమాల విభాగము అన్నా చాలు. 'సాంస్కృతిక వ్యవహారాల శాఖ'ట! 'వ్యవహారం' అంటే కోర్టు తగాదా అనే అర్థంలో వాడుకలో వుంది. ఎంటమాలజీ 'అసిస్టెంట్ అంటే 'కీటక' సహాయ కుడు అనీ, మైకాలజీ అసిస్టెంట్ అంటే శిలీంధ్ర సహాయకుడు అనీ బోర్డులు తగిలించుకున్నారు!

మీ దరఖాస్తు 'ఫారము'లో 'ఆరోపము' లన్నీ సరిగా నున్నవో లేదో జాగ్రత్తగా చూచుకొనుడు' అని ఒకచోట వ్రాశారు. 'ఆరోపము' అంటే ఎంట్రీకి అనువాదము. ఏం, 'ఫారం' తీపు, 'ఎంట్రీ' చేదా? అసలు "దరఖాస్తు" తెలుగా?

ఇచ్చట స్వచ్ఛమైన తెలుగులోకి 'తర్జుమా' చేయబడును అని ఒకరు బోర్డు తగిలించుకున్నాడు. అసలు 'తర్జుమా' 'జవాబులు' తెలుగా?

'ఉమెన్స్ కన్జ్యూమర్స్ పారడైజ్' అంటే వనితల వినియోగదారుల స్వర్గమట! పాపం శమించుగాక! ప్రభుత్వ పాఠశాల అనకుండా రాజకీయ పాఠశాల అని కొన్ని రాష్ట్రాల్లో, 'హైస్కూలు'కు ప్రౌఢ విద్యాశాల అనీ, ఉన్నత పాఠశాల అనీ తలా ఒక రకంగా గీకిపారేస్తున్నారు!

'Child guidance Bureau' కు 'శిశు దర్శక విభాగము' అని బోర్డు. అయ్యో! పరిపాలిత స్థానిక ప్రజా చెలిపోను! ఏమైనా అర్థమైందా? 'కాలేజ్ ఆఫ్ కామర్స్ ఎడ్యుకేషన్' అంటే ఒక ప్రబుద్ధుడు ఉన్నత వ్యాపార విద్యా కేంద్రము అనటానికి బదులు ఉన్నత విద్యా వ్యాపార కేంద్రము అని అమాయకంగా అనువదించాడు. పాపం, విద్య వ్యాపారంగా మారిందని ఉన్న విషయం బహిర్గతం చేశాడు!

అధికార భాష తెలుగులోనే వుండాలని వాదించే వీరాభిమానులకు ఒక మనవి. జన సామాన్యం నోళ్ళలో నాని, నాని స్థిరపడిపోయిన పదాలను వదలి అలమారా గూళ్ళలోని నిఘంటు పదాలను ఎక్కిస్తే చిక్కొస్తుంది. కిడ్నాప్, స్మగ్లర్, మాఫియా గాంగ్, హైజాకింగ్- ఇలాంటి పదాలకు అనువాదాలనవసరం. వాటిని వాడుకుంటే తెలుగు వారి ఆత్మాభిమానం దెబ్బ తినదు. అలా గాక, మా మిత్రుడు యాజ్ఞవల్క్యం వ్యాఘ్రేశ్వర శర్మ (వాడు ఆంధ్ర గీర్వాణాల్లో శిరోమణి లెండి) సూచించినట్లు ఈ క్రింది విధంగా అనువదిస్తే మన పని గోవిందా! చిత్తగించండి:

Fish Plate = మత్స్య పలకము
Head Office = శీర్ష కార్యాలయము
Starred question = నక్షత్రీకృత ప్రశ్న
Members of Standing Committee = ఉత్తిష్ఠ సమావేశ సభ్యులు
Red Handed = అరుణా హస్తాలతో
My God! = ఓరి! నా దేవుడో!
Easy Chair = సులభ కుర్చీ
Net work Programme = నికర కార్యక్రమము
Zero Hour = శూన్య ఘడియ లేదా సున్న గంట
Electric Dry cleaners = విద్యుత్ నిర్జల పరిశుభ్రకులు
Lipstic = ఓష్ఠకాష్ఠము
Wave length = అల నిడివి
Tail piece = తోకముక్క
Pin code = సూది సంకేతము
Wrong thread = తప్పుడు దారము
Drawing Room = చిత్రలేఖన గది
Living Room = బ్రదికియుండే గది!
Sleeping Partner = నిద్రాణభాగస్వామి లేదా సుషుప్తభాగస్థుడు
Man Hole = మానవ రంధ్రం!
Brake Van = నిలుపు వాహనం

కానీ చివరిగా ఒక్కమాట. ఇతర భాషల కన్న తెలుగుభాష ఎంతో పరిపుష్టికరమైనది. కనీసం ఇతర భాషలకు తీసిపోదు. పాశ్చాత్య, తురుష్క భాషల ప్రభావంతో వేలకొలది పదాలు కొట్టుకొనిపోయ్యాయి. అలా మరుగున పడిపోయిన పదాలను పునరుద్ధరించవలసిన అవసరం ఎంతో వుంది!

—: o :—

# 21. న్యాయవాద ప్రహసనమ్

నాకొక సందేహం- అసలు ప్లీడరు అడ్వకేటు కోర్టు జడ్జి- వీటికి మనము వ్యవహరిస్తున్న తెలుగు పదాలు సరియైనవేనా అని! ప్లీడరు, అడ్వకేట్లను న్యాయ వాది అనటం అన్యాయం! సంస్కృతంలో 'ప్రాడ్వివాకుడు' 'అక్ష దర్శకుడు' అని వుంది. తెలుగులో 'తగవరి' అని వుంది. సంస్కృత పదాలు పామరులకు, సగటు మనిషికి నోరు తిరగవు అనుకుంటే తగవరి అని పిలవడం తగవు. లేదా వాదించువాడు కాబట్టి 'వాదకుడు' అనొచ్చు. అంతేగానీ, న్యాయవాది తప్పు. తప్పున్నర. ఒక న్యాయవాది కేసు గెలిస్తే ప్రతివక్ష న్యాయవాది అన్యాయ వాది కావాలి గదా!

అలాగే న్యాయస్థానం! గెలిచిన ప్రతి కేసులో న్యాయమే గెలిచింది అని గుండె మీద చేయి వేసుకుని చెప్పగలమా? పత్రికల్లో వర్ద ప్రతి రచన ప్రశంస నీయంగా వుందనగలమా? తిరిగొచ్చిన రచనల్లో ఎన్నో క్షేమగ్గా వుండొచ్చు. పత్రికల వారికి స్థలా భావము, అవగాహన లేమి, మొహమాటాలు ఎన్నో వుండొచ్చు. అలాగే న్యాయస్థానాలకు సాక్ష్యాధారాలే మూల స్తంభాలు. అమెరికా సుప్రీంకోర్టులో ఒక న్యాయవాది వాదిస్తూ "ఇది న్యాయస్థానం అని మనవి చేస్తున్నాను" అన్నాట్ట. వెంటనే న్యాయమూర్తి ఆలివర్ వాండెల్ హోమ్స్ "మీది పొరపాటు. ఇది కేవలం చట్టాన్ని పరిరక్షించే చోటు మాత్రమే!" అని సమాధానం చెప్పాట్ట. కాబట్టి వకీళ్ళ వాదనా పటిమను బట్టి సమయస్ఫూర్తిని బట్టి, మనోబలాన్నిబట్టి, 'మనీ'బలాన్నిబట్టి, నైతిక ప్రవర్తనలబట్టి-జడ్జిగారి మూడ్‌నుబట్టి అన్నిటికి మించి, వాదిప్రతివాదుల కర్మఫలాలనుబట్టి తీర్పులు వస్తుంటాయి! ఇంతకన్నా ఎక్కువ వ్రాస్తే నన్ను కోర్టు ధిక్కారణ నేరంక్రింద సత్కరిస్తారేమో? ఆ మీద నా 'రాతే' మారవచ్చు! అంచేత న్యాయస్థానం అనే బదులు 'తీర్పుల కార్యాలయము' అని పెట్టుకోవచ్చు గదా?

పోతే, జడ్జి, మున్సిఫ్ మేజిస్ట్రేట్‌లను "న్యాయమూర్తు"లంటున్నాము. వాళ్ళు కేవలం తీర్పరులే గదా!సదరు తీర్పులు ఇరవై నాలుగు వన్నెల బంగారం లాంటి తీర్పులైతే, క్రింది కోర్టులు, పై కోర్టులు, హైకోర్టులు, సుప్రీంకోర్టులు ఎందుకు? ఒక న్యాయమూర్తిగారి తీర్పు పై కోర్టులో తుడిచిపెట్టుకొనిపోతే మరి ఆయనగారు అన్యాయమూర్తి కావాలి. 'తీర్పరి' అంటే విమర్శకు తావు లేదు.

అసలు ఈ న్యాయస్థానాలంటే నాకు తెలుగు వ్యాకరణంలో సంధి ప్రకరణం స్ఫురణకు వస్తూంటుంది. తుది తీర్పువరకు సంధిగ్ధావస్థ! 'విజయం' వైకల్పిక సంధి! 'వ్యయం' నిత్య సంధి! మరి తీర్పుల్లో ఔవ్వంబు బహుళంబుగా నయ్యెడి!.

'న్యాయం' అంటే ఏమిటి? మర్కట కిశోర న్యాయం, మార్జాల కిశోర న్యాయం, ఘృణాక్షర న్యాయం. భ్రమర కీటక న్యాయం..ఈ న్యాయాలు వేరు. ఇక్కడ మార్చలేని 'ధర్మం'అనే అర్థం! వీటిని భగవంతుడు దక్క శాసనాలు మార్చలేవుగాక మార్చలేవు!

అలాగే సాంఘిక న్యాయం వేరు. శాసన న్యాయం వేరు. ఏటికి పొత్తు కుదరవచ్చు. కుదరక పోవచ్చు. రెండు మూడు దశాబ్దాల క్రితం వరకు ఎంత మంది పిల్లలను కన్నా అది న్యాయ విరుద్ధం కాదు. కానీ ప్రస్తుత సమాజ పరిస్థితుల్లో అది అన్యాయమే. పెళ్ళి మంత్రాల్లో "దశపుత్ర మాతరమ్' అని వుంది. ఇలా వధూవరులను ఆశీర్వదించితే, పోషించడం మా తరం సుతరామూ గాదు. "ఒకటి, రెండు మాత్రం" అని అంటారు!

సాంఘిక న్యాయం, ఒక విధంగా మానవ నైజానికి సంబంధించింది. అల్పుణ్ణి సంఘం అణగ ద్రొక్కుతూనే వుంటుంది. మేకను చంపుకొని లొట్ట లేస్తూ తినటం, పాముకు పాలుపోసి పూజించడం, మెత్తని వాడిని ఈసడించు కోవడం, "దుర్జనం ప్రథమం వందే" అన్నట్లు దుష్టుడికి భయపడి దూరంగా

వుండటం.... ఇది యింతే! ఎన్ని శాసనాలూ మార్చలేవు. మనిషి తత్త్వమే అంత. గాలిని చూడండి. అది చిరు దీపమును ఆర్పిపారేస్తుంది. అదే గాలి పెనుమంటను ఎగదోడి ఇంకా పెద్దగా చేసి కొంపలు కూలుస్తుంది! 'ఓ గాలీ! నీకు ఎంత మాత్రం సమదృష్టి లేదే? ఎంత పక్షపాతం'అని నిలదీసి అడగలేం!

మన శరీరం సంగతే తీసుకోండి. లోపల గుండె, ఊపిరి తిత్తులు, మూత్ర పిండాలు, చిన్న ప్రేవులు,పెద్ద ప్రేవులు-ఇలా అన్నీ పాపం, పరమ సాత్వికులు! మనం పీల్చే గాలిని, తినే తిండిని, త్రాగే నీటిని, శుభ్రపరచి మంచిని మాత్రమే స్వీకరిస్తాయి. కానీ, టోకుగా ఈ మన శరీరాన్ని శాసించి, నడిపించేది ఎవరు? చెడుకే తరచుగా తలవంచే మనస్సు! దేహం సంగతి ఇంతే. దేశం సంగతీ అంతే సుమండీ! కాదంటారా?

ఒక్క రౌడీ వెధవకు జడిసి అంగళ్ళన్నీ మూసేస్తారు- బంద్ పేరుతో! మొత్తం కాలేజీ అంతా ఇద్దరు, ముగ్గురు విద్యార్థుల నాయకుల చేతుల్లో వుంటుంది. వారికి చదువూ గ్రట్రా అక్కర్లా. జడులై, అలజడులు రేపడమే వారి పని. స్ట్రైకాయుధులు! ధర్నాయుధులు! అదృశ్యంగా వారికి అమాత్యుల అండదండలుగూడా ఉండొచ్చు! విద్యాధికారులకు వారంటే లోపల బెదురు! పాంచాల దేశమైన పంజాబును పటాపంచలు చేస్తూ అంచెలంచెలుగా దాదాపు దశాబ్దంనుంచి రావణకాష్ఠంగా, నిరాఘాటంగా రగిలిస్తూ దేశానికి, ప్రపంచానికి తలవంపులు తెస్తున్నది ఎవరు? కేవలం అల్ప సంఖ్యాకులైన టెర్రరిస్టులు గాదా! అయోధ్య గానివ్వండి. అస్సాం గానీయండి, అలజడులు సృష్టించబడే వారి సంఖ్య జనాభాలో ఎన్నోవంతు?

"సత్ప్రవర్తనంబు జయమును పొందునా
పరమధూర్త జనుల ప్రాంగణమున?"

లోకం తీరే అంత. ఈర్ష్య, క్రోధము మన విచక్షణా జ్ఞానంమీద దాడిచేసి ఓడిస్తాయి. వార్థక్యం వచ్చి మీదపడి మన అందాన్ని, మనోబలాన్ని, సహన

శక్తిని లోబరుచుకుంటుంది! కామవాంఛ తనదే పైచేయిగా చేసుకొని మనిషిని పశుప్రవృత్తిలోకి దింపుతుంది!

మరో విషయం. ఏది న్యాయం, ఏది అన్యాయం అని నిర్ధారించడం అంత సులభం కాదండోయ్! జీవహింస చేయరాదు అనే బౌద్ధమత న్యాయ సూత్రాన్ని తు. చ. ఆచరించియుంటే ఈ పాటికి మనుష్యజాతి అంతరించి, మూషిక సంతతి, మశక, మత్కుణ, వృశ్చికాది కీటక సమూహాలు రాజ్యమేలుతూ వుండేది! బుద్ధభగవానుడు భార్యనూ ముక్కు పచ్చలారని బిడ్డను వదలి, రాత్రికి రాత్రి పరారు కావటం ప్రాపంచిక దృష్టిలో పరమ అన్యాయం! ఆనాడు యశోధరమ్మగారు, బుద్ధునిపై దావా వేసి వుంటే బుద్ధదేవునికి శిక్ష పడటం, ఆమెకు భరణం మంజూరవటం ఖాయం! ఈనాటి డైపు ఉద్దండ న్యాయవాదులు అప్పుడు లేరల్లే వుంది!

భక్త రామదాసు ప్రభుత్వపు సొమ్మును స్వాహాచేసి గుడి కట్టించకుండా వుంటే మనకు రెండవ తిరుపతి అనదగ్గ క్షేత్రం దక్కియుండేదా? ఏటేటా దేవుని పేరుతో మోసాలు చేస్తూ, శ్రీరామ నవమి వుత్సవాల పేరిట చందాలు మింగుతూ పొట్ట నింపుకునే కుహనా భక్తుల జనాభా పెరిగియుండేదా అని అడక్కండి!

క్రిమికంఠుడనే రాజు విశిష్టాద్వైత మత స్థాపకుడైన భగవద్రామానుజుల వారిని బంధించి తెమ్మని ఆజ్ఞాపిస్తాడు. "నా విష్ణుః పృథివీపతిః" అని ఆనాటి న్యాయం. రాజాజ్ఞను ధిక్కరించటం-దైవాజ్ఞను ఉల్లంఘించటం ఒకటే. రాజ భటులు ఆయన్ను తీసికొని వెళదామని. వచ్చినపుడు కూరానాథుడు అనే శిష్యుడు 'నేనే రామానుజుడనని' పచ్చి అబద్ధమాడి రాజుగారివద్దకు వెళ్తాడు. రాజుగారు ఆయన రామానుజులే అనుకొని కళ్లు పీకెయ్యమని ఆజ్ఞాపించాడు. పాపం, కూరానాధుని కళ్ళు పీకెయ్యబడ్డాయ్ ఆ విధంగా అబద్ధం ఆడకుండా కూరానాథుడు నిజం చెప్పి రామానుజుల వారిని చూపించియుంటే మనకు ఒక మహోన్నత మత ప్రవక్త దక్కియుండే వాడా?

ఆంగ్లేయుల దృష్టిలో స్వాతంత్ర్యమునకు పూర్వం మన అల్లూరి సీతా రామరాజు, భగత్‌సింగ్, చంద్రశేఖర అజాద్, మున్నగు మన దేశవీరులు దేశద్రోహులు! ఇప్పుడు వారు మనకు చిరస్మరణీయులు! నిసలైన దేశభక్తులు!

జూదమాడటం నేరం. చట్ట విరుద్ధం. చిన్న చిన్న జూదగాండ్రను మన సర్కారు వారు లాకప్‌లో పెట్టి, జరిమానాలు వేసి, జైలునుంచి విడుదల చేసి, మళ్ళీ నెలసరి మామూళ్ళు, మామూలుగానే తీసికుంటూ కలకాలం వర్ధిల్లండి అంటూ దీవిస్తూనే వుంటారు!

మరి రేసుకోర్సులు జూదం కాదా?

"అశ్వమేధయాగ మలనాటిరాజులు
పూర్తిచేసి పరమ పూజ్యులైరి.
అకట - నేడు జనులు - అశ్వాలపై డబ్బు
పోసి, పోసి ఓడి - పూజ్యులైరి!"
త్వరగ పందెమొద్దె - తురగమ్ము - మున్ముందు
పరువుదీయునంచు వ్యసనపరుడు
పరువుదీసె వాజి - పరువెత్తజాలకన్
వమ్ముచేసె సొమ్ము వారువమ్ము!

ఆనాటి రాజులూ పూజ్యులే, ఈనాటి రేసుకోర్సు ఉన్మాదులూ పూజ్యులే. మరో అర్థంలో!

కాస్త లోతుగా ఆలోచిస్తే జీవితమే ఒక జూదం కాదా! సహధర్మ చారిణిని ఎన్నుకోడం జూదం! సంతానం ఒక జూదం. విద్యాలయాల్లో సీట్లు దొరకడం జూదం. పరీక్షల్లో ఉత్తీర్ణులు అవటం ఈ కాలంలో పక్కా జూదం. ఉద్యోగాల్లో ఇంటర్వ్యూలు జూదం! ఎన్నికలు జూదం! చివరకు ప్రయాణ సాధనాలన్నీ దైవాధీనంగా మారి గమ్యస్థానం చేరే విషయంలో జూదం!

బహుశః అందుకే. 'గీత'లో ద్యూతం ఛలయతా మస్మి' అని భగవంతు దన్నాడు!

న్యాయవాదుల మీద ఒక జోకు చెప్పి ముగిస్తా. స్వర్గానికి నరకానికి సరిహద్దు గోడ కూలిపోయి మరమ్మతు చేయించవలసి వచ్చిందట. శ్రీమన్నారాయణుడు యమధర్మరాజు దగ్గరకు వెళ్లి గోడలకు దెబ్బలు తగిలినవి మీ వైపు నరులవల్లనే రిపేరి ఖర్చులు మీరే భరించాలి అని సూచించాడు. యముడు గారు అదేం కుదరదు, మీరే పెట్టుకోవాలి. లేదా మనము ఉభయులము బ్రహ్మను గానీ మహేశ్వరుణ్ణి గాని అధ్యక్షులుగా పెట్టుకుని ఒక కమిషన్ను వేద్దాం. మన వాదోపవాదాలను ఆయనకు విన్నవించుకుందాం. న్యాయవాదులను కూడా పెట్టుకుందాం. ఆయన తీర్పును పాటిద్దాం! అన్నాడట. శ్రీ నారాయణుడు విని "నీవు చెప్పింది బాగానేవుంది. కానీ అలా అయితే విజయం నీదే వుండొచ్చు. ఎందుకంటే. మా స్వర్గలోకంలో బాగా వాదించే న్యాయవాదులు, కనీసం జూనియర్లు కూడా లేరు. భూలోకం నుంచి వచ్చిన న్యాయవాదులంతా మీలోకంలోనే స్థిరపడిపొయ్యారే" అని ననిగాడట— జోకే సుమండీ! అర్థం కాలేదా? అయితే ఐక్యూ లో లోపము ఉండొచ్చు! ఆలోచించండి!

—: ० :—

# 22. ఉచిత ప్రహసనము

''పాల సాగరమున పవ్వళించిన సామి
గొల్ల యిండ్ల పాలు కోర నేల?
ఎదుటివారి సొమ్ము ఎల్ల వారికి తీపి
విశ్వదాభిరామ - వినురవేమ!''

ఒక ఆసామీ రైలు ప్రయాణము చేస్తూన్నాడట. తను దిగవలసిన స్టేషను వస్తూంది. రైలు దిగిపోతూ టికెట్ ఎగ్జామినర్‌తో ''బాబూ, నా లగేజీ ఇప్పించండి, త్వరగా వెళ్ళి బస్సు కూడా అందుకోవాలి'' అన్నాట్ట

''నీ లగేజి నా దగ్గర ఎక్కడుందయ్యా?"అని కొశ్చన్ మార్కు ముఖం పెట్టాట రైల్వే ఉద్యోగి.

అక్కడ బోర్డు చూపిస్తూ ''యాభై కిలోల లగేజీ ఉచితముగా తీసికొని పోవచ్చు అని వ్రాశారు గదండీ! దూర ప్రయాణికులకు ఇదేదో ప్రోత్సాహక బహుమతి అనుకున్నా. త్వరగా ఆ లగేజి ఏదో ఇప్పించండి. మీ పుణ్యం వుంటుంది" అని అడిగాడట ఆసామీ!

తేరకు వచ్చే సొమ్ముకై ఎగడటం మన బలహీనత. మానవ బలహీనత అంటే మరీ బాగుంటుంది. తన కలాంటి బలహీనతలు లేవు అనేవాడిని కాస్త అనుమానించాల్సిందే. ఫలానా హోటల్లో ఇతర హోటళ్ళకన్నా రేట్లు పావలా అర్ధ తక్కువ అంటే ''సెల్ఫు సర్వీసు'' అయినా అక్కడ 'క్యూ' ఏర్పడక పోతే ఒట్టు! ఈ బలహీనతే సగంపైగా వ్యాపారస్తుల పెట్టుబడి! వారి ఆస్తులు పెరిగే కిటుకు!

మా మిత్రుడు సుబ్బారావున్నాడు. వాడింట్లో కప్పులు, సాసర్లు, మగ్గులు, బక్కెట్లు, స్పూన్లు, ఇలాంటి ఎన్నో సామాన్లు, "ఫ్రీ గిఫ్ట్"ల బాపతే. వాడి లెక్కెక్కే వేరు. ఏయే వస్తువులు కొంటే ఫ్రీ గిఫ్ట్‌లు, ఎయే సీజనులలో ఇస్తారో, వాటికి ముగింపు తేదీ ఎప్పుడో ఆ వివరాలు టి.వి., రేడియో, పత్రికల ద్వారా శ్రద్ధగా తెలుసుకొని లాభార్జనా యజ్ఞంలో నిమగ్నుడౌతాడు ఆ లాభాన్ని ఇతరు లెక్కడ కొట్టేస్తారో అనే కుళ్ళుతో ఫ్రెండ్స్‌కు చస్తే చెప్పడు! అంతటి నిస్వార్థపరుడు మా సుబ్బారావ్! అసలేనేనొక సంశయాత్మను. 'డౌటింగ్ తామస్'ను అని ఒప్పేసుకుంటా. ఈ ఫ్రీగిఫ్ట్‌ల వ్యవహారాల్లోకి పోను గాక పోను! నాణ్యతలోనో, రేటులోనో మరెక్కడనో మడత పేచీ. లోసుగు ఉంద నిదే వినియోగదారునిపై ప్రేమ ఒలకపోసే వెర్రి వెంగళప్పలు వ్యాపారులు కారని నాకు దృఢాభిప్రాయం.

అయితే నేం? నేనుకూడా రామేశ్వర యాత్రలో టోపీ పెట్టించుకున్నా- మాంచి కుచ్చు టోపీ!

రామేశ్వర యాత్రకు రైల్లో వెళ్తున్నాము. ఒక కుర్రాడు నాకు మదురై నుంచే తారసిల్లాడు. పట్టుమని పన్నెండు, పదమూడు నిండని చురుకైన కుర్ర వెధవ. "మీకు రామేశ్వరంలో సత్రం ఉచితంగా ఇప్పిస్తాం. అన్ని గుళ్ళు గోపురాలూ చూపిస్తాం. తీర్థాల్లో స్నానాలు చేయిస్తాం. పురోహితులతో, మీ సంప్రదాయ ప్రకారం మంత్రోక్తంగా పిండ ప్రదానం చేయిస్తాం. (దానికి మాత్రం కొంచెం రుసుము చెల్లించుకోవాలట) అంటూ బీమా యేజంటులాగా తగులు కొన్నాడు. వాడికీ పది భాషలు ధారాళంగా వచ్చు. నా కెంతో ముచ్చట వేసింది. పాపం, కుర్రాడు కష్టపడి, తన పొట్ట తాను పోషించుకుంటూ తలితండ్రులను కూడాఆర్థికంగా ఆదుకుంటున్నాడుకదా అని మురిసిపోయ్యా. వాడిని దగ్గరికి తీశా. తెలుగు పలుకు వినగానే మెత్తబడ్డా. అదే మన బల హీనత! సత్రము ఉచితమే గదా! రెండ్రోజులకు అరవై, డెబ్బై రూపాయలు అయినా మిగులుకదా! వేరే వాడు మనల్ను ఉద్ధరిస్తాడా అని వాడు చూపించిన

సత్రంలోనే దిగాం. సామాను గట్రా సర్దుకొని, స్నానాలు ముగించుకొని, బట్టలు మార్చుకొని, సేద దీర్చుకొని, హమ్మయ్య అనుకున్నాం. రాత్రి పది గంటలకు సత్రం యజమాని ప్రత్యక్షం అయ్యాడు. ఆ వేళకాని వేళలో రావటమే ఆయనగారి మొదటి వ్యాపారాస్త్రం! నొసలు కన బడకుండా విబూతి రేఖలు. కుంకుమ! వేద పండితుని వేషం! ఆయనగారు అమలాపురం తెలుగువాడట!

అయిదు దశాబ్దాల నుండి రామేశ్వరంలోనే స్థిరపడి 'పోయాడు.' కాదు ఉన్నాడు! ఆయన చేతి క్రింద ఇరవైమంది పురోహితులు. అన్ని భాషలు తెలిసినవారు జీతానికి పని చేస్తున్నారు. సరే. శాస్త్రోక్తంగా సముద్రస్నానం చేయించి, అన్ని గుళ్లూ, తీర్థాలూ చూపించి, మంత్రోక్తంగా స్నానాలు చేయించేందుకు మూడొందలు అవుతుందన్నాడు. (ఇది 1984 రేటు!) మీకు సమ్మతమైతేనే. లేదా మీరు వేరే లాడ్జికి నిరాక్షేపణగా వెళ్ళొచ్చు. మీ యేర్పాట్లు మీరు చేసుకోవచ్చు అని ధీమాగా ముక్తాయించాడు. అసలే ముసలి ప్రాణులం. వేళకు తిండిలేక దూరప్రయాణంలో అలసిపొయ్యాం. భాష రాదాయె. మన తెలుగువాడు కదా అవి అనుకున్నాం. ఎలాగైతేనేం,అరగంట బేరం చేసి. ఇచ్చేదబ్బు మన తెలుగువాడికే కదా అని మనసును బుజ్జగించుకొని, రెండొందల యాభైకి తీర్మానం చేసికున్నాం లాడ్జి ఖర్చు మిగిలిందని చంకలు గుద్దుకున్నానే కానీ, దానికి ఇబ్బడి పురో 'హితుడు' దయా 'రహితుడై' దండుకుంటున్నాడని ఆలస్యంగా గ్రహించా. తర్వాత తిరుగు ప్రయాణంలో, క్రితం రోజు కుర్రాడు కనిపిస్తే కేకలేశా. ఏం లాభం? వాడేం తక్కువ తిన్నాడా? "అయ్యా! మాది సముద్రతీరం. గాలం వేసి చేపలను పట్టడమే మా వృత్తి' అని వ్యంగ్యోక్తి విసిరాడు! సదరు పురోహితునికి మద్రాసులో నాలుగు మేడలున్నాయని తర్వాత తెలిసింది!

యత్ర యత్ర ఉచిత ప్రకటనా, తత్ర తత్ర 'కుచ్చిత' ప్రహసనమ్ ఉందని ఊహించి వాటి జోలికి వెళ్ళకుండా ఉండటమే ఉచితం!

ఈ ఉచిత ప్రకటనలను చూచి, చూచి మా ఫ్రెండు వితండేశ్వరరావు వ్యంగ్యమైన అర్థాలతో కొన్ని నమూనా ప్రకటనలు తయారు చేశాడు. సరదాకే సుమండీ! చిత్తగించండి.

"సువాసనలు విరజిమ్మే మా హేరాయిల్ రెండు సీసాలు కొన్నవారికి స్త్రీలకు ఒక్క సవరము, పురుషులకు ఒక హేర్‌డ్రై ఉచితం! త్వరపడుడు. ఈ స్కీము నెలాఖరు వరకే."

"మా ఏర్‌కూలర్ కొన్నవారికి నాలుగు వట్టివేళ్ళ విసనకర్రలు, సీలింగ్ ఫాన్ కొన్నవారికి రెండు మామూలు విసనకర్రలు ఉచితం ఈ స్కీము మొదటి రెండు వందల మంది కొనుగోలుదారులకే."

"మా సెలూన్‌లో గడ్డము చేయించుకొన్నవారికి రెండుప్లాస్టర్లు ఉచితము. ముగ్గురు క్రాపు చేయించుకున్న సంవత్సరంలోపు పిల్లవానికి గుండు ఉచితం."

"మా ఇంట్లో అద్దెకుండువారు ముందుగా అడ్వాన్సు చెల్లించనక్కర లేదు. అద్దెకుండు వారిపై మాకు సంపూర్ణ విశ్వాసమున్నది. వారికి సంవత్స రానికి ఒకసారి రెండు దోమతెరలు, ఒక కిలో పందికొక్కుల మందు, రెండు ప్లాస్టిక్ బక్కెట్లు ఉచితంగా ఇస్తాము. ఇల్లు ఖాళీ చేయునప్పుడు బక్కెట్లు మాత్రమే వాపసు చేయవలసి యుండును."

"త్వరపడుడు, మా వద్ద విదేశీ సాంకేతిక నిపుణులచే తయారు చేయించబడిన గుర్రపు నాడాలు కలవు. వంద నాడాలు ఒకేసారి కొనువారికి ఒక ఘోడా ఉచితం!"

"మా లాడ్జిలో నెలరోజులు హనీమూన్ జరుపుకున్న నూత్నదంపతులకు అద్దెలో ఇరవై శాతం రిబేటు, ఒక ఆకర్షణీయమైన ఊరసాల బహుమతి!"

"ప్రతి ఇంజక్షనుకు ఒక పూటమందు ఉచితం. ప్రతి మూడు ఇంజక్షనులకు ఒక అదనపు ఇంజక్షను ఉచితం. ప్రతి ఎక్సురేకు తిరిగి ఇల్లు చేరేందుకు ఆటో"ఉచితం అని క్రొత్తగా ప్రాక్టీసు పెట్టే డాక్టరుగారు 'బోర్డు' పెట్టాడట!

ఇవన్నీ ఒక ఎత్తు. మొన్న చీరల షాపువాడు తగిలించిన బోర్డు ఒక ఎత్తు

"అమ్మాయిలూ, అమ్మలూ, అరగంటలో షాపింగ్ పూర్తి చేసిన వారికి ఒక బ్లౌజ్ ఉచితం.పావు గంటలో పూర్తిచేస్తే రెండు బ్లౌజులు ఉచితం!"

పోతే, ఏదో ఒక వస్తువంటూ ఉచితంగా వస్తుంది కాబట్టి కొంతవరకు సరిపుచ్చుకోవచ్చు. ఇంకొక రకం ఉచిత వ్యవహారం ఉంది. అది ఘరానా దోపిడీ. కొండొకచో వషట్కారాలు! పైకి అనలేము. లోన కుములుకోవాల్సిందే! బందుగులను రాబందులుగా రచయితలు అప్పుడప్పుడు పోలుస్తూనే వుంటారు. అందరూ వాటిని చదువుతూనే వుంటారు. కానీ, వాళ్ళ పద్ధతులు మాత్రం అంతే. పరివర్తన చెందవు.

ఇటీవల మా యింటికి కొంతమంది వచ్చారు గృహస్థధర్మం గదా అని మన తాహతు కొద్దీ ఆతిథ్యం ఇస్తాం అంతటితో సరిపెట్టుకుంటారా! వాళ్ళ బాబు సొమ్ము మనింట్లో డిపాజిట్ చేసినట్లు "ఒకసారి మీ స్కూటరిస్తారూ, కొంచెం ఆబిడ్స్ దాకా వెళ్ళొస్తా" అని స్వతంత్రంగా అడిగేస్తారు మొదటిసారి గదా అని మొహమాటపడి ఇస్తాం. మొత్తం నగర ప్రదక్షిణ చేసి, వీలుంటే గోల్కొండ కోట కూడా చూచి, పెట్రోలు కూడా పోయించకుండా ఇంట్లో పెడతారు. పైగా స్కూటరుకు ఆ స్పేర్ పార్టు మార్పించాలి. ఈ స్పేర్ పార్ట్ మార్పించాలి అంటూ శ్రేయోభిలాషుల్లా అయాచిత సలహా పారేస్తారు! "వదినెగారూ! ఈ రెండు బట్టలూ మీ పని మనిషితో ఉతికించండి" అని మొహమాటం లేకుండా అడిగేస్తారు. మనం బట్టలుతికించడానికి ఏర్పాటు చేసుకో కున్నా ఆ పని చేసి సర్ఫ్, సబ్బు బిళ్ళలూ అరగదీసుకోవాల్సిందే!

ఇదిగో, సుబ్రావ్! ఈ అడ్రస్ ఎక్కడుందో కాస్త చెప్తావ్? అని అడుగుతారు. చెప్పామో అంతటితో అధ్యాయం ముగుస్తుందా? నీవు ఆఫీసుకు వెళ్ళేటప్పుడు అటువైపు నన్ను డ్రాప్ చేస్తావా? అని అధికార స్వరంతో అడిగేస్తారు. మనకు చచ్చే మొహమాటం అని వాళ్ళు ముందే పసిగడతారు! ఇంట్లో ఫోనుంటే ఇహ మన పని ఖాళీ! ఆ ఫోనుకు టెంపరేచరు వస్తుంది. బిల్లు చూచుకొని మనకూ!

వాళ్ళదేంబోతుంది, అన్నీ రాజభోగాలూ ఉచితంగా లభ్యం అవుతున్నాయా య! కొంచెం విసుగును ప్రదర్శించామో- వెళ్ళక వెళ్ళక వెళ్ళితే సరిగా విచారించరని ప్రచారం చేస్తారు!

ఇంకొంత మంది "అన్నట్లు మీరేవో పుస్తకాలు వ్రాశారనీ, అచ్చు అయ్యాయనీ గవర్నమెంటు వారు డబ్బు కూడా ఇచ్చారనీ విన్నా, మీరు రచయితలని నాకు తెలియనే తెలియదు సుమండీ! నాకూ సాహిత్యమంటే బోలెడంత అభిరుచి" అంటారు. కొంటారా అంటే అబ్బే అదేం లేదు. ఇదంతా కాంప్లిమెంటరీ కాపీలకు కక్కుర్తి.

ఇది 'పుకట్' తంతు ద్వితీయ భాగం.

వేమన చెప్పింది ఏ యుగంలోనైనా అబద్ధం కాదనేది 'వేము' నిజం! హాస్యామనిజం గూర్చి వేమనిజం చెప్పినట్లు ఎవరూ చెప్పలేదు.

—: o :—

# 23. నీతి సూక్తులు–నేత సూక్తులు

"అర్థానాం అర్జనే దుఃఖమ్-అర్జితానాంచ రక్షణే
ఆయే దుఃఖమ్ - వ్యయే దుఃఖం- కి మర్థం దుఃఖభాజనమ్?"

అని ఒక నీతి సూక్తి. ఏ గ్రంథంలోనిదో, గ్రంథకర్త ఎవరో నన్న డక్కండి. తెలీదని ఒప్పేసుకుంటా. నదీ మూలం ఋషి మూలం రహస్య మన్నట్లు, ఇలాంటివీ ఆ బాపతే. ఎవరో ఒకరు వ్రాసి ప్రజల్లోకి పాకిస్తారు. అది అలా అలా చలామణి అవుతుంది కాదంటే కొన్ని కాలాంరిష్టాలకు తట్టుకో లేవు. మరికొన్నింటికి ఆయువు తక్కువ. కొన్ని బహుశః మంచి ఘడియలో పుట్టినవి చిరంజీవులౌతాయి.

సరే. డబ్బును సంపాదించాలంటే దుఃఖమట. రక్షించడం దుఃఖమట. వస్తే దుఃఖము. పోతే దుఃఖము. ఈ దుఃఖ కారకమైన ధనం ఎందుకు? అని వేదాంతం బోధిస్తారు! ఈ శ్లోక కాలంలో ఇప్పటిలాగా. బాంకులు, స్విస్ బాంకులూ, కంపెనీలు, షేర్లు గట్రా ఉన్నట్లు లేవు అందుకనే 'అర్జితానాంచ రక్షణే' అని వ్రాశారు. ఏ రహస్య స్థలాల్లోనో లంకెబిందెలోనో పెట్టేవారు. అవి దక్కకుండా పోతాయేమో అనే భయం పీక్కుతింటూండేది!

ఇలాంటి నీతి సూక్తులను క్రోడికరించి, అచ్చువేయించి పబ్లిషర్లు నేటికీ డబ్బు దండుకుంటున్నారు! ప్రెస్సు వాళ్లూ అర్థం ఆర్జిస్తూనే వున్నారు. హరికథ భాగవతార్లూ తమ తమ హరికథల్లో (హరకథల్లో కూడా) అడపాదడపా ఇరికించి అర్థం ఆర్జిస్తూనే వున్నారు. వేదాంతులూ మత ప్రవక్తలూ ఆ పనే, అదే అర్థం ఆర్జించే పనే, చేస్తూనే వున్నారు! చిత్రం, చిత్రం యీ రచనల్లో అసలు ధ్యేయం కూడా అదే అని మీరనవచ్చు!

ఇంగ్లీషులో 'కాపిటల్ పనిష్‌మెంట్' అంటే మరణశిక్ష అని అర్థం. పైనీతి సూక్తి ప్రకారం 'అర్థం' అనగా 'కాపిటల్' కల్గియుండటమే ప్రబల శిక్ష! శ్రీరాముల వారు ఎవరో నేరస్థునికి దేవాలయ ధర్మకర్త ఉద్యోగమిచ్చి శిక్షించండని ఉత్తర్వులు జారీ చేశారట. "అదేమిటి మహా ప్రభో! అంటే ధర్మకర్తలు దేవుని సొమ్ము తింటారనీ, ఆ తిన్న పాపానికి మళ్ళీ దరిద్రుడుగా పుట్టుతారనీ 'దరిద్రదోషేన కరోతి పాపం, పాపాదవశ్యం నరకం ప్రయాతి పునః దరిద్ర పునరేవ పాపీ' అని విశదీకరించారట. ఒకవేళ ధర్మకర్త నిప్పుగా, నిజాయితీగా వుంటే?! ఏది యేమైనా, శ్రీరాముల వారి అడుగుజాడల్లోనే మన దేశాధినేతలు నడుస్తున్నారు. అందుకే అస్మదీయ వర్గులకు కార్పొరేషనులలోనో, విధాన సభలలోనో ఉన్నత పదవుల నంటగట్టి, ఊరేగండి అంటున్నారు!

ఇటీవల ప్రభుత్వోద్యోగులు జీతాల పెంపుదలకై ధర్నా చేస్తుంటే ఒక అతి తెలివి ముఖ్యమంత్రిగారు 'ఈ అర్థానాం ఆర్జనే దుఃఖం....' శ్లోకం చెప్పి ఉద్యోగవర్గాల్ని ఉపశమింపజేయ ప్రయత్నించారట!

నిరాహార దీక్షలో వున్న ఆ ఉద్యోగ ప్రతినిధులు మాత్రం తక్కువ తిన్నారా? వారు అమాత్యవర్యా!.

"మాతానిందతి నాభినందతి పితా
భ్రాతా నసంభాషతే, భృత్యః కుప్యతి
నానుగచ్ఛతి సుతః కాంతాపి నాలింగతే
అర్థ ప్రార్థన శంకయా న కురుతే సల్లాపమాత్రం సుహృత్
తస్మాత్ అర్థ ముపార్జయ శృణుసఖే అర్థేనసర్వేవశాః"

అనే శ్లోకము కోట్ చేసి మంత్రిగార్ని ఇరకాటంలో పెట్టారు మంత్రిగారు సెక్రటరీ వైపు చూచి "ఈ శ్లోకం గ్రంథకర్త ఎవరు, ఏ గ్రంథం లోనిది? అని ప్రశ్నించారట.

"ఏమో తెలియదండి. మా అబ్బాయి తెలుగు క్లాసు పుస్తకంలో నేనూ చూచా. అది ఎప్పుడో రాజుల కాలం నాటి శ్లోకమయ్యుండొచ్చు" అన్నారు సెక్రటరీ.

ముఖ్యమంత్రిగారు "రాజులు పొయ్యారు. ఈ ప్రజాస్వామ్య ప్రభుత్వంలో ఇలాంటి పెట్టుబడిదారీ తత్వాన్ని తెలిపే పాఠ్య భాగాల్ని తొలగించ" మని విద్యామంత్రిని ఆదేశించారట

సెక్రటరీగారు "ప్రభుత్వం వారు చాలినంత డబ్బు లేక అయిదేళ్ళ నుండి పాత పాఠ్యగ్రంథాలనే లాగించేస్తున్నారండి. ఇప్పుడు కొత్త పాఠ్య గ్రంథాలను అచ్చువేయించాలంటే ఇటు ప్రభుత్వానికీ డబ్బు అవసరం. అటు విద్యార్థులకూ డబ్బు అవసరము. ఒక విధంగా డబ్బు అవసరాన్ని చాటే ఆ రెండో శ్లోకము ఈ కాలంలో కరక్టేమోనండి!" అని సవినయంగా మనవి చేశాట్ట! ముఖ్యమంత్రిగారు విని ఈ విషయాలన్నీ కూలంకషంగా చర్చించి తుది నిర్ణయం చేయటానికి ఒక ప్రత్యేక కమిటీని వేశారట! అక్కడికి కథను కంచిలో వదలిపెడదాం. కాదంటే హుస్సేన్‌సాగర్‌లో పారేద్దాం!

మరి కాసేపు సుత్తికొట్టనిస్తే, ఒకటి రెండు కాలం చెల్లిన శ్లోకాలు చెప్తా.
స్త్రీణాం ద్విగుణ మాహారో
బుద్ధిశ్చాపి చతుర్గుణమ్
సాహసం షడ్గుణం చైవ
కామం అష్ట గుణం ఉచ్యతే" అన్నారు.

ఈ శ్లోకము కొంతవరకు ఒప్పుకుందాం. కానీ ఇంగ్లీషు మీడియంలో పదో తరగతి వెలగబెట్టే మా అయిదో మనుమడు ఒక తర్కాన్ని లేవదీశాడు.

"నశ్యత్వ నాయకం కార్యం,
తథైవ శిశునాయకం
స్త్రీ నాయకం, తథోన్మత్త నాయకం
బహునాయకం"

స్త్రీ నాయకత్వం, శిశునాయకత్వం, ఉన్మత్త నాయకత్వం బహునాయకత్వం- వీటివల్ల హాని అని అన్నారే. మరి ఒక శ్లోకంలో నాలుగురెట్లు బుద్ధి, ఆరు రెట్లు సాహసం పురుషులకన్న స్త్రీలకు ఉంటుందని అర్థం గదా. అలాంటి స్త్రీలు నాయకత్వానికి ఎందుకు అర్హులుగారు? మార్గరెట్ థాచర్, ఇందిరా గాంధి, బండారు నాయకే మహోన్నత శ్రేణికి చెందిన నాయకీమణులుగా చరిత్ర చాటిందే, ఈ రెండు శ్లోకాలు పరస్పర విరుద్ధంగా లేవూ? అని ఎదురు ప్రశ్న వేశాడు.

అదీగాక, "స్త్రీణాం ద్విగుణ మాహారో" అనేది కూడా శుద్ధ అబద్ధం. స్త్రీ పురుషులకు ఆకలి, ఆహారం, ఉద్రేకం ఇవన్నీ సమానమే. స్త్రీలు తమ పిల్లల కోసం, భర్త కోసం ఆహార విషయంలో కొంత త్యాగానికైనా సిద్ధపడే మనస్తత్వం కలవారు!

ఇలాగే ఎవరికి తోచినట్లు వారు చెప్పి సగటు మనిషిని తికమక పెట్టారు. ఒకచోట 'శుభస్య శీఘ్రమ్' అంటారు. మరొక చోట ఆలస్యం అమృతం విషం అంటారు. నిదానమే ప్రధానం అంటారు. పోనీ వీటిని సమయానుకూలంగా అన్వయించుకోవచ్చు

'అభుక్త్వామలకం పథ్యం
భుక్త్వాతు బదరీ ఫలమ్
కపిత్థం సర్వదా పథ్యమ్
కదళీ న కదాచనయేత్

ఉసిరిక, రేగు, వెలగ పండ్లకు మార్కులిచ్చి, అరటి పండును ఎందుకు నిషేధించారో తెలియదు. ఆధునిక వైద్యులు అరటిపండు చాలా మంచిదంటున్నారే!

మరొక చోట 'ఔదుంబరాని పుష్పాని శ్వేత వర్ణంచ వాయసమ్ మత్స్య పాదం జలేపశ్యే ననారీ హృదయ స్థితమ్' అన్నారు.

మేడిపూలు, తెల్లకాకులు, చేపకాళ్ళు- వీటిని చూచుట సాధ్యమేమోగానీ స్త్రీ హృదయం తెలుసుకొనుట దుర్లభము అని అర్థం.

రహస్యాలను దాచియుంచుకోవడంలో గానీ బట్టబయలు చెయ్యడంలో గానీ స్త్రీ పురుష విచక్షణ ఎందుకో అర్థం కాదు మరొకచోట ఆడువారికి ధర్మ రాజు శాపం అంటగట్టారు. ఆడువారి నోట్లో రహస్యాలు దాగకుండుగాక అని. మన రాజకీయ నేతల హృదయాలు మాత్రం తెలుసుకోగలుగుతున్నామా? వారు చెప్పేదొకటి, చేసేది మరొకటి, అనుకునేది ఇంకొకటి కాదా? అభి ప్రాయాలు మనస్సులో పుట్టుతాయనీ, హృదయానికి సంబంధం లేదనీ సైన్సు చెప్తుందాయె!

ఇలా చెప్పుతూ పోతే చాలా వున్నాయి. మన పవిత్ర భారత రాజ్యాం గాన్ని దాదాపు అరవై నాలుగు సార్లు మార్చివేయగల స్తోమతగల మన దేశాధి నేతలు ఇలాంటి పరస్పర విరుద్ధ శ్లోకాలనూ, కాలం చెల్లిన శ్లోకాలను ప్రచు రించకుండా ఎందుకు నిషేధించటం లేదో అని నాకనిపిస్తుంది.

మా వితండేశ్వరావును అడిగా.

"ఆ వాళ్ళ మొహం! వాళ్ళకేం తెలుసు? వారికి తెలిసిన విద్య ఏ యెండకా గొడుగు పట్టడమే; అమాయక ప్రజల ఓట్లు రాబట్టడమే!" అన్నాడు.

"అదేమిటి" అన్నా.

"చూడు బాబూ! ఈ రాజకీయ వేత్తలు ఈ వేళ ఎక్కడో మహా యజ్ఞం జరుగుతూందంటే అక్కడికి వెళ్ళి 'అన్నీ మన వేదాల్లో వున్నా'యని వేదాల

ఉత్కృష్టతను గూర్చి వేనోళ్ళ ఉపన్యసిస్తారు. మరురోజే విజయవాడలో 'హేతువాద మహాసభ'లకు ప్రారంభోత్సవం చేసి, మూఢాచారాలు తొలగిపొయ్యేదాకా మన దేశం ప్రగతి సాధించదని ఘోషిస్తారు!

ఒకచోట కులనిర్మూలన సంఘానికి ప్రారంభోత్సవము జరుపుతారు!

మరొకచోట వీరశైవ విద్యార్థుల హాస్టలుకు పునాది రాయి వేస్తారు. రిజర్వేషన్లుండాలి అంటారు!

ఇంగ్లీషును ప్రపంచ భాషగా గుర్తిస్తూ బ్రహ్మాండంగా సమర్థిస్తూ ఇంగ్లీషులో ఉపన్యసిస్తారు. మరోసారి ప్రభుత్వం ప్రజల భాషలో నడవాలనీ ప్రాంతీయ భాషలు అభివృద్ధి చెందాలనీ పొలికేకలు పెడుతూ తమ పుత్రరత్నాలను పబ్లిక్ స్కూళ్ళకో విదేశాలకో పంపుతారు!

పురుషులకు మూడు నాలుగు పెళ్ళిళ్ళను గూడా సమర్థించే కవిసమ్రాట్ల సంస్మరణ సభలో పాల్గొని, ఫలానా వాడు మహోన్నత కవి అని పొగడుతారు. అదే నాలుకతో స్త్రీ జనాభ్యుదయానికి అవిరళ కృషి చేసిన వీరేశలింగం వర్ధంతిలో ఆయన్ను ఆకాశానికి ఎత్తుతారు.

దేశమును ప్రేమించుమన్నా అన్న గురజాడ వారి అడుగుజాడల్లో మనము నడుచుకోవాలి అంటారు వారి పుత్రులు, పౌత్రులు విదేశాల్లో గ్రీన్ కార్డ్ ధారులై, డాడీ మమ్మీ యాయా సంస్కృతిలో మునిగిపోయివుంటారు!

పరమ నాస్తికులైన మహా కవులను, భాగవత కర్త పోతనను, భక్తాగ్రేసరులైన వాగ్గేయకారులను సమ దృష్టితో చూడ కలిగిన స్థితప్రజ్ఞులు మన నేతలు!

భారతీయ వైద్య సంప్రదాయాలను సమర్థిస్తారు. ఆయుర్వేద, యునానీ, హోమియోపతీ విధానాలను తెగ పొగడుతూనే వుంటారు. కంటి ఆపరేషనుకు-కణితి ఆపరేషనుకు కూడా అమెరికాకు ప్రభుత్వ ఖర్చులతో పరుగులు దీస్తారు!

అహింసావాదాన్ని ప్రబోధిస్తూ భగవంతుని ఉనికి విషయం మౌనం వహించిన బుద్ధుని గూర్చి ఉపన్యసిస్తూ 'ఆయనగారి' బోధనలు ఈనాటికీ శిరోధార్యాలు అంటారు.

ఆ మతాన్ని ఆమూలాగ్రం ఖండించి మన దేశం నుండి పారద్రోలే వరకు నిద్రపోక అద్వైత మతాన్ని స్థాపించిన ఆది శంకరుల వారిని గూర్చి అంతకన్నా అనర్గళంగా ఉపన్యసించి 'ఆయన ఆనాటికీ, ఈనాటికీ, ఏనాటికైనా మార్గదర్శకుడే' అంటారు.

ఏ మత ప్రవక్త సూక్తులు శిరోధార్యాలు కావు? ఏ మత ప్రవక్త అబద్ధాలాడమనీ అన్యులను ఏడిపించుకొని తినమనీ ఆస్తులను ఆభరణాలనూ ఆర్జించి అనుంగు పుత్రులకు ఇవ్వమనీ చెప్పడు గాక చెప్పడు! విగ్రహారాధనను ఈసడించుకునే ఆర్య సమాజ మతమునూ ప్రస్తుతించగలరు. విగ్రహారాధనను వ్యాపింపజేసే హరేకృష్ణ మతమునూ ప్రశంసించగల అపర ఆదిశేషులు!

బసవేశ్వరుని గూర్చి చెప్పినా, జీసస్ మత ప్రవక్తను గూర్చి చెప్పినా, రామానుజుల వారిని గూర్చి చెప్పినా, రజనీష్‌ను గూర్చి చెప్పినా పేరు మాత్రమే మార్పు. అదే నోటితో ఎన్ని స్వరాలనైనా పలికించగల ఘటనా ఘటనా సమర్థులు!

అన్నిటికన్నా చిత్రమేమిటంటే - పాపం, వారికి ఏ ఒక్కరిని గూర్చి క్షుణ్ణంగా తెలియకపోవడం! తెలియదు అనే విషయం కూడా తెలియదు. తెలియని విషయం తెలుసనుకుంటారో తెలియదు! అధికార పీఠ మెక్కగానే "సెల్ఫుకాన్ఫిడెన్సు" ఎక్కువై, శిరః ప్రమాణం చిన్నదైపోతుందో ఏమో!

అన్ని రంగాల్లోనూ, అన్ని విషయాల్లోనూ తల దూరుస్తారు! స్వార్థబుద్ధితో ఆహ్వానించేవారు ఆహ్వానిస్తారు. అది సంగీత సభ గానివ్వండి, సాహితీ సభ గానివ్వండి, నృత్య కార్యక్రమం కానివ్వండి, ఇంజనీరింగ్, మెడిసన్, ఏ సబ్జెక్టైనా సై, అంటే సై అనగలిగే సర్వజ్ఞత్వం సంప్రాప్తిస్తుందేమో!

కాబట్టి రాజకీయ నేతలు ఏ పాపం యెరుగరు. వారికి ఓట్ల తాపత్రయం దప్ప మత త్రయము, కవి త్రయము, దండ త్రయము, గుణ త్రయము, మూర్తి త్రయము - వీటిని గూర్చి తెలుసనుకోడం మన భ్రమ!

అసలు విషయానికొస్తా, ఆ నీతి సూక్తులు నిన్నేంజేస్తున్నాయి? వాటిని మనము, మన కొరకు సమయానుకూలంగా వాడుకుంటున్నామే గానీ పాటిస్తున్నామా చస్తున్నామా? అదీగాక, వంద నీతి సూక్తుల కన్నా ఒక నాతి సూక్తి మిన్న అన్నది నేటి నీతి సూక్తి! వస్తా! అర్జంటు పని మీద వెళ్తున్నా అని జారుకున్నాడు వితండేశ్వరరావు.

—: o :—

# 24. కుక్కలున్నాయి – జాగ్రత్త!

"మా వ్రజత వి స్రంభ మేషాం
బహు చాటు కర్మ నిపుణానామ్
నిర్వ ర్తిత కార్య పరాఙ్మ ఖావాం
శునకా మివ ఖలానాం"

ప్రాకృత భాషలో నున్న గాథాసప్తశతిలోని ఒక సూక్తికి ఒక సంస్కృత కవి చేసిన అనువాదం పై శ్లోకం. "దుర్మార్గులు ఏవేవో తియ్యని కల్లబొల్లి మాటలు అల్లి చెప్పటంలో నిపుణులు. అలా చెప్పి తమ తమ పనులు పూర్తి చేసుకొని వెళ్ళిపోతారు. మళ్ళీ కనిపించరు." అంతవరకు బాగానే వుంది. "శునకా మివ ఖలానాం" అని పాపం దుర్మార్గుణ్ణి కుక్కతో పోల్చాడు. ఆ పోలికే నాకు కడుపులో ఎవరో ప్రేవులను మెలిక పెట్టినట్ల యింది. కుక్కలు ఏదో పాపం తోకాడిస్తూ చుట్టూ తిరగొచ్చు గాక. మన చేతిలోనున్న రొట్టె ముక్కనో, బిస్కట్ ముక్కనో కాస్త విదలించే వరకు దేవురిస్తాయి. అదీ అహింసా పద్ధతిలోనే; దౌర్జన్యంతో కాదు! ఆ తిండి పడెయ్యగానే తోకాడిస్తూ వెళ్ళిపోతాయి. అంత మాత్రంతో ప్రాకృత కవి ఖలులను కుక్కలతో పోలుస్తాడా?

కుక్కలంటే నాకెందుకో చెప్పలేనంత ఇష్టం. సీమ కుక్కలకన్నా, పెంపుడు కుక్కలకన్నా వీధి కుక్కలంటే మరీనూ. పాపం ఒక్కసారి కొంచెం విదలించిన దానికే, మనల్ని చూచినప్పుడల్లా హల్లో అంటూనేవుంటాయ్. చనువిస్తే ముద్దుగా వెంబడిస్తాయి.

యజమానుల ప్రాణ రక్షణ కోసం వాటి ప్రాణాలను కూడా ధారపోసిన కేసు లెన్నో! తిండి మానేసిన ఉదంతా లెన్నో! సహజ శత్రువులైన పిల్లులకు, మేకలకు, మరొక జాతి ప్రాణులకు కుక్కలు జాలిపడి పాలిచ్చి పోషించిన వార్తలు ఫోటోలతో సహా ఎన్నో సార్లు చూస్తుంటాం. అయ్యో మహా కవీ! అలాంటి పరమ విశ్వాస గుణ ప్రతీకలైన కుక్కలతోనా ఖలులను పోల్చేది? నీ కలం లేదా గంటం ఎలా ముందుకు సాగిందో కదా?

పోషకులూ, రాజపోషకులూ, మహారాజ పోషకులూ గల కుక్కలను వదిలెయ్యండి.

ఈ వీధి కుక్కలున్నాయి చూచారూ! ఎప్పుడూ జీతాలనీ, బత్తాలనీ, లంచాలనీ, మామూళ్ళనీ, ఓవర్ టైం అలవెన్సులనీ, సమ్మెలూ, ధర్నాలూ చెయ్యవు. నల్లబాడ్జీలు ధరించవు.

అవి బహుభాషా కోవిదులు! మనము ఏ భాషలో చెప్పినా గ్రహించుకొని మసలుకోగలుగుతాయి. అసలు మనిషిదక్క పశు పక్ష్యాదులన్నీ సర్వభాషా కోవిదులే.

ఆ.వె. మాటలాడలేవు మనిషితో జంతువుల్
గ్రహణశక్తి కొంత కలిగియుండు
మహిని నరులకేమొ - మాటలే అధికమ్ము
ఆగ్రహింత్రు - కొంచెమే గ్రహింత్రు.

దత్తాత్రేయ స్వామివారి వద్ద ఎప్పుడూ నాలుగు కుక్కలుంటాయి. అవి నాలుగు వేదాలకు ప్రతీకలట! వేదాలు ఓంకార జనితాలు. అందుకేనేమో కుక్కలు ఓం, ఓం అని అరుస్తుంటాయ్. బౌ,బౌ అని మనము అర్థము చేసుకుంటే అది మన అల్ప బుద్ధిని ప్రకటిస్తుంది.

ఊర కుక్కలు సమాజ శ్రేయస్సుకై అహోరాత్రులూ పాటుపడతాయి. నాకెందుకులే, ఈ వీధిలో ఈ పెద్ద మనిషి అన్నం పెట్టడు గదా అని దొంగ గారు వస్తే మొరగకుండా వుండవు. ఊర కుక్కలు బీటు కానిస్టేబిళ్ళకన్నా, మాసవారీ మామూళ్ళు గుంజుతూ రాత్రిపూట ఎప్పుడో వచ్చి టక్ టక్ అని కర్రనాడించే ఘూర్ఖావాలాల కన్నా ఎక్కువ బాధ్యతగా కాపలా కాస్తాయి.

హోల్ టైం గవర్నమెంట్ సర్వెంట్సు అని పిలువబడుతూ, ప్రైవేట్ ప్రాక్టీసు చేసుకునే భిషగ్వరులున్నారు! ట్యూషన్ల తంతు నడిపించే మహామహో పాధ్యాయులున్నారు! సైడ్ బిజినెస్ చేసుకుంటూ, అదే అసలు బిజినెస్, గవర్న మెంటు పనియే హాబీ అనుకుంటూ పనిచేసే ఉద్యోగ రత్నాలూ ఉన్నారు. ఇంకా ఇలాంటి ఘనులు ఎందరో ఉన్నారు. ఎప్పటికీ ఉంటారు. కానీ ఊర కుక్కలు?! ప్రొద్దున్న ఒక వీధీ, రాత్రి మరొక వీధీ కాయవు. త్రికరణ శుద్ధిగా పని చేస్తాయి. ఒక్క 'సిక్ లీవు' దక్క కాజువల్ లీవులూ, అరండ్ లీవులూ, సెలవు అమ్ముకోవడాలూ ఉండవు. పోలీసు స్టేషనుకెళ్ళి రిపోర్టు ఇస్తే ఈ కేసు మా పరిధిలోకి రాదు. ఫలానా సర్కిల్ కెళ్ళండి అని తిప్పలు పెడతారు మన రక్షకభటులు. (బహుశా మానభంగాలు జరపడంలో మాత్రం అనరులెండి!) ఈ పరిధి తగాదాలు రాకుండా పకడ్బందీగా వాటి వాటి పొలి మేరలు అవి మార్కు చేసుకుంటాయ్. కేవలం బౌ బౌలతోనే! ఆ పొలిమేరలు దాటి రాకుండా ఖచ్చితంగా రూల్సు పాటిస్తాయి. వాటికీ చిన్న చిన్న యూనియన్ లున్నాయి. కానీ వాళ్ళ యూనియన్ నాయకులు ఓటికీ మాటికీ మెరుపు సమ్మె లకు పిలుపివ్వవు. డబ్బులు వెనకేసుకోవు. పౌరులను ఇబ్బంది పెట్టవు. అయిదు నిమిషాలు, మహా అయితే పది నిముషాల్లో 'బౌండరీ' తగాదాలను బౌ - బౌలతో పరిష్కరించుకొని, 144 సెక్షను వాటికవే అమలుపరుచు కొంటాయ్. శాంతి భద్రతలను చక్కగా సంరక్షించుకొంటాయ్.

మన మునిసిపాలిటీవారు, పరమ మూర్ఖంగా, ఒక పెద్ద రంగాన్ని సృష్టించి మందీ, మార్బలంతో ఊడిపడి, ఇంక యే ఇతర సమస్యలు లేనట్లు,

బ్రహ్మాండమైన సమాజ సేవకే తాము అంకితమైనట్లు, యుద్ధ ప్రాతిపదికమీద జనక సంహార మహోత్సవం ఆర్భాటంగా జరుపుతుంటారు అదీ కూడ మొక్కుబడి తంతే అధికార్లు పైనుంచి తంతేనే! హుకుంలు వస్తేనే!

ఇంటింటికి ఒక చెట్టు నాటుడు అని సర్కారువారు ప్రతి సంవత్సరం ప్రచారం చేస్తుంటారు. అమాత్యుల వారు హౌ టు డు (How to do) చూపిస్తారు,

'నాటుడు' అంటే NOT TO DO అనుకుంటారు ప్రజలు! వన మహోత్సవ సాంవత్సరికాలకు, ప్రకటనలకు లక్షలు తగలేస్తారు. మొక్క నాటడం, ఫోటోలో, పేపర్లో, ఫ్రంట్ పేజీలో పడాలని తాపత్రయం! ఖర్చు చూపించుకోవడంలో ఉబలాటం. అంతే దప్ప, నాటిన మొక్కలు, మరునాటికి వున్నాయో లేదో పట్టించుకోరు మన సచివోత్తములు! పురపాలక ప్రముఖులు! మళ్ళీ వచ్చే సాంవత్సరికాల దాకా!

ఇంటింటికి చెట్టు, ఇంటింటికి బల్బు వీటి సంగతి అలా వుంచి, ఇంటింటికి ఒక కుక్క స్కీమును ప్రవేశ పెడితే, వీధికుక్కల సంతతిని దినదినాభివృద్ధిచేస్తే, దొంగతనాలూ, దోపిడీలు చాలవరకు తగ్గొచ్చు! పోలీసు బలగాన్ని కొంతమేర తగ్గించి, పొదుపు సాధించవచ్చు. దొంగతనాలు, అనుకున్నంత తగ్గవంటారా? కనీసం దొంగల ముఠాలతో చేతులు కలపడం, దొంగ సొమ్ము పంచుకోవడం, అమాయకులు ఇరుక్కోడం, బడా నాయకులు, న్యాయవాదులు అన్యాయవాదులై బాగుపడటం- ఈ బాపతులైనా తగ్గొచ్చు! ఇప్పుడు మాత్రం ముడుపులు, చేయిదడుపులు లేకుండా ఎన్ని దొరికి చస్తున్నాయి గనుక! మనకు దొరికినవాటి విలువకన్నా పోలీసువారికి గిట్టినదే ఎక్కువాయె. సగటు మనిషికంతే అనుకోండి. సచివోత్తముల వ్యవహారం వేరే కావచ్చు.

ఏదో పిచ్చి కుక్కలు కరుస్తాయనీ రాబీస్ అనీ అంటారు. అలాంటి వాటిని గుర్తించి ఏ అడవుల్లోనో, నక్సలైట్లకు 'సహాయార్థం' పంపవచ్చు

గానీ, సాముహిక శునక సంహారము మానవ జాతికే కళంకం! పోలీసులు మానభంగాలు చేస్తున్నారని, దొంగతనాలు దోపిడీలు పెచ్చు పెరుగుతున్నాయనీ, పోలీసులను షూట్ చేయడం లేదే?

స్వాతంత్ర్యం రాక మునుపు సర్కారు ఉద్యోగులు యువర్సు ఒబీడియంట్లీ అని రాయాలని రూలు. బ్రిటిషు వారికి విధేయత ప్రప్రధానము. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఉద్యోగులకు కూడా స్వేచ్ఛ వచ్చిందనీ, కొమ్ములు మొలిచాయనీ తమ విధేయుడు (యువర్స్ ఒబీడియంట్లీ) వద్దు, 'తమ విశ్వాస పాత్రుడు' అనండి చాలు అన్నారు అంతే. రాతలోనే! విధేయతను అవిధేయతనూ రుజువు చేయొచ్చుగానీ, విశ్వాసాన్ని పసిగట్టటం ఎలా చెప్పండి? "ఆఫీసరు పీనుగ, సణుగుడు ముండ కొడుకు సెలవు ఇచ్చి చావడు" అనీ చాటుమాటున తాబేదారులు అనుకుంటూనే వుంటారు. అడపా దడపా అధికారి అన్న తర్వాత బధిరత్వం నటించడం అవసరం అన్న విషయం స్వానుభవం మీదగానీ అర్థంగాదు. సవాలక్ష అబద్ధాలు చెప్పి, సెలవు చీటి పంపి చీట్ (cheat) చేస్తూనే వుంటారు. కాంతామణిగారు 'కాయ'లాగా వున్నా "కాయలాగా" వుందని వ్రాసీ తమ విశ్వాసపాత్రుడు అంటాడు! మరి ఆఫీసుల్లో అబద్ధాలుఆడంది ఒక్క పనీ అయిచావదే?

కుక్కలట్లాగావు. వాటికి 'నటన' తెలీదు. నా 'చివరి రక్తపు బొట్టు కూడా దేశానికే ధార పోస్తా'నని చెప్పి, చెమట చుక్కకూడా రాల్చకుండా వుండవు. ఈ దేశం కొరకు నా గుండె నిరంతరం పరితపిస్తూనే వుంది అని విదేశాల్లో దొంగ అకౌంట్లు తెరవలేవు. 'నా దగ్గిరేముంది బూడిద' అని కోట్లకు కోట్లు కూడ బెట్టి కొడుకులకూ, అల్లుళ్ళకూ ఇవ్వవు. అవిశ్వాసం, అబద్ధం అంటే ఏమిటో ఎరుగని అమాయకపు జీవులు పాపం, కుక్కలు. మనది ఉత్తజన్మ! వాటివే ఉత్తమజన్మ! ముమ్మాటికీ!

అయ్యో! ఇంత సోది ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే...మళ్ళీ సోది మొదలు పెట్టను లెండి. ఆ మధ్య ఒక చోట BEWARE OF DOG కుక్క ఉంది జాగ్రత్త! అనే బోర్డు చూశా. Beware of God, Beware of Police, Beware of Thieves అని బోర్డులు పెట్టుకోవడం చూడలా. అందరిలోనూ కనపడకుండా 'దాగి' యుండు వాడు గనుక 'గాడు' అయ్యుంటుందని నా థియరీ! విలోమసూత్రం! అలాంటి 'గాడ్'ను చూస్తే భయం వద్దా! గాడ్ ఫియర్ లేదుగానీ 'డాగ్' ఫికర్ ఎక్కువా? అని బాధపడ్డా.

ఇంత విశ్వాస పాత్రమైన, ఇంత ప్రీతి పాత్రమైన కుక్కలను చూచి 'జాగ్రత్త' అని బోర్డు పెట్టుకొని వాటిని కించ పరుస్తున్నామేమో అని పించింది. కుక్కలకు అక్షరజ్ఞానం అబ్బివుంటే ఎంతగా వ్యధ చెందుతాయో గదా.

DOG IS GOD. BEWARE AND BEHAVE అని పెట్టుకుంటే ఎంతగా తోకాడిస్తాయో గదా!

ఆ వె మనిషిరీతి మెలగు మాటాడు కుక్కలన్
చూడలేదు వాటి జాడలేదు
భువిని కుక్క వోలె మొఱగెడి మనుజులన్
చూచి చూచి కనులు వాచిపోయె!

ఉపశ్రుతి : "కుక్కలున్నాయి జాగ్రత్త" అని బోర్డు గల ఇల్లు చూచి ఒక పల్లెటూరి శాస్త్రీ అమాయకంగా "ఇదివరకు ఇక్కడ మనుష్యులుండినట్లు గుర్తు. వారు ఎక్కడికి వెళ్ళారండి?!" అని పక్క ఇంటివారిని ప్రశ్నించాట్ట!

— :o :—

# 25. మారే విలువలు!

మా వితండేశ్వరరావు అంటాడు- లోకల్ ట్రెయిన్‌లలో, అదీ మన జంట నగరాల్లో టికెట్ కొనడం శుద్ధ దండగ అని వాడు ఇప్పటికి కొన్ని పందల సార్లు వెళ్ళాడట. ఎవరూ, ఏనాడూ టిక్కెట్ చెక్కింగ్‌కు వచ్చిన పాపాన పోలేదట! వాడి దృష్టిలో చెక్కింగ్ చేస్తే వాడి టికెట్‌కు విలువ ఉన్నట్లు. చెక్ చెయ్యకుంటే అది చెత్తకాగితమైనట్లు! అదో రకం వాదం. అందులో ఎంతో కొంత పాయింట్ లేకపోలేదు లెండి.

ముందు జాగ్రత్త చర్యగా, ఎందుకైనా మంచిదని నేను తేలుమందు, పాముకాటు మందు, హార్ట్ ఎటాక్‌ల మందులు ఎప్పుడూ కొని దగ్గర పెట్టుకుంటూ వుండటం, ఆ మందుల కాల వ్యవధి ముగియటం, మళ్ళీ కొత్తవి కొని తెచ్చుకోవడం, ఇలా చర్విత చర్వణంగా, మూడు దశాబ్దాలనుండి జరుగుతూనే వుంది. అదేం పాపమో....లేక పుణ్యమో! ఆ మందులు ఒక్కసారైనా ఉపయోగించవలసిన అవసరం వుంటే ఒట్టు! మా శ్రీమతిని ఎప్పుడైనా, సరదాకు, తను చేసే ఖర్చుమీద కామెంట్ చేస్తే, వెంటనే తన విమర్శనాస్త్రం నా తేలు మందు, పాము మందులపై సంధిస్తుంది! ఫైర్ బక్కెట్లు, రైన్ కోట్లు, ధర్మామీటర్లు- ఇవికూడా ఆ కోవలోవే. అంత డబ్బుపెట్టి కొన్నాక ఒక్కసారైనా, కనీసం ఒక్కసారైనా, అవసరం రాకపోతే అదేమిటో వెలితిగానే వుంటుంది. వానకోటు తీసికెళ్ళిన రోజు, వాన రాకపోతే వెధవ న్యూసెన్సు! మోతబరువు! ఈ రోజు వర్షం రాదనీ, రేడియో, టి.వీ.వాళ్ళు కూడా చెప్పలేదులే అని ధీమాగా తీసికెళ్ళని రోజే, దీని దుంపతెగ, కుంభ వర్షం వస్తుంది. ఇస్త్రీ దుస్తులను తప్ప దడిపి, గబ్బు లేపుతుంది. కలిగీ ఖర్మం, లేక దరిద్రం అంటామే- అదే ఇది! మా నాన్నగారు అంటూండేవారు: "ఈ సీజన్‌లో మొత్తం, రెండు లేదా మూడుసార్లు ఈ రెయిన్ కోటు ఉపయోగపడి యుండొచ్చు. ఈ పాటి దానికి

నూరు నూటా యాభై తగలెయ్యటం దండగ. కాసేపు తడిస్తే కొంపలంటు కోవుగదా?" అని. అది ఒక తర్కం. పూర్వీకులు రెయిన్ కోటుకు పెద్ద విలువ ఇవ్వలేదు. మా నాన్న రెయిన్ కోటు దిట్టమైన మందపాటి గోనెపట్ట!

ఒక వస్తువు వెల వేరు. విలువ వేరు. జాతీయ పతాకం, మాంగల్యం, పూర్వీకుల స్మృతి చిహ్నాలు- ఇలాంటి వాటికి అంగట్లో వెల కట్టొచ్చు. అంతరంగంలో కట్టగలమా? వస్తువుల విలువలు, మన భావననుబట్టి, హెచ్చుతూ తగ్గుతూ వుండటం నిజ జీవితంలో, ఎన్నో సందర్భాల్లో చూస్తూ వుంటాం.

ఆ మధ్య నా పేరిట, పాతికవేల చెక్కు వచ్చింది. ఇప్పుడు దాని విలువ పాతిక వేలు. రాత్రికి రాత్రి నేను పాతిక వేల ఆసామినయ్యా. ఆ రాత్రి ఆనందంతో నిద్ర పట్టలేదు. తెల్లారుతూనే హుషారుగా బాంకు వెళ్ళా, దాంట్లో తేదీ వెయ్యటంలో సంవత్సరం తప్పుపడింది. అక్కడ బాంకువాళ్ళ సంతకాలు కావాలన్నారు. క్షణంలో రాత్రి పడిన ఆనందం కరిగిపోయింది. చెక్కుమీద డేట్‌గానీ, సంతకంగానీ, మరేదైనాగానీ, తప్పు పడిందనుకోండి. అంతే- దాని విలువ ఎగిరిపోతుంది!

చెక్కులో లోపాన్ని సవరింపజేసి, మళ్ళీ సికింద్రాబాద్ 'పికెట్'లో వుండే బ్రాంచికి బస్సులో వెళ్ళా. పరిచయంలేని స్టేజీ కనుక స్టేజీరాగానే చెప్పమని కండక్టరును అర్థించా. పాపం, అతగాడు మంచివాడులాగా వున్నాడు. స్టేజీ రాగానే 'ఏయ్! పికెట్! దిగు! అని హెచ్చరించాడు. అధికారంలో వుండగా ఎంత మందితోనో దండాలు పెట్టించుకున్న వాడిని. (కొన్ని దొంగ దండాలే అయ్యుండొచ్చు గాక) అలాంటి నేను, ఆ క్షణంలో, కండక్టరుగారికి లోకువై కేవలం 'పికెట్'గా పిలువబడ్డా! ఆ బస్సు టికెట్టు విలువ రెండు రూపాయలు! దాని విలువ ఆ బస్సులో ప్రయాణించినంత సేపే! దిగిపోతే దాని విలువ ఖతమ్!

ఒకసారి కండక్టరుకు చిల్లర లేక ఇరవై రూపాయల నోటు ఇచ్చా. అతడు రూపాయ టికెట్టిచ్చి, దాని వెనుక పందొమ్మిది రూపాయలు వ్రాశాడు. క్షణంలో టికెట్ విలువ పందొమ్మిది రూపాయలు పెరిగింది!

సరే బ్యాంకుకు వెళ్ళా నేను నేనే అనేందుకు అకౌంటు హోల్డరు సంతకం చెక్కుమీద కావాలన్నాడు. అక్కడ వుంటాడనుకున్న మిత్రుడు లీవులో వున్నాట్ట! మళ్ళీ ఎవరు తారసిల్లుతారా అని వడిగాపులు గాచి వెయ్యి కళ్ళతో చూస్తూ కూర్చున్నా. వాడే అప్పటికి నా పాలిట దేవుడు! ఇప్పుడు ఆ పాతికవేలు ఆయనగారి సంతకంలోకి వెళ్ళి కూర్చుంది.

కౌంటర్లో చెక్కు ఇచ్చా. టోకెన్ తీసికొని సోఫాలో కూర్చున్నా.

ఇప్పుడు ఆ పాతిక వేలూ వాడిచ్చిన టోకెన్‌లోకి ప్రాణ ప్రతిష్ఠ పొందింది. ఈ క్షణంలో ఆ టోకెన్‌ను కలిగియున్నవాడే పాతికవేల హక్కుదారు. ఎక్కడ క్రిందపడి పోతుందో, ఎవడి చేతుల్లోకి పోతుందో అని జాగ్రత్తగా దాని పిడికిట్లో బిగించి పట్టుకొని కూర్చున్నా. ఎంతసేపటికీ నా టోకెన్ నంబరు పిలవడు. ఓపిక తగ్గిపోతూంది. పావుగంట గంటగా అనిపిస్తూంది! ఆఖరుకు 'వన్‌సెవంటీయైట్' అని కాష్ కౌంటర్‌వాడు పొలికేక పెట్టాడు. అది నా టోకెన్ నెంబరు. ఆదరా బాదరా వెళ్ళి, టోకెన్ ఇచ్చి ఒకటికి రెండు సార్లు డబ్బు లెక్కపెట్టుకొని కాష్‌బాగ్‌లో భద్రంగా పెట్టా. అక్కడ అంతసేపూ నా పేరు "వన్‌సెవెంటీయైట్"గా మారింది!

తీరా డబ్బు తీసికున్న తర్వాత గుండెల్లో దడ పుట్టింది. దారిలో ఎవరైనా కొట్టి వేస్తే? బస్టాపుకు ఫర్లాంగు దూరం నడవాలి. ఏ రౌడీగాడో స్కూటరు మీద వరుగున వచ్చి బాగ్ లాక్కెళ్ళితే? కొంప మునగదూ? ఇలా జరుగుతున్నట్లు పేపరులో ప్రతిరోజూ చదువుతున్నామాయె. తలచుకుంటేనే

భయం వేసింది. డబ్బు లేనప్పుడు నిదానంగా కొట్టుకున్న గుండె డబ్బు చేతిలోకి రాగానే దబ్ దబ్ అని మరింత వేగంగా కొట్టుకోసాగింది! క్రితం రోజు ఆనందం మాయమైంది. ఇంత లోనే అది భయంగా మారిపోయింది. బస్సులో భద్రత తక్కువ అని ఆటో వాడిని పిలిచా. వాడు నన్ను ఎక్కించుకొని కొంతదూరం పోయి, మెయిన్ రోడ్డు మళ్ళించి ప్రక్క సందులోకి త్రిప్పాడు. ఇలా ఎందుకు తీసికెళ్తున్నావ్? అని అడిగా. నోట్లో కారా కిళ్ళీ బాగా దట్టించి నట్టున్నాడు. పలక్కుండా ఏదో అభినయం చేశాడు. అర్థమై చావలా. వీడేదో సందులోకి మళ్ళించి డబ్బులాగేసే పథకం వేశాడనీ అఘాయిత్యం చేసి తీరుతాడనీ నాకు అనుమానం దడ ఎక్కువై బి.పి. పెరిగిపోయున్నట్టుంది. పైగా నేను అరవ్వాణ్ణి అనుకున్నట్టున్నాడు. 'మణి ఎవ్వళవ్?' అని పాడు కారా కిళ్ళీ నోటితోనే అడిగాడు. నాకు మాట పెగల్లా 'మని ఇవ్వు' అంటున్నాడను కున్నా. ముచ్చెమటలు పోశాయ్. వెధవడబ్బు ఎందుకు వచ్చిందా అని తిట్టుకున్నా. అనుకోకుండా ఆంజనేయ దండకం వల్లిస్తున్నా.

ఆ ఉదయం ప్రక్కింటి అప్పారావును తోడుగా రమ్మని అడిగుంటే బాగుండేదేమో! వాడు నా డబ్బు చూచాక అప్పు అడిగి నన్ను మొహమాటంలో పెడతాడేమోనని భయపడ్డా. ఇప్పుడేమో ఈ భయం. ఈ రౌడీగాడి చేతిలో నా పని ఖాళీ, నా డబ్బు గోవిందా అని గాబరాపడుతూ గోవింద నామ స్మరణం కూడా చేశా.

"యెన్నా సార్! మణి ఎవ్వళవ్?" అని తన మణికట్టు మీద చెయ్యి వేసి చూపిస్తూ గట్టిగా అడిగాడు.

ఓరి దేవుడా. కొంప మునిగిందిరా అని అనుకుంటూంటే-

"టైమ్. సార్. టైమ్. తమిళ్ తెరియాదా?" అన్నాడు.

హమ్మయ్య. నీ దుంపతెగ. ఇంతాచేస్తే నీవు అడిగింది క్రైమా అనుకొని చెప్పా. ప్రాణం కాస్త కుదుటపడింది. ఇంతలో మా ఇల్లు వచ్చేసింది.

దిగి పోతూంటే "మీ నామం చూచి మీరు అరవాళ్ళనుకొని అరవంలో మాట్లాడాసార్! మధ్యాహ్నం మూడింటికి ఆటో ఇచ్చేయాలి. అందుకని క్రైమ్ అడిగా" అన్నాడు. బ్రతుకు జీవుడా అని ఇంట్లో పడ్డా.

చూచారా! డబ్బు విలువ మొదట్లో చెక్కులోకి, తర్వాత చెక్కుమీద సంతకంలోకి, తర్వాత అకౌంట్ హోల్డరు సంతకంలోకి, తర్వాత టోకెన్‌లోకి తదనంతరం నా సంతోషం భయంగా ఎలా క్షణాల్లో మారిందో. నాపేరు 'పికెట్స్‌గా' వన్‌సెవంటీయైట్‌గా గంటలో ఎలా మారిందో?

ఒకసారి అర్జంటుగా సైకిలు మీద వెళ్తున్నా. ఇంట్లో ప్రమాద స్థితిలో నున్న పేషంటును చూచేదానికి డాక్టరును పిలుచుకొని రావాలి. సైకిలు పంచరైంది. పంచరు చేయించేందుకు ఆ రోజుల్లో పావలా. నా వద్ద పర్సులో చిల్లర లేదనీ, పందరూపాయలునోటు మాత్రమే ఉందనీ చూచుకోకుండా హడావిడిగా బయలుదేరా. సైకిలు కుర్రాడి దగ్గర చిల్లర లేదు. ఇప్పుడు చెప్పండి చిల్లర దొరక్కుంటే ఆ వచ్చనోటు విలువెంతో?!

ఒకసారి బెంగుళూరులో మా పక్కింటి అమ్మాయి ప్రసవించింది. పాత కాలం వాళ్ళు గనుక బిడ్డపు నీళ్ళు పోయించి సాంబ్రాణి పొగ పెట్టడం సంప్రదాయం. సాంబ్రాణి దొరికింది. కానీ పొగవేసేందుకు బొగ్గులు కావాలి. ఆ చుట్టుపక్కల నాలుగైదు మైళ్ళవరకూ ఎక్కడా బొగ్గులంగడి లేదు. కనీసం చాకలివాళ్ళ దగ్గర కూడా దొరకలేదు. మిరపకాయబజ్జీల వాళ్ళదగ్గర కూడా లేవన్నారు. ఎక్కడ చూచినా ఎలక్ట్రికల్ ఇస్త్రీపెట్టెలూ కిరోసిన్ స్టౌలూ, గాస్‌పొయ్యిలే నాయె. తిరిగి తిరిగి ఎలాగో రిక్వెస్టు చేసి రెండ్రూపాయలు కూడా చెయ్యని ఆ బొగ్గులను పది రూపాయలు వదిలించుకొని పక్కింటి

వాళ్ళు సాధించారనుకోండి. అవసరాన్ని బట్టి వస్తువు విలువ మారుతుంది అంటారే- ఇదే!

మన ప్రభుత్వంవారు కోట్లు కోట్లు డబ్బు తగలేసి భారీ యంత్రాలను విదేశాల నుంచి దిగుమతి చేసికోవడం, చిన్న చిన్న స్పేరు పార్టులు లేక ఆ యంత్రాలు సంవత్సరాల తరబడి మూలబడిపోయి, ప్రభుత్వానికి లక్షల్లో నష్టమొచ్చినట్లు అప్పుడప్పుడు పేపర్లో చదువుతూ వుంటాం. నాగార్జున సాగర్‌లో నడవడానికి రష్యానుంచి స్టీమ్‌లాంచి తెప్పించి కొన్నేళ్ళు మూల పడేసిన విషయం మీకు తెలియదూ!

స్వర్ణకారులు లేకుంటే బంగారం విలువెంత? రిపేరర్లు లేకుంటే యంత్రాలకు విలువెంత? కొనేవాడు లేకుంటే వస్తువు వెల యెంత? విద్యుత్తే లేకుంటే టి.వీలు, ఫ్రిజ్‌ల విలువెంత? ప్రతిభను గుర్తించేవాడు లేకుంటే కళాకారుని విలువెంత?

— :o :—

# 26. భగవద్గీత–బారాకట్టు !



ఔట్‌డోర్ గేమ్సు అంటే నాకు చచ్చేంత భయం! నా బాల్యంలో ఏదో సరదాకు ఆడటం ఏ చేతికో, కాలికో, కంటికో దెబ్బ తగిలించుకొని కొంప జేరడం, దెబ్బతో నేను ఏడుస్తూంటే మా నాన్న రెచ్చిపోయి "అసలు నీవు ఇంటిపట్టున ఉండి ఆడుకోక అక్కడికి ఎందుకెళ్ళావ్? వెధవాటలూ నువ్వూ!" అని గద్దించి మరి రెండు అంటించడం, నేను లబోదిబో అని అమ్మను ఆశ్రయించడం. వారానికోసారైనా ఈ తన్నుల తంతు జరుగుతుండేది. 'దెబ్బకు దెబ్బే' అనేది మా నాన్న సూత్రం. హోమియోపతి సూత్రం అదేగా! ఈ పోరు పడలేక స్కూలు కాగానే కొంప చేరుకొని ఏ పరమపద సోపాన పటమో బారా కట్టో ఆడుకునే వాడిని. కాస్త పెద్దయ్యాక పేకాట- అదీ మా నాన్నకు తెలియకుండా!

ఔట్‌డోర్ గేమ్సులో,అంతో ఇంతో దెబ్బలు కద్దు. ఇన్‌డోర్ గేమ్సులో, అంటే నేను చెప్పిన పై ఆటలలో ఆ ప్రమాదం లేదు, కోపం వచ్చి పోట్లాడుకుంటే దప్ప! విదేశీయుల ఇండోర్ గేమ్సు అన్నీ ఖర్చుతో కూడుకున్నవి. మన ఇండోర్ గేమ్సు ఆటు కాలక్షేపానికే కాక, పుణ్యం, పురుషార్థం అనే డబుల్ బెనిఫిట్ దృష్టితో కనిపెట్టబడ్డాయి. పైసా ఖర్చుండదు. సులభగ్రాహ్యమైన వేదాంతం వీటిల్లో ఇమిడి యుందని క్రమక్రమంగా తెలుసుకుంటాం. రాత్రుళ్ళు జాగారాలు చేసే శివరాత్రి, వైకుంఠ ఏకాదశి రోజుల్లో ఇవే ఎక్కువగా ఉపకరిస్తాయి. అర్ధ రాత్రి సినిమాలు ఇప్పుడొచ్చాయనుకోండి, పేక ముక్కల్లో తెలుపు, ఎరుపు, నలుపు సత్వరజస్తమో గుణాలకు ప్రతీకలు! పరమపద సోపాన పటములో మొత్తం కర్మ సిద్ధాంతమంతా ఇమిడియుంది. వీటిని గూర్చి మరోసారి. ప్రస్తుతానికి బారాకట్టి ఆటను గూర్చి ముచ్చటించుకుందాం.

ఈ ఆట అన్ని వయసుల వారికీ వేదాంతం తెలుసుకోవటానికి పనికొచ్చే ఆడియో విజువల్ గైడ్! ఒకటి రెండుసార్లు ఆడి చూడండి. మీకే అర్థం అవుతుంది. కాలేదా? ఇంకా మీ బుద్ధి పరిపక్వం కాలేదన్న మాట! చదరంగం, కారెమ్సు లాంటి ఆటల్లో పురుష ప్రయత్నానికి (ఆ మాటంటే ఆడు వారికి కోపం రావచ్చు, మన ప్రయత్నానికి అందాం) చాల వరకు ఆస్కారం వుంది. ఈ ఆటల్లో మాత్రం అలాంటివి ముడియాదు.

శ్రీ కృష్ణభగవానుడు గీతలో "ద్యూతం చలయతా మస్మి" అని సెలవిచ్చినట్లు 'బారాకట్టి' 'పరమ పద సోపాన పటము' ఈ ఆటల్లో మాత్రం పురుష ప్రయత్నానికి - అదే లెండి మన ప్రయత్నానికి తావే లేదు. పందెం వేయడం వరకే మన చేతిలో వుంది. పడే పందెం పూర్తిగా భగవంతునిదే!

పై రెండు ఆటలను కనిపెట్టిన మహనీయునికి (పురుషుడో, స్త్రీయో ఎవరు చూడొచ్చారు! లేదా వ్యక్తికి) వేయి జోహార్లు సమర్పించినా చాలదు. మొత్తానికి ఈ బారాకట్టి ఆటను మాత్రం కనిపెట్టింది భారతీయులే అని నా విశ్వాసం. శివపార్వతులు పాచికలాట ఆడినట్లు పురాణాలు ఉవాచ!

ఇండోర్ గేమ్స్ భారతీయుల కెన్ని లేవు? కానీ ఆట ప్రారంభంలో విఘ్నేశ్వర పూజలాగా 'దేవుడు' 'దైవము' అని రెండు మూడు పందెములు వేసిన తర్వాతనే 'నాది' అని తన పందెం వేసే సత్ సంప్రదాయముగల ఆట ఈ బారాకట్టి! ఆధునికులు, హేతువాదులు ఈ పార్మాలిటీని పాటించక పోవచ్చుగాక! కనీసం మనసులోనన్నా అనుకుంటారనే నాకు ఒక మూల అనుమానం!

ఇందు పాలుగొనువారు ఆరు చొప్పున కాయలు పెట్టుకుంటారు! ఇవి మనలో, మన అందరి లోపల తిష్టవేసియుండే అరిషడ్వర్గాలకు ప్రతీకలుగావా! అవి మళ్ళీ మళ్ళీ చస్తూనే వుంటాయ్. పుడుతూనే వుంటాయ్. మొట్ట మొదట నిర్ణీతమైన పందెములు పడేంత వరకు ఆటలో 'గృహ ప్రవేశం' చెయ్యటానికి వీలులేదు. అంటే ఇది "ఎంట్రెన్స్ టెస్టు" అన్నమాట! ఒక్కొక్కసారి ఈ ఎంట్రెన్స్ టెస్టులో "డిమ్కీలు" కొట్టుతుంటాము. భగవంతుని సాన్నిధ్యం చేరెందుకు కూడా కనీస అర్హత ఉండాలి అని ధ్వని!

ప్రతి ఆటగాడూ తప్పని సరిగా 'జోడు' కట్టి తీరాలి అను నియమం మన సమాజంలో గృహస్థాశ్రమ ధర్మ విశిష్టతకూ, దాంపత్య వ్యవస్థకూ సంకేతం గాదా?

ఈ 'జోడు' కట్టేదానికి కూడా అప్పుడప్పుడు చాలా తిప్పలుపడి నిరీక్షించవలసి వస్తుంది పందెములు పడక. మన నిజ జీవితంలో మాత్రం, కొందరు యుక్తవయసులోనే దంపతులు కావచ్చు. మరికొందరు అర్ధ షష్టి పూర్తి అయినా అర్ధాంగి ప్రాప్తికి నోచుకోరు! మరికొందరు ఆజన్మ బ్రహ్మచారులుగానే మిగిలిపోతుంటారు! అసలు మన దేవుళ్ళందరూ 'జోడు'గానే ఉన్నారాయె. "జోడు" కట్టలేనివారు ప్రిఫైనల్స్‌లోనే ఓడిపోయినట్లు లెక్క!

ప్రత్యర్థి ఆటగాడు తను కట్టిన జోడును దాటకూడదు అని ఒక రూలు. ఒకవేళ దాటవలసి వస్తే అందులో దిగి ఒక పందెం వరకు కూర్చొని గాని

వెళ్ళగూడదు. ఆ తర్వాతి పందెం ఆ జోడు ఆసామీకి సరి పందెం పడితే ఆ కూర్చున్న కాయ ఏడ్చుకుంటూ కొంప చేరాలి. దంపతుల మధ్య తలదూర్చితే తంటాలు సుమా అని ఇది హెచ్చరిక! జోడు సరి పందెములకే ముందుకు నడుస్తుంది. బేసి పందెములకు ముందుకు పోలేదు. అనగా, ఆలుమగలు, సరియైన పంథాలో చెట్టా పట్టాలు వేసుకుంటూ కలిసి ప్రయాణము చెయ్యాలి అని హితబోధ!

ఓం ప్రథమంగా జోడే ముందు పండాలి. జోడు పండనిదే మిగతా కాయలకు పండే అర్హత లేదు. దాంపత్యవ్యవస్థకు మన భారతీయులు ఇచ్చిన ప్రాముఖ్యం మరోసారి రుజువైంది! కట్టిన జోడు కనీసం ఒక గదిలోకి కలిసి అడుగు పెట్టనిదే పంట గదుల్లోకి ప్రవేశించే హక్కులేదు. అనగా 'సప్తపది' చేసిన తర్వాతే 'గట్టి జోడు' అవుతుంది! వేదసంహితలో "సంపత్న్యా, పుత్రైః అనుగచ్ఛయత దేవం" అను ప్రమాణము ననుసరించి భగవంతుని సన్నిధి సహధర్మచారిణితో కలిసియే సేవించవలెను అను నియమము ఈ బారాకట్ట ఆటలో ప్రతిఫలించు చున్నది! పెద్ద పెద్ద పందెములు వేసినవారే విజయం సాధించగలరని గ్యారంటీ లేదు ఒక్కొక్కప్పుడు చిన్న చిన్న పందెములే భగ వత్సాన్నిధ్యమును చేర్చవచ్చు. దేవుని దగ్గర అందరూ సమానులే. ధనవంతులు బీదవారు అను తారతమ్యము లేదు నిజమైన సోషలిష్టు సామ్యవాద సిద్ధాంత మును మనవారు ఈ ఆట ద్వారా ప్రబోధించారు!

కనీసం ఒక్క కాయనైనా చంపంది లోనికి వెళ్ళే అర్హత లేదు అనే నియమం వుంది. అంటే అరిషడ్వర్గాలలో, ఒక్క దుర్గుణాన్ని అయినా చంపనిదే దైవదర్శనం కాదు అని సంకేతం! అంతేకాదు, చంపిన తర్వాత ఆ కాయ మళ్ళీ పండెం వరకు కదలరాదు. ప్రత్యర్థికి కూడా అవకాశం ఇవ్వాలి. ఇది నిజమైన వీరుని లక్షణమును తెలుపుతుంది!

ఈ ఆటలో ఉన్న మరో ప్రత్యేకత ప్రతి కాయ ముందుకు నడవ వలసినదే కానీ, వెనుకకు నడవకూడదు. మానవుడు పురోగమించవలసిన వాడే కాని, తిరోగమించకూడదు అని సమాజమునకు పరోక్షంగా ఉద్బోధ!

ప్రత్యర్థి తనకున్న ఆరు కాయలూ పంట గదుల్లోకి ప్రవేశించలేక బయటనే పడిగాపులు గాస్తూవుంటే, మనకు కేవలం ఒక్క కాయకు ఒక్కటే అతి చిన్న పందెం పడితే ఘన విజయం సాధిస్తామనే దురహంకారము ఏ మాత్రం పనికిరాదు. ఆ అతి చిన్న పందెమే ఒక్కొక్కప్పుడు పడదు గాక పడదు. పద్దన్నా పడే పందెము అవసరానికి పడిచావదు. అంతే. అంతలోనే, అది చావుదెబ్బ తిని కొంప జేరవచ్చు! ప్రత్యర్థికే విజయం సంప్రాప్తం కావచ్చు!

'నిమిత్తమాత్రం భవ సవ్య సాచిన్' అను గీతావాక్యం పంటబట్టించు కోవలసిందే!

'నిర్మమో, నిరహంకారస్సశ్శాంతి మధిగచ్ఛతి' అను శ్రీకృష్ణ భగవానుని వాక్యం స్మరించుకోవలసిందే!

మన కాయ చస్తే క్రుంగిపోకూడదు. ఎదుటివారి కాయ చస్తే ఎగిరి పడకూడదు.

"గతసూ నగతా సూంశ్చనాను శోచంతి పండితాః' అనేది అమలు పరచవలసిందే!

"సమశ్శత్రౌచ మిత్రేచ తథా మానావ మానయోః శీతోష్ణ సుఖదుఃఖేషు సమస్సంగ వివర్జితః" అను గీతా వాక్యమును స్ఫురణకు తెచ్చుకొని సుఖ దుఃఖములకు అతీతముగా ఉండుటకు అభ్యసించాల్సిందే!

బారాకట్ట చదరంలో మొత్తం 49 గదులు అందులో తొమ్మిది 'గట్టాలు'. ఇవి నవరంధ్రాలకు ప్రతీకలు!

ఈ చతురస్రములను గమనించితే విష్ణు సహస్రనామ స్తోత్రంలోని "చతుర్మూర్తి, చతుర్బాహు, చతర్వ్యూహ, చతుర్గతిః, చతురాత్మా, చరుర్భావ, చతుర్వేద విదేకపాత్" అనే శ్లోకమే జ్ఞప్తికి వస్తుంది. చతుర్భుజుడైన శ్రీమహా విష్ణువుగారి ఆత్మ, గతి, భావములు అన్నీ చతురస్రమైన బారాకట్ట మీదనే పరిభ్రమిస్తూంటాయి!

వంట గదులు గల భగవత్ప్రాంగణములో కూడా తొమ్మిది గదులే! అందులో కేంద్రస్థానంలో భగవంతుడు! అదియే అసలు సిసలు వంట గది. మోక్ష ప్రసాదం లభించే గది. ఆయన చుట్టూవున్న ఎనిమిది గదులు అష్ట లక్ష్మీ దేవేరుల గృహాలు!

'Games reveal the Character of a Person' అని ఒక మహాశయు దన్నాట్ట. ఆటలు మనిషిలో అంతర్గతంగా ఉన్న దుర్గుణాలను బయట పెట్టవచ్చు. బారాకట్ట ఆటలో ఈ స్వభావ బహిర్గతము ఇంకా ప్రస్ఫుటంగా కనిపించుతుంది. ఆయా మనుషులు పాల్గొనే ఆటల రకాలను బట్టి కూడా వారి వారి గుణములు బహిర్గతం అవుతుంటాయ్!

పోతే ఈ ఆట బాలబాలికలకు ఒకటి, రెండు, మూళ్ళు నేర్చుకొనడం, కూడిక లెక్కల్లో ఆసక్తి కల్గించే అవకాశం కూడా వుంది. అంతేకాదు, చతురస్రము, దీర్ఘచతురస్రము, త్రిభుజము వీటి స్వరూపాల విషయ పరిజ్ఞానం కూడా పిల్లలకు కలుగుతుంది! రోజూ ఇల్లాలితో ఒకటి రెండు బారాకట్ట ఆడిచూడండి. వారిలో ఎంత అనుకూలమైన మార్పువస్తుందో భార్యను ఆకట్టుకునే ఆట బారాకట్ట! భర్తకు పోనీయకుండా అడ్డుకట్ట వేసే ఆట బారాకట్ట!

పాశ్చాత్యుల ఆటల వలె గాక, ఇంతటి మహత్తర ఇహ పర సమన్వయాత్మకమైన ఆట, మన బారాకట్ట ఆట. బాల్యం నుండి పారమార్థిక చింతను ప్రబోధించే ఆట బారాకట్ట! పామరులకు కూడ పరమాత్మ తత్త్వాన్ని తెలిపే ఆట బారాకట్ట! దైవనామ స్మరణతో ప్రారంభించేసే ఆట బారాకట్ట! "పునరపి జననం పునరపి మరణం" అను వేదాంతమును స్ఫురింపజేసే ఆట మన బారాకట్ట!

మృగములలో పులిని జాతీయ మృగముగా భారత ప్రభుత్వము వారు గుర్తించారే. పక్షులలో నెమలిని జాతీయ పక్షిగా గుర్తించారే. పుష్పములలో

తామర పుష్పమును ఎన్నుకున్నా రే! దేశానికి స్వాతంత్ర్యం వచ్చి అయిదు దశాబ్దాలు దాటుతున్నా (పోనీ నాలుగే అనుకోండి) స్వదేశీయ గృహ క్రీడలలో మకుటాయమైన బహుపురాతనమైన ఈ ఆటను ఏలికలు గుర్తించకుండా, జాతీయ గృహక్రీడగా గుర్తించకుండా గౌరవ ప్రపత్తులను కల్పించకుండా ఉపేక్షించుట అన్యాయము కాదా!

పదకొండు మంది మందులతో ఆడబడి, పదకొండువేల మంది మందులతో చూడబడే ఆటగా 'బెర్నార్డ్ షా' గారిచే నిర్వచించబడిన బోడి 'క్రికెట్' ఆటకన్న 'బారాకట్ట' ఉత్కృష్టమైనది గాదా!

"వింటే భారతం వినాలి. తింటే గారెలు తినాలి" అన్నట్లు, ఆడితే బారాకట్టనే ఆడాలి. గారెలు ఎక్కువైతే అజీర్ణం కావచ్చు. బారాకట్ట ఎన్ని సార్లు ఆడినా హెల్తు చెడిపోదుగాక చెడిపోదు!

అపూర్వమైన మన పూర్వ సంప్రదాయములను ఎన్నింటినో మరచి పొయ్యాం. అనతికాలంలో పాశ్చాత్య నాగరికతా వ్యామోహంలో డాడీ, మమ్మీ సంస్కృతితో ఇంకను ఎన్నియో నశించనున్నవి. పల్లె ప్రాంతములలో మాత్రం కొంచెము ఊపిరి పీల్చుకొనుచు జీవచ్ఛవము వలె బ్రదుకీడ్చుచున్న ఈ మహోన్నత, పురాతన గృహక్రీడను పునరుద్ధరించుటకు ప్రభుత్వంవారు తగినన్ని గ్రాంటులు మంజూరుచేసి పూనుకోవాలి. జై బారాకట్ట! జై! జై! బారాకట్ట!

చివరి మాట, నాకు సంస్కృతం రాదుగాని, వచ్చియుంటే 'శిశుర్వేత్తి' శ్లోకం లాగా 'స్త్రీవేత్తి, పురుషవేత్తి, బాల బాలికల్ వేత్తి, వృద్ధుల్ వేత్తి, వేత్తి బారాకట్ట సర్వేజనాః అనే అర్థంలో రాసి వారేసేవాడిని!

—: o :—

# 27. దేవుడుగారు!

"దేవుడు దేవుండనగా
దేవుండా దివి నుండి దిగి వచ్చేనా
'ఈవి' గలవాడె దేవుడు" అన్నాడొక పూర్వకవి.

ఈ నిర్వచనము అపూర్వం! మా వితండేశ్వర్రావు వింత వ్యుత్పత్తులూ, విపరీతార్థాలూ లాగడంలో ప్రస్టు అని ఇదివరకే మనవి చేశాగా! 'ఈవి' అనే పదానికి అర్థం దానగుణము అని కాదట. 'ఈవి' అంటే ఆడమ్ అండ్ ఈవ్ లలోని 'ఈవ్' గారనీ, 'ఈవ్' (Eve) ను కలిగియున్నవాడు 'ఆదాము' (Adam) అనీ, ఆదాములో నుంచి వచ్చిందే 'ఆద్మీ' అనగా మనిషి అనీ వాడి వ్యాఖ్యానం! ఏతావతా, దేవుడంటే ఆదామేనట. మనిషే దేవుడట! వాడిదెప్పుడూ పిడివాదమే. తమాషా మేమిటంటే వాడి వాదం విన్నమీద ఏమో అయ్యుండ కూడదా' అనే ఆలోచన కూడా మనలో రేకెత్తుతుంది. పోనీయండి 'మనలో' కాకున్నా 'నా'లో! మన పురాణాల్లో సీత, ద్రౌపది మున్నగు వారిని 'అయోనిజ'లని అంటారు గదా! అంటే గర్భవాస క్లేశాలు లేకుండానే పుట్టారనీ, స్వయంభువులనీ అంటారు! ION అయాన్ అంటే ఇంగ్లీషులో విద్యుత్ప్రేరిత రేణువులట (Electrically Changed Particles) ఆ రేణువులలో నుంచి జనించినవే అయానిజలట. అవే ఆయోనిజలుగా మారినవట! మానవుడు భవ బంధాలతో తెగతెంపులు చేసుకోవలసిన పవిత్ర ప్రదేశాలు గనుక 'తెంపులు' నుండి 'టెంపుల్' (Temple) పుట్టిందంటాడు! ఇంగ్లీషులో 'గార్డు' అంటే రక్షకుడు అని అర్థం కాబట్టి దేవుడుగారు సర్వజగద్రక్షకుడు గనుక, 'గార్డు'లో నుంచే 'గాడ్' (God) వచ్చిందంటాడు మతి యిందాక, దేవుడంటే మనిషే అన్నావే అని నిలదీసి అడిగితే ఆదిశంకరులు వారు సెలవిచ్చిన అద్వైత

సిద్ధాంతం ప్రకారం అంతేకదా అని దబాయిస్తాడు. ఇక్కడికి మా ఫ్రెండ్‌ని వదిలేద్దాం!

ప్రపంచంలో ఎన్నో మతాలున్నాయి. ఎవరి నమ్మకాలు వారివి. **Faith is to belive what you do not see; and the reward of faith is to see what you believe** అన్నాడొక ఆంగ్ల మహాశయుడు అగస్టిన్ అనువాడు. అగోచరమైన దానిని నమ్మటమే విశ్వాసం. దాని ప్రతిఫలం నమ్మినది గోచరించుటయే అని దీని అర్థం!

నాస్తికులు, హేతువాదులు మాత్రం దేవుడు గివుడు జాంతానై అంటారు. దేర్ ఈజ్ నో గాడ్ అంటారు. ఆ 'నో'కు స్పెలింగ్ ఆస్తికులేమో Know అంటే నాస్తికులు No అంటారు! అదేమి చిత్రమో 'నో గాడ్' అన దానికి దేర్ ఈజ్ అంటే గానీ వాక్యం పూర్తి అవదు. ఖుదా నహీ 'హై' అంటే గానీ 'నహీ'కి పరిపూర్ణత్వం లభించదు. విజయవాడలో శ్రీ ప్రభాకర ఉమా మహేశ్వర పండితులు అనే ఉద్దండుడైన హిందూ మత ప్రవక్త ఉండేవాడు. యే వాక్యానికైనా కర్త, క్రియ, కర్మలు ఉండాలిగదా! కర్త, కర్మ ఒకప్పుడు లేకున్నా 'క్రియ' లేనిది వాక్యం కాదుకదా! దేవుడు లేడు అనే వాక్యంలో 'క్రియ' ఏది బాబూ అని అడిగేవాడు, ఎదుటివాడు అనాలోచితంగా 'లేడు' అనే వాడు. ఓహో! అలాగా! సరే 'వచ్చుట' అను క్రియకు భూతకాలం వచ్చెను, 'తినుట' అనే క్రియకు 'తినెను' భూతకాలము. మరి నీ 'లేడు' అనే క్రియకు భూతకాలం చెప్పు అని అడిగేవాడు. లేడెను, లేడినాడు. అనే క్రియా పదాలు లేవాయె. ఇలా ఎదుటివాడిని సభలలో కన్‌ఫ్యూజ్ చేసి పారేశేవాడు.

సరే, వారి చమత్కార తర్కమెలా వున్నా అసలు దేవుడు అనేవాడు నిజంగా లేకుంటే ప్రపంచం అంతా ఎంత రసవిహీనమై పోతుందో అని నాకు అమిత భయమేస్తుంది. మాటవరసకు సంగీత ప్రియులను, పండిత పామరులను కూడా ఓలలాడిస్తున్న త్యాగరాజు కీర్తనలు, రామదాసు కీర్తనలు,

పురందరదాసు, అన్నమాచార్య, జయదేవుడు, తులసీదాసు, కబీరుదాసు ఇంకా ఇంకా ఎందరో ఎందరెందరో త్యాగధనులైన మహానుభావులు దేవుని పరంగా లక్షల కొద్దీ కీర్తనల వ్రాసి, స్వరకల్పన చేసి, గానము చేసి భావితరాలకు శాశ్వతంగా అందించి గానకళను బహుధా సుసంపన్నం చేశారే! కొన్ని లక్షల కుటుంబాలకు జీవనోపాధి కల్పిస్తూ లక్షలాది మందికి మనోల్లాసం కల్గిస్తున్నాయే! ప్రపంచమంతా ప్రశంసలనందుకున్న మన గాన కళ అంతా దేవుడు లేదంటే గోవింద కొట్టదా? పురమే లేకుంటే అంతఃపురము ఎక్కడిది?

చిన్న చిన్న గుళ్ళను వదిలేసినా, దేవుడి కొఱకు ఎన్ని వేల దేవాలయాలు, శిల్ప కళా ఖండాలు, దేశం నాల్గు చెఱగులా వెలిశాయి? ఎన్ని రకాల శిల్ప సంప్రదాయాలు వ్యాప్తి చెందాయి? మానవాతీతులకు దప్ప సాధ్యముకాని ఎన్ని మహాద్భుత శిల్పాలు నేటికి సజీవంగా ఉన్నాయి! కోణార్క, ఖజురహో, బేలూరు శిల్పాలకు ఖండాంతర ఖ్యాతి వచ్చిందే! ఈ శిల్పాలను చూచేందుకు రెండు కళ్ళు చాలవే! మరి యీ శిల్పాలను మూక ఉమ్మడిగా గంగలో కలవ వలసిందేనా? ఎన్ని కుడ్య చిత్రాలు; ఎన్ని దారు శిల్పాలు; దంత శిల్పాలు; లోహ శిల్పాలు; తైల వర్ణ చిత్రాలు! వీటన్నిటికి నిమజ్జన మహోత్సవం జరప వలసిందేనా? దేవాలయ సంస్కృతితో విడదీయరాని బంధం లేని కళ ఉందా? భరతనాట్యం, కూచిపూడి, కథాకళి లాంటి అత్యద్భుత నాట్యకళా సంపదా, సంప్రదాయాలూ, వాయిద్యాలూ, అలంకార విశేషములు పాతాళలోకం చేర వలసిందేనా? ఎన్నివేల వృత్తులు వెలిసి, ఎన్నివేలమంది కుటుంబాలకు జీవనోపాధి తరతరాలకు ఏర్పఱచింది? వంటవాళ్ళు, పూలు అమ్ముకునేవారు, తమలపాకులమ్ముకునేవారు, చిత్రచిత్రమైన మాలలు కట్టేవారు, స్వర్ణకారులు, అగరు వత్తుల తయారీవాండ్లు, శ్రీచూర్ణాలు, తిరుమణులు, విభూతులు! ఎన్నని? ఎన్నని! అన్నీ దేవుడు లేదంటే చిటికెలో గోవిందా! అదిగో గోవిందా అంటే మళ్ళీ దేవుని పేరేనాయె! దేవాలయ సంస్కృతి సోషలిస్టు సమాజానికి పునాది రాయి! బడుగువర్గాలకు సుస్థిరమైన జీవనోపాధిని కల్పించి, నిరుద్యోగ నిర్మూలనకై స్థాపింపబడిన ఉత్తమ నాగరికత! ఈ వ్యవస్థలో, 'నేడే కొనండి! నేడే

చూడండి! ఉచితం!!!' అంటూ అబద్ధాలతో, అర్ధసత్యాలతో, మానవుని బల హీనత ఆధారంగా అనునిత్యం ప్రకటనలను గుప్పించి, నెలలు తిరక్కముందే లక్షాధికారులుగా, కోటీశ్వరులుగా అవతారాలెత్తి, సగటు మనిషి కష్టించి సంపాదించిన డబ్బును దోచుకునే పద్ధతులు మచ్చుకు కానరావు!

సారస్వత రంగాన్ని తీసుకుందాం. రామాయణ, భారత, భాగవతం లాంటి ఉద్గ్రంథాలూ, ఉపనిషత్తులు, అష్టాదశ పురాణాలు, వేదాలు, భగవద్గీత, ఉప పురాణాలు - నీటికి నాస్తిక ప్రపంచంలో తావు లేదు కదా! మన సంస్కృతికి పునాదులే కూలిపోవూ?

టీచరుండేనే స్కూలు పిల్లలు ఇలా తయారు అవుతున్నారే! పంతుళ్ళు లేని పాఠశాలా విద్యార్థుల సంగతెలా వుంటుందో ఊహించుకోండి! పోలీసులు, పోలీసు స్టేషన్లులేని గ్రామం ఎలా వుంటుందో కాసేపు తలచుకోండి ('రేపు' కేసులు తగ్గుతాయని చమత్కరిస్తారులెండి!) సూర్యచంద్రులు నక్షత్రాలులేని ఆకాశంలా అంతా అంధకారమయం కాదూ! నక్షత్రాణి 'దేవగృహాణి' అని కదా వేదవాక్కు!

రేడియోలు, పౌరాణిక సినిమాలు, హరికథలు, బుర్రకథలు, ఒక టేమిటి - ఆమాటకొస్తే అసలు సినిమాలను నిలబెట్టింది మన పురాణాలు గావా!

దేవుణ్ణి తీసేస్తే మన ప్రభుత్వోద్యోగులకు సగం సెలవులు ఎగిరిపోవూ! పండగలన్నీ ఖతమండోయ్! ఫెస్టివల్ అడ్వాన్సులూ గట్రా నహీ!

మన నోట్లోనుంచి అనుకోకుండా అనుక్షణం దొర్లిపడే 'ఓ మైగాడ్'లూ 'ఓరిదేవుడో'లూ 'రామరామ'లూ 'శ్రీహరి'లూ-వీటికి పర్యాయపదాలు, అంత పవర్‌ఫుల్ పదాలు వస్తాయా! ( ఓ మే గాడ్ (ఓం) - అదే ఓ మై గాడ్ అయ్యుండొచ్చు!)

పీడించుకుని తినే అప్పులాళ్ళను 'నక్షత్రకులు' అంటున్నాం. ఇక్కడి మాటల నక్కడ, అక్కడి వాటిని ఇక్కడ చెప్పి తగువులు పెట్టేవారిని 'నారదుడు' అంటున్నాం ఇంకా, మన సమాజంలో 'శకునులు'న్నారు! మంథర లున్నారు! ధృతరాష్ట్రులున్నారు! బోలాశంకరు లున్నారు! 'శల్యు'లున్నారు ఇంకా ఎందరో మానవ స్వభావానికి ప్రతీకగా నిలిచిన పాత్రలు ఎన్నో వున్నాయి మరి పురాణాలు చించేస్తే వీండ్లకేం బిరుదులివ్వాలో వెతుక్కోవాలి!

అందుకే దేవుడు లేని సమాజం తలచుకుంటేనే నాకు అమిత భయం!

మా ఫ్రెండ్ వితండేశ్వర్రావ్ అంటుంటాడు: దేవుడు కనబడితే మనకు ముందు పక్షవాతం రావడం ఖాయమట! ఎందుకూ అంటే నోరు పెగలదు. కళ్ళు బైర్లుకమ్ముతాయి. కాళ్ళు చేతులు ఆడవు! అందుకని లోక కళ్యాణార్థం కనబడదట!

—: o :—

# 28. బేరం – నేరం

'Market is a place where the buyers and sellers gather with an attempt to deceive each other' అని ఎవరో చెప్పాట్ట! 'అమ్మేవారూ కొనేవారూ పరస్పరం మోసగించుకొను ప్రయత్నం చేయు చోటునే మార్కెట్ అందురు' అని దీని అర్థం! నిజమేనేమో! వచ్చిన చిక్కల్లా ఈ ప్రయత్నంలో, ఎప్పుడూ అమ్మేవాడిదే, పైచేయిగా వుంటుంది నూటికి తొంభై తొమ్మిది కేసుల్లో!

ఒకసారి 'ఊటీ' కెళ్ళా. నాకెందుకో 'ఊటీ' పేరు నచ్చలేదు, ఏదో 'లూటీ' లాగావుంది. లక్షణంగా 'ఉదక మండలము' అని వుండగా 'ఊటీ'లూ లూటీలూ ఎందుకు? అక్కడ హోటళ్ళ వాళ్ళూ, లాడ్జిల వాళ్ళూ బసకు రోజుకు మూడు నాలుగు వందలు, భోజనానికి ముక్కుపిండి, ముప్పైలూ, నలభైలూ వసూలు చేస్తూ, అర్ధ కడుపుకు అన్నం పెడుతూ, నిజంగానే లూటీ చేస్తారనుకోండి!

ఈ ప్రపంచమే ఒక లూటీ కొంప! ఈ లూటీ అసలు పాలకుల దగ్గర నుంచే ప్రారంభమవుతుందాయె! కాలేజీల్లో సీట్లకాడి నుంచి, కాలేజీలేం ఖర్మ యల్.కె.జీ సీట్ల నుంచి, సర్కారు దవాఖానాల్లో బెడ్లకాడి వరకూ లూటీ! పట్టపగలు లూటీ! 'ప్రపంచము' అంటేనే 'మోసము' అనే అర్థం కూడా ఉందాయె! "ఏమున్నది గర్వకారణం, నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం' అని, దేశ చరిత్రలన్నింటినీ, కాచి వడబోసి, ఆంధ్రకవితా హాలికుడై, ఆల్కహాలికుడై చెప్పలేదూ! ఎవరు? మహాకవి శ్రీశ్రీ! ఆయనగారి

కవితాధార అంతా ఆల్కహాలులోనే వుందేమో! 'ఓ హెయెం' రాయాలంటే "ఓపియం" అయినా పడాలి, వోడ్కా అయినా పడాలేమో మరి!

'ఊటీ'ని....అదే.... ఉదక మండలాన్ని దక్షిణ దేశపు కాశ్మీర మన వచ్చు. అత్యంత మనోహర ప్రకృతి సౌందర్యం, మెడ కండరాలకు శ్రమ కల్గించే మహోన్నత పర్వత శ్రేణులు, సుందరమైన లోయలు, ఏరులు, సెల యేరులు, సరస్సులు! మధ్యందిన మార్తాండుడు సైతం తన కిరణాలను ప్రస రించలేక, తలవంచుకొని, మబ్బుల ముసుగులో, మొగము చాటు చేసుకొని, పక్కకు పోయేటట్లు చేసే దట్టమైన అరణ్య ప్రాంతాలు,కాఫీ, తేయాకు తోటలు! వీటిని తిలకిస్తూంటే వొళ్ళు పులకరిస్తుంది! భూతాల దుర్గాల్లా వుండే నగర వాసులకూ అదునిక వర్గాలవారికీ, ఆ ధనిక వర్గాలవారికీ 'ఊటీ' భూతల స్వర్గం! దేవునికి సమదృష్టి అనే వాదమును పూర్వ పక్షం చేస్తుంది. భవ బంధాల నుండి తప్పించుకుని, ఉదకము, దండము, కమండలములను పుచ్చు కొని ప్రశాంతంగా తపస్సు చేసుకోదగిన మండలము ఉదక మండలము! **forest అంటే a place for rest !**

అలాంటి ప్రసిద్ధ టూరిస్ట్ కేంద్రాల్లో ఏదో జ్ఞాపకార్థం. యధాశక్తి ఒక షాల్ కొందామని తాపత్రయ పడ్డా. ఒక షాల్ మూడొందలు చెప్పారు! గంట సేపు గీచి గీచి బేరమాడి (ఊటా మాడిం తర్వాత కాబట్టి తీరుబడిగా వుండింది!) డెబ్బైకి సాధించా. షాల్ స్పెషల్ క్వాలిటీ అట. చాలా బాగుంది! కాదంటే తడిపే కొద్దీ, వెలిసిపోయి, అంచెలంచెలుగా, ముందు అడ్డ పంచగా, తర్వాత టవలుగా, తుండుగుడ్డగా, చివరకు కర్చీఫ్‌గా అవతారాలు ఎత్తింది. అదేనేమో స్పెషల్!

ఈ బేరం అంటేనే నాకు పరమ చిరాకు! ఎక్కువగా మేధావులూ, విద్యావేత్తలూ, వీళ్ళే ఈ 'బేరం' అడే పరీక్షలో తప్పి కూర్చుంటారు! వాళ్ళకు బేరమాడటం నామోషి. ఈ బలహీనతే అమ్మే వాళ్ళకు పెట్టుబడి! ఈ సంగతి

అక్షర జ్ఞానం లేని హాకర్సు"కు బాగా తెలుసు! చివరికి కరివేపాకూ, కొత్తిమీరి అమ్మే పదేళ్ళ కుర్రాడికి కూడా మనం అంటే లోకువే. ఒక షాపింగ్ విషయం లోనే గాదు- అన్ని చోట్ల చదువుకున్నవాళ్ళే చిక్కుకుంటారు.

ఒకసారి టైలర్ దగ్గిరకెళ్ళా. వాడు ఖరీదైన గుడ్డముక్క కొట్టేసి వాడి బిడ్డకెక్కడ కుట్టుకుంటాడో అని నా బెంగ. "చేతులు కొంచెము క్రిందికి పెట్టి కుట్ట"మంటే "అబ్బే బాగుండదుసార్! మీ ఇష్టం నాదేం పోతుంది. పెట్టమంటే అలాగే పెడతా!"అని ఒక నయ వంచకుని నవ్వు నవ్వి, ఊరుకుంటాడు! అంతే నేనే గొయ్యి తవ్వుకొని ఏడ్వలేక"నవ్వుతూ వద్దా!

ఇంటికి రంగులు వేయిద్దామని ఒకసారి పెయింటర్‌ను పిలిపించా. వాడు చూపించిన రంగుల ఛార్ట్‌లో ఒక దాన్ని సెలెక్ట్ చేశా. 'అబ్బే! ఈ రంగు ఏమీ బాగుండదు సార్. ఇవన్నీ ఆఫీసులకేసే రంగులు! మీ ఇంటికి లైట్ కలరే బాగుంటుంది" అని నన్ను ఒప్పించేంతవరకు కూర్చున్నాడు!

మంగలి షాపు కెళ్లా. వెధవ తల, నెల దవ్వక ముందే, సారీ నెల తిరక్కముందే ఏపుగా పెరిగి కూర్చుంటుంది "సైడ్సు కొంచెం తగ్గించ'మంటే, "తలంతా ఖరాబు అవుతుంది సార్! ఆ తర్వాత నన్నొదగొద్దండి!" అని వార్నింగ్ ఇస్తాడు. అంతే! అంతా వాడి ఇష్టం! తల వంచేసుకొని, వాని మాటే 'శిరసా' వహిస్తా! ఇంటికి వస్తే శ్రీమతి 'క్షవరానికి వెళ్తానన్నారు. వెళ్ళలేదా?' అని అడుగుతుంది! 'వెళ్ళకపోవడ మేమిటి, వది రూపాయల క్షవరం చేసుకొని వస్తేనూ' అంటా.

కూరగాయల వారి దగ్గర కెళ్లా ఒకసారి. "బీరకాయలు ముదిరి నట్లున్నాయే" అన్నా. "వీటిని ముదిరినయంటారయ్యా! ఎవ్వరన్న బీరకాయలు తిన్నావయ్యా!" అని ఒక కాయ సగానికి విరిచి చూపిస్తుంది. మన అజ్ఞానాన్ని ఎక్కడ వసిగడుతుందో అని సంకోచపడి, కిమ్మనకుండా బీరకాయలు సంచిలో వేయించుకుంటా. తర్వాత కథ వద్దు లెండి-ఇంట్లో వషట్కారాలు!

సైకిలు రిపేరి వాడి దగ్గర కానీయండి, ఎలక్ట్రిషియన్, రేడియో రిపేరర్, టి వీ. ఏవైనా కానీయండి వాడు ఏ పార్టును మార్చాలంటే మార్చి తీర్చాల్సిందే. లేకపోతే ముందుగానే ఎర్ర జెండా చూపిస్తాడు!

ఇలా ఇలా వుంటాయి "మన" పరిస్థితులు 'మన' అని నా అనుభవాలన్నీ మీకు కూడా అంటగడుతున్నందుకు మన్నించాలి! అందరూ నా బాపతే అని నా దృఢ విశ్వాసం. మీకు చెప్పుకునేందుకు నామోషీ. నాకు నామోషీ లేదు! అంతే!

బస్సు స్టాపుల దగ్గర గంటల తరబడి నిలబడుతారు చాల మంది. నాకు నామోషీ లేదు. ఫుట్‌పాత్ మీదనే క్రింద కూర్చుంటా, ఎండలో తువ్వాలు నెత్తిమీదేసుకొని. ఎంత హాయిగా వుంటుందనుకున్నారు. ఇహ బస్సు ఎప్పు డొచ్చినా పర్వాలేదనిపిస్తుంది. అంతే, నేను కూర్చొన్నది చూచి, మరొకడు, ఆ తర్వాత ఇంకొకరు అయిదు నిముషాలయ్యేటప్పటికి దాదాపు అందరూ కూర్చుంటారు. గమనించండి- ఏ గొట్టం పాంటుగాళ్ళో తప్ప. అయ్యో! ఇందాకటి నుంచి యీ పని చేయకపోయామే అని కూడా నన్ను జూచి లోలోపల అసూయ చెందియుంటారని కూడ నా అనుమానం.

బేరం గురించి మొదలెట్టి, విషయానికి దూరమౌతున్నానని అనుకునేరు. భోజనంలో అన్నంతోపాటు వ్యంజనాల్లాగా వేరే టాపిక్స్ వస్తుంటాయి మరి.

క్రికెట్ ఆటల్లో ప్రపంచ వ్యాప్తంగా ఆడువారి చేత (ఆటగాళ్ళ చేత అనాలి కాబోలు!) ప్రేక్షకుల చేత, శ్రోతల చేత, వీటికి సంబంధించిన చర్యల చేత వృధా అయ్యే కాలం కన్నా, బస్సు క్యూలలో, సినిమా క్యూల్లో, పాల బూతులలో, రైల్వే స్టేషన్లలో, బాంకుల్లో, ఇంకా....అ....ఆ ఇరుగు పొరుగు వాళ్ళతో కాంపౌండ్ వాల్స్ దగ్గర ఊబుసుకపోక కబుర్లల్లో (దీనికి మా వాడు C W.C. అని ముద్దు పేరెట్టాడు. కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ కాదు.

'కాంపౌండ్ వాల్ కాన్ఫరెన్స్'లు!) వృధా అయ్యే మాన్ అవర్స్ కన్నా (ఉమెన్ అవర్స్?) ఈ బేరం వ్యవహారంలో వృథా అయ్యే కాలం విలువ కట్టలేనిది!

ఈ పాడు బేరం పద్ధతికి ఎవరు ప్రారంభోత్సవం చేశారో? బహుశా, నారదుడై ఉండొచ్చు. 'బలే మంచి చౌకబేరమూ' అంటూ కృష్ణ తులాభార ఘట్టంలో పాడుతాడు. మరి నిజంగా అలా జరిగిందో, ముక్కు తిమ్మనగారి పైత్యమో తెలీదు. శ్రీకృష్ణుడికి ఆరామ్ లేకుండా ఊరంతా తిప్పాడు బే+ ఆరామ్ అనే రెండూ పదాలూ కలిసి బేరం అయ్యుండొచ్చు! సాహితీవేత్తలు ఒప్పుకోరనుకోండి.

ఈ బేరం అనేది శాస్త్రము కాకున్నా ఖండితంగా 'కళ' అంటాడు మా మిత్రుడు మిస్టర్ బేతవోలు రంగారావు. చనువున్నవాళ్ళు వాడిని 'బేరం' అని పిలుస్తారు. ఈ మధ్యనే వాడికి రంగారావ్ డి. బార్ అని పట్టా ప్రధానం చేశాం కూడా. Doctor of Bargain! ఈ కళకు వాకచక్యం కావాలి. మాటలు నేర్వాలి. ఇరువైపుల వారూ. ఈ విద్య అందరికీ అబ్బదు! బేర కళా ప్రవీణులవద్ద ఆరుమాసాలైనా అప్రెంటిస్ చేస్తేగానీ, ఆకళలోని మెలుకువలూ, కిటుకులూ, రహస్యాలూ తెలియవు. మగవారు, వారి వారి వయసును బట్టి సేల్సుగర్ల్స్ వద్దకూ, ఆడువారు సేల్సుమన్‌ల వద్దకూ వెళ్ళి కొనాలిట. ఇది నెంబర్‌వన్ రహస్యమట! మనస్తత్వ శాస్త్రానికి సంబంధించిన సూత్రమట!

"ఫారిన్ నైలెక్స్ చీర సార్!" అని పాంటు జేబులోనుంచి తీసి, రహస్యంగా చెవిలో ఊదుతూ చాటుగా చూపిస్తాడు. మనల్ని ఏదో ఉద్ధరించ డానికి వచ్చినట్లు! ఈ కాలంలో అన్నిటికీ డూప్లికేట్లు వచ్చాయి- మనుష్యుల్లో లాగానే. ఏది అసలో ఏది నకిలీనో పసిగట్టలేనంత పరిపక్వత చెందిందీ కళ. చీరను పర్ పర్ అని నలుపుతాడు. లాగుతాడు. పిండుతాడు. నాలుగొందలు అంటాడు. యాభై కే ఇచ్చేసి పక్కసందుకెళ్ళి పత్తా లేకుండా పోతాడు! అమాయక శిరోమణులకు కుచ్చుటోపీ పెట్టి చల్లగా జారుకుంటాడు.నవ్వుకోకండి,

నా వద్ద అలాంటి కుచ్చు టోపీలు బోలెడు వున్నాయి. కానీ దేవతల తయారీ కనుక చర్మచక్షువులకు కనబడవు!

కొన్ని స్టాండర్డు షాపులుంటాయ్. ఫిక్సెడ్ రేట్లు. ఫికర్ లేకుండా కొనవచ్చు. పేచీలేదు. పూచీకూడా వుండొచ్చు. సాధ్యమైనంతవరకూ అలాంటి షాపులకు వెళ్ళితే సమయం వృథాకాదు. కొంచెం తైలం వదలొచ్చు!

ఈ కంప్యూటర్ యుగంలో కూడా ఈ బేరం పద్ధతి ఏం బాగులేదు. విదేశాల్లో ఈ బేరం ప్రక్రియ వుందో లేదో తెలీదు. నేనే గనుక ఏ ముఖ్య మంత్రినో, ముఖ్యమంత్రిగారి అల్లుడినో, వారసుడినో, బామ్మర్దినో అయ్యుంటే ఇలా నాలుగింతలు రేట్లు పెంచి, చెప్పి, మన కాలాన్ని, డబ్బును దోచేవాళ్ళను కటకటాల్లో పెట్టించేవాణ్ని. కనీసం చట్టం పెట్టించేవాణ్ని, అమలుకు నోచుకోని చట్టాల్లో ఇది ఇంకొకటిగా వుండొచ్చుగాక! బేరము చేయుట, చేయించుట నేరము అని బహిరంగ స్థలాల్లో బోర్డులు పెట్టి, రేడియోల్లో టీ.వీ.ల్లో ప్రకటనలను గుప్పించి కొన్ని లక్షలు ఖర్చుపెట్టించివుండేవాడిని డబ్బు సర్కారుది కానీ నాది కాదు కదా!

అలా అయితే, రోజూ కొన్ని లక్షల గంటలు ఆదా అయి తద్వారా దేశంలో వుత్పత్తి (జనాభా కాదు!) పెరుగుతుంది!

మరి ఆ విధంగా ఆదా చేసిన విలువైన కాలాన్ని కూడా పేకాటల్లో క్లబ్బుల్లో, కబుర్లలో, బార్లలో, పితూరీలు చేరవేసి కజ్జాలు పెట్టించడంలో, ఆఫీసు వేళల్లో క్రికెట్ కామెంటరీలు వినడంలో-ఇంకా, ఇంకా వేటిలోనో గడిపే స్వామనే వారికి ఒక్క నమస్కారం!

అయినా చట్టాలవల్ల ఆట్టే ప్రయోజనం వుండదు లెండి. హద్దులేవు ప్రభుల చట్టాలకూ, అడ్డురావవి వారి చుట్టాలకూ! ఏమంటారు?

—: 0 :—

# 29. నవ్వు

మన పూర్వ కవులకు, ప్రబంధ కాలము నాటి కవులకు రచయితలకు, (శ్రోతలకు కూడా లెండి) హాస్యమంటే పెద్దగా గౌరవము లేదేమో అనిపిస్తుంది. తెలుగువారు నూటికి నూరుపాళ్ళు హాస్యప్రియులే! కానీ అదేమి శాపమో, పాపమో సాహిత్య భాండాగారములో హాస్యరస ప్రధాన గ్రంథాలు తక్కువనే చెప్పాలి. హాస్యరసాన్ని నవరసాల్లో ఒకటిగా పేర్కొన్నారనుకోండి. కానీ దానికి ప్రత్యేక స్థానాన్ని, గౌరవ ప్రపత్తులను ఇచ్చినట్లు పెద్దగా కనబడదు. హాస్యమంటే ఏదో వెకిలి చేష్టలకూ, వెటకారానికీ, అసభ్య, కుసంస్కార సంభాషణలకూ పరిమితమైనట్లు కన్పిస్తుంది.

హాస్యానికి మారు పేరుగా, వికట కవిగా చలామణి అయిన తెనాలి రామకృష్ణ కవి వ్రాసిన గ్రంథాల్లో కూడా హాస్యం అంతగా పోషించబడినట్లు లేదు. ఆయనచే చెప్పబడినట్లుగా ప్రచారములో నున్న పద్యాల్లో తృతీయశ్రేణి హాస్యమేదప్ప, హృదయ రంజకంగా సభా రంజకంగా అనిపించదు. "లంజల కొడకా".... అని, "సిగ మొదలంట కోసెదను, చెప్పున కొట్టెద మోము దన్నెదన్" అనీ "చూతునె లవుడా యటంచు సూక్తులు పలికెన్...." "అనీ ఎరిపుచ కయ తిని నెపితివా, ఉమెత కయ తిని నెపితివా...." అంటూ చెప్పినట్లు గొప్పగా ప్రచారం జరిగింది. అంతటి మహాకవి నిజంగా అలా చౌకబారుగా పలికాడా అని, మనవాళ్ళు వాళ్ళ వాళ్ళ నోటి దురద ఆయన పేరు మీద తీర్చుకున్నారా అని నా అనుమానం.

హాస్యరసం సమపాళ్ళలో, ఎబ్బెట్టుగా కాకుండా బాగా పోషించబడింది ఈ శతాబ్ది ప్రారంభం నుంచేనేమో! నరసింహ త్రయం అనదగ్గ శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు, చిలకమర్తి లక్ష్మీనరసింహం, మొక్కపాటి నరసింహ

శాస్త్రి తెలుగు హాస్యానికి ప్రాణ ప్రతిష్ఠ చేశారు. మునిమాణిక్యం నరసింహా రావు కూడా ఈ కోవలోనివాడే. భీనాదేవి, భానుమతి, డా. రావూరి హాస్యానికి బాగా ప్రాముఖ్యత ఇచ్చారు. వీళ్ళే లేకుంటే తెలుగు హాస్యం కోసం కాస్తా అడుగంటిపోయియుండేది అన్నా అతిశయోక్తి కాదు. నవరసాల పోషణలో. 'నవ్వు' రసపోషణ అనుకున్నంత అల్లాటప్పా వ్యవహారం కాదండోయ్! ఒక జోకును సృష్టించడం 'జోకు' కాదు.

మరీ ఇంత ఘాటుగా విమర్శిస్తున్నందుకు మన్నించండి. దాఖలాలు లేనిది అనడానికి సాహసించను 'నవ్వు నాలుగందాల చేటు' అనే సామెత మనదే. దీనికి సోదాహరణంగా మయసభ ఘట్టంలో ద్రౌపదీగారి నవ్వు అనీ, రామ రావణ యుద్ధమునకు నాంది రావణాసురుడు సీతా స్వయంవరంలో, శివ ధనస్సును ఎక్కుపెట్టబోయి, ధనుర్భంగ ఘట్టంలో శృంగ భంగము చెంది నపుడు సీతమ్మగారి నవ్వు అనీ, వినాయకుని చూచి చంద్రుడు నవ్విన కారణంగా, వినాయకుని శాపం తగిలి, విశ్వ వ్యాప్తంగా, కాదు భారతదేశ వాసులకు మాత్రమేనేమో, ప్రజలకు అసౌకర్యం కల్గుతుందనీ, అందుచే వినాయక వ్రతం చెయ్యాలనీ, ఇంకా ఏదో "లక్ష్మణ దేవర నవ్వు" అనీ, అంజనేయుని నవ్వు అనీ, అదనీ ఇదనీ అదరగొట్టారు!

"ఏడ్చే మగవారిని, నవ్వే ఆడువారిని" నమ్మకూడదని తర్కానికి ఏ మాత్రం నిలబడని సామెతను సమాజములోకి పాకించి ప్రచారం చేశారు. భావోద్వేగం, కోపోద్రేకము, స్త్రీ పురుషులకు సమానం కాదా? నవ్వుకూ నమ్మకూడదనే దానికీ సంబంధం ఏమిటి? నవ్వని వారినే నమ్మగూడదంటే కొంత నిజం వుంది.

సకల జీవరాశిలో బాగా నవ్వగలిగిన ప్రాణి మానవుడొక్కడే. అసలు 'మానవుడు' అనే పదంలోనే 'నవుడు' అని వుంది! అంటే నవ్వేడు అనే నా వ్యాఖ్య! కోతులు కూడా నవ్వుతాయనుకోండి. కానీ, మనంత సంపూర్ణంగా,

అనుభూతులతో నవ్వవు. సిగ్గుపడేదీ మానవుడు ఒక్కడే. జంతు కోటి సిగ్గు పడవు. 'మాన' శబ్దం కూడా 'మానవుడు'లో లేదూ! అందుకేనేమో, మానం పోయే పనులూ, నవ్వుకునే పనులూ మానవులే చేస్తారు!

పాశ్చాత్యులు, నవ్వును నవ్వులాటగా తీసికోకుండా సీరియస్‌గానే తీసి కున్నట్లు తెలుస్తుంది. 'గోథే' అను మహాశయుడు "మానవుడు దేనిని చూచి, లేదా ఏ విషయము మీద నవ్వుతాడో దానినిబట్టి వాని స్వభావమును గ్రహించ వచ్చు" అన్నాడు. 'Laughter is the best Tranquilliser with no side effects' అన్నాడు ఆర్నాల్డ్ గ్లాసో అనువాడు, 'A Smile is a Small curve which makes many things straight' అన్నాడు మరొకడు. వీరంతా ఏ దేశం వారో, ఎక్కడ అన్నారో నన్నడగొద్దండి. నాకు అంతమటుకే తెలుసు. ఎక్కడిదో కొట్టేశా. అసలు పదిమందితో కొట్టేయబడేదే కొటేషన్!

"యద్దినం తద్దినం నాస్తి తద్దినం మమదుర్దినమ్" అని మన కొక హాస్య పరమైన ఒక మోటు కొటేషన్ ఏడ్చింది. ఇది సంస్కృతంలో కాబట్టి కొంత ఊరట. తెలుగులో లేకపోవడంవల్ల కాస్త ఉపిరి తీసుకుందాం. 'ఏ రోజు నాకు ఎక్కడా తద్దినం బ్రాహ్మణార్థం దొరకదో ఆ రోజు నాకు చెడ్డ రోజు' అని అర్థం! అంతేగానీ, ఏ రోజు నేను ఒక్కసారి కూడా నవ్వలేకపోయ్యానో ఆ రోజే నాకు చెడ్డ రోజు' అని అన్న పుణ్యానికి ఎవ్వడూ పోలేదు. అదే ఒక ఆంగ్ల కవి సెబాస్టిన్ అనువాడు 'The most wasted day of all is that on which we have not laughed' అని ధైర్యంగా బల్ల గుద్ది, లేదా గుండె మీద చెయ్యి వేసుకొని చెప్పగలిగాడు!

ఏ మాట కామాటే చెప్పుకోవాలి. పాశ్చాత్యులను 'అప్రాచ్యుల'ని మనము హేళన చేసినా, ఆ అప్రాచ్యులే రసజ్ఞులు. 'రస' ప్రియులే కాదు. హాస్యరసప్రియులు! అంతర్జాతీయ స్థాయిలో ఒక ఉత్తమ జోకుకు, ఒక

ఉత్తమ అబద్ధానికి బహుమతులిస్తారు! మనమూ ఉన్నాం. ఎందుకు? పరస్పర దూషణకు! లోలోపల గొయ్యి తవ్వేందుకు! లేదా ఆత్మవంచనకు ఒడిగట్టి ఒకరినొకరు భట్రాజు పొగడ్తలు చేసికొనేందుకు! బహిరంగంగా ఒక రకంగా అంతరంగికంగా మరొక రకంగా మాట్లాడేదానికి! కనీసం ఇలాంటివాటికైనా బహుమతి పద్ధతి ఉంటే బాగుండు.

మహాకవి తిక్కనగారు భారతంలో నవ్వుల రకాలను పరిశోధించి, పరిశీలించి, వర్ణించారు. కలకలనవ్వు, పకపకనవ్వు, నవ్వుగాని నవ్వు, ఇలాఇలా .... స్మితమనీ, మందస్మితమనీ, అతిహసితమనీ, విహసితమనీ, దరహాసమనీ, ఇలా ఏవో అలంకార శాస్త్రజ్ఞులు వివరిస్తారు నాబోటి అజ్ఞులకు వీటిలోతులు తెలియవు. కొందరు నవ్వితే గుఱ్ఱము సకిలించినట్లు గాడిద ఓండ్ర పెట్టినట్లు, సీమఁపాకాయ పేలినట్లు, ఏడ్చినట్లు ఉండటం చూస్తుంటాము.

మేము మా యింట్లో నవ్వును నినీ ఆక్టర్ల పరంగా వ్యవహరించుకుంటాం. లింగమూర్తి నవ్వు, రావుగోపాలరావు నవ్వు, రేలంగి నవ్వు, అల్లు రామలింగయ్య నవ్వు-ఇలా గుర్తులు పెట్టుకున్నాం. బ్రహ్మానందం. గొల్లపూడి మార్కుల నవ్వులకు కూడా ట్రేడ్ మార్కులు రావచ్చు. వారి వారి ప్రత్యేక బాణీ నవ్వులకు తెలుగువారు తలెత్తుకొని తిరగొచ్చు!

ఫలానా రకం నవ్వు నాలుగుదాల చేటు అనీ, అనర్థదాయకమనీ హెచ్చరిస్తే పరవాలేదు గానీ అసలు 'నవ్వే నాలఁగందాల చేటు' అనడంలో తెలుగువారు ఇతరుల దృష్టిలో నవ్వులపాలు కారూ?

నవ్వు వినఁబడకూడదు, కనబడాలి అన్నారు పెద్దలు. ఈ సలహా అంత శాస్త్రీయంగా వున్నట్లులేదు. ఒకరిని నొప్పించనంతవరకు నవ్వుకు హద్దులు అనవసరము. పొట్ట చెక్కలయ్యే నవ్వులోనే ప్రొటీనులు, విటమినులు, ఖనిజము లున్నమాట నిజము!

ఉద్రేకాలను, ఉద్వేగాలను అణచుకోవడాన్ని మానసిక శాస్త్రజ్ఞులు అంగీకరించరు. వినబడని నవ్వు సభ్యతకు సంస్కారానికి చిహ్నం కావచ్చు కానీ అది ఏ రక్తపోటు వాడికో అన్వయిస్తుంది. నీరసంగా పేలవంగా జబ్బు మనిషి నవ్వులా ఉంటుందే గానీ అందులో 'మజా' ఉండదంటా. అలాంటి బ్లాక్ అండ్ వైట్ నవ్వు ఎకనామి నవ్వు. ఎనీమియా నవ్వు నవ్వే బదులు నోరు మూసికొని కూర్చోవడం శ్రేయస్కరం! ఈగలు, దోమలు దూరవచ్చు, తుంపర్లైనా పడకుండా వుంటాయ్. నవ్వితే 'కలర్' లో ఫుల్ వాల్యూమ్ నవ్వాలి! నవ యవ్వనులుగా కనిపించాలి అంటే ఎల్లప్పుడూ ఉల్లాసంగా నవ్వుతూ ఉండాలి. నవ్వే యవ్వన రహస్యం. రోజు కొక జోకైనా వేయటం, కనీసం వినటం అలవాటు చేసుకోవాలి. జోకుకూ జగన్నాథ క్షేత్రానికి ఎంగిలి దోషం లేదట!

మంచి జోకు అంటే ఏమిటి అని అడిగితే తేల్చి చెప్పడం కాస్త కష్టమే. పేల్చిన సమయం సందర్భాలనుబట్టి, వినేవారి "మూడ్"ను బట్టి సాదా జోకు కూడా నవ్వులు కురిపించవచ్చు. టాప్ జోకు ఫ్లాప్ కావచ్చు. కొన్ని జోకులు వెంటనే సగటు మనిషికి అర్థమైచావవు. ఎదుటివారి రసజ్ఞతను బట్టి జోకు 'తుస్' అనీ 'ఢాం' అనీ పేలుతుంటాయి. ట్యూబులైట్ బావతుగాళ్ళ వద్ద జోకులు వేస్తే మన మొగాలే వెలవెల బోవచ్చు. జోకు వెల వడిపోవచ్చు. అందుకనే ఎవడో అన్నాట్ట- **"Best joke is laughed at THRICE first when it is told, second when it is explained and thirdly when it is understood!"** అని. ఈ జోకు పరమార్థం మీకు అర్థంగాకుంటే మీరు ట్యూబులైట్ కాటగిరీ అని అనుకోవచ్చు! కాబట్టి అర్థమైనట్లు ముఖం పెడతారనీ నాకు గ్యారంటీగా తెలుసు!

**Now a days** లో హాస్యప్రధాన పత్రికలు మార్కెట్‌లోకి వస్తున్నాయి కొన్ని నిలద్రొక్కుకోలేకపోతున్నాయి. నవ్వేదేస్ త్వరలో వస్తాయని ఆశిద్దాం.

డోన్ట్ వరీ డోన్ట్ వరీ చదువరీ!
వరీ నిన్ను క్రుంగదీయు గో మెర్రీ!!

—: o :—

# 30. మౌన మహిమ

'స్పీచ్ ఈజ్ సిల్వర్, సైలెన్స్ ఈజ్ గోల్డ్' అని ఆంగ్ల సూక్తి. "వక్తృత్వం వెండి, మౌనం బంగారం" అని అర్థం. మరి ఇనుము, ఇత్తడి లాంటివేవో చెప్పలేదు. బహుశః వక్తృత్వం వెండి అయితే వాగుడు అతి వాగుడు ఆ కోవకు వస్తాయేమో! వెండి, బంగారం విలువైన లోహాలే కావచ్చు. కానీ ఇనుము, ఇండాలియం, ప్లాస్టిక్ లాంటి అతి చౌక లోహాలతోనే ప్రపంచం మనుగడ ఆధారపడుతూంది. వెండి బంగారం లేకున్నా కొంపమునిగి పోదు. నిజానికి అవి వుంటేనే వాటిని కాపాడ లేక అవస్థపడతాము. విమానాలు తయారీల దగ్గరనుంచి, వంటింటి సామాన్ల వరకు ఇండాలియం, అల్యూమినియం, స్టీలు, ప్లాస్టిక్ లోహాలే ప్రముఖ పాత్ర వహిస్తున్నాయి.

ఇలా చెపుతూన్నానని, మౌనంగా వుండటం అంత మంచిది గాదని చెప్పటం నా ఉద్దేశంము కాదు. ఆంగ్ల సూక్తిలోని పోలిక 'సిమిలి' అంత సరిగా లేదేమోనని! అదే మన పూర్వీకులు (వారు దేంట్లోనూ పూర్‌గా వీక్‌గా వున్నట్లు దాఖలాలు లేవు). "పలుకక యుండుట కంటె దగ పల్కుట మేలు వినుండు" అని సెలవిచ్చారు గాని, నోరు మూసికొని పడియుండమని చెప్ప లేదు. అంతేగాక "విభూషణం మౌనం అపండితానాం" అపండితులకే మౌనం భూషణం అని భర్తృహరి కూడా అభిప్రాయ పడ్డాడు. సత్యం బ్రూయాత్, ప్రియం బ్రూయాత్, న బ్రూయాత్ సత్యమప్రియం. ఇలా ఎలా జనరంజకంగా కలహాలు రాకుండా, మెలగాలో సలహాలు ఇచ్చారు. ఈ శ్లోకానికి మా వితండేశ్వర్రావు వ్యాఖ్య సరేసరి. 'బ్రూ'యే సత్యమైన శుభోదయ పానీయమనీ దానిని అతిథులెవరొచ్చినా ఈయమనీ కానీ, చాలా ప్రియమైనదనీ ఈ 'బ్రూ' పురాణకాలం నుండే వస్తూన్నదనీ అంటాడు. వాడి వ్యవహారమే అంత! వికటార్థాలు పీకడంలో ప్రథముడు. ఒకసారి సుందరకాండలో "తాం స విద్యుత్

ఘనా కీర్ణాం జ్యోతిర్మార్గ నిషేవితామ్" అని వుంటే దానికి 'ఆంజనేయుడు నిత్యమూ ఘనమైన 'జ్యోతి' మార్కు విద్యుత్ రేజర్‌తో షేవ్ చేసికొనువాడు' అని అర్థం చెప్పాడు! "చారు తద్వదనం దృష్ట్వా తామ్ర శుక్లాయ తేక్షణం" అంటే సీతమ్మ వారు 'చారు' తెల్ల చింతపండుతో (తామ్ర, శుక్ల) చేసిందని వ్యాఖ్యానించాడు. పోనివ్వండి. అవునంటే వాడి దారిన వాడు పోతాడు. వాడితో వాదము ఏనాడో మానేశా.

ఇంతకూ స్పీచ్ ఈజ్ సిల్వర్‌ను గురించి కదూ, మనం ముచ్చటించు కునేది. నా మటుకు నాకు Speech is Silver అనే దాని కన్నా Speech is shiver అంటే బాగుండేదనిపిస్తుంది. నాకు ఉపన్యసించడం అన్నా సన్య సించడం అన్నా (తారకరాముని మార్కు సన్యాసం కాదండోయ్!) చచ్చేంత భయం! ముచ్చెమటలు పోస్తాయి. ప్రసంగం అంతా బట్టీబెట్టుకున్నా, రంగం మీదికి పోగానే కంగారు పుట్టి ఎక్కడో లింకు ఊడిపోతుంది. గొంతు పెగ లదు. 'సెబాసు' అనిపించుకోవాలని ఉబలాటపడి 'అభాసు' పాలవుతా! అంచేత సైలెన్స్ ఈజ్‌గోల్డ్' సూత్రం నాకు మహాబాగా నచ్చింది. రక్షించింది. గోల్డ్ ఏమిటి? దానికన్నా ఖరీదైన ప్లాటినమ్‌తో పోలుస్తా! అసలు ఈ సూక్తి ఎవడో ఉపన్యసించడం చేతగాని దద్దమ్మ కనిపెట్టాడనీ, దాన్ని దర్జాగా చలామణీ చేసింది కూడా ఆ బాపతు వారేననీ మా వితండేశ్వరరావు ఉవాచ. వాడి అభిప్రాయం ఏమంటే-అందరూ 'సైలెన్స్ ఈజ్ గోల్డ్' అని పెదవులను బిగబట్టి కూర్చుంటే ప్రపంచం ఎంత చైతన్యరహితమై, రసహీనమై పోయుండేదో? నాటి శంకర, రామానుజ, మధ్వాచార్యుల దగ్గరనుండి ఈ శతాబ్దం జిడ్డు కృష్ణమూర్తి, చిన్మయానందల దాకా మతప్రవక్తలూ, మహాత్మా గాంధీ, నెహ్రూ, సుభాష్ చంద్రబోస్ లాంటి రాజకీయవేత్తలూ మనదేశమునకు స్థిరకీర్తి తెచ్చిపెట్టియుండేవారా? చికాగో నగరంలో వివేకానందుడు గళం విప్పకుండా వుంటే భారతీయ సంస్కృతి, హిందూమత తత్త్వము విదేశాలకు తెలిసియుండేదా?

కాబట్టి, 'వాగను' శాసనులను బాగా వాగనివ్వాలి. అవి పసిడి పలుకులైతే ప్రజలు బ్రహ్మరథం పడతారు. సొల్లు కూతలైతే "చల్ రే, చల్' అని వారి భరతం పడతారు! వాక్స్థానంలో మంచిగ్రహాలు, మంచి స్థితిలో వుంచే వాళ్ళకు ఈ 'మౌనవ్రతం' నచ్చదు గాక నచ్చదు. ఎవడో ఒక ఆంగ్లవక్త ఏకాంతంగా అడవుల్లోకి వెళ్ళి, వృక్షాలనే ప్రేక్షకులుగా, శ్రోతలుగా భావించుకొని బిగ్గరగా ఉపన్యాసం దంచేశేవాడట! తేలు కుట్టకుండా వుండమంటే వుంటుదా?ఉపన్యసించ వద్దు అంటే వీళ్ళు అంతే.'మైకా'సురులు! స్టేజి ఫియర్ నాబోటివాళ్ళకు సహజమెట్లో 'స్టేజి ఫీవర్' కొంతమందికి అంత సహజం!

అయితే, సైలెన్స్ఈజ్ గోల్డ్' అని యే సందర్భంలో అని యుంటారని మీరు అడగొచ్చు. ఐహిక పరంగా కాక, ఆముష్మికపరంగా, ఆధ్యాత్మిక పరంగా అని నేనంటా. భగవంతుని తెలుసుకోవాలంటే మౌనమే శరణ్యం. ఉపన్యాసాలు దంచితే మైకు విరగొచ్చు, గొంతుపోవచ్చు. కానీ, కించిత్ అయినా, భగవత్తత్వము మనసుకెక్కదు.

"పంచదార యనుచు పందసారులు పల్క
తీపి రుచియు నీకు తెలియబోదు".

పరమ ఆర్థిక చింతగలవారికి స్పీచ్ ఈజ్ సిల్వర్- పారమార్థిక చింత గలవారికి సైలెన్స్ ఈజ్ గోల్డ్ అనవచ్చు. భగవద్దర్శన భాగ్యమునకు సైలెన్స్ అనే లెన్స్‌ను మించినది లేదు.

"ఏనన నెంత నిన్ను స్తుతియింపగ లేక మహర్షులే అవాఙ్మనస గోచరుండవని మౌనము జూపిరి భావశూన్యులై"

'తుని' తగవు అని ఒక తెలుగు సామెత. 'తుని' అనే ఊరి సరిహద్దు తగాదా విషయంలో, వాదోపవాదాలను అస్కారం వుందిగానీ, భగవం'తుని' దగ్గర మాత్రం బల్ల గుద్దడం కుదరదు. వాదించడం సంగతి దేవుడెరుగు!

"నిదానమే ప్రధానము' అన్నారు. "ఆలస్యం అమృతం విషం"అన్నారు ఈ రెంటినీ నిత్యజీవితంలో సమన్వయం చేసికోవటంలోనే మన తెలివి తేటలు వ్యక్తమౌతాయి. అలాగే "నిశ్శబ్దో బ్రహ్మముచ్యతే" అన్నారు. నిశ్శబ్దంతోనే బ్రహ్మజ్ఞానం ప్రాప్తి కావచ్చు. మరి 'నాదబ్రహ్మ' అనీ అన్నారు. ఓంకారం లోనే భగవంతుడున్నాట. అందుకేనేమో, దేవాలయాల్లో చెవులు హోరెత్తేటట్లు గంటలు మోగిస్తారు. శంఖం పూరిస్తారు. వాద్యాలు వాయిస్తారు. "నోరు నొవ్వంగ హరికీర్తి నుడువదేని'అని పోతనగారు చాటారు. ఇదంతా వింటూంటే నాదంలో దేవుడు ఉండేది నిజమా, నిశ్శబ్దంలో దేవుడుండేది నిజమా అని మిడిమిడి జ్ఞానముండే నాబోటి మిడిల్ క్లాస్ శాస్త్రిలకు ఒక 'మడిల్'గా కనబడుతుంది.

అప్పుడప్పుడు నాకనిపిస్తుంది. మనవాళ్ళు వక్తలకన్న మౌనవ్రతులగు మునులకే ఎక్కువ గౌరవం ఇచ్చారేమో అని. ఎవరో అన్నాట్ట 'మా స్వాముల వారు పదహారు భాషల్లో మౌనవ్రతం పాటించగలరు' అని. అంటే వారు అన్ని భాషల్లో కోవిదులైనా, మౌనం మంచిదని ఉపదేశిస్తున్నట్లు!

మీరేమీ అనుకోనంటే ఇక్కడ స్వంత విషయం కాస్త మనవి చేస్తా. ఆమధ్య నాకొక మొండి జబ్బు వచ్చింది. డాక్టర్ల మందులకు లొంగడంలేదు. మందులే (అనగా తెలివి తక్కువవారే) మందులు తీసికుంటారని మా వితండే శ్వర్రావ్ అంటాడు. దాదాపు రెండు నెలలు మంచము దిగలేదు. ఎవరో ఒక ఆస్తిక మహాశయుడు విష్ణుసహస్రనామస్తోత్రం రోజుకు తొమ్మిదిసార్లు పన్నెం డ్రోజులు శ్రద్ధాభక్తులతో చెయ్యమని సలహా ఇచ్చాడు. రోజూ కనీసం అయిదు వేలు అష్టాక్షరీ జపం చెయ్యమన్నాడు ఆపద అరపులు, సంపద మరపులు తత్త్వం గదా మనందరిది? పోనీలెండి.నాది మాత్రమే లెండి! అలాగే త్రికరణ శుద్ధిగా మంచం మీద పడుకునే చేశా. మీరు నమ్మండి, నమ్మకపోండి. భగ వంతుని దయవల్ల జబ్బు తగ్గుముఖం పట్టింది. పన్నెండో రోజుకు జపము, విష్ణు సహస్రనామము పూర్తి అయ్యేనాటికి లేచి కూర్చోగలిగా. ఆనాటి నుండి మా ఇంట్లో బుక్ షెల్ఫ్‌లో వేదాంత గ్రంథాల అరలోనున్న విష్ణు సహస్రనామ స్తోత్ర గ్రంథము, సుందరకాండ వైద్యగ్రంథాల ప్రక్కన అమర్చా. అదే సరైన పద్ధతి అనిపించింది. God cures the disease Doctor takes the fees అన్నారు గదా.

ఇంతకూ చెప్పొచ్చేదేమంటే ఆ పన్నెండ్రోజులూ కనీసం ఆరుగంటల సేపు ఆ జపాలు నా నోరు మూయించాయి. జపం ఎప్పుడు పూర్తి అవుతుందా అని ధ్యాస తప్ప, జపాన్‌లో లాక్‌హీడ్ కుంభకోణం గూర్చిగానీ, బోఫోర్సు భాగోతం గూర్చిగానీ ఆలోచనే వచ్చేదిగాదు. విష్ణుసహస్రనామం నూటాఎనిమిది సార్లు పూర్తి చెయ్యాలి అనే పంతం దప్ప, వి.పి. సింగ్ ప్రధానమంత్రి అవుతాడా, దేవీలాల్ అవుతాడా అనే చింత బుర్రలో మెదిలేదిగాదు! రాజకీయాల్లో దిగి వృథా ప్రేలాపనలతో కొంపలంటుకు పోతున్నట్లు నిగవట్లు పట్టుకునేవారిని చూస్తే జాలి వేసేది.

ఒక విధమైన ప్రశాంతత, వైరాగ్యం నాలో ప్రవేశిస్తూ వుందా అనిపించింది. అది పురాణ వైరాగ్యం లాంటిదే కావచ్చు. అందరినీ ఈ విధంగా దైవ చింతన గలవారిగా చేసి రోజూ కనీసం నాలుగైదు గంటలు విధిగా నోరు మూయించగలిగితే మనదేశం ఎంత బాగుపడుతుందో కదా అనిపించింది. అయ్యప్ప భక్తులు మండలం రోజులు 'దీక్ష'లో వుంటారు. దీక్షా కాలంలో వారు సిగరెట్లు లాంటి వ్యసనాల జోలికిపోరు. చెప్పులు వేసుకోరు. నేలమీద పడు కొంటారు. అనవసర వాదాలకు దిగరు లంచగొండి తనమునకు దూరంగా వుంటారు. రెండు పూటలూ భజనలు చేస్తారు ప్రశాంతంగా వుంటారు.

అయ్యప్ప దీక్షకు మించిన దీక్షను కనిపెట్టి సంవత్సరానికి కనీసం అర్నెల్లు ఈ కోతిలాంటి మనసును బలవంతంగానైనా కట్టిపడేస్తే దేశంలో శాంతి భద్రతలు నెలకొంటాయి. ఇహ, కాశ్మీరులో, శ్రీలంకలో, పంజాబులో, అస్సాంలో, మరెక్కడా మారణహోమాలు ఉండవుగాక ఉండవు. పోలీసుల ప్రాణాలకు హాయి.

'సైలెన్సు ఈజ్ గోల్డ్' అనే ఆంగ్లసూక్తి "మౌనేన కలహం నాస్తి' అనే ఆర్యోక్తి అక్షరాలా నిజమేమో. నారదుల వారు "కలహం నా ఆస్తి" అన్నా రను కోండి.

కానీ మౌనవ్రతం అంటే మజాఖా కాదండోయ్. ఒకవారం 'ఖానా" అయినా మానెయ్యొచ్చుగానీ, మౌనవ్రతం ఒక్కరోజు పాటించడం 'యమా' యాతన. నేనీ పరీక్షతో రెండు మూడుసార్లు తప్పా మీరు కూడా ఒకసారి పరీక్షించండి, ప్రయత్నించండి దేవుడు మీకు మేలు చేయుగాక!

—: o :—

# 31. జిడ్డురాయుళ్లు

స్నేహితులు ఎన్నో రకాలు. అవసరానికి ఆదుకునేవారు అవసరానికి మనల్ని వాడుకునేవారు. అవసరానికి తప్పుకొని చల్లగా జారుకునేవారు. మనలను ఇరకాటంలో పెట్టి తమాషా చూస్తూ అప్పుడప్పుడు ఆదుకునేవారు. ఇలా ఇలా పెద్ద లిస్టు తయారు చేయవచ్చు. మనవాళ్ళు మిత్రత్వం అపేక్షించే వారికి ఒక హెచ్చరిక చేశారు. "వాగ్వాదం, అర్థ సంబంధం, పరోక్షే దార భాషణం" స్నేహితుల పట్ల ఈ మూడింటినీ వదలి పెట్టమన్నారు. వాగ్వాదం, పరోక్షంగా అతని భార్యతో ముచ్చటించడం, ఈ రెండింటిని వద్దంటే పరవా లేదు. అర్థసంబంధం కూడా మానెయ్యాలి అన్నారు.' యత్రమిత్రత్వ మిచ్ఛంతి తత్ర త్రీణి నకారయేత్' అని మిత్రత్వమాశించే చోట మానెయ్యాలి అన్నారే గాని, యత్ర బంధుత్వం ఇచ్ఛంతి' అనలేదు. బంధువుల దగ్గర అర్థ సంబంధం పెట్టుకోవచ్చో కూడదో విశదీకరించలేదు మరి ఆ శాస్త్రకారుడు.

అసలు ఈ కాలంలో బంధువుల మధ్యకన్నా మిత్రుల మధ్యనే అర్థ సంబంధ లావాదేవీలు ఎక్కువ! అదే పాశ్చాత్యులేమో "A friend in need is a friend in deed" అన్నారు అక్కరకు వచ్చేవాడే నిజమైన మిత్రుడట. మా వితండేశ్వర్రావు దీనికి వింత వ్యాఖ్యానం చేస్తాడు. NEED అంటే మనల్ని కష్టాల్లో, సుఖాల్లో, సర్వకాల సర్వావస్థలందునూ 'నీడ' లాగా కని పెట్టుకుంటూ DEED అంటే D D రూపంగానో చెక్కు రూపంగానో డబ్బుసర్ది ఆదుకునే వాడు అని అర్థమట! స్నేహి" తుల"లో "తుల" అంటే బాలెన్సు అట. అనగా మనదగ్గర బాంకు బాలెన్సు నిజమైన స్నేహితులను కొలిచే త్రాసుట. ఇంగ్లీషువాళ్ళు అలా అంటారు. మనవాళ్ళు స్నేహితులను

ఎందుకో చిన్నచూపు చూచారల్లే వుంది. 'అక్కరకు రాని చుట్టము'ను గ్రక్కున విడువంగ వలయుగదరా సుమతీ' అని బద్దెనకవి సలహా ఇచ్చాడు గానీ 'మిత్రుని' అనలేదెందుకో?

'స్నేహం' అంటే నూనె అని మరో అర్థం కూడా వుంది. కనుక స్నేహితులలో "జిడ్డు" రాయుళ్ళు కూడా బహుళంబుగా కానంబడియెడి! ఆయా 'జిడ్డు' రకాలనిబట్టి మనమే స్నేహితుల గ్రేడును నిర్ణయించుకోవాలి!

కొందరు ఆముదం గాళ్ళు గావచ్చు. కొబ్బరి నూనె, నువ్వుల నూనె గావచ్చు. మఱికొందరు టాప్‌రాంక్. ఇలాంటి వారిని మేము ఇంట్లో "ఫెవికాల్ ఫ్రెండ్స్" అనీ పిండ తైలం గోత్రులు అనీ మనస్సులోనే బిరుదు ప్రదానం చేసి సత్కరిస్తుంటాం. ఇచ్చట సత్కారము అనగా కాస్త లౌక్యం పాటించి జాగ్రత్తగా తప్పుకొనుట అని అర్థం! ఆధునికులు ఇలాంటి వారికి చక్కని టైటిల్ ఇచ్చారు. సుత్తిరాయుళ్ళు అని! ఈ 'సుత్తి' ఎప్పుడు తెలుగులోకి దిగుమతి అయిందో తెలియదు. వాడు ఆఫీసరుకు బాగా 'సుత్తి' కొడతాడు' అంటారు. అంటే 'కాకా' గాడు అని భావం. వందిమాగధుల్లాగా నిరంతరం 'స్తుతి' చేస్తుండొచ్చు 'సుత్తి'కి పర్యాయపదాలెన్నో వున్నాయి. కాకా, మస్కా, మాలీసు, తైరు కొట్టడం ఇవన్నీ ఆ లలితకళలోని పాఠ్యాంశాలే. ఈ కాలంలో ఈ 'సు కా మ మా తై' జప ప్రభావం చాలా ఎక్కువ. ముఖ్యంగా ఉద్యోగ వర్గాల్లో!

ఇంకో రకంగా కూడా ఈ 'సుత్తి' దిగి యుండొచ్చు. లోహాలను సాగ దీసే దానికి ఎర్రగా కాల్చి సుత్తితో కొడతారు. కాలక్రమేణా సుత్తి కొట్టడం అంటే "పీకుడు" వ్యవహారం అని అర్థం సంతరించుకుంది. ఏదియేమైనా ఈ 'సుత్తి' తెలుగోడి బుర్రలో బాగా లోతుకు దిగింది!

ఈ సుత్తి ప్రబుద్ధులు మనకు దైనందిన జీవితంలో తగులుతూనే వుంటారు. ఇరుగు పొరుగువాళ్ళైతే వదిలించుకోవడం కష్టమే!

నీదు మిత్రచయము - నీ సృష్టియే సుమ్మ
శత్రులున్న నీదు చర్య ఫలమె!
ఎరుగు మిరుగు పొరుగు లీశ్వర దత్తాలు
వాదులాడ బోకు - వారితోడ!

కాబట్టి ఇరుగు పొరుగు వారితో "పారామౌంటర్"గా వుంటూ నాలుకమీద పట్టు కలిగి వుండకుంటే మదికి ప్రశాంతత దొరకదు. ఆఫీసు కొలీగ్సుతో కూడా కష్టమే మరి. మనము పనిచేసే సెక్షను అయితే మరీ బోరు. బస్‌స్టాప్ ఫ్రెండ్సు, మార్కెట్ ఫ్రెండ్స్, క్యాంటిన్ ఫ్రెండ్స్ అయితే నెట్టుకపోవచ్చు. ముళ్ళపూడివారి కథానాయకుడు అప్పారావులా కాకపోయినా, అప్పు అడగకున్నా ఈ సుత్తిరాయుళ్ళతో న్యూసెన్సు అనే చెప్పాలి! నిజానికి వారిలో ఎక్కువమంది నిర్మలహృదయులై ఉండవచ్చు!

కానీ, మొహమాటానికి పల్కరించామో మన పని గోవిందా. ఒక పట్టాన వదిలే రకము కాదు. వాళ్ళకు టైమ్ సెన్సు దేవుడు పెట్టలేదు. అంతే. అది దేవుడి తప్పు. పాపం, వారిని జాలిపడాలి దప్ప తప్పులు పట్టకూడదు! ఉగ్గుపాల వయసులో వాళ్ళకు 'వస' ఓవర్ డోస్ పడియుండొచ్చు. దాని సైడ్ ఎఫెక్ట్స్ మనము అనుభవించక తప్పదు. జన్మతః వచ్చిపడిన స్వభావ జనిత దోషప్రభావమని మనమే సర్దుకొనిపోవాలి తప్ప మన మేమీ చెయ్యలేము.

మా మిత్రుడు ముత్యాలరావు మాట్లాడుతూంటే వాడి నోటిలోనుంచి ఒక్క ముత్యమూ రాలదు గానీ వినేవాడికి తలవేదన అనే మాట సత్యము!

ఏ అరటిపండ్లు, మామిడిపండ్లు బండివాడో, రోడ్డుమీద కనబడితే అరటిపండ్లు తీసికుందామా అని యధాలాపంగా అడిగామనుకుందాం వద్దంటే పొయ్యేదానికి ఒక పావుగంట లెక్చరు దంచుతాడు!

"అంత అదృష్టం లేదు బాబూ! నేను సుగర్ పేషంటుని. పండ్లకే కాదు, అన్నానికి కూడా నోచుకోలేదు. రాగులు, గోధుమలు నా ఆహారం" అంటాడు. అంతటితో ఊరుకుంటాడా? ఊహు! "అప్పనూ! మీకు కూడా ఫిప్టీ దాటాయనుకుంటాను. ఎందుకైనా మంచిది. ఇహనుంచి మీరు కూడా ఈ అరటిపండ్లు, మామిడిపళ్ళు, సీతాఫలాలు, స్వీట్లు, వగైరాలూ మానేస్తే శ్రేయస్కరము. అంత తినాలని ఉంటే నేరేడుపళ్ళు తినండి. అసలు వరి అన్నంలో ఏముంది చెప్పండి? స్టార్చ్ తప్ప. రాగులు, గోధుమల్లో ప్రొటీనులు ఎక్కువ. ఒకసారి సుగర్ కనబడిందంటే ఇహ వదలదు. మనకు జీవితాంతం నేస్తమౌతుందట. అంచేత ముందు జాగ్రత్త చర్యగా మీరు కూడా మానెయ్యండి. అన్నట్లు మీ నాన్నగారికి గానీ, అమ్మగారికి గానీ, మేనమామలకు గానీ డయబెటిస్ ఉండిందా. ఆ. అలా చెప్పండి. ఇంకేం. ఇది వారసత్వమండీ బాబూ! నామాట వినండి"- ఇదీ వరస.

ఎదుటివాడు వింటున్నాడా లేదా అనేది వాడి ఆలోచనలోకి రానేరాదు. టైమెంతండీ! అని అడిగారో. చెప్పి వూరుకుంటాడా. బలేవారే! ఆ రిస్టువాచి తాను నాలుగు దశాబ్దాల క్రితం కొన్నట్లు, ఇంతవరకూ రిపేరను మొగము చూడనట్లు, దాని ఖరీదు అప్పుడెంత, ఇప్పుడెంత, ఆ రోజుల్లో వాచీలు ఎలా వుండేవి, ఎలా పని చేసేవి, ఈ రోజుల్లో వాచీలు రెండు వసంతాలు తిరక్కముందే సంతకు పోవల్సిందేననీ, ఒకసారి బావిలో పడిందనీ, మూడురోజుల తర్వాత తీయించి 'కీ' ఇస్తే ఇంకా ఆడుతూనే వుందనీ, ఈ కాలంలో వచ్చే వాచీలు షేపుల్లో, డయల్సు రూపుల్లో వస తప్ప టైము చూపులో లేదనీ, తనకు స్క్వేరు షేపు కన్నా రౌండ్‌షేపు అంటేనే ఇష్టమనీ, అంకెలు లేని వాచి అంటే పరమ అసహ్యమనీ, రేడియం వాచి, త్వరగా చెడిపొయ్యే అవకాశముందనీ, ఆటోమాటిక్ వాచీలు ఆరోగ్యానికి అంత మంచివి గావేమోననీ, అదనీ, ఇదనీ, యేమేమో వచన కవిత్వం చెప్పి మనలను అదరకొడతాడు!

ఆయన వెంట కూరల మార్కెట్టుకు వెళ్ళడం ఒక తప్పలేని శిక్ష, ఏయే కూరగాయల్లో ఎంతెంత పోషకపదార్థాలున్నాయో, లవణాలు, ఖనిజాలు, కార్బోహైడ్రేట్లు వగైరా ఎక్కువ వేటిల్లో వున్నాయో, ఏవేవి వాతపిత్త, శ్లేష్మకారులో, సవిస్తరంగా వివరించి తనకున్న కించిత్ ఆయుర్వేద పరిజ్ఞానాన్ని ప్రదర్శించుకుంటాడు.

మొన్న అనుకోకుండా ఇద్దరం ఆబిడ్స్ తాజ్‌మహల్లో కలుసుకున్నాం. రెండు దోశెలకు ఆర్డరిచ్చాం. రవ్వదోశ వద్దు. పెసరెట్టు కావాలంటే అలాగే సర్వరు రెండు ప్లేట్లు తెచ్చిపెట్టి వెళ్ళాడు. "ఏటి తప్పదియ్యా! ఇవేం పెసరట్లండీ! మూడు రూపాయలకు అర్ధజానెడు కూడా లేవు. మా ఊర్లో రూపాయ పావలాకు పీటికి రెండింతలుంటాయ్. కొత్తిమిరి, అల్లం, ఉల్లి పాయలు వేస్తారు. కొబ్బరి పచ్చడి ఎంత బావుంటుందనుకున్నారు? ఒక్కటి తింటే ఇహ ఆ పూట అన్నం మానెయ్యొచ్చు" అని చెప్పుకపోతూనే వున్నాడు. ప్రక్కవాడు "మీ దేవూరండీ!" అని అడిగాడు. "మాది కోనసీమండీ! తూర్పు గోదావరిజిల్లా అమలాపురమండీ! మా వూర్లో భోజనం మూడున్నర రూపాయలండీ! బ్రహ్మాండంగా ఉంటుంది. పెరుగు కూడా వేస్తారు" అని చెప్పుకు పోతూనే వున్నాడు, నేను తినటం పూర్తి అయ్యేదాకా.

పాపం! ఇలాంటి వాళ్ళను చూస్తే నాకు జాలి వేస్తుంది.

ఇంకా ఎందరో మహా మహా సుత్తి వీరభద్రులు ఉన్నారు. అందరి గూర్చి వ్రాస్తూ పోతే ఆ చిట్టాలో నన్ను కూడా పాఠకులు చేర్చే ప్రమాదం వుందేమోనని........

—: o :—

# 32. తీరిక వేళలు

మా బంధువొకాయన ఉండేవాడు. ఆయన రోజుకు ఏ అయిదారు గంటలు మాత్రమే నిద్రపొయ్యేవాడు. అంతే, నిద్ర లేచింది మొదలు రాత్రి పది, పదకొండు గంటల వరకూ, మేను వాల్చేదాకా క్షణము తీరిక లేకుండా ఏదో పని కల్పించుకొని చేస్తూనే వుండేవాడు. పగలంతా ఆఫీసులో చేసిన అర్ధ చాకిరి చాలక ఇంటికి దస్త్రం తెప్పించుకొని ఫైళ్ళతో కుస్తీ పట్టేవాడు. మళ్ళీ తెల్లారగానే ఎనిమిది, ఎనిమిదిన్నరకే ఆఫీసుకు ఉరుకులు పరుగులు. అలా ఒక రోజూ, రెండ్రోజులూ కాదు; ఒక నెలా రెండు నెలలూ కాదు; సంవత్సరం రెండు సంవత్సరములు కాదు; ఆయన నలభైయేళ్ళ సర్వీసూ అంతే! అంతటితో ఊరుకున్నాడా? ఉహూ. తర్వాత ఇరవైయేళ్ళ పై చిలుకు ప్రయివేట్ జాబ్ చేశాడు. అదే వరస. అదే ఉరుకుడు! సన్నగా వున్నా పిడిరాయి లాగా వుండేవాడు. ఇటీవలే హఠాత్తుగా, హాయిగా ఆ సహస్ర మాసజీవి నిద్రలోనే కన్ను మూశాడు! "మీ ఆరోగ్య రహస్యం ఏమిటి?" అని ఎవరైనా అడిగితే 'దాని విషయమై నాకు ఆలోచించే తీరికే లేదు' అని నవ్వి ఊరుకునేవాడు.

అప్పుడప్పుడు నేను మూడు దశాబ్దాల క్రిందట ఆయనతో "తీరిక లేని జీవి దురదృష్టుడుగాదె అసంశయంబుగా' అని పరిహాసం చేసేవాడిని. "పోనీ వోయ్! తీరిక ఎక్కువైతే ఏవేవో అనవసరమైన ఆలోచనలతో బుర్ర వేడెక్కిపోతుంది. మాటల్లో మనస్పర్థలు రావచ్చు. ఇలా వుండేనే శ్రేయస్కరం!" అని తప్పుకునేవాడు.

'మీరు తీరిక వేళల్లో ఏం చేస్తుంటారు?' అని అడిగితే, 'తీరిక అంటూ దొరికితే గదా?' అని ఎదురు ప్రశ్న వేసి నవ్వేవాడు.

ఆయనను దృష్టిలో పెట్టుకొని నేను వ్రాసిన 'తీరికలేని జీవి' పద్యము లోని భావం అక్షరాలా తప్పు అని ఇప్పుడు అనిపిస్తూంది.

అసలు మనిషికి తీరిక అంటూ వుండకుండా వుంటేనే మంచిదేమో! క్షణం తీరికలేని మనిషి సమాజానికి ఏ అపకారమూ చెయ్యలేడు. వచ్చిన చిక్కల్లా అతి తీరుబడి గాళ్ళతోనే. సోమరిపోతు బుర్ర రాక్షస కర్మాగారము అనే సూక్తి అక్షరాలా నిజం! ఇప్పుడు దేశం నలుమూలలా ఎక్కడ చూచినా చెర్రరిస్తు భీకర కార్యకలాపాలూ, గృహదహనాలూ, లూటీలూ, మారణ హోమాలూ, మానభంగాలూ- ఇలాంటి నేర ప్రవృత్తులు విజృంభించడానికి మూల కారణము యేపనీ పాటాలేని సోమరిపోతులు పెచ్చుపెరిగిపోవటమే! మనిషి మనస్తత్వము తీరుబడివేళల్లో ఆయా వ్యక్తులు చేసే పనులను బట్టి తెలుసుకోవచ్చు!

తీరిక సమయాల్లో కొందరు పేకాట, కారమ్సు లాంటి గేమ్సులో పాల్గొంటారు. మహాశివరాత్రి రోజు నిద్ర పోకుండా వుండేందుకు పేకాట ఆడే ప్రబుద్ధులున్నారు అర్ధరాత్రి సినిమాలు చూస్తారు.

చిత్తశుద్ధి తోడ శివరాత్రి మేల్కాంచి
పరమ శివుని కొలుము భక్తి మీఱ
వెఱ్ఱి పనులు గావె - పేకాట సినిమాలు
గవ్వలాట - గచ్చకాయ లాడ!

ఈ 'గేమ్సు' మనిషిలోని అసలు స్వభావాన్ని బహిర్గతం చేస్తాయట!

ఎదుట వాని తోడ ఎన్నేళ్ళు గడపినన్
అతని 'లోని' యెడద - నరయలేవు!
ఆడు మొక్క పందె మతనితో ఒకమారు
బయట పడునతని స్వభావమపుడు!

ఆటలు కొట్లాటలుగా మారి, మాటలు లేక బద్ధ విరోధులుగా ఆత్మీయులు మారిన ఉదంతాలు లేకపోలేదు! ఆట అంటే 'నింద' అని కూడా అర్థం. బహుశా నిందలకు దారి తీసేది కాబట్టి - ఆటకా అర్థం వచ్చింది.

కొందరు ఉరకనే రాజకీయ విషయాల్లో తలదూర్చి, బాతాఖానీలతో ప్రొద్దు పుచ్చుతారు అంతవరకు పరవాలా. కొంపలంటుకొని పోతున్నట్లు, నోటి తడి ఆరేదాకా వాదించుకుంటారు. అటు అధికార పక్షంవారూ ఇటు ప్రతి పక్షం వారూ హాయిగానే వుంటారు. మధ్య సంబంధంలేని జనం కొట్టుకొని చస్తుంటారు. ఈ వాద ప్రతివాదాల్లో బాగా వేడెక్కి ఆవేశాలకు లోనై నిగ్రహం కోల్పోయి, దెబ్బలాటల వరకు దిగిన ఎదిగిన సన్నివేశాలు అడపాదడపా చూస్తూనే వుంటాం.

పాకలోని ఆవు పట్టించు కొనకుండె
అరవ బాయె పాల కొరకు దూడ
ఆటక పైని దుత్త కార్యాట మెక్కువై
పాలు పాలటంచు నేల బడియె!

అన్నట్లుంటాయి ఈ నిష్ప్రయోజనకర చర్చలు!

మన దేశానికి ప్రస్తుతావసరం ఉత్పత్తి రాజకీయ వేత్తలు గానీ ఉత్తుత్తి రాజకీయవాదులు కాదు.

తీరిక వేళల్లో తోట పని, సద్గ్రంథ పఠనం రామ కోటి వ్రాసుకోవటం, నామ జపం, గుళ్ళకు వెళ్ళటం- ఇలాంటి వాటిల్లో పాల్గొని, కాలాన్ని సద్వినియోగం చేసే వారితో ఏ పేచీయుండదు. దేవుని గుళ్ళల్లో కూడా, ఎక్కడ లేని కబుర్లు పెట్టుకునే వారున్నారనుకోండి.

కొంతమంది తమ జీవితాలను, సినిమాలకు, టీ.వీలకు, వీడియోలకు, రేడియోలకు, రకరకాల పత్రికలకు అంకితం చేస్తూ తీరిక వేళలను గడపుతారు. వారి జోలి మనకొద్దులెండి. వారితో సమాజానికి నష్టమేమీ లేదు.

ఆడువారికన్నా మగవారే ఎక్కువగా వృథా కాలక్షేపణలో ప్రవీణు లేమో! చాలమంది స్త్రీలు స్వెట్టర్ల అల్లకంలోనో, ఎంబ్రాయిడరీ పనులలోనో నిమగ్నులౌతారు.

ఏమైనా టైంపాసుకు వాళ్ళు ఏం చేస్తున్నారు అనేది వారి మనస్తత్వము నకు ముకురము అనే మాట తిరుగులేని సత్యం. ఆ చూసే సినిమాలు, చదివే పుస్తకాలు వాటి రకాలను బట్టి కూడా ఊహించుకోవచ్చు.

నన్ను ఒక మిత్రుడడిగాడు- 'How are you killing the time after retirement?- రిటైరయ్యాక కాలహరణం ఎలా చేస్తున్నావ్?' అని.

"కాలాన్ని హరించేసే దానికి నేనెంత వాడిని గనుక? కాలమే నన్ను రోజుకు కాస్త, కాస్త చొప్పున హరించి వేస్తూంది. ఎప్పుడో ఇలాగే 'హరీ' అంటా" అన్నా.

విశ్రమించడంలో గల హాయి శ్రమించిన వాడికే తెలుస్తుంది. భోజనం విలువ క్షుదార్తులకే తెలుస్తుంది. "స్వేద బిందువు రాలినపుడె - నిదుర సుఖ మది - నీకు తెలియును - చేతినిండ పనియుండే వాళ్ళకే తీరిక యొక్క నిజ మైన విలువ తెలుస్తుంది. "It is impossible to enjoy idling thoroughly unless one has plenty of work to do" అని JEROME K అన్నారు- అక్షరాలా నిజం!

మన దేశంలో, (ఇతర దేశాల సంగతి మనకొద్దు) సగటు మనుషుల కుండే సగటు తీరిక సమయాలను అంచనా వేస్తే కొన్ని కోట్ల గంటలని నిస్సందేహంగా తేలుతుంది.

నా కప్పుడప్పుడు అనిపిస్తుంది. మన మనస్సు దయ్యాల దీవిగా మారకుండా ఉంటానికే మనవాళ్ళు నిద్రలేచింది మొదలు మళ్ళీ రాత్రి పడుకునే

దాకా పూజలనీ, నామ జపాలనీ, వ్రతాలనీ, నోములనీ, పండుగలనీ, పర్వ దినాలనీ నిర్దేశించి, సాధ్యమైనంత తీరిక సమయాన్ని తగ్గించే ప్రయత్నం చేశారేమో. భగవద్ధ్యానముతో నిద్ర లేవమన్నారు. భగవత్ ప్రార్థనతోనే నిద్ర పోవాలన్నారు. మన స్తోత్ర పాఠాలు చూడండి. ఫలశ్రుతిలో 'త్రి సంధ్యం యః పఠేన్నిత్యం' అనో, త్రి కాలం యో జపే న్నిత్యం, అనో అంటారు. మూడుసార్లు చెయ్యాలంటే రోజూ రెండు మూడు గంటలు పట్టవచ్చు. అది వరకు చేసిన పాపాలు కొట్టుకొనిపోయినా పోకున్నా కనీసం ఆ రెండు మూడు గంటలు పాపాల పాలబడరం గదా! అలా విధిగా రోజూ చేస్తూంటే మనిషిలోని దాగియున్న దుష్ట ప్రవృత్తులు పోయి, మంచి బుద్ధులుత్పన్నమయ్యే అవకాశాలు ఎక్కువగాదా? కాబట్టి వ్యర్థ కాలక్షేపం కన్నా మనవాళ్ళు నెలకొల్పిన సంప్రదాయాలు సమాజ కళ్యాణానికి దోహదకారులు కావంటారా?

తీరిక లేకుండా పని చెయ్యటంలోనే అసలైన ఆరోగ్య రహస్యం ఇమిడియుంది. డాక్టర్లు కూడా Occupational Therapy ని అంగీకరిస్తున్నారే? కానీ యే పని చేసినా, త్రికరణ శుద్ధిగా, ఆనందంగా చెయ్యాలి విసుక్కుంటూ చేస్తే ఫలితం శూన్యం.

అసలు తీరికెందుకండీ? సూర్యుడు, భూమి, గ్రహాలూ, ఒక్క నిముసం రెస్టు తీసుకున్నాయనుకుందాం. మనము భూమ్మీద ఉంటామా? ఇంతెందుకు? మన గుండె, ఊపిరి తిత్తులు, మూత్ర పిండాలు ఒక్క నిముసం విశ్రాంతి తీసుకుంటే....అమ్మ బాబోయ్, మనపని గోవిందా! ఈ విషయంలో చీమలు మనకు ఆదర్శవంతమైన మార్గదర్శకులు.

పనిపాటా లేని వాళ్ళు స్వార్థపు బుద్ధితో తమ పబ్బం గడపుకునేందుకు సంఘం మీద పడుతుంటారు. నిజమైన దేశ సేవకు పదవులూ అక్కరలేదు, పొలిటికలూ అక్కరలేదు. అదేమంటే, సమాజాన్ని బాగు పరచాలి. విప్లవం వర్ధిల్లాలి అంటారు. స్లోగన్లతో దేశం ముందుకు పోదు. అంతగా దేశ సేవ

కండూతి వుంటే, ఉచితంగానో, లాభార్జన దృష్టి తగ్గించుకొనో బీదవారికి చదువు చెప్పవచ్చు. ఆసుపత్రులలో నిస్సహాయులైన రోగులెందరో వుంటారు, వారికి కావలసిన సేవ చెయ్యోచ్చు.

అలా చెయ్యటానికి శక్తిలేని వారు ఊరి మీద బడి ఉపన్యాసాలు ఇచ్చే దానికన్నా భగవన్నామ స్మరణం చేస్తూ కొంపల్లో కూర్చుంటే పుణ్యం, పురుషార్థం.

చాటుకొనకు "సంఘ సంస్కరణమ్ముకై
నేడె పూను కుంటి నే"నటంచు
మొదలు పెట్టు మద్ది - మున్ముందు - నీ నుండె
అప్పుడొక సమస్యయైన తగ్గు!
ధిక్కరింపబోకు - తెలివియై సంఘమున్
కష్ట తరము - మరియు కాని పనియు
సంస్కరింప తలవ - సాహస కార్యమ్ము
కష్ట తమము - చేతకాని పనియు -

—: o :—

# 33. వైద్యో నారాయణో హరిః!

నాకెందుకో డాక్టర్లన్నా ఆసుపత్రులన్నా అంతగా సదభిప్రాయంలేదు! సంపన్నులను వదిలెయ్యండి. ఆరోగ్య భిక్షకోసం, ప్రాణభిక్షకోసం అర్థించే అసంఖ్యాకమైన సగటు మనుషుల నుండి వేలువేలు ముక్కు పిండి వసూలు చేస్తూ, మానవత్వమును మఱచిన డాక్టర్లను గురించే నేను చెప్తుంటా. వ్యాపార దృష్టిలేని వైద్యులూ, సజ్జనులైన సర్జనులూ ఉన్నారనుకోండి. వారికివే నా నమస్కారాలు.

ఈ భూలోకం ఒక 'డాక్' బంగళా లాంటిది. కొంతకాలం వుంటాం. కాలం చెల్లుతూనే సెలవు తీసికోని 'ఆబిట్యూరీ కాలమ్' లో పడతాం! ఈ 'డాక్' వాసులను 'తారె' త్తించువాడే డాక్టరు అని మా ఫ్రెండు అంటుంటాడు! ఆయువును కాపాడేందుకు ప్రయత్నించే ఆయుఃపతులు ఉండు చోటు కాబట్టి ఆయుఃపతి, ఆసుపత్రి అని అనుకొంటారు కూడా. ఎవరి అనుభవాలు వారివి. 'అసి' అంటే కత్తి, 'పత్తి' అంటే కూడా కత్తి అనే అర్థం. అసి, పత్తిలో నుంచి ఆపరేషనుకొరకు కత్తులుండుచోటు ఆసుపత్రి అయ్యుండొచ్చు అని నాకు అప్పుడప్పు డనిపిస్తుంది!

"యమలోకంబున తావు చాలకనొ? సీరాహార వస్త్రాదులన్
తమకే వెల్తియు కల్గెనో! అచట ప్రేతల్ పెంపొంద - వే
గమె - ఈ భూమిని ధర్మరాజు మనకై కట్టించె సబ్ బ్రాంచిలన్
భ్రమచే వానినె 'ఆసుపత్రు'లని పిల్వజొచ్చిరే మానవుల్.

యమలోకానికి వెళ్ళే దారిలో 'అసిపత్రి వనం' అని ఒకటి చనిపోయిన వారికి అడ్డము వస్తుందట! బహుశా ఆ వనంలో చెట్లు కత్తుల లాగా ఉండొచ్చు. ఆ అసిపత్రి వనమే ఆసుపత్రి!

ఈ వ్యాసం చదివితే డాక్టర్లు నాపైన చిందులు త్రొక్కి, కర్మం చాలక నాకు రోగం వస్తే మందులు ఇవ్వరేమో అని ఒక మూల భయం! కానివ్వండి. క్రిమి సిద్ధాంతం మీదకన్నా, కర్మ సిద్ధాంతంమీద నమ్మకం గలవాణ్ణి!

అన్ని వృత్తుల వారికి 'ట్రేడ్' సీక్రెట్లున్నట్లే డాక్టర్లకూ కొన్ని వృత్తి పరమైన కిటుకులు ఉన్నాయి.

"నాతి ధైర్యం, ప్రదాతవ్యం
నాతి భీతిశ్చ రోగిణి
నైశ్చిన్త్యాదిమే నం నైరాశ్యాదేవి నా న్విమే"

రోగం పూర్తిగా తగ్గిపోతుందని రోగికి అతిధైర్యం ఇస్తే, సరే తగ్గిపోతుందికదా అని నిశ్చింతగా ఉండి డబ్బు ఇవ్వడట. అసలు తగ్గదు అంటే అధైర్యపడి, ఎలాగూ తగ్గదుగదా అని నిరాశతో డబ్బు ఇవ్వడట. కాబట్టి అతిధైర్యం కల్గించకూడదు. అతిభయం కల్గించకుండా ఉండాలిట- కర్ర విరుగకూడదు. కట్లపాము చావకూడదన్నట్లు!

సానులకూ, సర్జనులకూ సామ్యము ఉందోయ్ అంటాడు మా మిత్రుడొకడు. రెండు వృత్తులవారికీ వరువు లమ్ముకొని బ్రదికేదేనట. ఇది కరక్టు కాదేమో! వైద్యులకూ, వేశ్యలకూ కోరికలలో వైరుధ్యం! "స్వాస్థైరసాధ్య రోగైశ్చ, జన్తుభిర్నాస్తి కించన కాతరా దీర్ఘరోగాశ్చభిషజాం భాగ్య హేతవః."

ఆరోగ్యవంతుల వల్లా, కుదరని రోగాలు కలవారి వల్లా వైద్యులకు ప్రయోజనం లేదు. చిన్న తలనొప్పి వచ్చినా గాభరాపడే వాళ్లూ దీర్ఘరోగులూ- వీరితోనే డాక్టర్ల జీవితం మూడు కాప్సూల్సు, ఆరు ఇంజక్షనులుగా వర్ధిల్లుతూందిట!

అంచేత, డాక్టరు 'సర్వేజనాస్సుఖినో భవంతు' అనుకుంటే భవంతుల మీద భవంతులు కట్టించలేడు. సర్వేజనాః రోగినో భవంతు అనే, వాళ్ళల్లో

అంతర్లీనంగా ఉండే కోర్కె. వైద్యులకు జాడ్యాల వాళ్లూ, వకీళ్ళకు వ్యాజ్యాల వాళ్ళూ వర్ధిల్లాలి!

పాపం వేశ్యలకు మాత్రం అలా కాదు. 'సర్వేజనాస్సుఖినో భవంతు' అనీ, అందరూ ఆరోగ్యంగా, పుష్టికరంగా, 'ఎయిడ్స్' రహితులై, 'సుఖ' వ్యాధులు లేకుండా సుఖులుగా ఉండాలి అనే వారు త్రికరణ శుద్ధిగా కోరుకుంటారు! చూచారా, పరువును నమ్ముకునే వేశ్యకు సంఘంలో పరువు దిగజారుతుంది. పరువులను అమ్ముకునే డాక్టర్లకు పరువు నిచ్చెనెక్కుతుంది.

ఈ వైద్య వృత్తి అతి పవిత్రమైనది. వాళ్ళకు బైబిలులో లాగా 'టెన్ కమాండ్‌మెంట్స్' అని వృత్తి పరమైన దశనీతి సూత్రాలూ వున్నాయట. అన్ని వృత్తులలోని నైతిక సూత్రాలూ గాలికి కొట్టుకొని పోయినట్లే దీంట్లోనూ డిటో. ఆశయాలు పాతాళలోకానికి, ఆశలు ఆకాశానికి ఎప్పుడో చేరుకున్నాయ్!

వైద్యుణ్ణి మనవారు 'వైద్యరాజ! నమోస్తుతే! యమరాజ సహోదరా! అని సంబోధించారు. సహోదరా అంటే మరి యముడికి అన్ననో, తమ్ముడో చెప్పలేదు అన్నయ్యే అయ్యుంటాడు. యముడు ఒక్కసారే, ఒక్క ప్రాణమే తీస్తాడు. డాక్టర్లు మన డబ్బును కూడా పీల్చి పీల్చి ఇన్‌స్టాల్‌మెంట్లలో చంపుతుంటారు! అసలు యం. బి. బి. యస్. అంటే యమ భ్రాతలైన భిషక్ సభ్యుడని, యముడే యండిగా మారిందని యండి. అంటే మృత్యుదేవత అనీ మా ఫ్రెండ్ ఉవాచ! వీళ్ళతో వాడికి తల వాచినట్లుంది!

కానీ, ఏ మాట కామాటే చెప్పుకోవాలి. డాక్టర్లకు కొన్ని సుగుణాలు లేకపోలేదు. సాటి గుమాస్తాగారికి ఏదైనా అమ్యామ్యా గిట్టుబాటు అయ్యుంటుందని వాసన పట్టాడో, ఇవతలి గుమాస్తాగారికి ఒకటే యావ. లోలోపల అసూయ! తన దగ్గర కొచ్చిన కక్షిదారును ఏ వకీలు వద్దకు పంపుతాడా? గెలువదు అని తనకు తెలిసీ కూడా గెలిపించి తీరుతాను అని బీరాలు పలికి, కక్షిదారుని కుషికొట్టి, తన కుక్షి నింపుకొంటాడు!

మరి డాక్టర్లను చూడండి. వారిలో సంఘీభావం వుంది. స్వజాతి ప్రేమ మెండు. అనుమానంగా వుందా? ఏ డాక్టరు దగ్గఱకైనా వెళ్లండి. రక్త పరీక్ష అనో, మూత్ర పరీక్ష అనో, ఎక్సురే అనో, మల పరీక్ష అనో, మరేదో అనో, అడపా దడపా రేడియాలజిస్టులనూ, పాథాలజిస్టులనూ పోషిస్తూనే వుంటారు. తిరుపతి వెళ్లి, వరాహస్వామిని సేవించుకోని రాకుండావుంటే, తిరుపతి వేంకటేశ్వరుని దర్శించిన పుణ్యం దక్కదట. వారణాసిలో విశ్వేశ్వరాలయమునకు మూడు, నాలుగు మైళ్ల దూరంలో ఒక చిన్న గుడి వుంది. ఆ గుడిలో వుండే దేవతను సేవించి, ఆమె పైన ఒక గవ్వ విసిరివేసి వస్తేనే గానీ కాశీ యాత్ర ఫలితం దక్కదట, అలాగే ఈ వైద్యాలయాల్లోకి అడుగు పెట్టి డాక్టరు గారిని, పాథాలజిస్టులను, రేడియాలజిస్టులను, మందుల షాపులను- యీ నాలుగు దేవుళ్లను కొలిచి నాలుగు స్తంభాలాట ఆడితేనేగానీ యమరాజ సహోదర సేవా ఫలితం ప్రాప్తించదు అంటారు ఆధునిక భిషగ్వరులు !

ఒకసారి సుప్రసిద్ధ సాహితీవేత్త, కవి, డా॥ నండూరి రామకృష్ణమాచార్యులు వారితో నేను, 'వైద్య విజ్ఞానం చాలా అభివృద్ధి అయిందండీ. మశూచి, ప్లేగులాంటి భయంకర వ్యాధులను అరికట్ట గలిగారు!' అన్నా. వారు హాస్య ధోరణిలో-

"అన్ని రోగములకు ఔషధమ్ములు వచ్చె
సగటు వయసు పెఱిగె జగతియందు
జబ్బుచేసి యింక చావనక్కఱ లేదు.
మందు వలన దక్క మనుజు లెవరు!"

అన్నారు. వారు చెప్పింది కూడా నిజమేనేమో ! ?

—: o :—

# 34. అంబరాలూ - ఆడంబరాలూ

మృత్యువనగా, జీర్ణవస్త్రాలనూ, మాసిన దుస్తులనూ మనము విడిచిపెట్టి కొత్త బట్టలనూ లేదా ఇస్త్రీ చేసిన వస్త్రాలనూ ధరించిన విధంగా ఈ శరీరం అనే వస్త్రం పనికి రాకుండా పోయినపుడు అందులో అధిష్ఠించియున్న 'ఆత్మ' దీన్ని విడిచేసి వేరే శరీరంలోకి ప్రవేశిస్తుందని గీతావాక్యం. మరి, శరీరం యే మాత్రం సదలకున్నా మనిషి దుక్కలాగా, 'బైసన్' లాగానో, బైసన్‌లాగానో వున్నా ఏ యాక్సిడెంటులాంటిదో జరిగి 'ఢాం' అనే వాళ్ళ విషయం యేమిటో వివరించి యుంటే ఇంకా బాగుండేది. అది వేరే విషయం. మొత్తానికి మన తత్త్వవేత్తలు, మఠాధిపతులు, మఠాధిపతులు ఈ శరీరాన్ని కేవలం ఒక బట్టతో పోల్చారు. అది అంతే.

ఆ మధ్య ఒక ఉపనయనానికి వెళ్ళా. ఒక మత సంస్థకు చెందిన మఠంలో పెండ్లికి రెండు రోజులు ముందుగా ఏదో మొక్కుబడి తంతుగా అబ్బాయిగారికి ఉపనయనం అయిందనిపించారు! అందరూ కలిసి ఇరవైమందికి మించి వుండరు. బహుజనం లేరుగాబట్టి భోజనాలకు ఆ మఠం వారికే కాంట్రాక్టుకు మాట్లాడుకున్నారు.

ఉపనయనం తంతు పూర్తికాగానే భోజనాలకు విచ్చేయండని వంట వాళ్ళు చెప్పి వెళ్ళారు. వెళ్ళి కూర్చున్నాము. 'చొక్కాలు విచ్చేసి కూర్చోవాలి' అని మర్యాదగా సూచించారు. ఓహో! 'విచ్చేయండి' అంటే అర్థం చొక్కాలు విచ్చేయమని కాబోలు అని నాలో నేను నవ్వుకున్నా అందులో వున్న శ్లేషకు! సరే. ఎక్కడి కెళ్ళినపుడు అక్కడి సంప్రదాయము పాటించాలి గదా అనుకొని నామటుకు నేను 'విచ్చేశా' కాని, ఆ పరివారంలో ఇద్దరు, ముగ్గురు బహుశా ఓ మోస్తరు వి.ఐ.పీలు అయ్యుండొచ్చు- ఛత్! మా యిష్టం. ససేమిరా.

చొక్కాలు విప్పం అన్నారు. "అయితే భోజనాలు వడ్డించేదానికి మా 'రూల్సు' ఒప్పుకోవు!" అన్నారు మఠం వాళ్ళు. ఇంకేముంది? కొంచెం వాగ్వాదం, నాల్కలకు పట్టు సడలడాలు జరిగింది. అందరం చివరకు చెవులు ఝాడించుకొని, వేసిన ఆకుల దగ్గరనుంచి లేచి, దగ్గర్లోవున్న హోటలుకువెళ్ళి భోజనాలు ముగించుకొని వచ్చాం!

మరి 'రూల్సు' అంటే రూల్సే గదండీ 'రూల్సు' అంటే ఒక 'జోకు' గుర్తొచ్చింది. ఒక నవ నాగరిక లలనామణి చెరువుకెళ్ళి, దుస్తులు విప్పి (స్విమ్మింగ్ డ్రస్సులాంటిది ధరించిందనుకోండి) జలకమాడ బోయిందట. అక్కడేవున్న రక్షకభటుడు "ఇక్కడ స్నానం చెయ్యకూడదు" అన్నాడట. ఆవిడగారు ఇంగ్లీషులో "ఆ మాట బట్టలు విప్పుకుంటూంటే అప్పుడే ఎందుకు చెప్పలేదు?" అని లా పాయింటు తీసి పోలీసాయన్ని నిలదీసి అడిగింది. 'భలే! అలా వుండాలి' అని అనుకున్నారు గట్టుమీదవున్న మరికొందరు యువతులు. రక్షకభటుడు మాత్రం తక్కువ భక్షించాడా? 'మేడమ్! బట్టలు విప్పుకోకూడదని రూలు లేదు. స్నానం చెయ్యకూడదని మాత్రమే రూలు!' అని మరో 'లా' పాయింటు తీసి, అదోలా ముఖంపెట్టి మీసం మెలేశాట్ట! మరి రూలు రూలే గదా!

"అనువు గాని చోట అధికుల మనరాదు' అని అయిదో యేటనే అమ్మమ్మలూ, నాయనమ్మలూ, తాతయ్యలూ కంఠస్థం చెప్పించిన పద్యభావం గానీ, 'ఏ దేశమేగినా, ఎందు కాలిడినా నిలుపరా నీ ఖ్యాతి' అనే రాయప్రోలు వారి సుప్రసిద్ధ గీతా రహస్యము గానీ, 'రోములో ఉన్నప్పుడు రోమనులలాగా వుండు' అనే ఇంగ్లీషువారి ఆచార సరళిగానీ, వాళ్ళలో ఒక్కరికీ వంట బట్టలేదే, వంటి మీద బట్ట పట్టింపుతో వంటకాలు వేస్ట్ అయ్యాయే అనీ చివుక్కుమనింది నా మనసు.

కొందరికి యిలాంటి పట్టింపులు జాస్తి. ఉండాల్సిందే అనుకోండి కానీ, తాడును తెగేదాకా లాగకూడదు అనే లౌక్య నీతి కూడా వద్దా? పైగా అక్కడికి వచ్చినవారు అందరూ విద్యావంతులే. కాదు. అధిక విద్యావంతులు! మేధావి వర్గులు, నవనాగరిక శిరోమణులు!

మాకు తెలిసిన ఒక పెద్ద మనిషి వున్నాడు. మాకే కాదు- అందరికీ అలాంటి పెద్ద మనుష్యులుండొచ్చు. అతనిదొక వింతతత్త్వము, కృతిమించిన బేషజము, తెచ్చిపెట్టుకున్న దర్పము. 'పోజు' మోజు కలవాడు. మనం ఆయన్ను కలుద్దామని వెళ్దామనుకోండి, వెళ్ళగానే ఇంట్లోనుంచి ఒక పట్టాన తెమిలిరాడు గడ్డం గీచుకొని, స్నో పౌడరు గట్రాలు దట్టించి, పంచె లాల్చీ లేదా పాంటూ, షర్టూ టకప్ ధరించి, 'రాజు వెడలె' పక్కీలో గానీ ఇవతలకు వచ్చేవాడు కాదు. అలాంటి వారికి ఆడంబరమే ఆరోప్రాణం! సామాన్యంగా, ఒకసారి వెళ్ళినవారు, రెండోసారి వెళ్ళరుగాక వెళ్ళరు!

మా ఫ్రెండు 'వితండేశ్వరరావు' అంటూ వుంటాడు- ఆడంబరము అంటే 'సింపుల్' అని. ఎలా అని అడిగా. ఆడవారి చీరలనే ఇక్కాలంబున పురుష పుంగవులు లుంగీలుగా ధరించు చున్నారు గావున ఎవరైనా వస్తే అద అంబరముతోనే అనగా లుంగీలోనే రావడం సింపుల్ గాదూ? అని ఎదురు ప్రశ్న వేస్తాడు!

ఇంతకూ చెప్పొచ్చేదే మంటే .... కేవలం చొక్కాలు విడిచేదానికి కొంద రికి అంత పట్టింపు ఎందుకూ అని! రాష్ట్రపతి అంతటి మహోన్నత పదవి నలంకరించిన మహానుభావులే కేరళ దేవాలయాలలోకి చొక్కాలు విప్పి రావాలి అంటే కిమ్మనకుండా ఆ సంప్రదాయానికి తలవంచుతారే? ఏ గోవా బీచ్ లోనో, కోవలం బీచ్‌లోనో, బట్టలు విప్పి, నగ్నంగానో, అర్ధ నగ్నంగానో, కౌపీన మాత్ర నగ్నంగానో స్త్రీ పురుష విభేదాలను విస్మరించి, పరవశులై, 'పర' వశులై బట్టలు విప్పేసి జలక్రీడలు సలుపుటలో లేని అభ్యంతరము ఒక మత సంస్థలో, అదీ ఒక్క అరగంట, ఒక్క చొక్కా మాత్రమే విప్పుటకు ఎందు కుండాలి? అమృతసర్ స్వర్ణదేవాలయం చూడదలచుకున్న వారికి వారు ఏ

మతస్థులైనా! నెత్తికి గుడ్డ చుట్టుకోనిది ప్రవేశం లేదే! మన వారంతా వచ్చినట్లు తోక ముడుచుకొని 'నెత్తిన గుడ్డ వేసుకొని (! ?) పోయిన వారేనే! ఆమాట కొస్తే స్కూళ్ళలో యూనిఫారా లెందుకు? ప్రస్నలు విద్యను గఱపు తాయా ? కొన్ని కొన్ని కాన్వెంట్లలో, జాతి మత విచక్షణ లేకుండా ఏ విద్యార్థినిగానీ పూలు, బొట్టు, కాటుక, గాజులు కూడా పెట్టుకొని రాకూడదను నియమముంటే మన వాళ్ళు నోరు మూసికొని పాటించుచున్నారే? కోర్టులో నల్లకోటు లేకుండా వాదిస్తానంటే ఎలా ? 'నా వాద పటిమ వినండి, నల్ల కోటులో ఏముంది ?' అని మొండిగా వాదిస్తే సదరు న్యాయవాది గారి పట్టా మరునాడే రద్దుకాదా? ఇంతెందుకు, ఈ ఉపనయనము తాలూకు వాళ్లంతా భీష్మించుకొని, చివరకు వెళ్లి భోజనం చేసిన హోటల్లో కూడా 'కంచములలో చేతులు కడగరాదు' అంటే కిక్కురు మనకుండా పాటించారే? మన పూర్వులు అసలు చొక్కాలు లేకుండానే తిరిగే వారని విన్నామే. అందాకా ఎందుకు, మహాత్మాగాంధీ గారి కన్నా మనము గొప్పవారమా ?

బాబూ ! ఒక్క భోజన సమయంలో- అదీ ఇంట్లో కాదు, ఒక మత సంస్థలో చొక్కాలిప్పడానికే విలవిల్లాడారే. భగవద్గీతలో చెప్పినట్లు రేపు ఈ శరీరము అనే చొక్కాను విసర్జించవలసి వస్తే ఎంత గింజుకొంటారో కదా ?

మరొక 'జోకు' చెప్పి ముగిస్తా. ఒక టీ పార్టీకి ఒక డాక్టరు గారు, ఒక లాయరు గారు వెళ్లారట. మాటల సందర్భంలో, డాక్టరు గారు, లాయరు గారితో 'నాకెక్కడికైనా ఇలాంటి పార్టీలకు రావాలంటే బలే చిక్కుగా వుందండీ ప్రతీవాడు తమ తమ జబ్బులను ఏ కరువు పెట్టుకొని ఏవో మందులు వ్రాసివ్వండి' అని అడుగుతాడు. వేసారి పోతున్నా' అన్నాట్ట.

లాయరుగారు "ఆ! దాందేముంది? బట్టలు పూర్తిగా విప్పి బల్లమీద పడుకోండి పరీక్ష చేస్తా అనండి. ఇంకెవరైనా మిమ్మలను పార్టీలలో వైద్య సలహాలడిగితే మీ స్టెతస్కోపు మీద ఒట్టు!" అన్నాడట!

ఈ సలహాకు మరి లాయరుగారి ఫీజు ఎంతో తెలియదు!

—: o :—

# 35. దేవుడు వరమిచ్చినా....

'పూజారి వరమీయడు' అనిగాదు నేను చెప్పబోయేది! ఆ ఇచ్చే దేవుడు గారి నిజాయితీని గూర్చి, పుచ్చుకునే మహామేధావులను గూర్చి. 'దేవుడు దయామయుడు' అంటాం. దయామయుడు అనడం ఎంత సబబో తెలియదు కానీ అయోమయుడు అంటేనే ఇంకా సబబేమో అనిపిస్తుంది. చూడండి-

"వద్దు మొర్రో యన - వరదలో వడ్రతోయు
చినుకుకై వేడ భీష్మించు చుండు!
చావుకై వేచిన శత వృద్ధు నటు బెట్టి
కుర్రకారుల పీక కోయు చుండు!
గుణ హీనులను గొప్ప ధనవంతులుగ జేసి
మంచి వారల కొంప ముంచు చుండు!"

'ముసలి పీనుగ త్వరగ పోతే బాగుండు' అని సంతతి చేత, సంఘం చేత ఛీదరించుకోబడి బ్రదుకులు ఈడ్చుచున్న వారి జోలికి పోడు! పూత పిందె కాపురాలను కూలుస్తూంటాడు! అమలాపురం వాళ్ళకేమో అతివృష్టి! అనంతపురం వాళ్ళకు అనావృష్టి! మరి ఆయనగారి రూల్సు, రెగ్యులేషన్సు అవసీ జనులకు అర్థము గావు!

దేవుడు గారు బ్రహ్మాండమైన రాజకీయ వేత్త అయ్యుండాలి! మన ప్రభుత్వం వాళ్ళు ఈ చేత్తో జీతాలు, భత్యాలూ పెంచినట్లే పెంచి, ఆ చేత్తో పాల రేట్లూ, తపాలా టారిఫ్‌లూ, రైలు, బస్సు ఛార్జీలూ అమాంతం పెంచేసి, ఇచ్చిందానికి ఇబ్బడి రాబట్టుకున్నట్లు, తపస్సు చేసిన వారికి వరాలు ఇచ్చినట్లే ఇచ్చి వాటిని వేరే రూట్లో నరుకుకుంటూ వస్తాడు. ఆ వరాలు కాస్తా తుస్సుమని నిష్ఫలమైపోతాయి. ఆ వరాల్లో ఎక్కడో ఒకచోట చిన్న లొసుగు వుండి తీరుతుంది. కొండొకచో, తపస్సుకు ముందు సాధించాలనుకున్న వరాన్ని మరపింపజేసి చవ్వ చవ్వని చచ్చువ్వర వరాన్ని కోరుకునేటట్లుగా కూడా చేయగల

సూపర్ కంప్యూటర్ బ్రెయిన్‌గలవాడు దేవుడు. అందరిచేత ప్రార్థింపబడుతూ వారితో 'అది దేవ్, ఇది దేవ్' అని ఎప్పుడూ దేవురింప చేసుకునేవాడు దేవుడు! తెలిసికొనుటకు ఆయన 'మీ వల్లకాదు-మా వల్లకాదు' అని ఎవరో వ్యంగ్యంగా అన్నాట్ట! నిజమే!

కుంభకర్ణుని ఉదంతము తీసుకోండి. అంత ఘోర తపస్సు చేసి తీరా దేవుడుగారు ప్రత్యక్షమయ్యాక ఆ ప్రబుద్ధుడు ఆరు నెలలు నిద్ర, ఒకరోజు భోజనం కోరుకునేటట్లు ముందుగనే పథకం వేశాడాయె!

హిరణ్యకశిపుడంతటి రాక్షస రాజు బ్రహ్మను గూర్చి బ్రహ్మాండమైన తపస్సు చేశాడు. చివరకు బ్రహ్మ దిగివచ్చి, వరము కోరుకొమ్మనగానే, ముందూ వెనకా ఆలోచించికుండా "దేవతలచేగానీ, రాక్షసులచేగానీ, నరులచే గానీ, రాత్రిగానీ, పగలుగానీ, జలముపైగానీ, నేలపైగానీ, ఆయుధముతో గానీ చావు కలుగకుండునట్లు"కోరుకుంటాడు! అంతటి దీర్ఘకాలిక తపస్సు చేసే టప్పుడు, కోరబొయ్యే కోరికను, అవసరమైతే ఏ అడ్వకేటునో సంప్రదించి డిమాండ్ల లిస్టు రాసిపెట్టుకొని అడగక్కర్లా? అదే మన యన్.జీ వో.లు గానీ, కార్మికులుగానీ ఐతే ఎంత జాగ్రత్తపడి పకడ్బందీగా అడుగుతారు! అడిగే వరంలో ఇన్ని 'కానీ'లూ ఇన్ని క్లాజులూ ఎందుకు? రూల్సు ఎక్కువ అయితే లూపుహోల్సు ఎక్కువగావుంటాయనే అవగాహన కొరవడింది హిరణ్యకశిపునికి! ఈ 'గానీ' లతో పుచ్చుకున్న వరము పుచ్చి, యేగానీకి కొరగాకుండా పోయె!

రావణాసురునికి కూడా పది తలకాయలని విన్నామే గానీ, ఉత్త మట్టి బుర్రలు! నర, వానరులను ఇరికించడం మరచాడు. చిన్న గుమాస్తా నౌకరీ ఇంటర్వ్యూకు కూడా మనం ఎంత ప్రిపేర్ అవుతాం? ఎన్ని ఫోనులు కొట్టిస్తాం? ఎన్ని రికమెండేషన్ లెటర్స్ సమకూర్చుకుంటాం. చివరకు 'దక్షిణా'భిముఖు లము అయి సర్వశక్తులు ధారపోస్తాం!

మురాసురుని సంగతి? అతడు కోరిన వరము? అదీ ఒక వరమే?? ఎవరి మీద తన చెయ్యి పెడితే వాడు దహించుకొని పోవాలిట! 'తనమీద దక్క' అని అనాలని తోచకపోయె? దాంతో అంత వరమూ శ్రవరం!

మన ఉద్యోగ వర్గాలకున్న ముందుచూపు ముందు వాళ్ళు బలాదూర్! మా రోజుల్లో క్రొత్తగా ఉద్యోగంలో చేరేవాళ్ళకు ఎంత భయం? డైరక్టరు పేరు చెపితేనే 'దయబిటీస్' వచ్చినట్లుండేది. ఇప్పుడూ? జాయినింగ్ అప్పుడే ఒక జేబులో జాయినింగ్ రిపోర్టు మరొక జేబులో సెలవు చీటీ! బాధ్యతలకన్నా ముందు హక్కుల చిట్టాను బైహార్టు చేసుకుంటారు.

ఒక చిన్న ఉద్యోగికి పాపం, ఎంత కాలానికీ ప్రమోషను రాలేదట. పై అధికారి దగ్గరకు ఎలాగో ధైర్యం చేసుకొని వెళ్ళాడు. ఇక్కడ ధైర్యం అంటే 'రిహార్సల్సు' అని అనుకోండి. "అయ్యా! నేను మీ దగ్గర వదునైదేండ్లుగా పనిచేసీ పనిచేసి, పదునుగా వున్న మెదడు మొద్దుబారి పోయింది" అని తన గోడు మొదలెట్టాడట. అధికారి "నాకు టైము లేదు నీ గొడవ తీరికగా వినటానికి. ఒక్కమాటలో చెప్పు" అని హెచ్చరించాడు. "నాకు పదిమంది పిల్లలు, ముసలి తలిదండ్రులు" అని మళ్ళీ నసగడం ప్రారంభించాడట గుమాస్తా. అధికారిగారు ఉగ్రుడై "మళ్ళీ చెప్పుతున్నా, ఒక్కమాట! ఒకే ఒక్కమాట!" అని గద్దించాడు. చిరుద్యోగి కాస్త ఆలోచించి, ఒక పెద్ద కాగితాన్ని అందించి "సంతకం" కావాలి అన్నాట్ట. అంతే, ఆ సంతకంతో, దానికి ప్రాణప్రతిష్ఠ జరిగి ప్రమోషన్ వచ్చిందట. అలా వుండాలి సమయస్ఫూర్తి!

కాశీమజిలీ కథల్లో ఒక ఘట్టం జ్ఞాపకమొస్తుంది. కొందరు రాకుమార్తెలు సరస్సులో స్నానము చెయ్యాలని వెళ్లారు. అది మహిమగల కొలను. అందులో, ఏ కోరిక కోరుకొని జలకమాడితే ఆ కోర్కె నెరవేరుతుంది. ఒకతె అందమైన భర్త కావాలి అని, మరొకతె ఆరోగ్యవంతుడైన భర్త కావాలి అని, వేరొకతె ఐశ్వర్యవంతుడైన భర్త కావాలని, ఇలా వేరు వేరు కోర్కెలతో సరస్సులో

మునకలేస్తారు. ఇదంతా ఒక చెట్టుచాటున రహస్యంగా వింటూ వుంటాడు ఒక సాదా సీదా మనిషి.

"వీళ్ళందరికీ నేను భర్త కావాలి' అని కోరుకొని కొలనులోకి అమాంతం పైనుంచి దూకేస్తాడు. అంతే. అతడి కోర్కె సద్యః ఫలితమిచ్చింది. చూడండి. ఎంత సింపుల్‌గా శ్రమలేకుండా జాక్‌పాట్ కొట్టాడో! కేవలం పాదాభివంద నాలతో మంత్రి పదవి సంపాదించినట్లు! అలా వుండాలి సమయస్ఫూర్తి!

కటిక దరిద్రంతో బాధపడుతున్న ఒక బ్రహ్మచారి అందరి లాగే తపస్సు చేశాడు. అందరికీ లాగే దేవుడు ప్రత్యక్షమయ్యాడు. ఆ నిత్యదరిద్ర బ్రహ్మచారి "నా మునిమనుమడు బంగారు పల్లకీలో వచ్చి నాకు నూరవ పుట్టిన రోజు పాదపూజ చేయాలి" అని అడిగాడట, అలా వుండాలి ముందు చూపు అంటే.

మన రాజకీయనేతలను చూడండి. ఒకే ఒక్కవరం కోరుకుంటారు. ఒకే ఒక్క మాట. ఓటు. అది పుచ్చుకుంటారు. మళ్ళీ ఎన్నికల వరకూ ముఖం చూపిస్తే ఒట్టు!

ఎన్నికల ముందు వోటు
ఎన్నికైతే వాట్ ?!

—: 0 :—

# 36. పుస్తకాలు

మనుజులలోని మస్తకాల లాగే పుస్తకాలు రకరకాలు. ఫ్రాన్సిస్ బేకన్ అనువాడు పుస్తకాలను చక్కగా వర్గీకరించాడు. కొన్ని పుస్తకాలు కేవలం రుచి చూడవలసినవట. కొన్ని రుచికరమైనవట. అంటే, రుచిగా వున్నాయి గదా, ఎక్కువగా చదివితే ఆరోగ్యం దెబ్బతినవచ్చు! కొన్ని చేదు మందు మాత్రలట. కొన్ని బాగా నమిలి, మింగి, జీర్ణించుకోవలసినవట. కొన్ని అక్కడక్కడ మాత్రమే పుటలు తిరగెయ్యదగినవి. కొన్ని కేవలం ఉబుసు పోక పుస్తకాలు. కొన్ని మన తరపున ఇతరులు చదివినా సరిపొయ్యేవి. కొన్ని మాత్రమే, బహుకొద్ది పుస్తకాలు మాత్రమే శ్రద్ధతో, ఆద్యంతాలు, మనసు లగ్నం చేసి చదివి, కలకాలం భద్రపఱచుకోదగ్గవి.

కొన్ని పానకం లాగా, చెఱుకు గడ లాగా తియ్యగా ఉండొచ్చు కానీ, ఆ చెఱుకు లాగానే, ఒకసారి ఆస్వాదిస్తే పిప్పిగా మారిపోతుంది. రెండో సారి చదవడానికి ఏమీ మిగలదు! పానకం మరురోజుకు పులిసిపోయి, వ్యాధికారకం కావచ్చు!

ఉత్తమ గ్రంథాన్ని చాలా పెద్ద ఉన్నతాధికారితో పోల్చొచ్చొకడు. రెండూ సగటు ప్రజలకు అందుబాటులో ఉండవు! ఉద్గ్రంథం పెద్దపెద్ద గ్రంథాలయాల్లో వుంటుంది. ఉన్నతాధికారి పెద్ద పెద్ద రాజధానీ నగరాల్లో ఎక్కడో ఏ.సీ రూములో ఎవరికీ అందుబాటులో లేకుండా ఉంటాడు.

ఫాక్సన్ హూడ్ అనువాడు 'పుస్తకాలు విలువైన ఔషధాలు లాంటివి' అన్నాడు. వాటి వాడకంలో తగు జాగ్రత్తలు వడకపోతే ప్రమాదం అని పరోక్షంగా హెచ్చరించాడు.

ఇ. పి. విపిల్ అనువాడు "పుస్తకాలు కాలమనే మహా సముద్రమును దాటుటకు ఉపకరించే దీప స్తంభాల్లాంటివి" అన్నాడు.

మార్క్ ట్వెయిన్ గారు 'ప్రజలచే పూర్తి పఠించబడకుండా, ప్రశంసించ బడేది ఉత్తమ గ్రంథము' అని చురక వేశారు! దీనినే 'మెకార్తి' అను వాడు పరోకరకంగా చెప్పాడు. ఉద్గ్రంథం అంటే ఎక్కువ మందిచే చదువ బడినట్లు అబద్ధాలు చెప్పించుకునే పుస్తకం అన్నాడు. ఇలా తలా ఒకలా చెప్పారు.

గ్రహింపబడే పుస్తకం కన్నా, రసజ్ఞులచే సంగ్రహింపబడే పుస్తకం మంచి పుస్తకం. అందులో ఎంతో సరుకు లేనిది గ్రంథ చౌర్యమునకు దిగ జారదు గదా! గ్రంథ చౌర్యము అంటే పుస్తకాన్ని దొంగిలించి తీరాలి అని రూలు లేదు. అందులోని అంశాలను, వారి వారి పేర్లమీద చలామణీ చేసినా గ్రంథ చౌర్యమే! కాబట్టి అది నిక్కచ్చిగా మంచి పుస్తకమే అయ్యుండాలి.

రచయితలు సమాజాన్ని నడపు ప్రచ్ఛన్న నియంతలు అని నానుడి. నా, నుడి కాదు. ఇది వాస్తవం కాదేమో! సత్యహరిశ్చంద్ర కథను చదివిగానీ, సినిమా చూచిగానీ ఎంతమంది సత్యవ్రతులుగా మారిపోయారు? వరకట్న సమస్య, బ్లాకు మార్కెట్ సమస్య, అంటరానితనం, లంచగొండితనము, ఇలా సంఘాన్ని ప్రతినిత్యం పట్టి పీడించుకొని తింటున్న ఎన్నో, ఎన్నెన్నో సమస్యలను గూర్చి కవితలు, కథానికలు, కథలు, నవలలు, నాటకాలు, సినిమాలు అసంఖ్యాకంగానే వచ్చాయి. ఆవగింజంతైనా సమాజం మారిందంటారా? మారుతూందంటారా? దిగజారుతూందే! ప్రపంచ దేశాల గత చరిత్రలను చదివి మనము ఎన్ని గుణపాఠాలు నేర్చుకున్నామో ఇదీ అంతే. యుద్ధాలు సమసి పోయినవా? మతకలహాలు మానిపోయినవా? గత ప్రభుత్వాలు చేసిన తప్పిదాలను మళ్ళీ చెయ్యటం మానుకున్నారా? సాహిత్యపఠనం కూడా ఆ బాపతే. ప్రపంచతత్త్వమే చిత్ర విచిత్రమైనది.

రచన కూడా అన్ని వృత్తులలాగే ఒక వృత్తి. లేదా వ్యాపకం. 'సమాజ కళ్యాణం కొరకు రచనను చేపట్టాం' అనడం అసలు సిసలు ఆత్మవంచన, స్వలాభాపేక్ష కీర్తికాంక్ష- ఇవే ముందుకు నడిపిస్తున్నాయి. కొద్దో గొప్పో. నిస్వార్థ సేవాభావంతో, భాషాభివృద్ధి దృష్టితో, భాషామతల్లికి అంకితమైన మహనీయులున్నారు వాళ్ళు ప్రాతఃస్మరణీయులు. మళ్ళీ మళ్ళీ ఏటికోళ్ళు అర్పించుకోదగ్గవారు.

పీధి వీధికి ఆధునిక అచ్చుయంత్రాలు, ఆఫ్‌సెట్ ప్రింటర్సు హెచ్చుగా వున్న ఈరోజుల్లో అర్థబలం వుంటే ఎవడైనా గ్రంథముద్రణకు పూనుకోవచ్చు. ఆ గ్రంథంలో 'అర్థ'బలం వుండేవి ఎన్ని? లోకానికి పనికొచ్చేవి ఎన్ని? తూకానికి పనికొచ్చేవి ఎన్ని? పాఠకులకే తెలియాలి! పరమాత్మునకే తెలియాలి!

చిత్రమేమిటంటే, ముద్రణా సౌకర్యం బొత్తిగా లేని తాళపత్రలిపుల కాలంలో భారత, భాగవత, రామాయణంలాంటి మహోత్కృష్ట గ్రంథాలు వచ్చాయి. గ్రంథకర్తలు స్థిరకీర్తిమంతులయ్యారు. ఆధునిక యుగములో, ఈ ధనిక స్వామ్యయుగంలో అలాంటి వెన్ని వచ్చాయి? ఎన్ని నిలిచాయి? రాటిని చూచుటకు మాత్రమే తలయెత్తుకోవాలి. వానిని చూడటానికి దించుకోవాలి!

వర్తమాన కాలంలో, ఏది నిజంగా ఉత్తమ గ్రంథమో, ఏది ఉత్త పుస్తకమో, ఏది పబ్లిసిటీ ముసుగులో మంచి పుస్తకంగా ప్రచార లాభం పొంతుతూందో గ్రహించడం కష్టమే. పబ్లిషర్ల దృష్టిలో అమ్మకాల సంఖ్యే కొలమానము.

సారస్వత రంగం కూడా అన్ని రంగాలలోవలె, వ్యాపారమయమై కూర్చుంది కాదు. కొట్టుమిట్టాడుతూంది "సారా స్వతహాగా చెయ్యటం నేరం! సారస్వత వ్యాపారం ఘోరం!"

సర్వే సర్వత్రా సారస్వత సంఘాలు, సాంస్కృతిక సంఘాలూ పుట్ట గొడుగుల్లాగా పుట్టుకొస్తున్నాయి. వీటిలో చాలా సంఘాలకు ముఖ్య కార్య క్రమము సన్మాన సభలో, అభినందన సభలో, ఆవిష్కరణ సభలో జరపటం. గ్రంథంలో పెద్దగా గంథం లేకున్నా, రెండు మూడు సన్మాన సంఘాలను ఆశ్రయిస్తే, 'తైలం' వదిలించుకొనే దానికి సంసిద్ధమైతే కావలసినంత ప్రచారం ఖాయం!

ముందు 'రైటర్'గా పేరు రావాలి. దానికి అన్నిదారులా తొక్కాలి. ఆ తర్వాత డోకొచ్చే రాతలకైనా ఢోకాలేదు. అడపా దడపా రాతలు అచ్చు ముఖం చూచాయో 'నెంబరు టూ' అధ్యాయం నాటినుండే ప్రారంభం. ఆధునిక చిత్రంలా, దేవతా వస్త్రంలా రాతలున్నా నుదుటి రాతలు మారవచ్చు. దువ్పట్లు, చవ్పట్లు, పూలదండలు అడపా దడపా సంప్రాప్తించవచ్చు. అంచె లంచెలుగా ఎదిగిపోవచ్చు!

పోతే, మనపాఠకులు, ఎన్నికల ముందు వోటర్లలాగా, వెర్రిబాగులవారా అనిపిస్తుంది. జనతా వేవ్, ఇందిరా వేవ్, యన్. టి. ఆర్ వేవ్, రాజీవ్ వేవ్‌ల లాగా సారస్వత రంగంలో, ఈ 'వేవ్'లే జనాన్ని పాలిస్తూన్నాయేమో అని నా అనుమానం. ఎంతోమంది సుప్రసిద్ధ రచయితలు, త్రులు తాటాకు మంట లాగా గప్ అని ఒక్క వెలుగు వెలిగి మళ్ళీ చప్పున చల్లారిపోయి, చిరునామాలు లేకుండా పోయిన దాఖలాలు లేవూ? విరివిగా మార్కెట్‌లోకి వస్తున్న రకరకాల పత్రికల పుణ్యమా అని విజ్ఞాన శాస్త్రం ముసుగులో 'వెలిసి' పోతున్న నవలా సాహిత్యం ప్రజల కందించి, ఎందరు రచయితలు వెలసిపోతు న్నారో తెలియాదా? సారస్వత రంగంలో కూడా రాజకీయాలు చోటు చేసుకున్న ఈ రోజుల్లో ఒక రచయితకు ఏ అవార్డో వచ్చిందనుకోండి, అది ఎందుకు వచ్చింది? నిజంగా అర్హత కలిగినదా? అని ఆలోచించే ఓపిక ఎవరికి? వాళ్ళు చేశారని వీళ్ళు, వీళ్ళు చేశారని వాళ్ళు, సభలు సన్మానాలు జరిపేందుకు ముందుకు వస్తారు. ఎవరి లాభం వారు చూసుకుంటున్నారు! ఏ గ్రంథకర్తా

అవార్డు గ్రహీత కాకముందే గుర్తింపు పొంది సత్కారం అందుకున్న సందర్భాలు లేవే? ఈ సంఘాలు అంతదాకా ఆయనగారి ప్రతిభను గుర్తించక పోవటానికి కారణం ఏమిటి? ఎవరూ రాత్రికి రాత్రి మహాకవి కాదే!

సుప్రసిద్ధ కవి డా. సండూరి రామకృష్ణమాచార్యులవారు సెలవిచ్చినట్లు డబ్బుంటే-

"నరుడే చతురాస్యుడగును నాయకవరుడే
వరదుడు, రసికవతంసుడు
సరసుడు పురుషోత్తముండు సర్వజ్ఞుడగున్
స్వార్థపరుడు దేశభక్తుడగును
అగును లొట్టిపిట్ట అందాల కాణాచి
పామరుఁడు గొప్ప పండితుండు!"

ప్రతి గ్రామానికి ఒక దేవత ఉన్నట్లు పట్టిసీటికి ఈ సంఘాలు నగర దేవతలు, సిసీఫాన్సు సంఘాల్లాగా సాంస్కృతిక సంఘాలు, రచయితలు అన్యోన్యాశ్రయ జీవులు! కంట్రాక్టర్లు, ఇంజనీర్ల లాగా!

కొత్తగా వెలిసిన సాంస్కృతిక సంఘాలు ముందు కొంచెం పెట్టుబడికి వెనుకాడకుండా ఇలాంటి సన్మానసభలూ గట్రా, పేరున్న వాళ్ళకు ఏర్పాటుచేస్తే ఉభయతారకం. ఆ పాటి డబ్బు పోగుచెయ్యటానికి, బెనిఫిట్ షోలనీ, సావనీర్లనీ ఎన్నో టెక్నిక్ లు ఉండనే ఉన్నవాయె! కాలక్రమేణా బండి 'రివర్సు' గేర్ లో నడుస్తుంది. అనగా రచయితలే సంఘాల వెంట పడతారు. పడాలి మరి. పడక యేంజేస్తారు? మెళ్ళో రేపు పూలదండలు పడాలంటే, వాళ్ళ అండదండలు తప్పవు. వాళ్ళపాలిట పడక తప్పదు. పూలమాలలు పడక పోతే ఆ బెంగతో పడకలెక్కిన వారున్నారు!

కీర్తి కండూతి అనే "గోకుడు తామర" ఒకసారి తగులుకుంటే శ్రీఘ చికిత్స లేదాయె! దాని లక్షణం గోకించుకునే కొద్దీ కండూతి ఉధృతం కావటమే.

తామర అంటే జ్ఞాపక మొచ్చింది. ఈ సాహితీవేత్తలకు కళాకారులకు మరో సరికొత్త రింగ్ వర్మ్ జబ్బు! ప్రతివాడూ ఒక 'రింగ్'ను తయారు చేసుకుంటాడు. (వేళ్ళకు కాదు). ఆ 'రింగ్‌ను' పెంచి పోషిస్తూ వుంటాడు, అది లేనిదే పైకి రాలేమని భయమేమో. వీళ్ళలో చాలా మంది సలక్షణులే కానీ 'ష' లక్షణం కూడా వంటబట్టించు కుంటారు. అదేమిటంటే, ప్రక్కవాడి "కాలు బట్టి కింది కీడ్చే 'ష'కార తత్త్వం" 'అహంభో అభివాదయే' అని లోలోన అనుకొంటూనే వుంటాడు. ఈ కాలంలో 'గిఫ్టు' ఒక్కటే చాలదు. 'లిఫ్టు' కూడా ముఖ్యం!

ఆ మధ్య కొంచెం సుస్తీగా వున్నారని విని, ఒక రచయిత మిత్రుని ఇంటికి వెళ్ళా. "ఏమిటి అలా వున్నారు? జబ్బేమిటి?" అని అడిగా. "అదే నాకూ తెలియటం లేదు. నిన్నరాత్రి నుంచి కొంచెం టెంపరేచరు కూడా వచ్చింది" అన్నారు.

"డాక్టరుకు చూపించకపోయ్యారా?" అని అడిగా. ఇంతలో వాళ్ళ బావమరిది వచ్చి, "అబ్బే! మా బావగారికి జబ్బేమీ లేదండీ. ఆయనగారిది హైపోకోండ్రియా! ఏవేవో ఊహించుకొని బాధపడిపోతుంటారు. రేపు ఏ సాంస్కృతిక సంఘం వారో ఒక సన్మానం చేస్తామంటే జబ్బు గిబ్బు ఎంచక్కా ఎగిరి, గెంతేసి లేచి కూర్చుంటారు. ఈ కాస్తదానికి డాక్టర్లు ఎందుకు డబ్బు దండుగ!" అని చనువుకొద్దీ అన్నాడు.

ఆయన హాస్యానికే అన్నాడే అనుకోండి. అందులో కొంచెం నిజం కూడా లేకపోలేదని అనిపించింది.

ఆ.... ఇంతకూ ఏది మంచి పుస్తకమో చెప్పలేదు గదూ? మా వితండేశ్వరరావు సూత్రప్రకారం చెక్కుబుక్కూ, డబ్బున్న పాసుబుక్కూ, రైల్వేగైడ్, పంచాంగం- వీటి తర్వాతే అన్నీ అన్నాడు! కలికాలంలో ఇది కరెక్టేనేమో!

—: 0 :—

# 37. జననీ, జన్మభూమిశ్చ

మా వూరెళ్ళాలంటే నాకు చాల ఇష్టం. ఆ మాట కొస్తే ఎవరికి యిష్ట ముండదు లెండి అదే, మా వూరు చూడాలని కాదు. వాళ్ళ వాళ్ళ ఊళ్ళను చూడాలని!

మనం పుట్టి పెరిగి, బాల్యం గడిపిన ఊరి కెళ్ళడం, అక్కడ మన చిన్నతనంలో దాగుడుమూతలు, తొక్కుడుబిళ్ళలు, అమ్మాయిలతో కూడా అమాయికంగా వెన్నెల కుప్పలు ఆడుకున్న చోట్లూ, బాల్య స్నేహితులనూ చూడటం, కొంటె చేష్టలను చేసి బయటి వాళ్ళతో, వాళ్ళ కంప్లయింట్ విని ఇంటి వాళ్ళతో బడితెపూజ జరిపించుకున్న రసవద్ఘట్టాలనూ తరతమ బేధాలు లేకుండా, హోదాలను మఱచి, సాదా జనంతో కలిసి మనం ఈదులాడిన నదులనూ, కోనేర్లనూ, చెరువులనూ, దిగుడు బావులనూ తలచుకుంటే వొళ్ళు పులకరిస్తుంది. అలా పులకరించకుంటే వాళ్ళకేదో మానసిక రుగ్మత ఉంటుందనే నా అనుమానం. మా వూర్లో కొంతమంది పర్మనెంటు బిచ్చగాళ్ళు కూడా వుండేవారు. వెళ్ళినపుడు వాళ్ళను చూచినా నా కేదో చెప్పరాని మమకారం. మన వయసు పెరిగే కొద్దీ, యీ మమత ఇంకా పెరుగుతూనే వుంటుంది. అవి మరపురాని, తిరిగిరాని మధురానుభూతులు. వాటిని చూస్తుంటే, తలచుకుంటూంటే, మనం మళ్ళీ ఆ బాల్య యౌవన అవస్థలలోకి అడుగుపెట్టి చూసుకుంటాం, సినిమాల్లో ఫ్లాష్‌బాక్‌లలా. మూడు, నాల్గు దశాబ్దాల క్రిందటి కుర్రవాళ్ళం అయిపోతాం అనుభవించిన రసజ్ఞులకే ఈ ఆనందం అర్థమౌతుంది.

'ఓల్డు యీజ్ గోల్డు' అనేది 'గోల్డు' లెటర్స్‌లో వ్రాయవలసిన మాటలు! పాత బియ్యం శ్రేష్ఠం. పాత చింతకాయ పచ్చడి బాలింతరాండ్రకు కూడ పథ్యం. పాత చింతపండు మంచిది. పాత సినిమాలు కూడా డిటో.

వాటిని చూస్తూంటే నా మటుకు నాకు కుర్రాణ్ణి అయిపోయినట్లు అనిపిస్తుంది. జననీ, జన్మభూమిశ్చయే గాదు, పాత సినిమాలు, గత స్మృతులు కూడా 'స్వర్గాదపి గరీయసీ' అంటా

అవసరం వున్నా, లేకున్నా యల్.టి.సీ సౌకర్యం వున్నా లేకున్నా అయిదేళ్ళ కొకసారైనా స్వంత వూర్లకూ వెళ్ళడం ఆయుర్వృద్ధికరమనీ, ఆరోగ్యకరమనీ నా సిద్ధాంతం! రెండు, మూడు సార్లు నాకు బాగా జ్వరంవచ్చి మా వూరి పొలిమేరల్లోకి అడుగు పెట్టగానే జ్వరం అమాంతంగా ఎగిరిపోయిన సందర్భాలున్నాయి. ఈ విషయంలో, డాక్టర్లు మానసిక శాస్త్రవేత్తలు నాతో విభేధిస్తారనుకోను 'హోమ్ సిక్‌నెస్' అనే పదం వూరికే రాలేదు - కొందరు ప్రబుద్ధులు, హోమ్‌టౌన్‌కు వెళ్ళినట్లు 'దొంగ' బిల్లులు పెట్టి, వెళ్ళకుండానే జేబులు నింపుకొని సంతోషిస్తారే గానీ వాళ్ళు ఎంత ఆనందాన్ని పోగొట్టు కుంటున్నారో ఆలోచించరు!

నాకు కొన్ని ఎక్స్‌ట్రా చాదస్తాలు కూడా వున్నాయి. ఎవరైనా ఫ్రెండును విచారించటానికి ఆసుపత్రి కెళ్తా-గా - అక్కడ నేను ఇదివరలో ఎప్పుడో అడ్మిట్ అయి చికిత్స పొందిన బెడ్‌ను చూసుకోంది తిరిగిరాబుద్ధె య్యేదు! ఎవరైనా తెలిసిన నర్సుగానీ, డాక్టరుగానీ ఉంటాడేమో అని వార్డులన్నీ కలయజూచి, వుంటే వాళ్ళను 'హల్లో, గుడ్‌మార్నింగ్'లతో పలకరించితే గానీ మనసు కుదుటపడదు. మా వూరికెళ్ళానంటే ఒకసారి స్కూలు గదులన్నీ సింహావలోకనం చేసి, నేను ఏయే క్లాసుల్లో ఎక్కడెక్కడ కూర్చున్నానో, చూచుకోంది రాను! ఆనాటి స్కూలు అటెండరో, వాచ్‌మేనో వుంటే ఆప్యా యంగా పలకరించి థ్రిల్ పొందుతా. చివరికి తిరుపతికి వెళ్ళినా సరే - అంత క్రితం వచ్చినప్పుడు బసచేసిన లాడ్జిని చూసుకోవాలనిపిస్తుంది కాలవాహినిలో ఆయా స్థలాలు తమ స్వరూపాలను మార్చుకొనుంటే 'యమా' బాధపడుతా. చిన్నతనంలో ఆడుకున్న చింతచెట్టు లేకున్నా కొరతగానే ఫీల్ అవుతా!

ఇంత ఉబలాటం వున్నా మా వూరికి వెళ్ళాలంటే ఒక్క విషయంలో మాత్రం పరమ చిరాకు!

నేను చేసే ఉద్యోగం గూర్చి, నాకెంతమంది పిల్లలు, వాళ్ళ ఉద్యోగ వివరాలు, నా జీతం ఎంత లావు; పై ఆదాయం ఎంత, ఇత్యాది అడగకూడని స్వంత విషయాలను గూర్చి తల దూరుస్తారని కాదు. నా చిన్నతనంలో తన్నులు తిన్న ఘట్టాలను, గోచీ పెట్టుకోకుండా యీత కొట్టిన 'క్రీడా విశేషాలను' జ్ఞాపకం చేస్తారనీ....కానేకాదు. ఇలాంటి ఇష్టంలేని ప్రశ్నలకు అలవాటు పడ్డా, విసుగును దిగమ్రింగి జవాబిస్తా. రాజకీయ నాయకునిలాగా! మరింకేమిటంటారా? వినండి-

'ఏం గురూ, బహుకాల దర్శనం! ఎప్పుడు రావటం'? అంటాడు. చెప్తా.

'పిల్లలంతా కుశలమా?' అడుగుతాడు. చెప్తా.

'ఏం చిక్కిపొయ్యావ్?' అని అడుగుతాడు.

మరికొందరైతే 'ఎలా వుండేవాడివి ఎలా అయిపోయావ్! చిన్నప్పుడు మిసమిసలాడుతుండేవాడివి. పండిన జామపండులాగా' అని అదనపు ప్రేమాను రాగాలను ఒలకపోస్తూంటారు, సినీమాలో నా అభిమాన నటి నిర్మల లాగా!

అదగదీ! అదండీ సంగతి! 'చిక్కిపోయ్యావే?' అంటారు. దాంతోనే నాకు తిక్కరేగేది.

క్షేమలాభాలు విచారిస్తున్నామనుకొని అడిగే ఆ 'చిక్కు' ప్రశ్న వింటే డొక్క చీలుద్దామనిపిస్తుంది. ఇంచుమించు అందరూ ఈ బాపతే. నిజంగా ఎదుటివాడి ఆరోగ్యం కోరేవాడు ఇలాంటి యధాలాపపు అనాలోచితపు ఎదవ ప్రశ్న వెయ్యకూడదంటా. ఎందుకంటారా? నిక్షేపంగా రాయిలాగ వుండే

వాడు కూడా ఇలా నలుగురు అడిగితే చాలు, ఫినిష్! వాడి గుండెల్లో గుబులు పుట్టి తీరుతుంది. "నిజమే ఐ వుండొచ్చు. రోజూ చూచే వాండ్లు గుర్తించలేరు. ఎప్పుడో ఒకసారి చూస్తారు కాబట్టి వారి స్టేట్‌మెంట్ కరక్టేనేమో!" అని మనసులో ఆందోళనకు నాందీ బీజాలు పడవచ్చు.

నలభై యేండ్ల నుంచి వింటున్న ఈ 'చిక్కిపోవడమే' నిజంగా 'నిజం' అయితే ఈ పాటికి నా అస్థిపంజరం మాత్రం మిగిలియుండేది. ప్రతినెలా బరువు మరి ఒకేలాగున ఉంటూంది, ఒక కిలో అటూ ఇటూగా. 'చిక్కిపోవడం ఎలా జరుగుతుందీ అంట!

మొన్న ఆమధ్య మావూరెళ్ళినపుడు ఇలాంటి మార్కు ఆదరాన్నే ప్రదర్శించాడు ఒక మిత్రుడు. నాకు చిర్రెత్తుకొచ్చింది. వాడికి కొంచెం సున్నితంగా వడ్డిద్దామనుకున్నా!

"మిత్రమా!" కుతః కుశల మస్మాకం ఆయుర్యాతి దినేదినే' అన్నట్లు వయసు పెరిగే కొద్దీ ఆయుస్సు తగ్గినట్లే కదా! క్రమక్రమంగా చిక్కగదా చివరకు మృత్యుదేవతగారి చేతిలో చిక్కేది?

అదియునుంగాక, వెండియు, ఈ మన ప్రజాస్వామ్యవేషంలో వున్న విశాల భారతదేశంలో అత్యధిక సంఖ్యాబలంలోవున్న మధ్య తరగతి జాతీల్లో ఒక్కడినైన నేను 'చిక్కని' పాలు తీసుకుంటున్నా. చిక్కని పాలు ఎక్కడ చిక్కి చస్తున్నాయి! ఆ మాటకొస్తే జీవిత సమరంలో అందరూ ఎప్పుడో ఒకప్పుడు చిక్కవలసినవారే! విద్యార్థి, ప్రిన్సిపాల్ చేతిలో చిక్కుతాడు. అత్త, కోడలి చేతిలో చిక్కుతుంది. భార్య, భర్త చేతిలో చిక్కుతుంది. ఒక్కొక్కప్పుడు ఇది రివర్సు కావచ్చు. ప్రభుత్వోద్యోగి పైయధికారికి చిక్కుతాడు. ఆపై యధికారి, భార్య చేతిలో చిక్కవచ్చు.

'బాసుగారు బయట భాస్వరమై మండు
బాసు భార్య ఇంట పవర్‌ఫుల్ డై మండు'

రాజకీయ నాయకులు ప్రతిపక్షాల చేతిలో చిక్కవచ్చు. లేదా ఎన్ని కబుర్లు చెప్పినా ఎన్నికల సీజన్‌లో వోటర్ల చేతిలో చిక్కుతారు!

ఇంతెందుకు అంతటి 'చిక్కుదేవుడుగారు' కూడా భక్తుల చేతిలో చిక్కిపోతాడని మొన్న స్వాములవారు ఉపన్యాసంలో చెప్పలేదా?

ఇలా చిక్కిపోవడం నా ఒక్కరికే కాదు- అందరికీ ఉండే చిక్కే!"

"బాగా చెప్పావయ్యా! వస్తా! వనుంద" అంటూ జారుకున్నాడు ఆ మిత్రుడు.

ఇంతకూ నా రిక్వెస్టు ఏమిటంటే- ఈ 'చిక్కిపోయ్యావేంటి, బక్కగా అయినావేంటి?' అనే ఒక్క చచ్చు ప్రశ్న నన్నడగకండి ప్లీజ్ అని. నిజంగానే చిక్కిపోయియుంటే....అది వేరే సంగతి!

—: o :—

# 38. యమహా! గురూ!

మన తెలుగు వారికి చావు అంటే అస్సలు భయం లేదు! మామూలుగా, పిచ్చాపాటీగా మాట్లాడుకునే, మాటల్లో కూడా "ఎక్కడ చచ్చావురా వెధవా!" అనీ, "ఒరి చచ్చిన పీనుగా!" అనీ, (చచ్చిన తర్వాతనే పీనుగ అంటారు. మరి 'చచ్చిన పీనుగ' అనే ప్రయోగమెందుకో!)"ఇంత సేపూ ఎక్కడ తగలడ్డావ్?" అనీ 'నీ బొంద' 'నా బొంద'అనీ, ఇలాంటి అమంగళ ప్రయోగాలు ధారాళంగా ప్రయోగిస్తుంటారు! కొన్ని ప్రాంతాల్లో "నీ దివసం బెట్టా!"అనీ అంటారు. కోపంగా వున్నపుడే కాదు సుమండీ, వేళాకోళ వేళల్లో, హాస్యంగా మాట్లాడేటప్పుడు కూడా ఈ వాక్యాలు దొర్లుతుంటాయ్. పోనీ, మనకు గిట్టని వాళ్ళనుద్దేశించో, లేదా క్రిందివారితో మాట్లాడేటప్పుడో అయితే ఏదో సరిపుచ్చుకోవచ్చు. అదేం కాదు. స్వంత కొడుకులతో (కొడుకులతో అంటేనే చాలనుకుంటా. స్వంత కొడుకు ఏమిటి, స్వంత తండ్రి ఏమిటి నా బొంద!) ఆత్మీయులతో, చనువు ప్రేమాభిమానాలున్న వారితో కూడా ఇలాగే మాట్లాడుతారు! ప్రేమాభిమానములు ఎక్కువయ్యేకొద్దీ, ఈ ప్రయోగాలు ఇంకా ఎక్కువ! అసలు అభిమానము అంటే 'చంపుట' అనే అర్థం కూడా వుందండోయ్!

మా ఫ్రెండూ, వాడి ఆవిడగారు, ఎప్పుడూ అయిన దానికీ, కానిదానికీ కీచులాడుకునేవారు. "నాకు చావు రాకుండా వుందిరా భగవంతుడా!" అనేవాడు మా వాడు! "నేనూ అలాగే అనుకుంటున్నా" అనేసేది ఆవిడ మామూలు ధోరణిలో. ఆ మహా పతివ్రత మెదడులోని నిజమైన భావము భర్తకు చావు రావాలనో, లేక తనకే అనో నాకు ఎంత చచ్చినా (చూశారా నేనూ అనేశా) బోధపడేదికాదు.

మన శరీరమొక వస్త్రం లాంటిదట. పాతబాడిపోతూనే పారేసి కొత్తది తొడుగు కున్నట్లట 'చావు' అంటే, ఈ వస్త్రం ఉపమానము నాకు బాగా నచ్చింది కాదంటే కొందరివి కాటన్‌వి. కొందరివి నైలెక్సులు, ఫారిన్ నైలెక్సులు, పాలియస్టరు- ఇలా ఎన్నో రకాలు. సరే. ఈ 'భగవద్గీత'లో మూలాతి మూల సూత్రమైన దాన్ని మన ఆంధ్రులు బాగా వంట బట్టించుకున్నట్లు ఏ ఇతర భాషల వాళ్ళూ వంట బట్టించుకున్నట్లు లేదు అందుకనే 'చావు' అంటే బొత్తిగా భయం, భక్తి లేదు. కాదు. భక్తివుంది, భయం లేదు. ఒక చావేకాదు సాక్షాత్ యమధర్మరాజన్నా మనము బెదిరే బాపతు కాదు.

"నిన్నరాత్రి సినిమా ఎలా వుందోయ్?' అని అడిగితే 'యమా'గా వుంది!' అంటాడు లేదా, 'నా బొందలా వుంది' అంటాడు ఈ 'యమా'కు చాలా బాగుంది అని అర్థం అన్నమాట!

సూపర్లెటివ్ అన్నమాట. 'స్పీడు'కు సూపర్లెటివ్ 'యమా' స్పీడ్! ఈ 'యమా'కు బ్రదర్స్ 'గురూ' మాస్టారూ! ప్రతి హారిజాంటల్ వాడూ, వెర్టికల్ ఆసామీ 'ఏం గురూ' అనో, అదిగాదు మాస్టారూ అనో అనేవాడే! ఎదుటివాడిని బుట్టలో వేసుకునేదానికి ఈ పదాలు అమోఘంగా పని చేస్తాయ్. థాంక్యూ, సారీలాగా.

అసలీ 'యమా' ఏ అర్థంలో, ఏ శతాబ్దంలో ఎలా దిగుమతి అయిందో రిసర్చి చెయ్యాలి, ఏమీ పనిపాట లేని పరిశోధకాగ్రేసరులు! యేం? కృష్ణునికి మీసాలున్నాయా లేవా? అర్జునుడు తెల్లనివాడా? పోతన జన్మస్థలము ఏది? కృష్ణదేవరాయలు 'ఆముక్త మాల్యద' నిజంగా వ్రాశాడా లేక పెద్దనగారితో వ్రాయించి ఆయన పేరు పెట్టుకున్నాడా. ఇలాంటి నిష్ప్రయోజక విషయాలపై 'ఉపరి' శోధన చేసి పరిశోధన వ్యాసాలు వ్రాసి డాక్టరేట్లు కొట్టేయడంలా? వాటికన్నా తీసిపోతుందేంటి ఇలాంటి ఇంపార్టెంట్ సబ్జక్టు?

ఏమో! నా మటుకు నేను రిసర్చి చేసి, ఈ ప్రయోగాలు ఉపనిషత్తుల కాలం నుంచి వస్తున్నాయని నిర్ధారణ చేశా!

కఠోప నిషత్తులోని కథ. వాజశ్రవసుడు అనే మహర్షి మహా యజ్ఞం చేస్తూ తనకున్న యావత్తు ధన, కనక, పస్తు వాహనాదులను దానం చేస్తూంటాడు. ఆ మహర్షిగారి కుమారుడు నాచికేతుడు (నచికేతుడు?) చిన్న కుర్రాడు. ఏం పొద్దుపోక, "నాన్నా, నన్నెవరికి దానం చేస్తావు?' అని పాపం, సీరియస్ గానే అడిగాడు. వాజశ్రవసుడు యజ్ఞ కార్యాల్లో బిజీగా ఉన్నట్లున్నాడు. ఇంతా అంతా బిజీగాదు. 'యమా' బిజీ! ఆ మూడ్‌లో మహర్షిగారు, మహా హార్ష్‌గా 'నిన్ను ఆ యముడికి దానం చేస్తా ముందు అవతలికి పో. విసిగించకు" అని గదమాయించాడు. ఇంకేం, కొంప మునిగింది. నాచికేతుడు నేరుగా 'స్పేస్ షిప్'లో యమలోకానికి ప్రయాణం కట్టాడు. యముడుగారు సరిగ్గా ఆ సమయానికి. కొంచెం సీరియస్ కేస్ వచ్చినట్లుంది. కాంపులో వుంటాడు. మూడు రోజుల తర్వాత వస్తాడు. తర్వాత కథ అంతా చెప్పుతూ కూచుంటే స్పేస్ ప్రాబ్లం! ఏదో మరణానంతరం జీవుడు ఏమౌతాడు? ఎక్కడికి పోతాడు? ఇలాంటి అతి రహస్య సమాచారాన్ని, సవాలక్ష ప్రశ్నలేసి, ఆబ్జక్టివ్ టైపు ఆన్సర్సు సాధించి భూలోకానికి వస్తాడు!

ఇంతకూ చెప్పొచ్చేదేమంటే, ఈ నాచికేతుడు ఆంధ్రుడేననీ, అందుకే ఆంధ్రులు చావు అన్నా యముడు అన్నా 'ఆఫ్టరాల్'గా చూస్తారనీ, నాచికేతుడే మళ్ళీ నాచన సోముడుగా పుట్టి యుండొచ్చనీ! మనం మోటర్ సైకిలుకు కూడా 'యమా' అని పేరు పెట్టాం గదా!

మరి, మరణానంతరం జీవుడెక్కడికి పోతాడూ అంటే నాకు తెలిసిందల్లా శ్మశానానికని!

—: ౦ :—

# 39. 'దండో'పాయం!

"దండశ్చేన్న భవేల్లోకే, వినశ్యేయురిమాః ప్రజాః"

"దండమే లేకుంటే ఈ లోకంలోని ప్రజలంతా వినాశము నొందుదురు" అని అర్థం.

'సర్వో 'దండ' జితో లోకే' అందరూ రాజ దండమునకే తల వంచెదరు- అని భారతంలోని సూక్తి.

దండమ్ 'దశగుణం భవతే' అని మన పెద్దల దృఢాభిప్రాయం. పాశ్చాత్య నాగరికతా ప్రభావం వల్లో, మరి దేనివల్లో, అధునికులు, మనస్తత్వ శాస్త్రవేత్తలు ఈ అభిప్రాయంతో, ముఖ్యంగా విద్యార్థుల విషయంలో అంగీకరించరు!వారి కో 'దండం!' Spare the rod, spoil the child' అని ఆ కాలం తెల్ల దొరలు కూడా ప్రవచించారు!

చిన్నతనంలో బెత్తమునకు పని చెప్పకుండా వుంటే, బాలురు వారి వారి చిత్తము వచ్చినట్లు ప్రవర్తించుతూ, బడికి 'దుమ్మా'లు కొడుతూ,ఉత్తరోత్తరా కాలేజీలకు ఆఫీసులకూ ఎగనామం పెడుతూ, కొరకరాని కొయ్యలుగా, అవర నిగమ శర్మలుగా మారి. సమాజ కళ్యాణమునకు నష్టము కలిగించవచ్చు అని హెచ్చరించారు. పిల్లలను కొట్టడం అనాగరికమని, థర్డ్ డిగ్రీ మెథడ్ అనీ, అంటారు.అది నిజం కావచ్చు. కానీ, మరీ అశిక్షితంగా పిల్లలను పెంచటం వల్ల విద్యార్థులలో క్రమశిక్షణ ఎంతగా దిగజారి పోయిందో చూస్తూనే వున్నాం. ఈ సరుకే చట్టసభల్లో నేడు స్వైర విహారం చేస్తున్నారు. ఈ సరుకే ఎన్నికల్లో రిగ్గింగ్ ఎక్స్‌పర్ట్‌లుగా, సారాజులుగా, స్మగ్లింగ్ సార్వభౌములుగా అవతారం ఎత్తుతున్నారు. ప్రజాస్వామ్యం అంటేనే సగటు మనిషికి వెగటు పుడుతూంది.

మా కాలంలో ఎలిమెంటరీ స్కూలు టీచరంటేనే భయం. 'పోలీసు' అంటే చెప్పక్కర్లా. గడగడ! ఇప్పుడు పరిస్థితి చూస్తూనే వున్నారు గదా! "పరీక్షల్లో కాపీ కొట్ట వద్దంటే "ఖచ్చితంగా కొడతాం" అని కత్తులు ఝళిపించే స్థాయికి విద్యార్థులు ఎదిగారు. పోలీసులే భయపడాల్సి వస్తూంది. చివరకు సైన్యము అంటే కూడా 'సై' అంటున్నారు! స్కూటరు మీద వెళ్ళేటప్పుడు హెల్‌మెట్ ఎందుకు పెట్టుకున్నారు? మన హెడ్ రోడ్డుమీద పడిపోయి, 'హెల్'కు పోతామని భయం వల్ల కాదు. హెడ్ కానిస్టేబుల్ పట్టుకుంటాడని, జరిమానా వేస్తాడనే భయం వల్లనే కదా! కాబట్టి, భయం, రాజ దండ భయం వుండి తీరాలి!

రాజనీతిజ్ఞులు శత్రువులను వశపరచుటకు సామ, దాన, భేద, దండోపాయములని చతుర్విధోపాయములను సూచించారు. నా చిన్నతనంలో 'సాదా బేదం' అని వీటికి కొండ గుర్తు పెట్టుకొనేవాడిని. ఇప్పుడు చెప్పుకునేదానికి చిన్నతనం!

సామోపాయము అనగా, పరస్పరోపకారం, మంచితనం, పొగడుట, బంధుత్వము అగపరచుట, హితవుగా మాటాడుట అని అయిదు విధములట.

దానము అనగా ఒక్క ధనము ఇచ్చుటే కాదు - సంపాదనకు తోడ్పడుట, విశిష్ట కానుకల నిచ్చుట, ఇతరుల డబ్బు నీదే అని ప్రోత్సహించుట, అప్పు ఇప్పించుట వగైరాలు (వగైరాకు ఇంకో అర్థం తీయకండి )

భేదోపాయము అంటే - స్నేహమును చెరచుట, కలహములు పెట్టుట, బెదరించుట - ఇవి.

చివరిది దండోపాయము, ఇది మూడు రకాలు. చంపుట, పీడించుట ధనము హరించుట.

ఆముష్మికానికి మనకు తోడ్పడే నీతి శాస్త్రమును విస్మరించినా, ఐహికానికి సద్యః ఫలితాల నిచ్చే రాజనీతిలోని చతుర్విధోపాయాలను మాత్రం

మనం తూ, చా తప్పకుండా పాటిస్తూనే వున్నాం. అంతేగాదు, ఇంకా ఎన్నో క్రొత్త పుంతలు, కౌటిల్యుడు చెప్పిన దానికన్నా ఎక్కువగా, తొక్కుతున్నాం! ఆఫీసుల్లో, జాసును 'కాకా' పట్టడం, ధనం, ధాన్యం ఇతర రూపాల్లో (అదిగో మళ్ళీ అపార్థం వద్దు) 'సప్లైలు' చెయడం, ఇవన్నీ శాస్త్ర సమ్మతములట. మరి లంచం ఇవ్వటం, పుచ్చుకోవడం నేరము అని మనం చట్టాలు ఎందుకు పెట్టుకున్నామో తెలియదు. 'లా' తగలడిందే గానీ, లంచాల బాగోతాలు తగలడ్డాయా? సచివోత్తముడి దగ్గర నుండి, చప్రాసీ దాకా, వారి వారి హోదాలను బట్టి ఈ రాజనీతి శాస్త్ర సూత్రాలను పాటిస్తూనే వున్నారు; వుంటారు! అది చిరంజీవి! క్రిందివాడు 'పై'కి ఆశిస్తే, పైవాడు 'పైడి'కి ఆశిస్తాడు!

పై చతుర్విధోపాయాలు, సర్వవేళలా, సర్వులయెడ, పవ్వలు ఉడక్కపోవచ్చు! నాలుగోది 'దండోపాయం' మాత్రం చాల సులువైనది. నమ్మకంగా జయమును సాధించవచ్చు "దండోపాయ సూత్రం చంపుట, పీడించుట, ధనావహరణం. వీటిని సులువు అంటారేమిటి" అంటారా?

అదే తిరకాసు! సంస్కృత దండం వేరు. దానికి కర్ర అని కూడా అర్థముంది. తెలుగులో దండము అంటే నమస్కారం! మనము తెలుగు వాళ్ళమే గానీ సంస్కృతం వాళ్ళం కాదు కదా!

'నమస్కారం' అనడంలో వివిధ రకంబులైన భంగిమలున్నాయి! వేదంలో లాగా ఉదాత్త అనుదాత్త స్వరభేదాలున్నాయి. ఒక్కొక్క అక్షరం దగ్గర ప్రెస్ చేసీ, దీర్ఘం తీసీ ఉచ్చరిస్తే దాని అంతరార్థం, మహిమ మారవచ్చు! ఎదుటివాడు పసిగడితే మొత్తం వ్యవహారం బెడిసికొట్టవచ్చు! రాంగ్ ట్రాక్‌లో పడి 'బూమరాంగ్' కావచ్చు! కాబట్టి బహు జాగ్రత్త అవసరం. ఈ చిక్కు లేకుండా, వాక్కుతో అనకుండా, మామూలుగా చేతులతో పెట్టే నమస్కారం క్షేమకరం! జయప్రదం. దేవుడి దగ్గర చూడండి - నమస్కారం పెట్టేటప్పుడు నోరు మూసుకొని, మౌనంగానే పెడతాం! నోటి దండాలు, చనువున్న వాళ్ళ దగ్గరే! సాధారణంగా తెలుగులో పెద్దల వద్ద 'దండమండీ!' అనరు. 'దండాలండీ' అని బహు వచనంలోనే అంటారు. ఎందుకో తెలియదు.

కరదండాల్లో కూడా రకరకాలు! రెండూ జోడించి పెట్టడం. చేతులను నెత్తిపైకెత్తడం, ముఖం వరకు ఎత్తడం, గుండె వరకు ఎత్తడం, సాష్టాంగ ప్రణామం. ఇవన్నీ, ఎదుటివాడి స్థాయిని బట్టి, మనకు కావలసిన కార్యము

యొక్క ఘనపు కొలతలను బట్టి, మనకు మనమే నిర్ణయించుకొని రంగంలోకి దిగాలి. కొన్ని సింపుల్ కేసుల్లో కేవలం 'హల్లో'లు, అరదండాలు (అదేనండి గుడ్ మార్నింగ్!) తర్జనీ దండాలు, నమస్తేలతోనే పని అవ్వొచ్చు!

మారిన మాడరన్ కాలంలో, ఈ 'దండో'పాయమునకు మరి రెండు క్రొత్త నిర్వచనాలు కూడ చేర్చవచ్చు. దం ద అంటే ఒకటి పూలదండ, రెండవది దండిగా డబ్బు!, దండాల్లో రీతులున్నట్టే దండల్లో కూడా పద్ధతులున్నాయి. గజ మాల వేస్తే పని గ్యారంటీ! కాకుంటే మాల వాపస్!

అప్పుడప్పుడు పై యధికార్లకూ, అమాత్యవర్యులకూ, సభల్లో ఏదో సాకుతో, దండ ప్రయోగాలు చెస్తూంటే, వారి వారి అంద దండలు మనకు మూడు దండలు ఆరు పుష్ప గుచ్ఛాలుగా వర్ధిల్లగలదు ఇంతెందుకు - రామాయణంలో సుగ్రీవుడు మొదటిసారి యుద్ధం చేసినపుడు వాలి చేతిలో వంకాయ పచ్చడిగా మారి, కొంపకేరి, మళ్ళీ శ్రీరాముని సలహాపై సులభంగా గుర్తించేందుకు పూలదండ వేసుకొని యుద్ధం చేయబట్టి గదా రాముడి చేతిలో వాలి నేల వ్రాలాడు! సుగ్రీవుడు చచ్చి చెడి బ్రతక గలిగాడు! సుగ్రీవుణ్ణి రక్షించింది శ్రీరాముడే కాదు - పరోక్షంగా సీతమల్లె దండ!

దండ ఖర్చు దండగ ఖర్చు కానేకాదు. అధికారంలోకి వస్తూనే కొంత మంది ముఖ్యమంత్రులు 'దండలు వద్దు' అని ప్రచారం కొరకు ప్రకటించడం తెలుసు. అంతా స్టంటు! లోపల, తల మినహా ఎదీ కనపడకుండా దండలు వేయించుకోవాలనీ, ఫోటోల్లో దిగాలనీ ఉండి తీరుతుంది! ఆశే మనిషిలో ఉన్న బలహీనతేమో! ఫోటోగ్రాఫరు లేకుంటే, పేపర్లో పడకుంటే, దండ విలువ దండగ అంటాడు మా మిత్రుడు. నిజమే అనిపించింది. ఆ మధ్య ఒక సాహితీ సమావేశంలో పడక. పడక నలుగురితో పాటూ నా మెళ్లో కూడా ఒకటి పడే సరికి, ప్చ్! ఏం జేస్తాం - పత్రికా ప్రచార ప్రాప్తి యోగం కావాలంటే జన్మ కుండలిలో శుభగ్రహ వీక్షణ ఉండాలి! కేంద్ర కోణాధిపతుల కలయిక వుండాలి! పరివర్తన ఉండాలి. ఏదీ లేకుంటే, పేపర్లో ఫోటో రమ్మంటే మాటలా?

—: o :—

# 40. జీవితం - గణితం

జీవితం మహావిచిత్రమైనది. దీన్ని ఎంతో మంది మేధావులు తత్త్వవేత్తలు ఎన్నో రకాలుగా పోల్చారు. నీటి బుడగ అన్నారు. తామరాకు మీద నీటిచుక్క అన్నారు. జీవితమొక సమస్యల తోరణం - సమస్యలతో రణం అన్నారు. అనుభవించ వలసిందేగానీ, అనిర్వచనీయమన్నారు. కొందరు సముద్రంతో పోల్చారు. అనగా సముద్రంలో వున్నట్లు జీవితంలో కూడా ఉప్పెనలూ, అటు పోటులూ చోటు చేసుకుంటాయని భావం. జలధి తరంగానికి జీవిత రంగానికి సామ్యం చెప్పారు. ప్రేమించడం, ప్రేమించబడడమే జీవిత పరమార్థం అన్నారు. అంతా ప్రేమమయం అన్నారు. రసజ్ఞులు. జీవితమొక స్వప్నంలాంటిదన్నారు. మిథ్య, మాయ అన్నారు జగద్గురువులు, వేదాంతులు.

నా మటుకు నాకు జీవితం ఒక గణితశాస్త్రం అనాలనిపిస్తుంది. మీరు ఒప్పుకోకున్నా నా ఉద్దేశ్యం మార్చుకోను.

భూతలంపైన కొత్తగా బిడ్డ పుడితే 'ఏరా, ప్లస్సా మైనస్సా!' అని అడిగేవారు వేళాకోళంగా మా కుర్రతనం రోజుల్లో. ప్లస్ అంటే మగపిల్లవాడనీ, మైనస్ అంటే ఆడపిల్ల అనీ సంకేతాలు! కాలానుగుణంగా దృక్పథాలు మారాయి. ఈ పరిభాష కూడా మారియుండొచ్చు. కానీ జీవితం మాత్రం ప్లస్‌లూ మైనస్సులూ, గుణకారాలూ, భాగహారాలూ, బ్రాకెట్లూ....వీటితోనే ముడిపడి వుంది. ఎలా అంటారా - మనవి చేస్తా.

ఈ మనభూమి మీద మనం మొదటిసారి ఊపిరి పీల్చగానే మన యింటి జనాభాకు, మహీతలంపై జనాభాకు ఒక ప్లస్; మరణిస్తే....మైనస్!

ఇంట్లో మందిఎక్కువైతే మజ్జిగ పలచన అన్నట్లు మరోఇద్దరో, ముగ్గురో పుట్టారనుకోండి. ప్రతిదీ డివిజను! అనగా భాగహారమే ఏ కుటుంబానికి ఆ

కుటుంబం ఒక యూనిట్. అదే బ్రాకెట్. ఒక్కొక్కప్పుడు, ఒక్కొక్కప్పుడు యేమిటి- ఈ కాలంలో సర్వసాధారణంగా అబ్బాయిగార్లకు అర్ధాంగులు సరసన చేరగానే ఒక బ్రాకెట్ కాస్తా, రెండు, మూడు బ్రాకెట్లు తయారౌతుంటాయ్! కొంతమందికి జీతంతోపాటు గీతంకూడా వస్తూంటుంది. నుదుటిగీత బాగున్న వాళ్ళకు గీతంతోనే సంసారం మూడు పూవులు ఆరుకాయలుగా వర్ధిల్లుతుంది. గీతమునకు మారుపేరు అమ్యామ్యాలు. ఈ అమ్యామ్యాలు ప్రజాస్వామ్యములో కొంచెం ఎక్కువ. సదరు అమ్యామ్యాలనే ఆదాయానికి "ఇంటూలు" అందురు. అనగా గుణకారాలు. కొన్ని కొన్ని డిపార్టుమెంటు వాళ్లకు అనుదినమూ గుణకారమే. గుణకారాలులేని రోజు అయ్యగారు ఇంట్లో కారాలు మిరియాలు నూరుతారు. ఒకేశాఖలోని కొన్నిసీట్లకు పై ఆదాయం. మరికొన్ని సీట్లకేమో 'పై' కూడా గిట్టుబాటుకాదు. కొంతమందికి జాస్తి. మరికొంతమందికి నాస్తి. ఈ జాస్తి నాస్తిలు వాళ్ళ వాళ్ళ జాతకాలనుబట్టి నడుస్తూంటాయి.

అల్జీబ్రాలూ, జ్యామిట్రీలూ అనగా బీజగణితము, క్షేత్రగణితము జీవితంలో దర్శనమిస్తుంటాయి. కొంతమంది (వీళ్ళను పెట్టిపుట్టిన వాళ్ళంటారు) జీవితంలో అడుగుపెట్టింది మొదలు, మళ్ళీ గిట్టేదాకా వృత్తంలా తిరుగాడుతుంటారు. కొంతమందికి అర్ధవృత్తం, మరికొంతమందికి సమవృత్తం, లేదా వారి చరిత్ర ఒక ఇతివృత్తం.

కొంతమందికి అన్నివైపులూ సమానంగా సమ చతుర్భుజం లాగా వుంటుంది. పొడవు వెడల్పులు సరిసమానంగా వుంటాయి. పొడవు అంటే లాభం, వెడల్పు అంటే నష్టం అని మాట వరసకు అనుకుందాం. నాలుగు భుజాలూ అనగా తల్లివైపు వారు, తండ్రివైపు వారు, వైఫ్వైపు, వారు స్నేహితుల వర్గాలవారు! మరికొంతమందికీ అదృష్టవంతులకు దీర్ఘచతురస్రము. పొడవు ఎక్కువ, వెడల్పు తక్కువ. పావం కొంతమందికేమో విషమ చతుర్భుజము. కాసేపు అటూ, కాసేపు ఇటూ.

జీవితం అల్జీబ్రా లాగా కూడా వుండొచ్చు. ఎవడైనా తెలియని వాణ్ణి గూర్చి చెప్పుకోవాలి అంటే ఎవడో 'ఎక్స్' అంటూంటాం. మనకు ఆఫీసులలో ఏదైనా పని యుంటే పైరవీకారుని అనగా ఒక 'ఎక్స్'ను కాకా పట్టాలి. పైన రవి, క్రింద భువి యున్నంత కాలము ఈ పైరవీ తప్పదు.

జీవితం మిథ్య అని వేదాంతులు ఉవాచ. జగమే మాయ అని దేవదాసులో నాగేశ్వరరావు అన్నాడు. ఘంటసాల అనుకోండి. ఎవడన్నా మిథ్య మాయ ఎలా అవుతుంది? ఎదురుగా కనబడుతూ సిక్షేమంగా ఉన్న నాగార్జున సిమెంటుతో కట్టిన మిద్దెను మిథ్య అంటే ఎలా? కేంద్రం మిథ్య అనగానే మిథ్య అయి కూర్చుంటుందా? దేశాలకు సరిహద్దు రేఖలు కనబడనంత మాత్రాన మిథ్య అంటే ఎప్పుడో వచ్చే మూడవ ప్రపంచ యుద్ధం సారీ అంతిమ ప్రపంచ యుద్ధం యిప్పుడేరాదూ? జగత్తు అంతా నిజంగా మిథ్య అవదూ? తుఫాను వచ్చింది. వందలు మరణించారు. వేలమంది క్షతగాత్రులూ, నిర్వాసులూ అయ్యారు.

తుఫానూలేదు గిఫానూ లేదు అంతా మిథ్య అంటే మీదబడి కొడతారు. ఇవ్వబోయే పరిహారము, ఆర్థిక సహాయం మిథ్య అంటే గోవిందా!

జగత్తు అనే నాటక రంగంలో ప్రతి వ్యక్తి జీవితం ఒక పాత్ర. కాదంటే ఈ నాటక రంగంలో కొంతమంది తమ తమ పాత్రలను బాగా పోషిస్తారు. మరికొంతమంది రిహార్సల్సు సరిగా చేసుకోకుండా వస్తారు. మొదటి రకం వాళ్ళు వన్సుమోరు కొట్టించుకుంటారు. రెండో కాటగిరీ వాళ్ళు బోరు కొట్టిస్తారు. రాళ్ళు కొట్టించుకోవచ్చు.

చివరిమాట- జీవితం ఖచ్చితంగా లెక్కలే! విజ్ఞానం, వివేకం,అనుభవం సంకలనము కావాలి. ఈర్ష్య, నిరాశ, ఐద్ధకం వ్యవకలనం కావాలి. ప్రేమ, దయ, సేవాభావం హెచ్చింపు కావాలి, నీకు చిక్కిన సమయాన్ని తెలివిగా భాగించాలి. పారమార్థిక చింత కావాలి. పరమ ఆర్థిక చింత తగ్గించాలి.

జీవితం అంటే లెక్కలే! కాకపోతే "వాడు నన్ను లెక్కచెయ్యలేదు". "నేను వాడిని లెక్క చెయ్యను" "లెక్కా పత్రం లేకుండా" వంటి ప్రయోగాలు ఎలా వచ్చాయి? 'ఏం చదివావురా' అంటే మామూలుగా B.A. అనో B.Sc. అనో చెప్తారు. అదే 'MATHS' సబ్జెక్టు వాళ్ళు B.A. (MATHS) అని అదేదో ఎక్కువైనట్లు చెప్పుకొంటారెందుకు?

ఇప్పుడు చెప్పండి. నాతో ఏకీభవించి జీవితం గణితం అని ఒప్పుకుంటారా?!

—: o :—

# 41. చెల్లని సామెతలు

సామెతలంటే ఇష్టపడని వారుంటారని నేననుకోను. శరీర పోషణకు ఆమెత (విందు) లెంత ముఖ్యమో, భాషా స్వరూపానికి సామెత లంత అలంకారము. సాహితీ సౌందర్య సూచికలు ఈ సామెతలే. వీటిని లోకోక్తులు అని కూడా అంటారు. ఏ భాషలో చక్కని సామెతలు అధికమో ఆ భాష గొప్పది అంటా. వీనిలో ఎంతో లోకానుభవం, విజ్ఞానము, హాస్యం, శృంగారము-మరెన్నో మిళితమై యుంటాయి. సామెతలో సత్తా లేకపోతే నలుగురి నోళ్ళలో నానవు చిరంజీవులు కావు. రసోత్పాదకమైన సామెతలు ఒక తరం వారినుండి మరొక తరం వారికి కూడా దిగుమతి అవుతుంటాయి. నగరవాసుల్లో కన్నా పల్లెవాసుల్లోనే ఈ సామెత లెక్కువగా దొర్లుతుంటాయ్ ప్రతివాడూ ఎప్పుడో ఒకప్పుడు ఏదో సామెత చెప్పుతూనే వుంటాడు. సమయానికి ఏ సామెత, స్ఫురించని వాడు 'ఏదో సామెత చెప్పినట్లుంది' అని ఊతపదంగా అనడం కద్దు. కాలప్రవాహంలో, పరభాషా ప్రభావంలో, క్రొత్త క్రొత్త సామెతలు పుట్టుకరావడం కూడా చూస్తుంటాం.

కానీ, కొన్ని కొన్ని సామెతలు వింటూంటే మాత్రం, అవి ఏ సందర్భంలో పుట్టాయో ఎలా బ్రదికి బట్టగట్టాయో, ఒక పట్టాన అంతుబట్టవు. అవి విక్టోరియా రాణి కాలం నాటి నాణేల లాగా కాలం చెల్లినవై పోయాయ్యేయని పిస్తుంది. అలాంటి సామెతలను ఒకటి రెండు ముచ్చటించుకుందాం.

**పండిత పుత్రః పరమ శుంఠః**

ఇది పరమ సత్యమైనట్లు తోచదు. పస్టు పాయింట్-ఏ సబ్జక్టుకు చెందిన పండితుడో సెలవీయబడలేదు. మరి పుత్రికలను ఎందుకు చెప్పలేదు? వీరికి

మినహాయింపు యివ్వడంలో అంతరార్థం? పోనీయండి. పండితురాంధ్ర పుత్రుల విషయం ఏమిటి?

డాక్టరు సంతానం డాక్టర్లవుతున్నారు. సినీనటుల కొడుకులు, కూతుర్లు సినీనటులు, తారలు అవుతున్నారు. ఇంజనీర్ల కొడుకులు ఇంజనీర్లూ అవుతున్నారు. ఇక రాజకీయ పండితుల సంగతి సరే సరి. వీరి సంతానం చవటలైన సందర్భం లేకపోలేదనుకోండి కానీ బహు స్వల్పం. సంఖ్యాపరంగా సామెత పుట్టేంత కేసులు దాఖలాల్లేవు. మహామహోపాధ్యాయు లున్నారు. సంగీత విద్వాంసులున్నారు. సైంటిస్టు లున్నారు. కవిశేఖరు లున్నారు. వివిధ రంగాలలో విద్వద్వరేణ్యులులున్నారు. వీరి వీరి సంతానం అంతా శుంఠలమయం అనడం దుస్సాహసమే. తండ్రులంత మేధావులు కాకపోవచ్చు. అది వేరే విషయం.

నాకు తెలిసిన చవట లెందరో వున్నారు. నాకే ఏమిటి. మీకు మాత్రం తెలిసిన చవటలు వుండరు గనుకనా? మరి వారి వారి తలిదండ్రులు ఎవరూ పండితులు కారే! ప్రఖ్యాత ఇంగ్లీషు కవి షేక్స్పియరు తండ్రి చర్మకారుడట! మూర్ఖుల తలిదండ్రులు పండితులు కానపుడు, పండితుల సంతానము మూర్ఖత్వమునకు ప్రతీకలై వుంటారంటే రూలు ఒప్పుకోదు. ఇదే నిజమైతే, తమ తమ సంతానం ఎక్కడ చవటలు అవుతారో అనే భయంతో ఎవరూ పై చదువులకు వెళ్ళియుండేవారు కారు. ఏతావతా ప్రపంచంలో యూనివర్శిటీ లన్నీ మూతపడియుండేవి!

Fools build houses wisemen live in them. ఇది కూడా అరిగిపోయిన గ్రామఫోను రికార్డే. ఈ సామెత కర్థం ఏమిటంటే- ఇల్లు కట్టేది అజ్ఞులు. అందులో వసించేది విజ్ఞులు! అమ్మబాబోయ్! ఇంకేమన్నా వుందా? మన దేశంలో నిర్భాగ్యుల సంఖ్య కొన్ని కోట్లలో వుంటుంది. వివరాలకు గణాంకశాఖ రికార్డులు చూడండి. వీళ్ళందఁకీ వాసాలు లేవు. సగానికి పైగా ఉపవాసాలే!?

'ఓనర్సు' కన్నా టెనెంట్సు విజ్ఞులైతే. మన దేశం ఏనాడో మళ్లీ స్వర్ణ యుగంలో ప్రవేశించియుండేది. మన ప్రభుత్వం వారు బలహీనవర్గాల కోసం (ఓట్ల కోసమే అనుకోండి) బలహీనమైన ఇండ్లు కట్టించి ఆర్భాటంగా ఇస్తుంటారు మరి ఈ ఇంగ్లీషు సామెత కొలబద్ద ప్రకారము ప్రభుత్వాధినేతలు 'ఫూల్సు' అయ్యుండాలి. అలా అనగలమా? కనీసం లోపల అనుకోవచ్చా? ఈ సామెత సృష్టికర్త ఉద్దేశ్యం ఇండ్లు కట్టించి, తాము వుండకుండా అద్దెలకిచ్చు వారి గూర్చేమో ! అలా అనుకున్నా ఇండ్లు లేని వారి గృహ సమస్యలు తీరే అవకాశమే లేదే? అందుచేత హౌస్ ఓనర్సు అంతా వెర్రి వెంగళాయప్పలు కాదు. సామెతలో చెప్పినట్లు విజ్ఞులూ, మేధావులూ కాదు. ఓనర్సు అద్దెల ఆదాయపు పునాదులమీద మేడ మీద మేడ కట్టుకొని కుబేరులౌతున్నారు!

నాకు తోచినదేమంటే ....తాజ్ మహల్ నిర్మాత ఫూల్ కాదు. రాళ్లెత్తిన కూలీలున్నారే - వారు ఆ శ్రామిక వర్గాలు ఫూల్సు! పొట్ట చేత బట్టుకొని, ఆలు బిడ్డలను పోషించుకోలేక, పుట్టిన గడ్డను వదలి, ఇచ్చిన కూలీ సగం కడుపుకైనా చాలకున్నా సగానికి సగం కంట్రాక్టరు మింగుతున్నా, గంజి నీరు త్రాగుతూ, ఇంజనీరునూ, కంటకాల కడలిలో ఈదుతూ కంట్రాక్టరునూ పోషించే మహారాజ పోషకులు ఆ నిరుపేద శ్రామికులు! వాండ్లు పాపం. ఫూల్సు! ప్లానుకు లంచం, నీళ్ళకు లంచం, లైటుకు లంచం మింగుతూ, ఒక ఇటుకైనా ఎత్తకుండా, కాలు కదపకుండా హాయిగా జీవించే పరాన్నభుక్కులు పరమాన్న భుక్కులు! వారు తెలివైనవారు. లేక ఇండ్లను కట్టించుకునేకన్నా, శాస్త్రతైలం ఎక్కువైతే అయింది, ఈ యాతి బాధలను వదిలించుకొని, ఏకంగా కట్టించిన యిల్లును కొనెయ్యమని వారి భావమేమో ! ఏమైనా ఈ కొటేషన్ అంత బాగా లేదు !

'ఇల్లు ఇరకటం - ఆలి మరకటం' అని మనకు ఒక మోటు సామెత వుంది. ఈ 'మర్కటాన్ని' ఏ ప్రబుద్ధుడు ఏ సందర్భంలో ప్రజల్లోకి వదలి పెట్టాడో తెలియదు. కులమింటి కోతిఅయినా పర్వాలా అని కూడా

అంటుంటారు. ఎవడైనా చూచి చూచి, మర్కటం లాంటి పిల్లకు ప్రిఫరెన్సు ఇచ్చి చేసుకుంటాడా? బహుశా కట్నాన్ని తూచి తూచి చేసుకోవచ్చుగాక! అమ్మాయి పేరు హనుమాయమ్మ అని వుంటే సరిపుచ్చుకోవచ్చుగాక. పేరుకు తగ్గట్టు రూపం కూడా అదే 'బ్రాండు' అయితేఫైర్ బ్రాండ్ కాకుండా వుంటాడా? సరసానికి పళ్ళికిలిస్తే అదొక శృంగారం అని సర్దుకొని పోవచ్చు. ఎల్లవేళలా పళ్ళ యికిలింపులో ఇంపు వుంటుందా? 'లింపింగ్' అమ్మాయినైనా ఒప్పుకుంటాడేమోగానీ, ఇకిలింపింగ్ అమ్మాయిని చూచి ఎగిరి గంతేస్తాడా?

ఒకసారి ఒక మేగజైనులో చదివా. 'భార్యా రూపవతీ శత్రుః అనేది కరక్టేనట. అందమైన భార్య వుంటే సదరు భర్తగారికి తన అర్ధాంగి విషయమై అహర్నిశలూ 'టెన్షను' ఎక్కువై బిపీలు హార్టు అటాక్‌లూ వచ్చే అవకాశాలు ఎక్కువనీ అయ్యగారికి 'టెన్షను' మరీ ఎక్కువైతే, అమ్మగారు ఫామిలీపెన్షను తీసుకోవలసి రావచ్చనీ, కొందరు 'వైద్యశిఖా 'మునులు' హృద్రోగ నిపుణులు, (బహువ్రీహిసమాసంకాదులెండి) ఉవాచ. ఏతా వతా, బ్యూటిపుల్ వైఫ్ వుండేయిల్లు భర్తగారి 'ఇల్‌నెస్‌కు' కారణంగా మారి,Heart ఒక Hearth గా మారవచ్చు (ట) కాబట్టి అంత అందక త్తె(ర) వద్దులే అనుకోవచ్చుగానీ, మరీ మర్కటంగా వుండాలని కోరుకోరు. చక్కని చుక్క,గాకున్నా, చుక్కానిగా వుండాలని ఆశిస్తాడు!

మరి....ఇల్లు ఇరకటం? దీన్ని కొంత వరకు సరిపుచ్చుకోవచ్చు. ఎందుకంటే, స్పేస్ ప్రాబ్లం దృష్ట్యా! దీంట్లో ఒక ప్లస్ పాయింటుంది కూడా. ఇల్లు మనకే ఇరుకుగా వుంటే, చుట్టాల బెడద తగ్గొచ్చు! కోర్టు పని అనీ, ఆఫీసు పని అనీ, పనిలో పని అనీ చెప్పాపెట్టకుండా, వచ్చి తిష్టవేసే అతిథి దేవుళ్ళ గొడవను చాలవరకు సాల్వు చెయ్యొచ్చు.

నా వుద్దేశ్యంలో ఇల్లు ఇరకటంగావున్నా ఆలు 'మరకతం'(మాణిక్యం) లాగా వుంటే ఎక్కువ భాగం ఔట్‌డోర్‌లో లాగించేసి చీకటిపడిన తర్వాత పక్షులు గూడు చేరినట్లు ఇల్లుచేరి సంసారం చేస్తూ సర్దుకపోవచ్చు.

'ఇల్లు యిరకటం ఆలి మరకతం' అని మొదట సామెత వుట్టి ఎవడో కిష్కింధాపుర అగ్రహారీకుడైన పండితో త్తముడు అంత్యప్రాసాప్రియుడు 'తం' స్థానే 'టం' పెట్టి తన అర్ధాంగిని సమర్థించుకొని యుంటాడని నా దృఢాభిప్రాయం

బ్రహ్మచారీ శత మర్కటః అని మరొకటి వుంది ఇదీ ఆ కాటగిరియే

ప్రభుత్వం వారి పంచవర్ష ప్రణాళికల పుణ్యమా అని యేటేటా నిరుద్యోగ సమస్య వటవృక్షాన్ని ఆదర్శంగా పెట్టుకుంది. నిరుద్యోగ సమస్యకూ బ్రహ్మచార్లకూ డైరక్టులింకు! కాబట్టి రెండు కాళ్ళ మర్కటాల జనాభా దిన దినాభివృద్ధి అవుతూంది. ఆలా అని వీళ్ళను 'మర్కటాల'ని పిలుస్తే ఇంకే ముంది, తమ తడాఖా చూపిస్తారు పైగా యీ మర్కటాలకుద్యోగాలు దొరికితే 'మార్కెటు'లో రేటు చాల వుంది

అద్వైత మతాధిపతులందరూ బ్రహ్మచారులేనే! వారిని మర్కటాలుగా అనుకోవడం మహాపచారం! భీష్ముడు ఆజన్మ బ్రహ్మచారి! కాబట్టి, బ్రహ్మచారీ శత మర్కటః తప్పనీ, శతమరకతః అనేదే కరక్టనీ అంటా!

**మొరిగే కుక్కలు కరవవు!**

ఇది ఇంకొక సామెత! ఈ సామెత! గ్రంథకర్త ఒక స్కౌండ్రెల్ అంటా.

నేననుకోవడం ఇది ఇంగ్లీషు సామెత 'Barking Dogs never bite' అన్న దానికి మనవాళ్ళు చేసిన తర్జుమా మాత్రమేనని. అసలు ఈ సామెతను గూర్చి ఈషణ్మాత్రమైనా కుక్కలకు తెలిస్తే మన అజ్ఞానానికి ఎంతగా నవ్వు కుంటాయో?

వర్షించే మేఘాలే వురుముతాయి. కరిచే కుక్కలే మొరుగుతాయి! ఇదే రూలు.

సీమ కుక్కల విషయంలో నిజం వుంటే వుండొచ్చు. అవి కొంచెము ఎలాగైనా మనకన్నా, సారీ, మన కుక్కలకన్నా నాజూకు! మనకు వీధి కుక్కలు దక్క జాతి కుక్కలు ఎక్కడ ఏడ్చాయి? అవన్నీ వాళ్ళవేనాయె. కుక్కలకు మనం గ్రామసింహాలని గౌరవ పురస్కారంగా బిరుదు ప్రదానము చేశాము కూడా. మరి వాళ్ళ కుక్కలకు ఇంగ్లీషులో Village Lions అన్నారా? గర్జించే సింహాలు చంపవు అనడం ఎంత నిజమో మొరిగే కుక్కలు ముద్దుపెట్టుకుంటాయనడం అంత కరక్టు!

మొరిగే కుక్కలు కరుస్తాయో లేదో కుక్కకాటుకు గురైన ఏ శాల్తీనైనా అడగండి.

యీ సామెతను నమ్ముకొని రాత్రిళ్ళు కర్ర లేకుండా వెళ్లారో ఇంతే సంగతులు; మీ వంటిమీద రేఖాచిత్రాలు గీసి సత్కరిస్తాయి. దంతక్షత, నఖక్షత విశేషాలు మిమ్మల్ని అలంకరిస్తాయి.

కుక్క కరిచిన ఏ కవి పండితుడో యీ సామెతను జనంలోకి దిగుమతి చేశాడు. లేదా, దీని సారాంశం కరిచేటప్పుడు మొరగవు, మొరిగేటప్పుడు కరవ లేవు అని సరిపుచ్చుకోవాలి. ఇంకొక విషయం, అసలు పిచ్చికుక్కలే కరుస్తాయి. నిలువెల్ల విషము వుండే మనిషిని కరిచే సాహసం మరి పిచ్చి కుక్కలకు దక్క మంచి కుక్కలకు ఉండదుగాక ఉండదు - ఉంటా!

—: o :—

# 42. జంటనగరాల వీధులు – నామకరణాలు

ఒక వార పత్రికలో కొన్ని వూర్లకు ఆ పేరు ఎలా వచ్చిందో, స్థల పురాణం యేమిటో. జనశ్రుతిగా వచ్చిన తీరును గూర్చి ఒక 'ఫీచరు' నిర్వ హించారు. వాటిలో సత్యాసత్యాలెలావున్నా, సరదాకు, కాలక్షేపానికి పాఠకులు చదువుతుంటారు. పత్రిక సర్క్యులేషనూ పెరగవచ్చు!

మద్రాసులో 'సున్నాది స్ట్రీట్' అని వుండేది. ఇప్పుడు పేరు మార్చా రేమో తెలియదు. అది ట్రిప్లికేనులో (అది తిరువళ్ళికేణిగా మారింది) వుంది. ప్రసిద్ధ పార్థసారథి దేవాలయము అక్కడే వుంది. దేవాలయాన్ని అరవ సంప్రదాయంలో "సన్నిధి" అంటారు. మొదట్లో సన్నిధి వీధిగా చలామణీ అయి, ఆంగ్లేయుల పాలనలో 'సున్నాది స్ట్రీట్'గా నిలిచి పోయిందట.

అలాగే, ఒక ముసలవ్వ పేరిట నల్లపెత్తల్లి వీధిగా వెలిసి నన్నే పత్ అల్లీ స్ట్రీట్‌గా స్థిరపడింది మరొకవీధి!

మద్రాసులో చాలా పేర్లు ఇలాగే భ్రష్టు పఱచబడ్డవే. బార్బర్స్ బ్రిడ్జి పేరు చాల మంది వినియుంటారు. హామెల్టన్ అనువాడు కట్టించిన బ్రిడ్జి హామె ల్టన్ బ్రిడ్జిగా పిలవబడి తమిళుల చేత పలకబడలేక 'అంబట్టన్ వారావది' అని పిలవబడేదట. లేదా కొంటెతనం చేత అన్నారో! అంబట్టన్ అంటే అరవంలో మంగలి! కాలక్రమేణ అది బార్బర్స్ బ్రిడ్జి అయింది!

నాకు అప్పుడప్పుడు ఒక అనుమానం వస్తూంటుంది. హైదరాబాద్‌లో లాల్‌బహదూర్‌నగర్‌ను ఎవరూ అలా పిలవరు. యల్.బి. నగర్‌గానే వ్యవ

హరిస్తారు. కాలక్రమేణా యల్.బి. అంటే అర్థం మరుగున పడిపోయి, దానికి అనుబంధంగా 'షిల్లింగ్' నగర్ అని మరొకటి వస్తుందేమో!

అసలు బెస్తవాడైన ముతరాసు చెన్నప్ప పేరిట వచ్చిన నగరము మదరాసు లేక చెన్నపట్నం!

మన 'కాకినాడ' తీసికోండి- విదేశీయులు సముద్ర తీరమున ఉన్న అ వూరు చూచి 'కో - కెనడా' అన్నారుట! అదే కాకినాడ అయిందంటారు.

విజయవాడకు పూర్వనామము బెజవాడ. ఆ కాలంలో అచ్చట బౌద్ధ బిక్షువులుండేవారట బిక్షువాడే బెజవాడగా మారిందట. ఎండలు మండే వూరు గనుక బ్లేజ్‌వాడ బెజవాడ అని కట్టమంచి రామలింగా రెడ్డిగారు చమత్కరించారనుకోండి. మరి బెజవాడ గోపాలరెడ్డిగారు, బెజవాడ అని ఇంటిపేరు ఉన్నవారు విజయవాడ అని ఎందుకు మార్చుకోలేదు?

అదే విజయవాడలో ప్రభాకర ఉమామహేశ్వర పండిట్ అని ఒక హిందుమత ప్రవక్త ఉండేవారు. గొప్పవక్త. తొంభై, తొంభై అయిదు సంవత్సరాలు జీవించి కన్నుమూశారు. వారు చెపుతూండేవారు: 'ఇంగ్లండ్' అనే పదము 'గురుండ్' అనే పదము నుండి వచ్చిందని. అది ఒక దేశము పేరుగా భవిష్య పురాణంలో వుందట. చిన్న పిల్లలు, విద్యాహీనులు 'ర' కారము పలుక లేరట. శ్రీరాములు. కర్ర శిలాములు, కల్లలుగా పలుకుతారట, అలాగే గురుండ్ గులుండ్‌గా మారి, స్కూలు ఇస్కూలు, స్టేట్ ఇస్టేట్ అయినట్లు గులుండ్ ఇగులుండ్ అయి ఇంగ్లాండ్‌గా మారిందట. వారి చమత్కార తర్కానికి జోహార్లు!

మన తిరుపతి పట్టణానికి ఆ పేరు ఎలా వచ్చిందా అని ఆలోచిస్తే నాకొక ఆలోచన మెరిసింది! 'తిరు' అనే అరవ పదానికి 'పతి' అనే సంస్కృత పదానికి సంధి కుదరదుగాక కుదరదు. సంస్కృతం

అంటే అరవ్వాళ్ళకు అసలే గిట్టదే? మన భారతదేశంలో, తిరుపతి వెంకన్న కున్న భక్తకోటి ధనరాశి, ఏ దేవునికీ లేదు. కుబేరుని మించిన ధనాధిపతి! ఇప్పుడు అమెరికాలోని 'పిట్స్‌బర్గులో'లో కట్టించబడిన వేంకటేశ్వరాలయ మునకున్న ఆదాయము అక్కడి చర్చిలకు లేదట!

ఆ దేవుడొక్కడే తనను శ్రద్ధాభక్తులతో సేవించిన వారికి 'తృప్తి'ని కలిగించువాడు! 'తృప్తి'ని ప్రసాదించు క్షేత్రము గనుక 'తృప్తి' అనుపదము నుండి 'తిరుపతి' వచ్చి యుంటుందని నా ఊహ. లేదా త్రిమూర్తుల అంశ లున్న దేవుడు గనుక 'త్రి'పతిగా అయి తిరుపతిగా మారియుండొచ్చు. అది మొదట ఈశ్వర క్షేత్రమనే వాదము ఇప్పటికి వుండనే వుందిగదా!

ఏం! గురుండ్ ఇంగ్లండ్ కాగాలేంది నా వాదం కరక్టు కాగూడదా?

మన భాగ్యనగరంలోని జంటనగరాల వీధులు పేటల పేర్లు ఎలా వచ్చాయో పరిశోధించాల్సిందే.

ఆ మధ్య చాలా కాలానికి మా వితండేశ్వరావు తారసిల్లాడు.

"ఏం? కనబడ్డం మానేశావ్? బ్రదికే వున్నావా? అని అడిగా."

"ఇంకా పూర్తి చావలా" అన్నాడు.

"జబ్బేమిటి? డాక్టరుకు చూపించావా?"

"ఆ-ఈ కాస్తదానికి డాక్టరెందుకూ? నేనే డాక్టరును అవుదామనుకున్నా."

"అంటే?"

"డాక్టరేట్ పట్టా కొట్టేద్దామనుకున్నా" అన్నాడు.

"ఆరు నెలలుగా జంటనగరాల్లో వీధి వీధి వాడ వాడ తిరిగి, పాత తరం వాళ్ళను కలుసుకొని వారి అభిప్రాయాలను పరిశీలించి, శోధించి, పరిశోధించి

'జంటనగరాల వీధులు పుట్టుపూర్వోత్తరాలు". 'The Onomastics of Twin Cities' అనే అతి క్లిష్టమైన అంశం మీద పెద్ద సిద్ధాంత వ్యాసం వ్రాస్తున్నా! అది వారం క్రింద ఫెయిర్ అయింది!" అన్నాడు

"మరి యూనివర్సిటీ వాళ్ళకు సమర్పించుకున్నావా?"

''ఆ. నిన్ననే మన 'తెలుగు విజ్ఞాన' పీఠానికి సమర్పించా' అన్నాడు

అయ్యో! నవ్వుకోమంటే, పోనీయండి. సరదాగా నవ్వుకుందామంటే మరీ సంతోషం. వాడి, వాడి పరిశోధనా సారాంశ క్రమం బెట్టిదనిన-

మన జంటనగరాలు సర్వమానవ సౌభ్రాతృత్వమునకు, సర్వ జీవరాశి సమానత్వమునకు ప్రతీకలట! అంచేత నగర వాడలకు నామకరణ విషయంలో, ఆ నాటి మేధావులు ఈ రోజుల్లోలాగా, 'మా కులానికీ వర్గానికీ కాబినెట్‌లో ప్రాతినిధ్యం లే'దనే వాదానికి ఏ మాత్రం తావు లేకుండా ఉండేందుకు శత విధాలా ప్రయత్నించారట

''అలా ఎలా రుజువు చెయ్యగలవ్?" అని అడిగా.

మనుష్యుల తరపున మోజంజాహి, ఆబిడ్స్, బషీర్‌బాగ్, యూసఫ్ గూడా, ఈసామియా బజార్, ఆసిఫ్‌నగర్ లాంటి పేర్లనూ, చతుష్పాత్తుల తర పున ఆవుల మంద, మేకల మంద, అనీ, పక్షుల గౌరవార్థం చిలకల గూడా కాకా గూడా, కబూతర్‌ఖానా అనీ,కీటకాల గుర్తింపు చిహ్నంగా 'దోమలగూడా, అనీ, ఫల వృక్షజాతుల పక్షాన 'సీతాఫలమండీ, ఆమలకపేట'(ఆమలకం అంటే ఉసిరిక అదే మలకపేట అయిందట), పుష్పముల పేరిట 'మల్లెపల్లి' అనీ, స్త్రీలను గౌరవించుటకై బేగం బజార్ అనీ, కలవారి తరపున అమీర్‌పేట్, పేద వారి తరపున గరీబ్ నగర్ (ప్రస్తుతం ప్రకాశ్ నగర్), షెడ్యూలు తెగల తరపున 'మాల' కుంట, వెనుక బడినవర్గాల పక్షాన మంగల్‌హాట్, బోయి

గూడా, కుమ్మరి గూడా, చాకలి బస్తీ ఇత్యాదులున్నూ, కవ్వాళి సంగీతానికి గుర్తింపుగా 'కవ్వాళి గూడా' అనీ (అదే కవ్వాడి గూడాట!) ఇలా ఇలా వ్రాసి ఒక రీము కాగితాల కట్ట నా ముఖాన కొట్టాడు!

''అది సరేనోయ్! సకల జీవరాశులనీ సమానత్వమనీ ఏదో అన్నావ్! మన దేశంలో 'తస్కరాం పతయే నమోనమో' అని దొంగలను కూడా ప్రస్తుతించారే- వారికి ఒక వాడ పేరైనా పెట్టలేదేం?" అన్నా ఉడికిద్దామని వాడేం సామాన్యుడా?

''సికిందరాబాద్‌లో 'పికెట్' ఏమిటనుకున్నావ్, పిక్ పాకెట్స్ అనే పదమును కుదించి పెట్టిన పేరు!" అన్నాడు.

''మరి .... దిల్‌సుఖ్ నగర్, సంతోష్ నగర్ వుంది. చింతల బస్తీ ఏమిటి? అక్కడ అందరికీ చింత లెక్కువా?" అని అడిగా.

"చింతల బస్తీ' అంటే 'చింతలు'కు సంబంధం లేదు. ఆ ప్రాంతంలో పూర్వం చింతచెట్లు ఉండేవి. నేనింతకు ముందు చెప్పానే. చెట్లపట్ల గౌరవ సూచకంగా 'చింతల' బస్తీ అన్నారు. ఇంతెందుకు, ప్రాణంలేని రాయిరప్పలను కూడా ఇక్కడి వాళ్ళు గౌరవించారు."

"అదెలా?"

"పత్తర్‌గట్టీ, కట్టెల మండీ, కుండబజార్ (అదే పాట్ స్ట్రీట్),బొగ్గుల కుంట, మోతీగల్లీ. ఇవి ఉదాహరణలు మాత్రమే ఉప్పురాయి పేరగూడా ఉప్పుగూడా అని పేరు పెట్టారు!"

"కాచిగూడా, బొలారం ఎలా వచ్చాయంటావ్?

"పూర్వం ఆ ప్రాంతమంతా శవాలను కాల్చే శ్మశానంగా వుండేది. ఇప్పుడు దాన్ని కాచిగూడాకు దగ్గరగా ఉండే అంబరపేట్‌కు మార్చారు. కాల్చేగూడెము నుండి కాచేగూడా అయిందంటా. ఈ విషయం గూర్చి మరి కొంత రిసర్చి చెయ్యాల్సి వుంది."

'అంబర్ పేట్' అంటే జ్ఞాపకమొచ్చింది ఆ పేరెలా వచ్చిందో?

"శ్మశానం అని చెప్పాగా. శవ అస్థులు దహనం తర్వాత 'అంబర వీధి'కి పోవు ప్రదేశం 'అంబర్ పేట' లేదా, ఇంగ్లీషులో 'EMBER అంటే కాలిన తర్వాత మిగిలిన బూడిద అని అర్థం EMBERPET. AMBER-PETగా మారి యుండొచ్చు

'బొలారం' పేరుమీద చాలా పరిశోధించా.

"నా సిద్ధాంత వ్యాసం రెండవ భాగంలో విపులంగా చర్చించా. జంట నగరాల్లో రామభక్తులూ, రామ మందిరాలూ చాలా ఎక్కువ హనుమాన్ మందిరాలూ ఎక్కువే. ఎక్కడ చూచినా, యాచారాం నాచారాం, నాగారాం, బోగారం, గడ్డి అన్నారాం, పోచారాం - ఇలా రాం రాం అని పిలుస్తారు. ఎవరో మహానుభావుడు అక్కడ రామ భజన ఏర్పాటు చేసి, 'బోలోరాం' అని యుంటాడు. బోలోరాం భజన స్థలము క్రమంగా బోలారం అయ్యుండొచ్చు. "చివరగా ఒక చిన్న సందేహం! ఈ మహానగరంలో 'మహారాజ్ గంజ్' ఉంది. రాణిగంజ్' ఉంది మహామంత్రి గంజ్ ఎందుకు లేదో?"

"అడిగావూ. నాకూ ఈ సందేహం వచ్చింది. మాదన్న మంత్రి పేరిట మాదన్న పేట వెలిసిందనుకో. గంజ్ అని ఎందుకు అనలేదంటావా? ఆ కాలంలో కూడా మంత్రుల మీద ప్రజలకు మంచి అభిప్రాయం ఉన్నట్లు లేదు. అందుకని మంత్రులకు గంజికూడా పుట్టగూడదనుకున్నారో ఏమో. దీని విషయం ఇంకొంచెం పరిశోధించాలి, వస్తా" అని అర్జంటు పని యుందంటూ జారుకున్నాడు మా వితండేశ్వరావు!

—: ౦ :—

# 43. 'స'కార 'ర'కార మహిమ!

అమెరికనులు ఏ పనీ 'నాకు రాదు' అనరట. ఎందుకంటే AMERICAN అనే పదంలోనే I CAN వుంది కదా అంటారట. భారతీయ భాష లన్నింటిలో విశిష్టమైన భాష మళయాళం అన్నాట్ట ఒక ఆంగ్లేయుడు. ఏమిటయ్యా, అంటే MALAYALAM అనే పదము ఒక్కటే వెనుక నుంచి చదివినా అదే పదం వస్తుంది అన్నాట్ట ఇలా వెనుకనుంచి చదివినా అదే పదం వచ్చే పదాలను ఇంగ్లీషులో PALINDROME పాలిన్డ్రోమ్ అంటారు. తెలుగులో కూడా ఇలాంటి పదాలున్నాయనుకోండి వికటకవి, తోకమూకతో, మందారదామం, కిటికి లాంటి చిత్రపదాలకు తెలుగులో ఏం పేరు పెట్టారో తెలియదు. ఇవి అక్షర చమత్కృతిగల పదాలు. కొన్ని పదాల్లో అక్షరాల చమత్కారముంటే మరికొన్ని పదాల్లో, అక్షరాల్లో శబ్ద మహిమ ఇమిడి వుంటుంది - సెనగ గింజంత, పెసర గింజంత ఎలక్ట్రానిక్ బాటరీలలో బ్రహ్మాండమైన శక్తి లీనమైయున్నట్లు!

మంత్రాలకు పవరుందో, లేదో రిసెర్చి చేస్తేగానీ తెలియదు ఉందనే నా అభిప్రాయం కానీ, కొన్ని పదాలకు మాత్రం ఖచ్చితంగా పవరుందనే నా నిశ్చితాభిప్రాయం ఇంగ్లీషులో 'థ్యాంక్యూ, సారీ, యెస్ సార్' ఇవి మహత్తరమైన పదాలు. ఇంగ్లీషు రాకున్నా అక్షరజ్ఞానమున్నవాడూ, లేనివాడూ, అర్థమైనవాడూ, నిలువైనవాడూ మాతృభాషలాగా ఈ కాలంలో వాడే పదాలు. ఎన్నటికీ వాడిపోని పదాలు. విశ్వజనీనమైనవి. మహిమాన్వితమైనవి!

పోతే, మన తెలుగు భాషకు సంబంధించినంత వరకు అలాంటి అక్షరాలు 'స'కార 'ర'కారయుత పదాలు అక్షర ద్వయములు!

ప్రస్తుతానికి 'సారీ' పదం తీసుకుందాం. ఏదో తొందరలో, ప్రక్క వాడి కాలు తొక్కడం గానీ, మోచేత్తో మొట్టడం గానీ జరిగింది అనుకోండి. అనుకోండి ఎందుకు? మీ కిలాంటి అనుభవం అయ్యుండదు గనుకనా? సదరు తొక్కితుడు గాని, మొట్టితుడు గానీ, (బాధితుడు అనాలి కాబోలు) గుడ్లురిమి చూడటం ఖాయం. "ఏం! కళ్ళు నెత్తిమీది కొచ్చాయా?" అని అడగడం లేదా నేత్రావధానం చేయడం గ్యారంటీ. ఆ చూపులకే పవరుంటే (కౌశిక మహర్షుల వారి కున్నట్లు) ఆ శాల్తీ దగ్ధం అయిపోతాడు. మాటవరసకు మీకే జరిగిం దనుకోండి. భయపడకండి. వెంటనే మీ అమ్ముల పొదిలోంచి 'సారీ' బ్రహ్మాస్త్రం సంధించండి. ఖతమ్. ఆ సామి, ఆ ఆసామి, కాలు కందిగాని, తల బొప్పికట్టిగాని, లోలోపల ఏడుస్తున్నా 'నో మెన్షన్' అని ఏడవలేక ఒక జీవం లేని నవ్వులాంటి నవ్వు నవ్వుతాడు. లింపింగ్ కాకపోయినా, ఇక'లింపు' పండ్ల ప్రదర్శన జరగవచ్చు. మరి ఆ 'సారీ' మహత్తు అలాంటిది. చిన్న పిల్లల ఆటల్లో 'తూచ్' తూనాబొడ్డు పెట్టినట్లు ముందుగానే 'సారీ' అనేస్తి రాయె ఇక చచ్చినట్లు మచ్చికగాక చస్తాడా మరి!

ఆ 'సారీ'నే మనము 'సరి' అని సరి పుచ్చుకున్నాం. ఆఫీసులో బాసుగాడి మాటకు ఆ మాటలు గడియ గడియకూ, గాడి తప్పుతూ ఉన్నా, కిమ్మనక శిరఃకంపనం బొనరించుచూ సరి, సరి అంటూండండి. సద్దిజోకులు వేసినా 'పద్దిక' అనక ఒద్దికగా నవ్వండి. దాని మహిమ, మండలం లోగా మీకే తెలుస్తుంది. అసలు 'సర్ - సర్' అనే వాళ్ళుండే చోటు కాబట్టే సర్కార్ అయిందని నా అనుమానం! ఈ సరి, సర్ శబ్ద జన్యములే సర్వీస్, సర్వెంట్!? సర్కార్ సర్వీస్ అంటే అది కేంద్రం గానీయండి, రాష్ట్రం గానీయండి ఆఫీ'సరే' అయినా, సరే పైవాడికి సరే, సరే అంటూంటూనే ఇంక్రిమెంట్లు సెలవు మంజూర్లులోను శాంక్షన్లు, అడ్డదారి ప్రమోషన్లు సంప్రాప్తమౌతాయి. సరి సరి అనరో, మీ కథ ఇంతటితో సరి! అడ్డుపుల్లలు, అప్పుల తిప్పలు తప్పకపోవచ్చు! తస్మాత్ జాగ్రత్త! ఇంతెందుకు, మన ప్రధాన మంత్రి వద్ద, ముఖ్యమంత్రి వద్ద, సరి సరి అని తలలూపుతుండే తాబేదార్లుండబట్టే వారికి

ప్రతి సంవత్సరం పంచాంగాల్లో కందాయ ఫలాల్లో సున్నాలు లేకుండా వుండటం, మంత్రి పదవులు పదిలంగా వుండటం! ఈ తల వూపుడుగాళ్ళే ముద్దుగా వంది మాగధులనీ, భట్రాజులనీ కాలక్రమేణా పిలువబడసాగారు! ఇంట్లో నారీమణి అలకపాన్పు ఎక్కిందనుకోండి. వంద నీతి సూక్తుల కన్న ఒక నాతి సూక్తి మిన్న. అలాగే, వంద 'ప్యారీ'ల కన్నా ఒక్క కొత్త 'సారీ' మిన్న ఇక్కడ కేవలం మాట 'సారీ' కొండొకచో పని చెయ్యకపోవచ్చు. ఏ కోటా సారీయో, వెంకటగిరి సారీయో, నైలెక్సుదో, లేటెస్టు డిజైన్‌లో తెచ్చి సర్‌ప్రైజ్ చెయ్యండి. కోపం లేదు. తాపంలేదు ముడుచుకున్న 'లిప్స్' 'ఫిలిప్స్' దీపాల్లాగా వెలుగుతాయి. ఆ సారీమణి, సారీ, నారీమణి ముఖం విప్పారుతుంది. అసలు 'సరిగ' చీరలు అంటే జరీ చీరలు అని మాత్రమేకాదు. కీచులాటలను 'సరిగ' చేసి సరిదిద్దగలవి అని అర్థం!

మగ పెళ్ళివారి వైపు అత్తగార్లకూ, ఆడపడుచులకూ (మగపడుచులని ఎందుకు అనరో? ముసలి వారిని కూడా ఆడపడుచులు అని ఎందుకంటారో!) చీర - సారె పెట్టకుంటే పెళ్ళి సాఫీగా సాగుతుందా?

సంగీత ప్రపంచంలో స, ర, ల, సంగతి సరే సరి! సప్త స్వరాల్లో మొదటి రెండు సరి.

చూదారా. 'స'కార 'ర'కారాల శక్తి! ఇవి సరిగా, డోసు చూచుకొని ప్రయోగిస్తూంటే జీవితం హాయిగా, సప్త స్వరాలూ, అపస్వరాలు లేక పలుకుతూ 'స, రి' గ, మ, లు, వు' తిరుగుతూ సరసంగా నడుస్తుంది!

'సారీ'కి తోబుట్టువు 'థ్యాంక్యూ'! దీన్ని గూర్చి మరో 'సారి'!

—: o :—

# 44. దఫేదార్ మునసలయ్య!

మా రోజుల్లో సర్కారు శాఖలు, ఆ శాఖల్లో కొలువులు చాలా తక్కువగా వుండేవి. పోలీసు, రివిన్యూ. రిజిస్ట్రేషను ఇలా ఏవో కొద్ది సంఖ్యలో, అన్ని భాషలకు లేదా ఎన్నో భాషలకు సంస్కృతం తల్లి అన్నట్లు, ఇప్పుడుండే ఎన్నో శాఖలకు రివిన్యూ శాఖే తల్లి శాఖ "పెద్దన అన పెద్దననే పెద్దనవలె" అన్నట్లు ఉద్యోగం అంటే సర్కారు కొలువనే ఆ రోజుల్లో చలామణీ అయ్యేది. అందులో కూడా రివిన్యూలో నౌకరి అంటే, అది ఏ నౌకరి కానివ్వండి, మరీ గౌరవ ప్రపత్తులుండేవి. పోలీసు డిపార్టుమెంట్ అంటే భయం మాత్రమే వుండేది ఆ డిపార్టుమెంట్‌లో చేరాలన్నా భయమే. ప్రాణాలకు ముప్పు అనుకునేవారు. రిజిస్ట్రేషను అంటే పై ఆదాయం వున్నా అధికారం, పలుకుబడి అంతగా లేదు. రివిన్యూశాఖలో వుంటే "కుడువ కూడు కద్దు, గుగ్గిళ్ళు తిన కద్దు, తలకు చమురు కద్దు, తరుణి కద్దు" అని తిరుపతి వేంకటకవు లన్నట్లు అధికారానికి అధికారం, ఆదాయానికి ఆదాయం! ఎప్పుడైనా మా వూరి కెళ్ళితే "ఏమోయ్! ఉద్యోగమటగా, ఎక్కడా? తాలుకాఫీసా? జీతమెంత? పై ఆదాయమెంత?" అని మామూలుగా కుశలప్రశ్నల వలె వేసేవారు. సామాన్య జనానీకానికి తాలుకాఫీసుతోనే పనులు. యుద్ధకాలం కావటం మూలాన కిరసనాయిలు, చక్కెర, బియ్యం దొరకడం కష్టంగా వుండేది. అందరూ తాలుకాఫీసును నిత్యావసరాలకై ఆశ్రయించాల్సిందే. ఎవరో లెవలు మనుష్యులకే కలక్టరాఫీసుతో పని! ఈ కాలంలో ఆఫీసులలో కొన్ని సీట్లకు విష్ణ్వాలయాలనీ, కొన్ని ఉత్త శివాలయాలనీ సంకేతాలున్నాయిగానీ, ఆ రోజుల్లో సర్కారు కొలువంటేనే చక్కెర, పొంగలి, దద్దోజనం లభించే విష్ణ్వాలయమనే అభిప్రాయం ప్రజల్లో వుండేది పై ఆదాయం జీతానికి అనుబంధం లాగా నేటి కరువు భత్యం లాగా ఉండి తీరుతుందనీ ప్రజల విశ్వాసం!

మా వితండేశ్వరరావు అంటూండేవాడు, పై ఆదాయం పైసల్లోనా, కాసుల్లోనా అని. నీవు ఉద్యోగస్తుడివా, ఉద్యోగాస్తుడివా అని ఆస్తిపాస్తులు బాగా ఆర్జించిన వారు ఉద్యోగాస్తులట. కేవలం జీతంరాయుళ్ళైతే ఉద్యోగస్తులట. సెక్రటేరియట్‌లో పనిచేస్తున్నాడంటే సచివాలయమా, సశివాలయమా? అని వ్యంగ్యోక్తి విసిరేవాడు ప్రభుత్వ సంస్థలు అంటే గవర్నమెంట్ అండర్ టేకింగ్ అనీ, అండర్‌టేకింగ్ అంటే బల్ల క్రింద చేతులుంచే సంస్థ అనీ వ్యంగ్యంగా అనేవాడు! సరే, వాడి సంగతి వదిలేద్దాం.

తాలుకాఫీసుకు మళ్ళీ వద్దాం. అలాంటి తాలుకాఫీసుల్లో తాహశీలుదారు వద్ద దఫేదార్ ఉండేవాడు. తాహతు లేని జనానికి తహశీలుదారు దర్శనమే దుర్లభం. వారికి దఫేదారంటేనే హడలు! మహారాజుల దగ్గర మంగలిలా, పోర్టుఫోలియో లేని మంత్రిలా వెలిగిపొయ్యేవాడు. తాసీల్దారు మూలవిరాట్టు. దఫేదారు ఉత్సవ విగ్రహం! యత్ర యత్ర రఘునాధస్య చరితం తత్ర తత్ర కృతమస్తకాంజలిం అన్నట్లు తాసీల్దారుగారు ఎక్కడ కొలువుదీరితే దఫేదారు అక్కడ ముందుగా వస్తుండేవాడు- పైలట్ కారులా!

ముసలయ్య అని మా వూర్లో ఒక దఫేదార్ ఉండేవాడు వాడివి చూస్తే నాకు చచ్చేంత భయం! ఆట్టే పొడవు లేకపోయినా దఫేదార్ వేషంలో పొడుగ్గానే కనిపించేవాడు- తలకు మించిన తలపాగా, దవాలూ, అన్నిటికన్నా వాడి బుర్రమీసాలు చూస్తుంటే ముచ్చెమటలు పోసేవి. "అద్గదీ, చేస్తే ఇలాంటి ఉద్యోగం చెయ్యాలి" అని నా చిన్నతనంలో అనుకుంటూండేవాడిని!

ఉద్యోగస్తులు అందరూ మామూలు మనుష్యులే. అంటే మామూళ్ళకు అలవాటుబడ్డ ప్రాణాలు! ఇప్పుడు అవినీతి అవినీతి అని గగ్గోలు పెడుతూ నేతలే అవినీతిని ఉద్యోగస్తులకు నేర్పిస్తున్నారు కానీ ఆ కాలంలో అవి నీతిపనులు గానే, సాఫీగా సూర్యుడు తూర్పున ఉదయించినంత సహజంగా జరిగిపొయ్యేవి! కాదంటే ఈ కాలంలో అవినీతి ప్రవాహంగా మారింది. అంటే పైనుంచి క్రింది

స్థాయి ఉద్యోగులకు ప్రాకింది. ఆ కాలంలో ఇది ఒక చిన్న మంటలాగా క్రింది స్థాయి వారినుండి పైకి రెండు మూడు స్థాయిల వరకే ప్రాకేది. అంతవరకే. గజెటెడ్ అధికార్లలో చాలా తక్కువ. ఒకటీ అరా ఉన్నా ఇంత తక్కువ రకం బాపతు కాదు. గజెటెడ్ అధికార్లను వారి హోదాలో పిలువకూడదు. 'దొర' గారు, పెద్ద దొర గారు. చిన్న 'దొర' గారు!

తహసీలుదారు కాంపుకు వస్తే ఆ హంగామా ఇంతా అంతా కాదు. ఇప్పుడు జిల్లా కలక్టరుకు కూడా అంత లేదేమో! 'కాంపు'ను 'దొరా' అని అనే వాళ్ళు. 'దొరా'లో మా ముసలయ్య దర్పము ఆర్భాటం చూచి తీరాల్సిందే! 'దొరా' జన్మమే దౌర్జన్యము అని మా వాడి నిర్వచనం!

డబ్బు వచ్చే దారి తెలిసిన వాడు డబ్బేదార్ అయి- అదే దఫేదార్ అయిందంటాడు మా వితండేశ్వర్రావ్! 'అర్థానాం అర్జనే దుఃఖం' అని తెలిసినా అర్ధణాకు కూడా చెయ్యి చాచేవాడు. అర్ధణా అంటే ఈ రోజుల్లో రూపాయ కన్నా ఎక్కువేనేమో! 'ప్రొద్దున్న చుట్టకు ఇచ్చా సారూ' అంటే 'తమలపాకుల మీద నీళ్లు మాటిమాటికి చల్లకుంటే వాడిపోవూ?' అని మీసం మెలివేసి నవ్వేశే వాడు!

మా ముసలయ్య పాత అగ్గిరాముడు సినిమాలో అగ్గిరాముడిలా వుండే వాడు. పేరుకు ముసలయ్యే. కాని వయసులో మిసమిసలాడుతూండేవాడు. Viceలు ఎక్కువై వయసు ఎక్కువై చర్మం ముడుతలు పడి ముసలయ్య చర్మం మొసలి చర్మంలా గరుగ్గా అయిపోయింది!

ముసలయ్య చాకచక్యంగా, శ్లేషార్థాలతో మాట్లాడుతూ నవ్వుతూ నవ్విస్తూ ఉండేవాడు. అక్షరాలు రాకున్నా, ఇంగ్లీషు ముక్కలు కూడా అక్కడక్కడ వదిలేవాడు. కాంపుల్లో రెడ్లు, కరణాలు గెస్ట్ హౌస్‌లో భోజనాలు ఏర్పాటు చేసేవారు. ముసలయ్య ఒకసారి 'హాస్పిటాలిటీ' బాగానే వుంది. హాస్పిటల్

లేదేంటి? ఎక్కడ' అని అడిగి నవ్వేవాడు. ప్రక్కాయనకు వెంటనే స్ఫురించ లేదు. 'హాస్పిటల్‌లో మందులు ఉంటయ్ గదయ్యా! 'మందు' ఎక్కడ?' అని ఇకిలించేవాడు. హాస్పిటాలిటి అంటే మందు పార్టీ అనేవాడు.

తన మాట పలుకుబడితోనే తాసిల్దారు గారి పీలు చూచుకొని చెవిలో వేసి చిన్న చిన్న కొలువులు ఎందరికో ఇప్పించాడంటారు మా ముసలయ్య.

ఠీవిగా, ఎదురులేని జీవిగా ఏడు పదులు హాయిగా బ్రతికి, ఒకరోజు హఠాత్తుగా కన్ను మూశాడు పాపం, ముసలయ్య!

—: o :—

# 45. మతము – మతోన్మాదము

ఆ.వె. మతము పేర నాడు మారణహోమాలు
జరిగె - జరుగు చుండె - చరిత మరయ
మానవత్వ హీన మతములు వేయేల?
హృదియు, మదియు విస్తరించనపుడు?

సృష్టి ప్రారంభంలో మతాలున్నట్లు ఎట్టి దాఖలాలూ లేవు. నేడు కొన్ని వందల సంఖ్యలో మతాలున్నాయి. మానవుని మేధ పదునెక్కడం ప్రారంభం అయిన తర్వాత ఈ చరాచర సృష్టిక్రమాన్ని గురించి, సృష్టి కర్తను గూర్చి, తాను ఎక్కడి నుంచి వస్తున్నాడు. ఎక్కడకు మళ్ళీ పోతాడు, మరణానంతరం ఈ ప్రాణం ఏమౌతుంది అనే అగాధ విషయాల్లోకి ఆలోచన సాగించడం ప్రారంభించింది. ఈ ఆలోచనా తరంగాల నుండి క్రమక్రమంగా వెలసినవే విభిన్న మత సిద్ధాంతాలు. ఆ చీకటి తెర వెనుక ఏమి వుందో, ఎలా వుందో, అసలు ఏదీ లేదో చూచినవాడు లేడు. ఉండడుగాక వుండడు. మరణించిన వాడు మళ్ళీ తిరిగిరాడు గనుక! ఈ ప్రతిపాదనలూ, సిద్ధాంతాలూ అన్నీ ఆయా మత ప్రవక్తల మేధాజనితాలూ, ఊహాజనితాలే! వారి వారి అనుభూతులే అనుభవాలే! ఖచ్చితంగా ఇదమిత్థమని తెలియనిదానినిగూర్చి, తెలియలేనట్టి, రుజువులు చూపించలేనట్టి విషయాలను గురించి, ఎందుకు ఇన్ని రభసలో, రాద్ధాంతాలో, మతకలహాలో, పీరావేశాలో, మారణహోమాలో అర్థంకాదు.

'మతం మత్తుమందు లాంటిది' అని అన్నాడు కారల్ మార్క్స మహాశయుడు ఇదే నిజమైతే ఈ మత్తుమందు దేశవ్యాప్తంగా, నిరంతరాయంగా, ఇంత భావోద్రేకాన్ని, ఇంతటి చైతన్యశక్తిని, ప్రాణాలకైనా తెగించే సాహసాన్ని ఎలా కలిగిస్తుందో ఊహకు అందదు.

దేవుడు, ఆత్మ, పరలోకాలు, పునర్జన్మ, కర్మ, మాయ, ప్రకృతి, పదార్థము, సత్తు, అసత్తు- ఇలాంటి అగోచరమైన, జటిలమైన అంశాలలో ఒక మతానికి, మరొక మతానికీ ఎన్నో విభేదాలున్నాయి. అంతవరకే గానీ దాదాపు అన్ని మతములలోని మౌలిక సూత్రాల్లో, అంతగా తన్నుక చచ్చేంత వైరుధ్యం లేదు. అబద్ధాలు, దోపిడీలు, గృహ దహనాలూ, హత్యలూ, హింసలూ- వీటిని ఏ మతమూ ప్రబోధించదు. కేవలం వ్యక్తిగత విశ్వాసానికి సంబంధించిన మతము, తమ తమ సంతతికి జన్మతః ఎలా సిద్ధిస్తుందో, మతానికి వారసత్వ నిబంధనలూ, నిర్బంధాలూ ఎలా ఏర్పడ్డాయో తర్కానికి నిలబడని విషయాలు. అసలు సమస్యలకు నాంది ఇక్కడే మొదలయింది.

విదేశీయ మతాల్లో మనకున్నన్ని మతాలు, విభేదాలు లేవనుకుంటే పొరపాటే. ఎటొచ్చీ, వాళ్ళకు మనకున్నన్ని శాఖలు, ఉప శాఖలు లేవు. ఆ ఉన్నవి వాళ్ళ వివాహ వ్యవస్థను, కుల వ్యవస్థను ప్రభావితం అంతగా చెయ్య లేదు. ఇనుప తెరలను నిర్మించలేదు.

ప్రపంచ వ్యాప్తంగా వ్యాపించిన మనము అనుకునే క్రీస్తుమతములోనే బోలెడన్ని సంఘాలున్నాయి. రోమను సంఘము, లూథర్ సంఘం, ప్రొటెస్టెంటు సంఘము, గ్రీకు సంఘము, వెస్లియన్ సంఘం, యూనిటేరియన్ సంఘము, లండన్ సంఘము, స్కాట్స్ సంఘము, క్వాకర్ సంఘము ప్రిస్బిటేరియన్ సంఘము, కాల్వెనిస్టు సంఘము- ఇలా వాళ్ళకూ ఉన్నాయి.

ఏ మతాన్ని అయినా, స్థూలంగా మూడు విభాగాలను చెయ్యవచ్చు:

సత్యము, దయ, స్వార్థత్యాగము, అహింస, పరోపకారం మున్నగు సద్గుణములను ఆచరణలోనికి పెట్టడం. ఇవి లోక కళ్యాణమునకు సమాజోద్ధరణకు ఉద్దేశించబడినవి. మతమనే బృహత్ సౌధానికి ఇవి పునాది రాళ్ళు. ఇవి పైకి కనబడకుండా మత సౌధానికి అడుగుననే ఉంటాయి.

ద్వితీయ భాగము మరణానంతరం జీవుని పరిణామము, పుణ్యలోకాలు, పాపలోకాలు, దేవుడొక్కడేనా, పెక్కురా, పునర్జన్మ ప్రకృతి, ఆత్మ వీటికి సంబంధించినది. ఇవి పైకి మనకు కనిపించే పునాదిగోడలు, వీటి ఎత్తు ఆయా సౌధాలనుబట్టి మారవచ్చు.

కట్టు, బొట్టు, జుట్టు, కర్మకాండలు, ఆచార వ్యవహారాలు ఇవన్నీ తృతీయ భాగం. ఇవి మతసౌధానికి కిటికీలు, తలుపులు, గోడలులాంటివి.

ఎటొచ్చీ, మనకు ద్వితీయ భాగంలోనే మత స్థాపకుల్లో విభేదాలు.

మతాన్ని మరొక రకంగా కూడా పోల్చవచ్చు. మత మనేది శరీరము అనుకుంటే ప్రథమ భాగము (సద్గుణాలు) రక్తమాంసాలు, ద్వితీయ భాగము (మత సిద్ధాంతాలు) మనస్సు, హృదయము; తృతీయ భాగము (ఆచార వ్యవహారాలు, కర్మకాండ) శరీరానికి అస్థిపంజరము.

ప్రస్తుతం ఏ మతాన్ని పరిశీలించినా, ప్రాణాధారాలైన రక్తమాంసాలు నానాటికీ క్షీణిస్తున్నాయి. అస్థిపంజరాలనదగ్గ కట్టు, బొట్టు, జుట్టు, ఆచారాలు వగైరాలు పేరుకు నిలిచియున్నాయి. మత శకటానికి SPIRITUALISM, RITUALISM అనేవి రెండు గుర్రాలైతే, మొదటి గుర్రము కనుచూపు మేరలో కనపడకుండా దూరంగా వుంది. రెండో గుర్రం కుంటుకుంటూ కాళ్ళీడ్చుకుంటూంది. ఈ పరిస్థితి ఇలాగే మరికొంత కాలము సాగితే ఇక ఎలాంటి బలవర్ధక ఔషధం ఇచ్చినా అది బలవ్యర్థక ఔషధంగా మారి, అస్థిపంజరాలను ఖననమో, దహనమో చెయ్యాల్సి రావచ్చు!

## సిద్ధాంత విభేదాలు

మతము అంటే మది, మతికి అనగా మనస్సునకు సంబంధించినది అని చాలామంది నిర్వచిస్తారు. ఆ నిర్వచనము అంత సరిగా లేదేమో! భారతీయుల

నిజమైన ప్రార్థన 'తమసోమా జ్యోతిర్గమయ' అని (బృహదారణ్యకం) 'అంధకారంలో నుంచి వెలుగులోనికి మమ్మ తీసికొని పొమ్ము' అని భావం. అజ్ఞాన 'తమస్సు' నుండి (చీకటి) జ్ఞానమనే వెలుగులోనికి మమ్మ తీసికొని పొమ్మ అని. 'తమః' అను పదమును తలక్రిందుచేస్తే మతః అవుతుంది. అజ్ఞాన తమస్సును ఛేదించి జ్ఞాన తేజస్సును ప్రసాదించునదే మతము.

ఇతర మతాల సంగతి ఇక్కడొద్దు. మన హిందు మతము, ఒక మతము కాదనీ, అది ఒక జీవన విధానమని విశదీకరించారు మనవాళ్ళు. మహమ్మదు మతము, క్రీస్తు మతము, బౌద్ధ మతములు ఆయా ప్రవక్తల పేర్లమీద స్థాపింపబడ్డాయి. హిందు మతమునకు ప్రత్యేకించి అలా ఒక ప్రవక్త లేకపోవడమే ఈ అభిప్రాయమునకు కారణము కావచ్చు.

'హీనంచ దూషయత్యేవ హిందూ' అనియూ "హింకృణ్వతీ వసూనాం" అనే గోమంత్రము నందలి ప్రథమాక్షరములతో 'హిం, దు' శబ్దము (బి జె.పి, టి.డి పి., బి.ఏ, యమ్ ఎ లాగా) "హింసా దూషయతీతి హిందుః" అనియూ రకరకాలుగా పండితులు అభిప్రాయపడ్డారు. 'హీనంచ దూషయతి' అనగా హీనమైన దానిని దూషించువాడు- హింసను దూషించువాడు హిందువు అనే కొలబద్ద ప్రకారం నేటి మన సమాజంలో ఎంతమంది నిజమైన హిందువులు ఉన్నారో ఎవరికి వారు ఆత్మపరిశీలన చేసుకొని నిర్ణయించుకోవచ్చు. అన్ని సమాజాల్లో లాగా, అన్ని దేశాలలోలాగే మనలో కూడా, ఖూనీకోర్లూ, దోపిడీ దొంగలూ, దేశద్రోహులూ, నరరూప రాక్షసులూ, గోముఖ వ్యాఘ్రాలూ, కోకొల్లలుగా వున్నారు. అందరూ ఏదో ఒక మత చిహ్నం ధరించువారే! దేవుడిని పూజించేవారే. రాజకీయ నాయకుల అండదండలతో, సంఘ విద్రోహులే సమాజాన్ని నడిపిస్తున్నారు. కాదు ఋడిపిస్తున్నారు!

మత త్రయ కర్తలలో ఒకరు ఈశ్వరుని అంశ. మరొకరు ఆదిశేషుని అంశ. ఇంకొకరు వాయుదేవుని అంశ. తమాషా యేమిటంటే- అందరు మత

స్థాపకులూ దైవాంశ సంభూతులుగా, దైవ పుత్రులుగా, దేవ దూతలుగా, మహనీయులుగా, మహిమాన్వితులుగా విశ్వసింపబడుచున్నవారే. వారి వారి సిద్ధాంతాలే విభిన్నమైనవి.

కపిల మహర్షిచే బోధింపబడినట్లుగా చెప్పబడుచున్న 'సాంఖ్య' మతము, బృహస్పతిచే ప్రబోధింపబడుచున్నట్లు ప్రచారంలోనున్న 'చార్వాక' మతము, విరోచనుడు ప్రతిపాదించిన 'విరోచన' మతము ప్రకృతికే పట్టము కట్టాయి. ప్రత్యక్ష ప్రమాణమునే అంగీకరించాయి. పరలోకాలు, పునర్జన్మలు అంగీకరించలేదు. "యావజ్జీవం సుఖం జీవేత్ నాస్తి మృత్యురగోచరః భస్మీభూతస్య దేహస్య పునరాగమనమ్ కుతః" అనేది వీరి సూత్రం. 'బ్రదికియుండు వరకు సుఖముగా జీవించవలెను. భస్మీ భూతమైన దేహము మరలరాదు,' అంటారు. 'ఆత్మ'ను అంగీకరించరు. వీరంతా నిరీశ్వరవాదులే. సాంఖ్య మతముతో ఏకీభవిస్తూనే, ఈశ్వరుని అస్తిత్వాన్ని, ఆత్మనూ నమ్ముతూ ప్రతిపాదించాడు పాణిని మహర్షి. వీరికి పతంజలి అని మరొక పేరు. పతంజలి యోగ శాస్త్రము వీరు రచించినదే.

'అహం బ్రహ్మాస్మి' ప్రతిపాదకులైన అద్వైత మత స్థాపకులైన శ్రీ శంకర భగవత్పాదులు జగత్తు మాయ, మిథ్య అన్నారు. వీరు 'సోహం సోహం' అన్నారు. విశిష్టాద్వైతులు 'దాసోహం దాసోహం' అన్నారు. శ్రీమద్రామానుజులవారు జగత్తు సత్యమనే అభిప్రాయపడ్డారు. జైమినీ మహర్షి ప్రణీతమైన మీమాంసక మతం, జైనమతము రెండు కూడ జగత్తు సత్యమనియే సిద్ధాంతీకరించాయి. అద్వైతులు యజ్ఞయాగాదులకు, కర్మకాండకు ప్రాధాన్యత ఇచ్చారు. విశిష్టాద్వైతులు భక్తికి ప్రాముఖ్యత ఇచ్చారు. సుప్రసిద్ధ భక్తుడు శ్రీ కబీరుదాసు, ఆర్యమత స్థాపకుడు శ్రీ దయానంద సరస్వతి, బ్రహ్మసమాజ వ్యవస్థాపకుడు శ్రీ రాజా రామమోహనరాయ్. వీరంతా విగ్రహారాధనను అంగీకరించరు.

ఆంధ్రుడైన శ్రీ వల్లభాచార్యులు కూడా ఒక సుప్రసిద్ధ మతప్రవక్త. వారు ఇంద్రియ వశీకరణము, ఉపవాసాలు, సన్యసించడం ఇలాంటివన్నీ అనవసరమన్నారు. భక్తిమార్గ మొక్కటే శరణ్యమని బోధించారు.

జైనమత సిద్ధాంత ప్రకారం గృహస్థులకు, స్త్రీలకు మోక్షప్రాప్తి లేదట. అద్వైత పీఠాధిపతులు బ్రహ్మచర్యాశ్రమము నుండే నేరుగా సన్యాసాశ్రమము స్వీకరిస్తారు. విశిష్టాద్వైతులు మాత్రము గృహస్థాశ్రమము నుండి వచ్చినవారే పీఠాధిపతిగా ఉండాలంటారు. ఏతా వతా, ఒకే హిందూ మతములోని శాఖల లోనే మత చిహ్నాలలో, ఆచార వ్యవహారాలలో, ఎన్నో వైవిధ్యాలూ, వైరుధ్యాలూ, సిద్ధాంత విభేదాలు ఉన్నాయి.

విడ్డూరమైన విషయ మేటంటే, ప్రతి మతకర్త తమ మతస్థులకు దప్ప అన్య మతస్థులకు మోక్షం లేదని ప్రచారం చేసుకోవడం. మహమ్మదు అలాగే అన్నారు. ఏసుక్రీస్తు అలాగే ఫలానా పన్నెండు మంది గోత్రీకులకు మాత్రమే స్వర్గద్వారాలు తెరుచుకుంటాయి అని హెచ్చరించారు. "మా బడిలో చదివే వారు మాత్రమే నూటికి నూరుశాతం ఉత్తీర్ణులౌతారు" అంటే కొంతవరకు ఊరుకోవచ్చు. ఇతర స్కూళ్ళ విద్యార్థులు తప్పితీరుతారు అని హెచ్చరించి నట్టు లేదూ!

శైవమతము వారు 'శివభక్తి విహీనశ్చ బ్రాహ్మణాః శ్వపచాదమాః శివ భక్తిస్సదా పూజ్య శ్వపచో బ్రాహ్మణోత్తమః అని, అన్నారు. బ్రహ్మజ్ఞానియైనను సరే, శివభక్తి లేనివాడు నీచుడని,శివభక్తి కలిగి యున్న వాడు నీచకులస్థుడైనను సరే-బ్రాహ్మణోత్తమునిగా పూజింపదగిన వాడనియూ చాటారు. విశిష్టాద్వైతులు శ్రీమన్నారాయణుడొక్కడే దేవుడనియూ, ఆయనను భర్తగా మనము పూజింప వలయుననియూ ప్రబోధించారు. శ్రీ వైష్ణవులు శివాలయమునకు పోకుండుటకు ముఖ్యకారణం ఇదే.

అష్టవిధ భక్తిమార్గాల్లో "మద్భక్త జనవాత్సల్యం," "మమానుస్మరణం నిత్యం" అని వుంది. నిజమైన భక్తుడు మరొక భక్తుడిని 'వాత్సల్యం'తో

ఆదరించాలని, భగవంతుడినే నిత్యమూ స్మరించాలనీ బోధించారు. వీటిని అమలుపరిస్తే చాలు- అసలు మతకలహాలే రావు!

ఏ మతమూ హింసను విశ్వసించకున్నా ప్రబోధించకున్నా ఈ మత ప్రవక్తల జీవితాలను పరికిస్తే ఒక మతం వారు ప్రత్యర్థి వర్గం వారిపై విష ప్రయోగాలు, కన్నులు పీకించబడ్డాలు, యుద్ధాలు, మారణహోమాలు జరిగినట్లు దాఖలాలు ఎన్నో!

'సర్వే జనాస్సుఖినో భవంతు' అనీ,'స్వస్తి ప్రజాభ్యాం పరిపాలయన్తాం' అనీ చాటుకున్న మన మతములో 'అన్ని దిక్కులనుండి మాకు ఉన్నతభావాలు ప్రవహించుగాక' అని చెప్పుకునే మన మతములో, హైందవేతర మతాల సంగతి అటుంచి, హిందువులలోనే అడుగు వర్గాలవారిపట్ల, బడుగువారిపట్ల మన ప్రవర్తన, మనస్తత్వము, సమదృష్టి ఎలా వుందో ఒక్కసారి ఆత్మ పరిశీలన చేసుకుంటే చాలు. ఒకే శాఖలోని ఉపశాఖల వారిలోనే ఎన్ని కక్షలు? కార్పణ్యాలు? వైషమ్యాలు? భగవంతుడా! బ్రాహ్మణులలోనే వైదికులకు నియోగులకూ, శ్రీవైష్ణవులలోనే వడహలశాఖకు తెంగలశాఖవారికి పొడగిట్టదా? 'కంచి'లో దేవస్థానములోని గజరాజుకు నామాలు పెట్టు విషయంలో, తిరుపతి వెంకన్నకు నామాల విషయంలో బ్రిటిషువారి పాలనలో, ప్రివీ కౌన్సిల్ వరకు పోయిన వారము మనము కాదా! నామాలు అంటే ఏమిటో తెలియని తెల్ల దొరలతో రాజీ సూత్రంగా నామం పెట్టించుకున్న ఘనత మనది గాదా? అర్థరహితమైన అంశాలపైన ఏర్పడిన అభిప్రాయ భేదాలే ఈ వడహల, తెంగల శాఖలకు కారణము కాదా! కాకపోతే ఏమిటి? లక్ష్మీదేవికి స్వతంత్రత్వము, మోక్షం ప్రసాదించే హక్కులేదని ఒకరూ, ఉందని మరొకరూ; శరణాగతి పొందిన వారికి నిత్యానుష్ఠాన నియమాలు అవసరములేదని ఒకరూ, వాటిని విసర్జించరాదని మరొకరూ; స్త్రీలకు ప్రణవం (ఓం) ఉచ్చరించే అర్హత లేదని ఒకరూ, ఉచ్చరించవచ్చు అని మరొకరూ; విధవరాండ్రు ముండనం చేయించుకొనవలెనని ఒకరూ, అక్కరలేదని ఇంకొకరు! నిత్య కైవల్యపదము

విరజానదికి ఈవలి యొడ్డునుండే ప్రారంభమా లేక అవలి యొడ్డునుండియా అనునది ఒక సమస్యా? రుజావులు లేని ఇలాటి వ్యర్థ విషయాలపైన తలలు బ్రద్దలు కొట్టుకొని విడిపోయింది చాలక ఇంకను కొట్టుకొనుచునే యున్నారు!

శ్రీమద్రామానుజులవారు ఎంతో మంది హీనకుల జాతులకు శరణాగతి ఇచ్చి, అష్టాక్షరి ఉపదేశించి వారి ఔదార్యమును చాటుకున్నారే! పన్నిద్దరు అళ్వార్లలో హరిజనులు కూడా పూజనీయులై, ఇప్పటికీ ప్రాతఃస్మరణీయులుగా నున్నారే! ఇప్పుడు, అయ్యో! ఇప్పుడు మనము శాఖాసంకుచితత్వమును, భాషాసంకుచితత్వమును, కుచ్ఛితత్వము, ప్రాంతీయ సంకుచితత్వమును విస్తరించుకుంటూ పోతున్నామే? తిరుమలవంటి సుప్రసిద్ధ క్షేత్రాల్లో ఒక మతం అనుయాయులకు, మరొక మతం వారు వసతిని ఇచ్చుటకు కూడ మనస్కరించని ఔదార్యాన్ని ఔన్నత్యాన్ని నిర్లజ్జగా ప్రదర్శిస్తున్నారే! మతాలు, మతాలు సమాజాన్ని చీల్చుటకా?

ఇప్పుడున్న మతాలు, మతాలు, సిద్ధాంతాలు చాలవా అన్నట్లు ఊరూరా సరిక్రొత్త యోగులు, భగవానులు, బాబాలు, అమ్మలు మనకు పుష్కలంగా వున్నారు. రజనీష్‌లు, మహేష్‌లు,బాలయోగులు, వృద్ధయోగులు, రామచంద్ర మిషనువారు, హరేకృష్ణ మిషన్‌వారు (వీరు శ్రీరాముడిని అంగీకరించరు!) ఇలా సేకరిస్తూ ఏకరువు పెడితే పట్టిక పెద్దదే అవుతుంది. ఒకరి సిద్ధాంతానికి మరొకరి సిద్ధాంతానికి పొంతన ఉండొచ్చు. బొత్తిగా లేకపోవచ్చు. అందరికీ లక్షలసంఖ్యలో విదేశాల్లోకూడా (అసలు పిచ్చి వారికే) భక్తులు, ప్రచారకులు వున్నారు. నిజానికి అన్ని మతాల వారిలో, అన్ని దేశాల్లో కూడా మహాజ్ఞానులున్నారు. మహిమాన్వితు లున్నారు. మహా భక్తులున్నారు. తత్త్వవేత్తలు, ధన్యజీవులు, దైవాంశ సంభూతులూ వున్నారు.

**అసలు లోపము ఎక్కడుంది?**

మన పురాణాల్లో మహోత్కృష్టమైన పాత్రలున్నాయి. ఒక హరిశ్చంద్రుడు, శ్రీరాముడు, శిబిచక్రవర్తి, లక్ష్మణుడు, భరతుడు, ఏకలవ్యుడు, కర్ణుడు లాంటి పాత్రలు విదేశీయుల కథల్లో విస్తృతంగా కనపడవు ఇతిహాసాల సంగతి వద్దనుకున్నా- సక్కుబాయి, మీరాబాయి, కబీరు, తులసీదాసు, రామదాసు, త్యాగయ్య, రామకృష్ణ పరమహంస, వివేకానందుడు, రమణమహర్షి, వేమన, వీరబ్రహ్మం, మహాత్మాగాంధీలాంటి యుగపురుషులను అందించిన మనదేశం ఎందుకు నానాటికీ ఇలాంటి దుస్థితికి దిగజారిపోతుందో ప్రతివాడూ ఆలోచించాలి. ముఖ్యంగా రాజకీయ నేతలు ఆత్మపరిశీలన గావించుకోవాలి.

కర్మ సిద్ధాంతం ప్రకారం జీవుడు పాపం, పుణ్యం రెండింటి ఫలితాలనూ అనుభవించి తీరాల్సిందే. పుణ్యం ఎక్కువ చేసుకుంటే, పాపం పరిహారం కావటం, తగ్గటం, రద్దు కావటం కుదరదు గాక కుదరదు. కానీ మనము రాసుకున్న స్తోత్ర పాఠాలు, ధ్యాన శ్లోకాలు, పురాణగాథలు చూడండి. "కోటి జన్మకృతం పాపం స్మరణేన వినశ్యతి' అనో 'పునర్జన్మ న విద్యతే' అనో ఫలశ్రుతి ఉంటుంది. ఉదాహరణకి నారాయణోప నిషత్తులో—

"ప్రాతరధీయానో రాత్రికృతం పాపం నాశయతి
సాయమధీయానో రాత్రికృతం పాపం నాశయతి
తత్ సాయం ప్రాతరధీయానః పాపో అపాపో భవతి

మాధ్యందిన మాదిత్యాది ముఖో ధీయానః పంచ
మహాపాత కోపపాతకాత్ర్పముచ్యతే
సర్వ వేద పారాయణ పుణ్యం లభతే
నారాయణ సాయుజ్య మాప్నోతి"

భక్తునిలో ఆత్మవిశ్వాసం పెంపొందటానికి వీటిలో ఇలా పొందుపరిచారే గానీ నిజం కాదు. సగటు మనిషి అలా అర్థం చేసుకోడు.

గంగలో స్నానం చేస్తే చాలు సకల పాపాలూ భస్మీపటలమైపోతా యని వ్రాసుకున్నాం. పంచ మహా పాతకాలూ చేసి, చివరి ఘడియల్లో భగవ న్నామస్మరణ చేసినవారికి మోక్షం వచ్చినట్లు వ్రాసుకున్నాం. ఒక ఆవును కొట్టుటకై తరుముకుంటూ వచ్చి యాదృచ్ఛికంగా శివాలయం చుట్టూ తిరిగితే అట్టివానికి పుణ్యలోకాలు ప్రాప్తించాయని కథలు అల్లుకున్నాం. "పాపులను రక్షించుటకు ఏసు భూలోకమునకు వచ్చెను" అంటారు. విదేశాల్లోకూడా పాప పరిహార పత్రాలు అమ్మారు!

ఇలాంటి సత్యదూరమైన భరోసాలు మరిన్ని పాపాలు చేసేదానికి పరో క్షంగా 'లైసెన్సులు' గావా? మందులున్నాయనే ధీమాతో, డాక్టర్లున్నారనే ధైర్యంతో, డబ్బు గర్వంతో రోగులు అను నిత్యం అపథ్యం చేస్తున్నారు!

సమాజంలో పాపభీతి నశించటానికి, సంఘ విద్రోహుల జనాభా పెరగ టానికీ, తిరుపతి హుండీల్లో ఆదాయం పెరగటానికీ, గంగా స్నానాలు పెరగ టానికి ఇలాంటిభరోసాలూ, విశ్వాసాలూ కారణం కావంటారా? ఆలోచించండి.

ప్రతి మతములో పునాది రాళ్ళు కదలడం ప్రారంభించి చాలా కాల మైంది. పునాది గోడలుకూడా కదలుతున్నాయి. బీటలు వారుతున్నాయి. ఈ పరిస్థితి ఇలాగే మరికొంత కాలం, అట్టే దూరం లేదు లెండి - సాగితే, మత

సౌధాలు మొత్తం శిథిలమై, రోము సామ్రాజ్యం నామ రూపాలు లేకుండా పోయినట్లు సర్వనాశనం కాక తప్పదు.

వ్యక్తిగత విశ్వాసాలకు సంబంధించినమతాన్ని ఇంటి నాలుగుగోడలను దాటి రానీయకుండా వుంచాలి. వీధుల్లోకి తేవటం, దీనికి స్వార్థబుద్ధితో రాజకీయనేతల అండదండలు లభించడం, సంఖ్యాబల ప్రదర్శనలు తగ్గించాలి.

అధికారంలో వుండే రాజకీయ నేతలు ఎట్టి మత ప్రాతిపదిక సభల్లో ఉత్సవాల్లో అధికారికంగా పాల్గొనరాదు. వారి వ్యక్తిగత హోదాలో, స్వంత ఖర్చుతో వెళ్లితే వెళ్ళొచ్చు. ఒకానొక గవర్నరు నూటా ఎనిమిది సార్లు తిరుమల సందర్శిస్తానని మ్రొక్కుకొని, అధికార హోదాలో అన్ని సార్లు వెళ్లాడు. మన మంత్రులు స్వంత ఖర్చుతో వెళ్లమనండి. అప్పుడు వీళ్ల నిజమైన భక్తి బహిర్గతమౌతుంది.

ఇవన్నీ పరిశీలిస్తే సర్వజన సమ్మతమైన సన్మతము మరొక్కటి స్థాపింపబడినా, మనిషిలోని స్వార్థము దినదిన ప్రవర్ధమానముగా పెచ్చుపెరుగుతున్నంత కాలము షరా మామూలేనేమో. మనిషిని Caste మన దేశంలో విభజిస్తే, విదేశాల్లో Cash విభజిస్తుందట!

—: o :—

# ద్వితీయ భాగము

1. అన్ని హంగులున్న ఆంధ్రభాష
2. మన భాషలో చిత్రపదాలు
3. అర్థాలు మార్చుకున్న పదాలు
4. మరుగునపడిపోతున్న మన భాషాపదాలు
5. పొంతనలేని పదాలు
6. ఆంగ్లవాసనతో కూడిన ఆంధ్రపదాలు
7. విరుద్ధార్థ పదాలు

# 1. అన్ని హంగులున్న ఆంధ్రభాష !

ఆంగ్ల భాష కున్నంత సువిశాల పద వాఙ్మయము ఆంధ్ర భాషకు లేదని చాలా మంది అనుకుంటారు. ప్రధానంగా అధునికులు, ఆంగ్ల మానస పుత్రులు! తురుష్కుల పాలన, ఆ తర్వాత, ఆంగ్లేయుల పాలనా ప్రభావంతో, మనలో, ముఖ్యంగా యువతరం వారిలో గాఢంగా పాతుకొని పోయిన అపోహ మాత్రమే ఇది! ఆంగ్లభాష కూడ అంత పరిపుష్టికరం కావటానికి మూలకారణం గ్రీకు, లాటిన్, ఫ్రెంచి లాంటి ఇతర భాషల్లోంచి కొన్ని వేల పదాలు దిగుమతి చెంది, వారి భాషలో తాదాత్మ్యం పొందరమే.

సంస్కృత పదములకు, విభక్తి ప్రత్యయములను చేర్చి, సరిక్రొత్త వ్యాకరణం సృష్టించి, తెలుగు భాషా స్వరూప స్వభావమును సమూలంగా మార్చి వైచి, మెరుగులు దిద్ది, మన భాషను చిరంజీవిగా వర్ధిల్లజేసిన ఆదికవి నన్నయ్యకు మనమెంతో ఋణపడి యున్నాము. నన్నయ్య ఆ పని చెయ్యక పోయియుంటే అచ్చ తెలుగు భాష ఏనాడో అంతరించి యుండేది అంటే అతిశయోక్తి కాదేమో!

నన్నయ్యగారి పున్నెమా అని మన భాష కూడ, నిస్సందేహంగా ఇంగ్లీషుతో సరితూగ గల సుసంపన్నమైన భాషగా మారింది. తెలుగు రాజుల కాలంలో, విదేశ భాషలకన్నా విశిష్టత సంతరించుకొన్నది.

ఇంగ్లీషు భాషలో పుత్రుడు అంటే Son సన్ అని మాత్రమే. కొడుకు కొడుకుకూ, కూతురి కొడుకుకూ Grand Son గ్రాండ్ సన్ అనియే. అదే మనకు పౌత్రుడు, దౌహిత్రుడు అని విభజన ఉంది.

అదీగాక, మొత్తము సంతానాన్ని పండ్రెండు రకాలుగా వర్గీకరించారు. ఒక్కొక్క రకానికి ఒక ప్రత్యేకమైన పేరు. అలా ప్రత్యేక నామకరణము. ఆంగ్ల భాషలో ఉన్నట్లు కనబడదు, అవేవో మనవి చేస్తా.

ఔరసుడు : భార్య యందు తనకు పుట్టిన వాడు.

క్షేత్రజుడు : పెద్దల అనుజ్ఞచేత భర్త అన్నతమ్ముడు మున్నగు వారికి పుట్టిన వాడు.

దత్తుడు : దత్తత తీసికొనబడినవాడు.

కృత్రిముడు : అభిమానించి పెంచుకోబడినవాడు.

గూఢోత్పన్నుడు : తనకు తెలియకుండగా అంకు మగనికి పుట్టినవాడు.

అపవిద్ధుడు : తండ్రిచేతగాని, తల్లి చేతగానీ విడువబడగా, తెచ్చి పెంచుకొన బడినవాడు.

కానీనుడు : తన భార్యయందు, కన్యాత్వ దశలో రహస్యముగా ఇతరునికి పుట్టిన వాడు.

సహోఢజుడు : గర్భిణిగా నుండగా, తెలిసిగాని తెలియకగానీ వివాహము చేసి కొన్న భార్యకు జన్మించినవాడు.

క్రీతుడు : తలిదండ్రులవద్ద ధనము ఇచ్చి కొనబడిన కొడుకు.

పౌనర్భవుడు : మారుమనువుబోయిన స్త్రీకి పుట్టినవాడు.

జ్ఞాతిరేతుడు : దాయాది కొడుకు (కొందరు పుత్రిక పుత్రుడు అని అంటారు) పారశవుడు శూద్రుడు అని కూడా అంటారట.

స్వయందత్తుడు :- తలిదండ్రులు లేక గానీ వారిచేత అకారణంగా విడువబడినవాడుగాని, తనంతట తాను 'నీకు పుత్రుడ నయ్యెదను' అని వచ్చిన కొడుకు.

ఇంగ్లీషులో, కాలమానమును సెకండ్లు, నిముషములు, గంటలు, దినములు, నెల, సంవత్సరము అని ఆరు భాగాలుగా విభజించారు. మనవారు ఆ నిముసములను కూడా ఎంత సూక్ష్మంగా విభజించారో గమనించండి.

కాష్ఠ = పదునెనిమిది రెప్పపాటుల కాలము

కల = ముప్పది కాష్ఠలు, అనగా 540 రెప్పపాటుల కాలము

క్షణము = ముప్పది కలలు. (దాదాపు నాలుగు నిముసములు)

ముహూర్తం = పన్రెండు క్షణములు

దినము = ముప్పది ముహూర్తములు

కుతపము = దినములో మూడవ భాగము

యామము.గడియ (జాము) = ఇరువది నాలుగు నిముషములు

దినము అంటే పాశ్చాత్యులు మార్నింగ్, మిడ్ డే, ఈవినింగ్ అని స్థూలంగా మూడు విభాగాలు చేశారు. అర్లీ అవర్స్, లేట్ అవర్స్ అని చేర్చారు. అదే మన వాళ్ళు పగటి భాగమును కూడా పదునైదు విభాగాలు చేశారు!

1 రౌద్రము 2. శ్వేతము 3 మైత్రము 4 శారభటము 5. సావిత్రము 6. విజయము 7. గాంధర్వము 8. కుతపము 9. రౌహిణేయము 10. విరించము 11. సోమము 12. నిర్బతి 13. మాహేంద్రము 14. వరుణము 15. భటము.

వరుసగా ఒక్కొక్క భాగానికి 48 నిముసములట!

అంతేకాదు మన ప్రస్తుత గణితం ఒకట్లు, పదులు మొదలు, కోటి లేదా మిలియన్, బిలియన్ వరకే ఎదిగింది, ఈ క్రింది వివరాలు చూస్తే మన వాళ్ళు ఎంత ఎత్తుకు ఎదిగారో అవగాహన అవుతుంది.

| | | |
|---|---|---|
| అర్బుదం | - | పది కోట్లు |
| బృందం | - | నూరు కోట్లు |
| ఖర్వం | - | వేయి కోట్లు |
| నిఖర్వం | - | పదివేల కోట్లు |
| శంఖం | - | లక్ష కోట్లు |
| అంబుజం | - | పది లక్షల కోట్లు |
| సముద్రం | - | కోటి కోట్లు |
| పదార్థం | - | వేయి కోట్ల కోట్లు |

రామాయణంలో ఈ వర్ణనలు సాక్షాత్కరిస్తాయి. భారతంలో పదునెనిమిది అక్షౌహిణీల సైన్యం యుద్ధంలో పాల్గొన్నట్లు వ్రాశారు. అక్షౌహిణీ అంటే 21875 రథాలు, అన్ని ఏనుగులు, 65610 గుఱ్ఱాలు, 109350 కాల్బలము.

ఇలాగే భవనములను కూడా పదునాలుగు వర్గాలుగా విభజించారు!

| | | |
|---|---|---|
| పండు ఇటుకలతో కట్టబడినది | - | భవనం |
| రాళ్లతో నిర్మించబడినది | - | మందిరం |
| మట్టిగోడలతో తయారైనది | - | సుధారము |
| పచ్చి ఇటుకలతో నిర్మించబడినది | - | సుమనము |
| కర్రలతో కట్టబడినది | - | మానస్యము |
| బెత్తములతో అల్లబడినది | - | చందనము |
| వస్త్రములతో రూపొందించబడినది (డేరా) | - | విజయము |
| గడ్డి, ఆకులు | - | కాలము |
| జల గర్భితము (Air Conditioned) | - | ప్రాయువము |
| లక్కతో నిర్మించబడినది | - | అనిలము |
| బంగారు శిఖరము కలది | - | కరము |
| వెండి శిఖరము కలది | - | శ్రీవదం |
| రాగి శిఖరము కలది | - | సూర్యమంత్రం |
| ఇనుప శిఖరము కలది | - | చండము |

రంగుల విషయములో, మన వారి నిశిత విభజన పరికించండి:

అరుణము = తేలికపాటి ఎరుపు
పాటలము = తెలుపు ఎరుపు కలిసిన రంగు
కపిశము = నలుపు పసుపు కలిసిన రంగు
ధూమ్రము = నలుపు ఎరువు కలిసిన రంగు
కపిలము = ఎరుపు పసుపు కలిసిన రంగు
కర్బురము = మిశ్రమ రంగులు.

పూర్ణిమ అంటే ఇంగ్లీషులో FULL MOON. దానిని కూడా మనవాళ్ళు మూడు రకాలుగా చెప్పారు.

అనుమతి = ప్రకాశము లేని పూర్ణిమ
రాక = ప్రకాశవంతమైన పూర్ణిమ
సినీవాలీ = చంద్రకళ అగుపడినది
కుహూ = చంద్రకళ కనబడనిది.

యాంత్రిక యుగము వచ్చాక ఆధునిక వ్యవసాయ పద్ధతులు పెరిగి, విదేశీయులకే మనకన్న ఎక్కువ తెలుసు అనుకుంటున్నాం. మనవారు సాగు భూమిని ఎన్ని రకాలుగా వర్గీకరించారో పరిశీలించండి.

వ్రైహేయము = వడ్లు పండించదగిన భూమి.
శాలేయము = రాజనాలు పండించదగిన భూమి
తిల్యము = తిలలు ,, ,,
మాష్యము = మినుములు ,, ,,
మౌద్గీనము = పెసలు ,, ,,

శంబాకృతము = రెండుసార్లు దున్నబడిన భూమి.
బీజాకృతము = విత్తనములు చల్లి, దున్నబడిన భూమి
హాల్యము
కృష్టము } విత్తుటకై దున్నబడిన భూమి
సీత్యము
ద్రౌణికం = రెండు తూములు విత్తదగిన పొలము
ఆఢకి = కుంచెడు ధాన్యము విత్తదగినది
ఖారీకము = పుట్టెడు ధాన్యము విత్తదగినది.

వస్త్రములను నాలుగు రకాలుగా విభజించారు:
వల్కలము = నారతో నేయబడినవి
కార్పాసము = ప్రత్తి మొదలగు వాటితో నేయబడినది
కౌశేయము = పురుగు (పట్టు పురుగు)
రాంకవము = జంతువుల రోమములతో
అప్పట్లో టెరిలిన్, పాలియిస్టర్‌లాంటి సింథటిక్ వస్త్రాలు లేవు!

దూరములను కొలుచుటకు ఈ ఆధునిక యుగములో మిల్లీమీటర్లు, సెంటిమీటర్లు, మీటర్లు వచ్చాయనుకోండి కాని, వాటికి చేతిలో టేపు లేదా స్కేలులాంటివి కావాలి! అలాంటి బాదరబందీ అక్కరలేకనే కొలుచుటకు మనవారి టేపులు చూడండి:

హస్తం = చాచబడిన వ్రేళ్ళనుండి మోచేతి వరకుండు దూరము
ప్రాదేశము = బొటనవ్రేలినుండి చూపుడువ్రేలివరకుండు దూరము (బిత్తెడు)
రత్ని = మోచేతినుండి పిడికిలితో కూడిన దూరము
అరత్ని = మోచేతినుండి చిటికెనవ్రేలివరకు
తాలము = బొటనవ్రేలి నుండి నడిమివ్రేలివరకు
గోకర్ణము = బొటనవ్రేలినుండి ఉంగరపువ్రేలువరకు కొలత.
వితస్తి = బొటనవ్రేలినుండి చిటికెన వ్రేలివరకు

ఇంగ్లీషులోలాగే విభిన్న చతుష్పాత్ సమూహాలకు వేరు వేరు పేర్లు తెలుగులో వున్నాయి.

ఔష్ట్రికము=ఒంటెల గుంపు
మేకల గుంపు=ఆజకం
ఏనుగుల గుంపు = గజత
గొర్రెల గుంపు = ఔరభ్రకం
ఆవుల గుంపు = గోత్రము, ధైనుకము
ఎద్దుల గుంపు=ఔక్షకం

సైనికులు తుపాకుల పేల్చేటప్పుడు నిలబడు పద్ధతికి ప్రత్యేకించి పేర్లు వున్నాయో లేదో తెలియదు. కానీ, విల్లునెక్కు పెట్టేటప్పుడు ఎన్ని విధానాలున్నాయో గమనించండి. విల్లునెక్కు పెట్టునపుడు.

ఎడమకాలు ముందుకు చాచిన—ప్రత్యాలీఢము
కుడికాలు ,, ,, —ఆలీఢము
రెండుకాళ్ళు సరిగనుంచిన—సమపదము
కాళ్ళను ఎడముగా నుంచిన—విశాఖము
కాళ్ళను గుండ్రముగా నుంచిన—మండలము

ఆ కాలంలో కూడా సంగీతవాద్యాలు ఎన్నో రకాలు వుండేవి. వాటిని స్థూలంగా నాలుగు రకాలుగా విభజించారు.

తతములు = తంతులతో కూడిన వాద్యములు: ఫిడేలు, వీణ మొ॥
మురజములు = చర్మముతో తయారైనవి: డోలు, మృదంగము, తబల మొ॥
సుషిరములు=వాయువుతో ఊదబడునవి: వేణువు, మేళము మొ॥
ఘనములు = తాళములు, ఘటము మొ॥

మృదంగములలోని భేదములను కూడ వివరించారు.

ఆంక్యము = కరకకాయ ఆకృతిగలది

ఊర్ధ్వకము = యవమధ్య ఆకృతి కలది

ఆలింగ్యము = గోవు పుచ్ఛ ఆకృతి కలది

ఆవుదూడను ఇంగ్లీషులో 'CALF' కాఫ్ అంటారు. ఆ దూడలను కూడ మనవారు విభజించారు.

తర్ణకము = అప్పుడు పుట్టిన దూడ

తఱపి బష్కయము = ఆరునెలల దూడ

వత్సము = ఏడాది లోపల దూడ

వత్సతరము, దమ్యము = పని మఱగింపదగిన దూడ

ఆర్షభ్యము = ఆబోతు కాదగినది

గోపతి = ఆబోతు

అలాగే బండిని లాగు ఎద్దును శాకటము అంటారు. కాడి మోయు ఎద్దును యుగ్యము అంటారు. తల కాడి మోయు ఎద్దును ప్రాసంగ్యము అంటారు.

ఆవులలో కూడా ఎన్నో రకాలున్నాయి. అన్నిటికీ ఇంగ్లీషులో 'COW' ఒక్కటే శరణ్యం.

ఉపసర్య = చూలి యగుటకు తగిన కాలము కలది

ప్రష్ఠౌహి = పెయ్యగా నున్నపుడే చూలియైనది

పీనోధ్ని, పీవర స్తని = పెద్ద పొదుగుగల ఆవు

దేనుక్య = కుదువ బెట్టబడిన ఆవు

గృష్టి = ఒకసారి యీనిన ఆవు, నిరుడుమాలి యావు అని కూడా అంటారు.

సమాంసమీన=ప్రతియేడు ఈను ఆవు
రకరకాల పశువుల గుంపులను గూర్చి పైన వివరించబడింది అలాగే.

వేణువుల వరుస = వేణుకము
బడిపిల్లల సమూహము = మాణవ్యము
జనుల గుంపు = జనత
గ్రామముల గుంపు = గ్రామ్యత
ఎండు పిడుకల కుప్ప = కారీషము
జోళ్ళ వరుస = కార్మము
ధూమముల వరుస = ధూమ్య
త్రాళ్ళ ప్రోగు = పాశ్య
సహాయకుల గుంపు = సహాయతము.
ఇలా విడి విడిగా పేర్లు వున్నాయి.

న్యాయ స్థానాల్లో తగాదాలు ఎన్ని రకాలుంటాయో మనవారు చేసిన యీ క్రింది విభజనము చూస్తే వారి న్యాయశాస్త్ర పరిజ్ఞానము విశదమౌతుంది. వివాదాలు 18 రకాలట!

1. అప్పు పుచ్చుకొనుట
2. సొమ్ము దాచుట
3. ఒకరి సొమ్మును తాను అమ్ముట
4. ఉమ్మడి బేరము
5. ఇచ్చినదానిని మరలించుట
6. జీతము ఇయ్యకపోవుట
7. ఒప్పుకొని మరలబడుట

8. క్రయ విక్రయములు చేసి తిరగబడుట
9. స్వామి, భృత్య న్యాయము
10. సీమా నిర్ణయము (సరిహద్దు తగాదా)
11. దండవాక్పారుష్యము
12. దొంగతనము
13. బందిపోటు మున్నగు సాహసము
14. స్త్రీ సంగ్రహణము
15. భార్యాభర్త్రృక్రమము
16. దాయభాగము
17. ద్యూతము
18. ప్రాణిద్యూతము

పొగరుబోతు తనాన్ని కూడా మనవారు వర్గీకరించి, వాటికి ప్రత్యేకంగా పేర్లు పెట్టారు.

1. అన్న మదము
2. అర్థ మదము
3. స్త్రీ మదము
4. విద్యా మదము
5. కుల మదము
6. రూప మదము
7. ఉద్యోగ మదము
8. యౌవన మదము

న్యాయ స్థానాల్లో సాక్ష్యాలను చెప్పేవారిని కూడా మనవారు పదకొండు రకాలుగా వర్గీకరించారు:

1. లిఖితుడు (సంతకం చేసినవాడు)
2. స్మారితుడు
3. యదృచ్ఛాభిజ్ఞుడు (విషయమును విని తెలుసుకొన్నవాడు)
4. గూఢుడు (రహస్యముగా పొంచి తెలుసుకున్నవాడు)
5. ఉత్తరుడు

పై అరుదుగురు కృత సాక్షులట. అనగా నిర్ణయించుకొనబడిన వారట.

6. గ్రామస్థులు.
7. ప్రాడ్వివాక లేఖక సభ్యులు.
8. రాజు
9. కార్యాధికారి
10. వాదిచే పంపబడినవాడు.
11. అతని కులమువారు.

సాక్ష్యమిచ్చుటకు అర్హులు కానివారిని కూడా వివరించారు.

"బాలకుండు, వృద్ధు, వగవాడు, చుట్టంబు
బూతు, సూనగాడు, పాతకుండు
బొంకులాడు ముచ్చు - ముండరి, కొంకీడు
కల్లు త్రాగువాడు - కాదు - సాక్షి!"

పై వారేకాక వీరుకూడా సాక్ష్యానికి పనికిరారట:

"అన్నదమ్ములైన, ఆలు మగండైన
కొడుకు తండ్రియైన కూడియుండి
పొత్తు ధనము నందు పూటవాటును నవ్వ
సాక్ష్యమును వహింప జనదు జగతి"

ఆంగ్ల భాషా వాఙ్మయ సంపద నిస్సందేహంగా అట్లాంటిక్ సాగరమే! కానీ, కొన్నికొన్ని విషయాల్లో మనము చేసుకున్నంత సూక్ష్మ విభజన చేసుకో లేదేమో! బ్రదర్-ఇన్-లా, ఫాదర్-ఇన్-లా, సిస్టర్-ఇన్-లా, ఇలా ఇన్ లా లతో లాగించారు. తోడికోడలు, ఆడబిడ్డ, వియ్యంకుడు, షడ్డకుడు - వీటికి ప్రత్యేక పదాలున్నట్లు లేవు. పోతే, పెద్దలను గౌరవించే సంప్రదాయమున్నట్లు కనబడదు! సిస్టర్, బ్రదర్, యూ, పెద్దలకూ చిన్నలకూ ఒకే పదము! 'ఐ' - (నేను) ని కాపిటల్ అక్షరముతో వ్రాసుకుంటారు. మరి అహంకార సూచకమో! ఆంగ్లేయుల అభిజాత్య ప్రదర్శనో?

—: o :—

# 2. మన భాషలో చిత్రపదాలు

ఆ మధ్య ఒక మంత్రిగారి మీటింగ్‌కి వెళ్ళా, ఆ మాత్యులవారు అనర్గళంగా ఉపన్యాసం దంచి పారేస్తున్నారు, అప్పడాల ప్రాముఖ్యత దగ్గఱనుంచీ, ఆటంబాంబు ఆవశ్యకత దాకా; వరకట్న సమస్య నుండి, వాతావరణ కాలుష్య నివారణ గూర్చి. ఇంతకూ అది ఎవరో మంత్రిగారి వర్ధంతి మహాసభ!

వయోజన విద్యనుగూర్చి కాబోలు చెబుతున్నారు. "మన **'సమజము'**లో యింతమంది **'పండితమ్మన్యులు'**న్నారు. వీండ్లు ఒక్కొక్కరు ఒక్కొక్క వయోజనుడికి రోజుకు ఒక్క గంట చొప్పున చదువు చెప్పితే,మన రాష్ట్రంలో- ఆ మాటకొస్తే మన దేశంలో నిరక్షరాస్యత ఏనాడో ఎగిరిపోయి యుండేది" అన్నారు. "చేసి, చూపించు నీ యుపన్యాసమేల?" అని అనుకున్నా.

ఇంతకూ చెప్పొచ్చేదేమంటే **'సమజము' 'పండితమ్మన్యులు'** అని సచివులవారు వాడిన పదాలకు సభను అలంకరించిన పెద్దల్లోగాని, శ్రోతల్లో గానీ 'రియాక్షన్' వుంటుందేమోననుకున్నా, ఆలాంటిదేమీ లేదు పైగా కరతాళ ధ్వనులు మ్రోగాయి కూడా! "సమజము" అంటే పశువుల సంత అని అర్థము. సమాజమునకు 'సమజము'నకు అంత వ్యత్యాసము. అలాగే **'పండితమ్మన్యుడు'** అంటే పండితుడుగాదు, పాండిత్యహీనుడు అని అర్థం!

మా బంధువొకాయనకు వాళ్ళ వూర్లో ఒకసారి ఘనంగా సన్మానము జరిగింది. నేను వాళ్ళ వూరికి వెళ్ళినపుడు నాకు ఆయనగారు అంతకన్న ఘనంగా, ఫ్రేము వేయించిన సన్మాన పత్రము చూపించాడు. అందులో ఫలానా గ్రామవాసులు ఫలానా వారికి సమర్పించుకున్న **'అభిశంసన పత్రము'** అని వుంది ఖర్మ! **'అభిశంసన'** అంటే 'నింద' అని అర్థం!

ఇలా తెలిసీ తెలియని పదములను ప్రయోగించడం ఒక్కొక్కప్పుడు బెడిసికొట్టవచ్చు! పైగా మన అజ్ఞానం శ్రోతలు పసిగడ్తే ప్రమాదం! మన భాషలో యిలాంటి యమా ప్రమాదపదాలు చాలా వున్నాయి. పైకి అది ఏదో గంభీరంగా, గౌరవ వాచకంగా కనిపిస్తుంది. తీరా అర్థం చూస్తే అవి నిందలై కూర్చుంటాయ్. మచ్చుకు కొన్ని మనవి చేస్తా:

"మీరు కృష్ణకర్ములండీ" అనో "ధర్మధ్వజులండీ" అనో అన్నారనుకోండి. అంటే మీరు" ఏదో కృష్ణ తత్త్వ ఉపాసకులనీ ధర్మవర్తనులనీ అంటున్నారనీ మిమ్మలను పొగడుతున్నారనీ అనుకున్నారో...గోవిందా, మీరు పొరబడుతున్నట్లే! కృష్ణ కర్ముడు అంటే దురాచారుడు. ధర్మధ్వజుడు అంటే కూటి కోసం సన్యాసి వేషం వేసిన దొంగ సన్యాసి!

మీరు 'ఋష్యప్రోక్త' సత్కారానికి అర్హులన్నారనుకోండి. అదేదో ఋషీశ్వరులు చెప్పిన విధంగా, వేదోక్తంగా సత్కరించదగినవాడు అని అనుకుంటారు. పప్పులో కాలేశారు. అయ్యో! ఋష్యప్రోక్త అంటే దూలగొండి చెట్టు. మీకు వంటినిండా దూలగొండిని పట్టించాలి సుమా! అని అవహేళన

వీడు మా గురుకుల పాఠశాలలో 'క్రియాకారుడు' అంటే కార్యసాధకుడు అనో, కార్యకారుడు అనో అనుకునేరు క్రియాకారుడు అంటే క్రొత్త శిష్యుడు!

మొన్న ఒక మిత్రుడు ప్రొద్దున్నే మా యింటికి వచ్చి 'మీ నాన్నగారున్నారా' అని అడిగాడు. వాడితో మాట్లాడటం మా నాన్నగారి కిష్టంలేదు వాడితో ప్రొద్దున్నే అబద్ధం చెప్పటం నాకు ఇష్టంలేదు. "ఆ ...వున్నారు. కానీ పెరట్లో పుష్పికవిముక్తికై నిష్ఠీవన కార్యక్రమములో నిమగ్నులై వున్నారు" అన్నా. పాపం, ఆ శాల్తీకి అర్థంగాలా.అదేదో తపోనిష్ఠలోనో,పూజాది కార్యములోనో, పుష్పార్చనలోనో నిమగ్నమై యున్నాడనుకున్నాడల్లేవుంది. మళ్ళీ

వస్తానంటూ చక్కా వెళ్ళిపొయ్యాడు. అయ్యో! నిష్ఠీవనము అంటే వనము కాదు. నిష్ఠ లేదు. ఉమియుట అని! పుష్పిక అంటే పండ్లకు పట్టిన పాచి! పుష్ప సంబంధము సున్న!

"స్వామీ! మీరు శ్రోత్రియులే కాదు క్షేత్రియులు: పురోభాగులు: బ్రాహ్మణ బ్రువులు: బ్రహ్మ బిందువులు. తమ వాక్కులో నాట్యమాడు తుంటాయి. మీరు త్రికాలములయందూ ఆహ్నికములను సల్పుతూ కాల సూత్రమునకు కట్టుబడి వుంటారు. మీరు మా పాలిటి ప్రతియోగులు:" అంటూ మా వూర్లో పురోహితుణ్ణి ప్రక్కింటి పండితుడు వేళాకోళంగా అంటూ దేవాడు. పాపం! ఆ సంస్కృతభూయిష్ట పదజాలం అర్థంగాక ఆ పురోహిత బ్రాహ్మడు ఏదో చిరునవ్వుతో, తల వూపుతూ, తనను పొగడుతున్నాడని భ్రమపడేవాడు. ఆ మాటల కర్థం తెలిస్తే? బాబోయ్ ఇంకేమన్నా వుందా? దవడ వాయించే వాడు. ఇంతకూ వాటికి అర్థాలేమిటో తెలుసా అండి? క్షేత్రియుడు అంటే ఏదో క్షేత్రాలను దర్శించిన వాడనుకునేరు. పరదార రతుడు! పురోభాగి అంటే ఎప్పుడూ తప్పులు పట్టువాడు! బ్రాహ్మణబ్రువుడు అంటే కేవలము జాతిమాత్ర బ్రాహ్మణుడు! బ్రహ్మబిందువులు అంటే వేదము చెప్పినపుడు పడే నోటి తుంపరలు! కాలసూత్రము అంటే అది ఒక నరక విశేషము! ఇక ప్రతియోగి అంటే విరోధి!

"అయ్యో! వారు ఈ గ్రామములో సుప్రసిద్ధులు. ఒకరు దేవానాం ప్రియుడు. మరొకరు వైశికుడు. ఇంకొకరు బందులుడు. ఆ పొయ్యేమనిషి అక్షదేవిగారు అని అంటే, ఆహా! ఈ గ్రామమెంత పుణ్యము చేసుకున్నదో కదా, అని అనుకోవడం కద్దు. 'దేవానాంప్రియుడు' అంటే మూర్ఖుడు! 'వైశికుడు' అంటే బహువేశ్యోపభోగుడు! 'బందులుడు' అంటే అంకుటాలికొడుకు! 'అక్షదేవి' అదేదో దేవత పేరు కాదు- జూదరి అని! ఇదీ కథ.

అర్ఘ్య పాద్యములంటే తెలుసు. మరి ద్విపాద్యము అంటే? ఒకటికి రెండింతలు దండుగ అని!

ఒకసారి మంత్రిగారు "అమెరికా వారు నియుద్ధ ప్రకటన చెయ్యాలి" అన్నారట. నియుద్ధము అంటే యుద్ధము చేయకుండుట అని అనుకున్నట్లున్నారు. నియుద్ధము అంటే 'బాహుయుద్ధము' అని నైఘంటికార్థం!

వధువు అంటే తెలిసిన పదమే. క్షవధువు అంటే దగ్గు, తుమ్ము అని అర్థం! రామబాణం అంటే రాములవారి బాణం అనుకునేరు. అది తాటాకు గ్రంథాలను తొలిచే ఒక పురుగు.

భగవదంశము అంటే భగవంతుని అంశము కానీ అవదంశము అంటే ఊరుగాయ!

అభినివేశము అంటే ప్రవేశం, కుతూహలం అనే అర్థం వాడుతాము. అభిని అంటే నల్లమందు(ట)! ఇలాంటివి ఎన్నో! ఎన్నెన్నో!

తస్మాత్! తెలిసీ తెలియని పదాలజోలికి పోకండి. పారాహుషార్!

—: o :—

# 3. అర్థాలు మార్చుకున్న పదాలు

కొంతకాలము క్రిందట ఒక ప్రముఖ సాహితీవేత్త విమర్శకుడు, ఒక సుప్రసిద్ధ సినీ కవిగారి సంస్మరణ సభలో మాట్లాడుతూ "గౌరవనీయులైన" అనే ప్రయోగము తప్పనీ "మాన్యమహోదయులైన" అని లేదా 'గౌరవ్యులైన' అని ప్రయోగించాలనీ సెలవిచ్చారు. ఆ సభలోనే "సత్యమేవ జయతే" అనే ప్రయోగంకూడా తప్పనీ "విజయతే" అనవచ్చుగానీ "జయతే" అనరాదనీ, అలాగే "ఆధ్వర్యవము" అని వాడాలిగాని "ఆధ్వర్యము" అనడం తప్పనీ విశదీకరించారు. "స్వాగతము" అనే అనాలి. "సుస్వాగతము" అనకూడదట!

కొంతమంది పండితోత్తములకు వ్యాకరణంపై పట్టింపు చాల ఎక్కువ. ఒక మహా పండితుడు, విమర్శకుడు, మహాకవి "మంగళారతులు" అనే ప్రయోగము దుష్టమనీ "మంగళహారతులు" అనేదే కరక్టనీ చెప్పారు. నేను వూరుకోకుండా మరి "మముగన్న తల్లికి మంగళారతులు" అనే ప్రయోగం వుంది గదండీ అని అడిగితే "అందుకే మన తెలుగు తల్లి దౌర్భాగ్యం ఇలా వుంది" అని విసుక్కున్నారు. వాళ్ళ లాక్షణిక దృష్టి అలాంటిది. క్రమశిక్షణ, కట్టుబాటు, సంకల్పబలముకూడా అలాంటివే. అభినందించాల్సిందే. కాలాను గుణంగా మారరు; మారిన వారికి, మారదలచుకున్నవారికి 'లైసెన్సు' ఇవ్వరు!

కానీ, నాకనిపిస్తుంది. ఏదైనా ఒక భాష అది సజీవంగా వుండాలంటే ఆ భాషలోని పద స్వరూపాల్లో, వ్యాకరణ నియమాల్లో, కాలక్రమానుగతంగా కొంత మార్పు తప్పదేమో! తప్పైనా, వాటిని సహించక తప్పదేమో! ఈ వ్యాసము ముఖ్యోద్దేశ్యం అలాంటి మార్పుచెందిన పద ప్రయోగములగూర్చి సంక్షిప్త వివరణ మాత్రమే.

**అవాంతరము** వచ్చి పడిందండీ అంటాము, అనుకోని సంఘటన అనే అర్థంలోనో, చిక్కు అనే అర్థంలోనో అవాంతరము అంటే పూర్వనైఘంటి కార్థము లోపలి భాగము అని మాత్రమే!

ఏ కాలో, చెయ్యో, సరిగాలేని అబ్బాయిని **అవకరాల అబ్బాయి** అనడం వింటూంటాం. అవకరము అంటే పొరకతో చిమ్మి చేర్చిన కసవు కుప్ప అని మాత్రమే!

"ఎందుకంత కంగారు పడతావ్?" 'నీవేం కంగారు పడకు'. అంటాము కంగారు అంటే, పూర్వనైఘంటిక అర్థము 'యుద్ధము' అని మాత్రమే!

అలా సవ్యంగా జరిగిందా? అని అడుగుతాము మరి **'సవ్యము'** అంటే కుడి, యెడమ, ప్రతికూలము అని మాత్రమే పూర్వార్థాలు!

సెలవు అంటే 'హాలీడే'అనే అర్థంలోనే ఎక్కువ ప్రచారములో వుంది. కానీ 'సెలవు' అంటే కేవలము 'ఆజ్ఞ', ఖర్చు అని మాత్రమే.

మొన్న ఒక మిత్రుడు మన ముఖ్యమంత్రిగారు **'సభాజనము'**ను బాగా **ఆకట్టుకుంటారు అన్నాడు.** సభాజనము అంటే పాపం అసలు అర్థం తెలియక! 'సభాజనము' అంటే "చుట్టములను ఆలింగనాదులచే సంతోషపఱచుట" అని! ఆకట్టు అంటే అడ్డగించు అని మాత్రమే అర్థం. ఆకర్షించు అనే అర్థము ఎప్పుడు ఎట్లు దిగుమతి అయిందో?

ఇంతెందుకు **'రేపు'** అంటే ప్రొద్దుట అనే అర్థంకూడా వుందని యీ కాలం కుర్రాళ్ళకు ఎంతమందికి తెలుసు?

పోతే కొన్ని కొన్ని ప్రయోగాలు మరీ ఘోరంగా దిగుమతయ్యాయ్!

ఇంట్లో కుర్రాళ్ళు గోల చేస్తూంటే, లేదా ఎవరైనా 'సుత్తి' కొడుతుంటే "ఎవండ్రా వెధవ 'సొద' అనడం కద్దు. అయ్యా! సొద అంటే నిఘంటువు చూడండి. శవమును కాల్చుటకై పేర్చిన కట్టెల ప్రోవు! జనతాపార్టీ ఆవిర్భవించినపుడు పత్రికలవాళ్ళు దేశమంతా జనతాపార్టీకి బ్రహ్మరథము పట్టారు అని వ్రాశారు, 'బ్రహ్మరథము' అంటే మృతి పొందిన సన్యాసులను తీసికొని పోవు వాహనం అని అర్థము!

'చీర' అంటే వస్త్రము అనే అర్థము కూడా వుంది. కానీ యిప్పుడు ఎవరైనా 'ఒరేయ్! వెళ్ళి త్వరగా చీర కట్టుకొని రారా!' అంటే మన పని ఖాళీ!

హిట్లర్ 'నియంత' స్టాలిన్ నియంత అనీ మన పత్రికల వాళ్ళు వ్రాస్తుంటారు. 'నియంత' కేవలం నడుపువాడు అని మాత్రమే. నిరంకుశ ప్రవర్తకుడు అని లేదు.

టూరిస్టు కేంద్రము అనటానికి పర్యాటక కేంద్రము అని వాడుతుంటాము. పర్యటన అంటే భిక్ష లోనగువాని కొఱకు తిరుగుట అని మాత్రమే. పర్యాటక కేంద్రము అంటే దీని ప్రకారము భిక్షుక కేంద్రము!

వాడు డబ్బు కోసం క్రొత్త క్రొత్త పన్నాగాలు పన్నుతున్నాడు అంటాం. మరి పన్నాగము అంటే 'ప్లాను', వ్యూహము అనే అర్థం లేదు. పల్లకి పైకప్పు!

భోపాల్ బాధితులకు నష్ట పరిహారము యివ్వాలి అని పత్రిక భాష! పరిహారము అంటే 'విడుపు' చేయి అని అర్థం. మఱి యీ కంపెన్సేషన్ అనే అర్థం స్థిరపడిపోయింది!

ప్రణాలికా లక్ష్యాన్ని అధిగమించారు అని పత్రికల్లో చూస్తుంటాము, లక్ష్యం కన్నా ఎక్కువగానే సాధించారు అనే అర్థంలో. "అధిగమించు" అంటే

పొందు, తెలియు, చదువు, అనే అర్థాలు మాత్రమే వున్నాయి దాటు అనే అర్థం ఇవ్వనే లేదు!

గ్రామీణ బాంకు అంటున్నాం. మఱి 'గ్రామీణ' అంటే 'వేశ్య' అని కూడా అర్థం!

ఆమె నింపాదిగా నడుస్తూంది అంటారు. 'నింపాది' అంటే సమృద్ధి అని మాత్రము అర్థం. 'చెరువులో నీరు నింపాదిగా ఉన్నాయి' అని ప్రయోగం.

విడ్డూరం అంటే విచిత్రం అనే అర్థంలో వాడుకవడింది విడ్డూరం అంటే మూర్ఖత్వం!

'రభస' అనే పదాన్ని తీవ్ర రూపము దాల్చిన చర్చ అనే అర్థం లోనో, గలభా, గోల అనే అర్థంలోనో వాడుతుంటాము. మరి, రభస అంటే 'వేగము సంతోషం అని మాత్రమే నిఘంటువులో' వుంది!

ఇలా పూర్వనైఘంటికార్థమును సమూలంగా మార్చుకున్న పదాలు ఎన్నో.

అలాగే, యీ వ్యాసం ప్రారంభంలో, విమర్శకు గురైన (ఆధ్వర్యము, జయతే) పదాల లాగానే తమ రూపాలను స్వల్పంగా మార్చుకొన్న పదాలు కూడా కాల ప్రవాహంలో ఎన్నో దొర్లాయి.

మా రోజుల్లో శిఖా విహీనులకు, నొసట బొట్టు లేని వారికీ, స్వాముల వార్లు తీర్థము కూడా ఇచ్చేవారు కారు. మరి ఇప్పుడు కాల మహిమతో, మారిన విజ్ఞాన యుగంలో, ఎలాగో రాజీవడి 'తీర్థమిస్తూనే వున్నారు. అదిగో', అలాగే, ఈ ముసుగు పదాలు కూడా దొర పదాల్లాగా చలామణీ అయిపోయి, ఛందోబద్ధ కవితల్లో కూడా చిరునవ్వుతో దర్శనమిస్తున్నాయి! తప్పదు మరి. అలా మారిన దానివల్ల సాహిత్యరంగానికి ఏమీ లోటు రాదు. కొంపలు అంటుకోవు కూడా. మచ్చుకు కొన్ని ఉదహరిస్తా :

'పైన పటారం లోన లొటారం' : దీని అసలు స్వరూపం బటారం. 'ప' కాదు.

**'తాళి'** కట్టిన భర్త అంటాం. మంగళసూత్రం అనే అర్థంలో **'తాలి'**యే మొదటి రూపం.

**అడపాదడపా** కాదు. ఎడపదడప!

**బ్రోచేవారెవరురా** : 'బ్రో' కాదు. ప్రో!

చందనము అనే అర్థంలో గంధము అంటాం గందమే సరియైనది. 'ద'కు వత్తు లేదు.

అలాగే అభ్యాసము అనే అర్థంలో సాధన అంటాం. సాదనయే. 'ద'కు వత్తు లేదు. సాధన అంటే సాధించుట అని!

అయ్యా! భోగి పండుగ కాదండోయ్. బోగి పండుగ. ఎందుకో 'వత్తు' దిగింది. కొంత కాలానికి 'విధ్య' విధ్యాలయాలు శుద్ధపదాలై పోతాయేమో!

సరే, పత్రికల వారి పుణ్యమా అని **మేధస్సు, వివక్షత, వధ, వాదన,** ఇడుము చతుష్షష్టి కళలు ఇవన్నీ గ్రాంథిక భాషా పద గౌరవాన్ని క్రమ క్రమంగా సంతరించుకుంటున్నాయి ఏం చేస్తాం. కానీయండి. అసలు పదాలు, మేధ, వివక్ష వధము, వాదము, ఇడుమ, చతుష్షష్టికలలు!

ఇలాంటి మార్పులతో సరిపెట్టుకోవచ్చు. అసలు పదాలే కాలగర్భంలో మరుగున పడిపోయేదానికన్నా మేలే కదా! వాటిని గూర్చి మరో వ్యాసంలో.

# 4. మరుగున పడిపోతున్న మన భాషా పదాలు

"అర్థాలు మార్చుకున్న తెలుగు పదాలు" అనే వ్యాసంలో, క్రొత్త రూపు సంతరించుకున్న కొన్ని తెలుగు పదాలను గూర్చి కొంత వరకు తెలుసుకున్నాము.

వాడుకలోనే అంతరించిపోతున్న మన భాషలోని పదాలను గూర్చి కొంత వివరిస్తా.

యావద్దేశానికి రాజభాషగా ఉండదగిన అన్ని హంగులూ సంతరించుకున్న మన భాష, స్వాతంత్ర్యము వచ్చిన తర్వాత అభివృద్ధి సంగతి దేవుడెరుగు, నానాటికి దిగజారిపోతుందని తెలుసుకొన్నపుడు తెలుగువాని హృదయము బాధపడకపోదు.

ఉదాహరణకి 'రేపు' అంటే కేవలం మరుదినము అనే అర్థం మిగిలింది. 'ప్రొద్దుట' అని కూడ అర్థం వుంది. రేపు మాపు అంటాం. అంటే ప్రొద్దున - సాయంత్రం అని. ప్రొద్దుట అనే అర్థమునకు సాయంకాలము ప్రాప్తించి అస్తమించిపోతూంది!

గొడుగు అంటే అందఱికీ తెలుసు గొడుగు పట్టుకునే కర్రను 'కామ' అంటారని ఈతరం వారికి ఎంత మందికి తెలుసు? అలాగే 'గిడుగు' అనే పదం కూడా వుంది. అది ఇంటి పేరుగల వారు కూడా వున్నారు. దాని అర్థం

చాలమందికి తెలియకపోవచ్చు. గిడుగు అంటే కర్రలేని గొడుగు. బహుశా ఆ కాలంలో వుండేవి.

నీళ్ళను మరగించటానికి తెర్లించుట అంటారు. మఱి 'తొర్లించు' అంటే కాచిన నీటిని చల్లార్చటం!

అప్పళం అంటే అందరికీ తెలుసు. దప్పళం అంటే పులుసు అని చాలా మంది మఱచిపొయ్యారు. "పంగనామము" అంటే తెలుసుగాని, "బుంగ నామము" అనే మాట విన్నారా? తెల్లనామమునకు ఎర్రనామమునకు మధ్య ఎడమ లేకుండా వుంటే బుంగనామము అంటారు.

పల్లెవాసులలోనే తెలుగు భాష నిలిచియుంది. నగర వాసుల నాగరికతా మాహాత్మ్యముతో, మంచి మంచి పదాలు మరుగునపడిపోతూ వున్నాయి. ఈ క్రింది పదములు గమనించండి:

కన్నాకు=తమలపాకుల కట్టపైనుండే ఆకు.

కన్నెబావి=నీళ్ళులేని బావి.

నడబావి=నడచిపోవుటకు మెట్లుగల బావి.

ఉట్టుకట్టు=పాలు పిండునపుడు ఆవు కాళ్ళను కట్టుట.

తలకోల=సాధువుకాని ఆవును పిదుకునపుడు కొనను తాడు గట్టి దాని కొమ్ములకు తగిలించి పట్టుకొనెడి కోల.

ఓదె=కోతకోసి చేనిలో అక్కడక్కడ వుంచెడు వెన్నుపోచల ప్రోగు.

అడిగండ్లు=అంటే ధాన్యమును మలచగా అడుగున నిల్చిన రాళ్ళు.

చిట్టంటులు=శృంగారంలో చేసే దంతక్షత, నఖక్షతాది క్రియ.

తోకచిచ్చు=నిప్పు రగిల్చిన పిడుకల వరుస.

పాటిరేవు=దిగి నడచి దాటిపోదగిన రేవు.

తలపొలము = ఊరి పొలిమేరలను ఆనుకొనివున్న పొలము.

ఇలువరము = గోడలులేని ఎత్తు గుడిసె

ఈదుముంత=పాలు పిదుకుపాత్ర

**మూన**=వస్త్రగాలితము చేయగా మిగిలినది.

**కోదు**=ధాన్యమును చేటలో పోసికొని ప్రక్కవాలుగా అటునిటు త్రిప్పడం!

ఈ యువతరానికి కట్నం అంటే బాగా తెలుసు! వట్నం, కొట్నం అనే పేర్లు వినియుండక పోవచ్చు.

**వట్నం**=ధాన్యము నించిన గోనె. ఆ గోనెను మోసికొనుపోయెడు కఱ్ఱ వట్నాల కఱ్ఱ.

**కొట్నం** = వడ్ల దంపకము.

**కలుజు** = చెరువులో నుంచి నీళ్ళుపోవుటకు రాతితో కట్టిన మార్గము. రాతి తూము.

**సత్యకారము** = క్రయవిక్రయముల విషయమై మాట గట్టిచేసుకొనుట. ఇదే సంత కరువు, సంచ కరువుగా మారింది.

**రెడ్డిగము** = ఈ పదము నా మటుకు నేను వినలేదు సుమండీ! ఈ మధ్యనే మా బామ్మ నోటి నుంచి విన్నా. రచ్చబండలవద్దనో, వరండాల్లోనో కొంతమంది మోకాళ్ళనిడ్చి అంగవస్త్రముతో బిగించి ఆ 'పోజు'ను 'రెడ్డిగము' అంటారుట. ముడుచుకొన్న ఒక కాలితొడ మీద మోకాలి మీదుగా ముడుచుకున్న మరియొక కాలిపాదము మోపి ఆ కాలిని అంగ వస్త్రముతో యీడ్చి కట్టుకొని కూర్చోవడం.

**ఉంకుటుంగరము**=వధూవరులు వివాహము చేసుకొనుటకు పరస్పరము సమ్మతించి, మార్చుకొనెడి ఉంగరము.

**అంపుదోడు** = ప్రయాణమైపోవువారికి తోడుగా పంపబడువాడు.

**అడితి** = ఒక వర్తకుడు మరియొకడు పంపే సరుకు అమ్మి, మరల వానివద్ద, నూటికి ఇంత అని పుచ్చుకొను తరుగు (కమిషను) .

**ఆకత్రాళ్ళు** = కవ్వమును తగిలించుటకై ఉరికంబమునందు కట్టెడు త్రాళ్ళు.

గుత్తికవ్వం = వెదురుకొయ్య చివరను చీల్చి దారముతో గట్టి పేర్చబడిన కవ్వము.

ఆలెపొయ్యి = గాడిపొయ్యి.

తూపి = మూల విగ్రహముండెడి చోటికి మీద, విమానమువలె ఎత్తుగా కట్టిన కట్టడము.

తూగు పలక = తాపీవాడు గోడల మట్టము సరిచూచుటకై వ్రేలాడగట్టిన నిడుపాటి పలక.

పట్టుబడి = ఏదేని ఒక పద్దుక్రింద వ్యయమైన ధనము.

పస్తాయించు = పశ్చాత్తాపబడుట.

వారయాత్రికుడు = పెండ్లికి వచ్చిన చుట్టము (బహుశా ఆ కాలములో పెండ్లి అయిదు రోజులు జరుగుచుండెడి. అందుచేత పెండ్లికి ముందు రోజు వచ్చి, పెండ్లిముగిసిన మరునాడు వెళ్ళెడివారు)

మండకంచము = అంచు కట్టించిన కంచము.

మడిసందులు = చంకలు.

నిక్కలం = ఫలించిన కల

తలపు సాకిరి = ఈ కార్యము నీ వెఱిగి యుండుమని, పలుమారు వాదిచే తెలిపింపబడిన సాక్షి.

గుట్టుసాకిరి = వాదిచే యేర్పాటు చేయబడి వచ్చి, రహస్యముగా దాగియుండి ప్రతివాది మాటలన్నియు విన్నసాక్షి.

గచ్చులాడి = బయటకు యోగ్యురాలివలె నటించునట్టి ఆడుది. ముచ్చులాడి.

కొలి = చిన్న పిల్లలు చిల్లకర్ర ఆడుకొనుటకు త్రవ్వే చిన్న గుంత. దీనిలోంచే 'కొలిమి' వచ్చిందేమో!

దబ్బ చిప్పలు = తాటిచెట్టును బ్రద్దలు చేయు సాధనము.

తప్పుదెబ్బలు = బడులలో ఉపాధ్యాయులు ఆలస్యముగా వచ్చినందుకు, పిల్లలను వరుసక్రమముగా కొట్టెడు దెబ్బలు.

కట్టుబండి = అన్ని సౌకర్యములు సమకూర్చబడిన బండి. (ఇప్పుడు మనము చూస్తున్న ప్రచార రథములు!)

ఏగుపెండ్లి = పెండ్లిలో యేర్పాటు చేయు ఊరేగింపు; మెరమణి.

వెలిమాడు = విదేశములకు పంపబడు ధాన్యము.

లోమాడు = విదేశముల నుండి దిగుమతి చేసుకున్న ధాన్యము.

వారకము = లేనికాలమందు, వడ్డీలేకుండ, కలిగిన కాలమందు, మరల పుచ్చుకొనెడు ధనాదికము.

నాగు = ధాన్యమును అప్పుగా తీసికొని అదనముగా ఇచ్చు ధాన్య రూపము వడ్డీ.

కవలుకొను = వేదము మున్నగు వాటిని పఠించునపుడు కొంత సామ్యముచే ఒకటి విడువబడి, మఱియొక్కటి వచ్చి కలియుట.

వట్టము = చిల్లర మార్చునపుడు పెట్టు నష్టము.

వల్లిగము = బొక్కెన మీది ఇనుప వలయము.

చునాయించుట = బట్టలు మడత పెట్టుట.

గుడికట్టు = గ్రామమునకు నలుదిక్కుల ఎల్లల ఏర్పాటు.

అట్టెడ = పూడిక ఎత్తుటకు ఊతబద్దలు లోనగువానితో అల్లిన తట్ట

నలుగ = (1) ధాన్యమును కొలుచుటకై నిర్ణీత సంఖ్య ముగిసిన తోడనే గుర్తుకై దోసిలితో ఎత్తిపోసెడు ధాన్యపు కుప్ప.

(2) కొలుచువానికి పుట్టికి ఇంత అని ఇచ్చెడు ధాన్యము.

(3) రూపాయలు మొ॥ కొలుచునపుడు నిర్ణీత సంఖ్య ముగియుతోడనే గుర్తుకై దోసిలితో ఎత్తియుంచెడు రూపాయ లోనగునవి.

వెనుకమ్రాను = ఏతము బానకు నీళ్ళెత్తువాడు కూర్చుండుటకై నిలువు కాళ్ళమీద అడ్డముగా నుంచిన మ్రాను.

కూటి ముత్యాలు = నకిలీ ముత్యాలు.

ఒంటింపు = వీడు, వీడు యీ యీ పనులకు చెయ్యవలెను అనెడి యేర్పాటు.

మరి ఇలాంటి పదాలు మరెన్నో వున్నాయి. వీటిని మన భాష క్షీణించిపోకుండా ముందు తరాలవారికి అందించవలసిన బాధ్యత మనందరిమీదా వుంది.

—: ౦ :—

# 5. పొంతనలేని తికమక పదాలు

ఇంగ్లీషులో వేరు వేరు అర్థాలు గల రెండు పదాల కలయికతో ఏక పదంగా మారుతుంటాయి. వాటి అర్థం మాత్రం కలిసిన ఆ రెండు పదాల అర్థాలకు పొంతన ఉండదు. మాట వరసకు JOURNEY అంటే ప్రయాణం. Man అంటే మనిషి. మరి Journeyman అంటే ప్రయాణీకుడు కాదు! 'అర్హతలున్న పనివాడు' అని. అలాగే KID, NAP, (కిడ్ అంటే పనివాడు NAP అంటే కునుకు నిద్ర) Kidnap అంటే ఎత్తుకొనిపోవుట. After అంటే తర్వాత All అంటే అందరు. మరి Afterall అంటే నిచార్థం! అలాగే Understand కూడా. హండ్రడ్ వెయిట్ అంటే 112 పౌనులు. నూటికి సంబంధం లేదు! Honey cart అంటే తేనెకు ఏ మాత్రం సంబంధం లేకపోగా అది మలమును తీసికొనిపోవు ట్రక్కు. అలాగే Canadian River అనేది U S.A. లో వుంది. కెనడాలో లేనేలేదు!

కొన్ని పేర్లు ఎలావచ్చాయో తెలియవు హైద్రాబాద్‌లో చిలకలగూడా ప్రాంతంలో చిలకలు లేనట్లు, దోమలగూడాలో దోమలు ఉంటాయని గ్యారంటీ లేనట్లు, సికింద్రాబాద్‌లో 'ఆవులమంద'కూ ఆవులకూ సంబంధం లేనట్లు, మద్రాసులో థౌజండ్ లైట్స్ ఏరియాలో వేయి దీపాలు కానరానట్లు, ఎక్కడా పొంతనుండదు. నేతి బీరకాయ, పెరుగు తోటకూర బాపతు. బెల్లంతో చేసి, చక్కెర పొంగలి అంటున్నట్లు! మన ఇంట్లో చేసుకున్నా మైసూరు బజ్జీ అయినట్లు! పోతే మన ప్రజాస్వామ్యము కూడా అంతేగదా!

బంగారు తీగల బియ్యంలో ఎంత బంగారం వుంటుందో, సెవంటీన్ "జ్యూవెల్స్" వాచీలో అన్ని నగలున్నాయి!

ఇలాంటి వింతయైన పొంతనలేని తెలుగు పదాలను గూర్చి కొంత వివరిస్తా.

**ఏనుగు కొమ్ములు :**
**గటిక నూదులు :** } ఇవన్నీ ఏవో ధాన్య విశేషములట
**గంగాజలములు :**

**కోతి పుల్లలు :** కోతికి సంబంధం లేదు. సాలెమగ్గపు పలకదారములను మీదికి తగిలెత్తేడు పుల్లలట!

**ఏనుగడుగులు :** చిత్రవర్ణ విశేషములు!

**గోస్తనము :** మీరనుకునే ఆవు పొదుగు కాదు. నలుబది పూసల సరమట!

**చీరచింపు :** చినిగిన చీర కాదండోయ్. ఒక మత్స్య విశేషమట!

**బట్టమేక** అంటే అది ఒక పక్షి యని నాకు చాలాకాలం వరకు తెలియదు సుమండీ!

ఒక్క అనేది సంఖ్యకు సంబంధించినది.
ప్రొద్దు అంటే సమయమును తెలుపు పదము.
మరి 'ఒక్కప్రొద్దు' అంటే ఉపవాసము!
ఈ అర్థం ఎలా దిగుమతి అయిందో మరి!

# 6. ఆంగ్ల వాసనతో కూడిన ఆంధ్ర పదాలు

ద్రావిడ భాషలైన తెలుగు, తమిళము, కన్నడ భాషలకు అక్కడక్కడ పోలికలు కనబడతాయి. సంస్కృతం, లాటిన్ పదాలకూ చాలా చోట్ల పొంతన కనబడుతుంది. మాతృ - మదర్, పితృ - పీటర్, ఫాదర్, గ్రాసము - గ్రాస్, వాసము - హౌస్, గోళము - గ్లోబ్, దంత - డెంటల్, తరు - ట్రీ - ఇలా ఎన్నో.

తెలుగు పదాలకు కూడా ఇంగ్లీషు పదాలతో సాపత్యం కద్దు. మౌత్ - మూతి, పెయిన్ - నొప్పి, ఓత్ - ఒట్టు, బాయ్ - అబ్బాయి, కోస్ట్ - కోస్తా, లాడ్ - పిల్లాడు. వ్రాయు అంటే WRITE. కానీ పలికేటప్పుడు మాత్రము 'వ' కారం వాళ్ళు వదిలేసి రైట్ అంటారు. మనము 'రాయు' అంటాం! అలాగే మరికొన్ని పదాలను గమనిద్దాం.

**అలవెన్స్ : Allowance** - అంటే భృత్యము. డియర్‌నెస్ అలవెన్సు, ట్రావెలింగ్ అలవెన్సు - ఈ అలవెన్సు శబ్దం 'లవణ' శబ్దంలోంచి వచ్చి యుండొచ్చని నా అభిప్రాయం.

నౌకర్లు, సేద్యగాండ్లు ఇప్పటికీ అంటూ ఉంటారు "మీ యింట్లో ఉప్పు తిని బ్రదుకుతున్నాం. మీరేం చెపితే అది చేస్తాం" అని.

'వాళ్ల ఉప్పు తిని, వాళ్లకే ద్రోహం చేస్తావుట్రా' అంటాం.

ఉప్పు అంటే సంస్కృతంలో 'లవణం' 'లావణం' అంటే సంస్కృతంలో కొత్తగా వచ్చిన వానిని పట్టికలో (అనగా ఎస్టాబ్లిష్‌మెంట్ లిస్టు!)

వ్రాసుకొనుట అని అర్థం. అసలు జీతము అంటే ఇంగ్లీషులో SALARY సాలరీ ఇది కూడా SALT లో నుంచి వచ్చిందే పూర్వకాలంలో జీతము ఉప్పు, చింతపండు బియ్యం వగైరాలు వస్తురూపంలో ఇస్తూండేవారు కరువు భత్యం బదులు ఈ పద్ధతే బాగుంటుందేమో!

రేకంటు = అంటే సూర్యుడు అని అర్థం. 'రే' RAY అంటే ఇంగ్లీషులో కిరణము అని అర్థం విద్యుత్‌ను మనము Current కరెంటు అంటాం ఈ 'కరెంటు'కు 'రేకంటు'కు సంబంధం లేదంటారా- అరవంలో ఉరల్ తెలుగులో 'రోలు' అయినట్లు!

కెలవు = అంటే అనురాగము, ప్రేమ. ఇంగ్లీషులో లవ్ అంటే ప్రేమ.

గుర్విణి = అంటే గర్భవతి. గర్భవతిని మెడికోలు గ్రవిడా అంటారు.

ప్రేమికుడు
లేదా
ప్రియురాలు } ఇంగ్లీషులో PARAMOUR

మరుడు అంటే మన్మథుడు. PARA అంటే అసాధారణమైన, కృత్రిమమైన. అనుబంధమైయున్న అనే అర్థాలున్నాయి- పేరా సైకాలజీ, పేరా టైఫాయిడ్ లాగా. మరి ప్రేమికుడు అభినవ మన్మథుడే గదా!

కేడ = అంటే దూర్తుడు ఇంగ్లీషులో కెడి. అంటే దొంగ! ఎలా వచ్చిందో?

కేరడము = అంటే తిరస్కారము. ఇంగ్లీషులో I care a dam అని తిరస్కార సూచకంగా అనడం వింటూంటాం.

తక్షక = అనేది ఒక విష సర్పము. రక్తములో విష పదార్థములు ఏర్పడడాన్ని TAXAEMIA టాక్సేమియా అంటారు.

అంగారము = అంటే నిప్పు. ఆకలిని అగ్నితో పోలుస్తాము. క్షుదాగ్ని అగ్నిమాంద్యము అలా, ఈ అంగారానికి ఇంగ్లీషులో Hunger!

లుక్కు = అంటే లోపము. ఇంగ్లీషులో LACUNA!

స్యూతము : కుట్టబడినది. ఇంగ్లీషులో SUTURE.

ఓవరి అంటే లోపలి గది అని అర్థం. ఇంగ్లీషులో OVARY అంటే గర్భకోశం. అది గర్భము లోపలి గదియే కదా!

నరకము : ఇంగ్లీషులో NECRO అంటే శవము.

వర్షము : ఇంగ్లీషులో SHOWERS షవర్స్‌కు లింకు.

దక్ష : ఇంగ్లీషులో DUX అంటే నాయకుడు.

మిడియ : అంటే వేద వాక్యం. వేదాలను శ్రుతులు అంటాం. మానవ సృష్టి ప్రారంభంలో వేదాలు మానవులకు దేవతలకూ మీడియాగా నిలిచి యున్నాయేమో!

కట్టడి : దీనికి 'Custody'కి లింక్ లేదా?

కుట్ర : ఇదే ఇంగ్లీషులో 'ట్రిక్కు' అయ్యుండొచ్చు!

ఇలా ఎన్నో. ఎన్నెన్నో.

# 7. విరుద్ధార్థ పదాలు

ప్రతి భాషలో, కొన్ని కొన్ని పరస్పర విరుద్ధమైన అర్థాలు గల పదాలుండొచ్చు. ఇతర భాషల సంగతి మనకొద్దు. తెలుగు భాషలో మాత్రం అలాంటి చిత్రమైన అర్థాలు గల పదాలను, మచ్చుకు కొన్నింటిని ముచ్చటించుకొందాం.

**అరిష్టము** = కీడు (మామూలు అర్థము). అదృష్టము, మజ్జిగ అని కూడా వుంది.

**అభిమానము** = ప్రేమ; చంపుట; అజ్ఞానము.
**ఆహారము** = భోజన పదార్థము, దొంగతనం.
**భార్గవి** = లక్ష్మీదేవి; గఱిక.
**మందారము** = మందారము; జిల్లేడు.
**బడబ** = బ్రాహ్మణస్త్రీ; దార్పుడుకత్తె.
**ద్విజ** = బ్రాహ్మణుడు; పక్షి; దంతము.
**శిశ్విదానుడు** = సదాచారుడు, దురాచారుడు.
**ఇబ్బంది** = అసౌకర్యము; అడవి పందికిని ఊరపందికిని పుట్టిన పంది.
**కల్యము** = ముండ్ల పంది; ఎముకల గూడు.
**ఆశీస్సు** = మేలుకోరుట; పాముకోర.
**ఆట** = ఆట; నింద.
**నరేంద్రుడు** = రాజు; పాములవాడు.
**శుచి** = శుభ్రత; శృంగార రసము.
**గృహిణి** = ఇల్లాలు; కందిరీగ.

వ్యంజనము = భోజన పదార్థము; మర్మావయవము.
సంకోచము = బిడియము; కుంకుమ పువ్వు.
పాళి = కలము పాళి; మీసాలు కల స్త్రీ.
ప్రాయము = యౌవనము; మరణించువరకు ఆహారము లేకుండుట.
శివ = గౌరి; నక్క.
శ్రద్ధాళువు = శ్రద్ధకలిగిన వ్యక్తి; వేవిళ్ళుగల ఆడుది.
భాగ్యము = సంపద; పాపము.
వితండము = మొండియైన; తాళము.
వివరము = వివరము; రంధ్రము.
గ్రామీణ = గ్రామ సంబంధము; వేశ్య.
కళ = చంద్రునిలో పదునారవ భాగము; మూర్ఛ.
వర్షము = వాన; పేడితనము; (సంవత్సరము కూడ)
అసలు = అసలు; బురద.
సవ్యము = కుడి; ఎడమ ప్రతికూలము.
పరిసరము = చుట్టు ప్రక్కల; చావు.
నిహ్నవము = నమ్మిక; అపనమ్మిక.
సందర్భము = సన్నివేశము; పువ్వులను గ్రుచ్చుట.
ఇలాంటివే ఎన్నో!

—: o :—

# కొస మెరుపులు

1. మంత్రయుగంలో 'మనుస్మృతి' ఉండేది. యంత్ర యుగంలో 'మనీ' స్మృతి మొండైంది!
2. ప్రబంధ కవిత్వాలూ, మహా కావ్యాలు నాడు పబ్లిషర్ బంధ కవిత్వాలు, మహావ్యయాలూ నేడు.
3. గత కాలంలో తాళపత్ర గ్రంథాలు అందరి నోళ్ళలో; మన కాలంలో మహామహా గ్రంథాలే అలమారా గూళ్ళలో!
4. నాటి కవితలకు 'మీటరు' ముఖ్యం; నేటి కవితలకు 'మేటరు' ముఖ్యం.
5. ఆ నాటి గ్రంథాలు రాజుల నాశ్రయిస్తే నేటి గ్రంథాలు ఎన్నో తరాజుల నాశ్రయిస్తున్నాయి!
6. అర్థబలముంటే గ్రంథ ముద్రణ ఎంత పని కానీ, అర్థబలము ఉంటేనే లోకానికి పనికి వస్తాయి. లేకుంటే తూ-కానికే!
7. కవి 'తల'కే అర్థమయ్యే కవితలు
   పఠితలకు కడువెతలు!
8. కవి తల వ్రాతను బట్టే 'కవితల' వ్రాత రాణించేది.
9. తమ కవితలే ఉత్తమ కవితలనుకుంటే ఎట్లా?
10. విమర్శించేవారు క్రిటిక్కులు
    కిరీటము పెట్టేవారు 'కిరీటి'క్కులు
11. రచయితలు రెండు రకాలు. గ్రంథకర్తలు గ్రంథహర్తలు!
12. గ్రహింపబడేది కవిత్వం
    సంగ్రహింపబడేది అసలు సిసలు కవిత్వం
13. వర్తమాన రచయితలకు, కళాకారులకు 'గిఫ్టు' ఒక్కటి చాలదు; 'లిఫ్టు' ఉంటేనే వర్ధమాన రచయితలవుతారు.

14. కాలుబట్టి కింది కీడ్చే అక్షరం 'ష' తెలుగువారు సలక్షణులేకాదు 'ష' లక్షణులు. కాదంటే ప్రక్కవాడి కాలు!

(a) అనర్హులను సన్మానించకపోతే సమాజం నిదురావస్థలో
అనర్హులను సన్మానించితే దురావస్థలో ఉన్నట్లు?

15. వెల్లు (Wealth) వుంటే మాత్రం వెలితి వుండకూడదా?

16. తనఖా (జీతం) తనకాధారం!

17. అప్పిటైట్ (Appetite) ఎక్కువైతే
అప్పు టైట్ కావచ్చు!

18. సుఖం మరిగితే సుఖం కూడా మరిగి మరిగి చివరకు ఆవిరిగావచ్చు.

19. 'గీత' వక్రిస్తే జీతంతోనే సంసారం జరుగుతుంది
గీత బాగుంటే 'గీతం' తోనే తిరుగుతుంది

20. ఒకరికి పై ఆదాయం మెండు
మరొకరికి 'పై' కూడ ఆదాయం లేకుండు

21. కార్యాలయాల్లో సీట్లు రెండు రకాలు
శివాలయాలు విష్ణ్వాలయాలు!
ఒక వర్గం వారు ఉద్యోగస్థులు
మరోవర్గం వారు ఉద్యోగాస్తులు!

22. అదికారులు అంటే ప్రభుత్వ కారులను అధికముగా కోరువారు.

23. కార్యాలయాధికారులంటే
కార్యంలో లయమయ్యే అధికారులా?
కార్లను నిలయాల్లో వాడుకొనేవారు!

24. జాస్తి రూకలు జేరితే
జాగరూకత అత్యవసరం!

25. ప్రజలకు తనపై విశ్వాసం కల్గించువాడు నాయకుడు.
తమపై విశ్వాసం కల్గించేవాడు నిజమైన నాయకుడు.

26. పెద్ద పెద్ద రచయితలకు పెన్నులోనే పెన్నిధి!

27. ఆరోగ్యానికి 'యా' వత్తు బీజాక్షరం!
యా వత్తు మితిమీరితే అది క్షరం!
28. సీరియల్ నవలలు
పతితల తలలకు వలలు!
29. ఈ దేశం నాది అనుకొని పని చెయ్యమన్నారు -గాంధీ.
'నేతలు దేశమంతా మాదే' అని పల్కారు -నాంది.
30. ప్రసంగించేటప్పుడు, పర్సు తీసేటప్పుడు
ప్రజ్ఞ లేకుంటే ప్రమాదం.
31. శతఘ్నులకన్నా కృతఘ్నులే ప్రమాదం.
32. నిగ్రహం వుంటే శనిగ్రహం ఏం చేస్తుంది?
33. స్వప్నావస్థలో పసందైన విందు
జాగ్రదావస్థలో అజీర్తికి మందు!
34. తానొకటి తలిస్తే సైతాను మరొకటి తలుస్తాడు.
35. "పెద్ద గండం తప్పింది, అంతా ఒక పీడకల అనుకోండి అంటే
అవును పిడకల అవసరం తప్పింది" అన్నాట్ట.
36. కృతజ్ఞతను ఆశించువాడు అజ్ఞుడు
చూపనివాడు అధముడు.
37. నయాగరాలాంటి కోపం కూడా
నయగారాలతో తగ్గించవచ్చు!
38. కోవెలకును వేంచేసే
ప్రతి వ్యక్తీ భక్తుండా
గారేజిలో వుంచేస్తే
ప్రతి వస్తువు వాహనమా?
39. నిజమైన ప్రగతి, కోరికలను సాధించడం కాదు-
కోరికలను జయించడం!

40. కోడి అండము నేటికి మాత్రమే తిండి.
నాలుగు రోజులు ఓపిక పట్టితే ఆంద!

41. శరీరానికి కావలసింది భాషను కాదు- పోషణ!

42. పరిశ్రమలు అంటే పరశ్రమలపై ఆధారపదేవి.

43. భాష ఎంత ప్రయోజనకారి!
మన తెలివితేటలను విప్పి చెప్పవచ్చు
కప్పిపుచ్చవచ్చు కొండొకచో
అవి లేకుండానే వక్తగా చలామణి కావచ్చు!

44. పాలకులు 'తమ' శాసనాలతో
అదుపులో పెడతారు మనిషిని
ప్రవక్తలు మత శాసనాలతో
అదుపులో పెట్టారు మనసును!

45. వ్యసనాలుంటే వసన వాసాలుండవు

46. ఏ కాంతత కు భయపదేవారు
ఏ కాంతనూ పెండ్లాడకూడదు!

47. నిద్రలో నీవు కన్న ఆ తీపి కలలు
నిజం కావాలంటే ముందు ఆ నిద్రమత్తు వదలు!

48. వివాహమునకు కారణం ఘటన
విడాకులకు కారణం ప్రతిఘటన.

49. నాకు లోకంతో ఏం పని అనుకోవడం వంచన
లోకానికి నేను కావాలి అనుకోవడం ఆత్మవంచన.

50. 'విలన్' అంటే ఎదుటివాడిని విలవిల ఆడించువాడు.

51. ప్రతి'నిధి'ని మ్రింగువాడు ప్రతినిధి

52. ఫిజీషియన్ అంటే ఫీజును ఆశించువాడు

53. అవ్సరస అంటే అప్పును సరసనే మిగిల్చేది

54. మేనక మేనక అని కొంగుబట్టుకొని తిరిగితే మేనా తావాలి అని నిక్కిందట.

55 వర్జీనియాలో వాళ్ళంతా Virgin లా? రోమన్స్ కే రొమాన్స్ తెలుసా?

56. పెన్సిల్వేనియాలో పెన్సిల్ ఫాక్టరీ లెక్కువా?

57. 'డి''స్ట్రిక్టు' అధికారి స్ట్రిక్టుగా వుండకూడదు?

58. కొందరు కవులు ఓపియం సేవించితేగానీ ఓ 'హాయం' రాయలేరట!

59. మత్, మత్ (వద్దు, వద్దు) అని మనస్సును హెచ్చరించేది మతము!

60. 'తమ'స్సు (చీకటి)ను తల్కిందు చేసి వెలుగునిచ్చేది మతము!

61. చరిత్రకారులంతా 'భూత'ప్రియులు!

62. 'జాయ్'ని కల్గించేది 'జాయ' (భార్య)!

63. 'రం' తాగితే కనబడేది రంభ!

64. భ్రాంతి కలిగించేది బ్రాంది!

65. 'కొటేషన్' ఎక్కడనుంచో కొట్టేయబడినది!

66. 'గాడ్' అంటే ప్రపంచానికి 'గార్డ్'!

67. 'ప్రయివశీ' Privacy అంటే

68. ప్రియవశత్వమునకు, పరవశత్వమునకు దోహదకారి!

69. ఆల్కహాల్ అంటే ఆలుతో కలహాల్ కల్గించేది.

70. రియల్ జనులను మలచేదే రెలిజియన్. రెలిజియను లేకుంటే రెబెలియన్!

నమ్మకద్రోహి అంటే నమ్మకంగా ద్రోహం చేసేవాడు.

సైతస్కోపు అంటే బ్రదికే స్థితికి స్కోపు ఉందా అని పరీక్షించేది!

గేస్తు అంటే గెస్టులను ఆదరించువాడు.

71. చెప్పితే రావచ్చు చదువు చెప్పకున్నా వచ్చేదే సంస్కారం!

72. కొందరు చదువుకున్నప్పటికీ సంస్కారపరులుగా వుంటారు!?

73. దేవునికి కావలసింది హారతి పూజలా? 'హార్టీ' Hearty పూజలు!

74. 'సేవ్' చేసుకొనుటకు పనికొచ్చేది సేవ ఎట్లవుతుంది?

75. నాస్తికులయినంత మాత్రాన నైష్ఠికులు కాకూడదా?

76. ఎక్కువైతే విదేశాల్లో చదువు; 'కిక్కు" కోసం కావాలి మధువు!

77. వాయిదాల పద్ధతిలో కొనకు; ఫాయిదా పెద్దగా ఉందనుకొనకు
వాయిదాలు తీరగానే వస్తువుపోదు అమ్ముడూ; అందుకని నా మాట
విను తమ్ముడూ!

78. బందిపోట్ల బెడద నిత్యం ఎక్కుతున్నా బంగారంధర మాత్రం
నిచ్చెనెక్కుతూందే?

79. ఒకప్పుడు వర్ణవ్యవస్థ సువర్ణవ్యవస్థ; అదిప్పుడు భ్రష్టుపట్టి వ్రణ
వ్యవస్థగా మారింది!

80. 'సారా' స్వతహాగా చేస్తే నేరం; సారస్వతంలో వ్యాపారం—ఘోరం.

81. ఎదుటి వాడు నిన్ను చూచి అసూయపడితే అది వాడి తప్పు.
వాడిని చూచి, నీవు గర్విస్తే - అది నీ మూర్ఖత్వం!

82. మోపెడ్‌లలో కొన్ని ఖారీ 'పేర్లు'
(Pairs) కూర్చుంటే రిపేర్లు మోపెడు!

83. నీ నవ్వు వాలకం నీ ఎదలోని పలకం!

84. కొందరు పుత్రులు సకాలంలో వార్ధక్య పోషకులు.
మరి కొందరు అకాలంలో వార్ధక్య కారకులు!

85. ప్రతి పిచ్చాసుపత్రి ఒక కొళ్చన్ మార్క్
కారాగారం ఆశ్చర్యార్థకం!

86. తరుణి మనస్తత్త్వము తరతరాల కొళ్చన్ మార్క్!

87. వస్తువు వెల తెలిసేది కొన్నప్పుడు
కాని దాని విలువ తెలిసేది పోగొట్టుకొన్నపుడు!

88. యువకులు కొందరు గత చరిత్రను వరిస్తారు.
వృద్ధులు కొందరు తమ గత చరిత్రను కలవరిస్తారు.

89. తలిదండ్రులు తమ పిల్లలకు చిన్నప్పుడు నేర్పిస్తారు పాఠాలు!
పెద్దయ్యాక పిల్లలు నేర్పిస్తారు గుణ పాఠాలు!

90. జబ్బు పుష్టిగా వుంటే జబ్బ పుష్టి ఎట్లనిపిస్తుందది!

91. జీవితంలో కొందరి ఆశయం జీర్ణాశయం నింపుకుంటే చాలని!

92 సంస్కృత భాషకు లింగ సమస్య
ఇంగ్లీషు బాషకు స్పెల్లింగు సమస్య!

93. మన విద్యలు మానవ స్వభావాన్ని మరుగు పరుస్తున్నాయేగానీ
మెరుగు పరచడం లేదు.

94 విశ్వము అనే పచ్చని పంట పొలంలో
మానవుడొక దిష్టి బొమ్మ

95. పరమ ఆర్థిక చింత కాదు-
పారమార్థిక చింత కావాలి.

96. వృద్ధుల కన్నా
యువకులే మిన్న
వృద్ధులకు బలవర్థకాలన్నీ
బలవ్యర్థకాలే.
యువకులో - ఏ మందులేకున్నా
వృద్ధాప్యం సాధిస్తారు!

97. అవనీతలం ఒక ఆడిటోరియం
డబ్బులిచ్చుకున్నా
కొంతమందికి వెనుకసీట్లు
ఇచ్చుకోకున్నా కొంతమంది
అనర్హులకు కూడా ముందుసీట్లు!

98. ప్రజలు ప్రవక్తల ప్రవర్తనను అనుసరిస్తారు
ప్రవచనాలను పక్కకు పెడతారు.

99. ఏది పుణ్యం? ఏది పాపం?
అంతరాత్మ మెచ్చింది పుణ్యం
పదేపదే గుచ్చితే పాపం!

100. 'పానం' (?!) ఎక్కువైతే కిక్కిస్తుంది
మరీ ఎక్కువైతే చెక్కేస్తుంది!

101. జగ మెరిగిన బాపనికి జాగ్రఫీ తెలియాలా?

102. నియంతృత్వంలో పాలించేవి వ్యాఘ్రాలు
ప్రజాస్వామ్యంలో గోముఖ వ్యాఘ్రాలు!

103. ఇంగ్లీషు వారు పెద్ద చిన్న లేకుండా మాట్లాడుతారు. అన్నకూ తమ్మునికీ, (బదర్) అక్కకూ చెల్లెలకూ (సిస్టర్) నీకు, మీకూ (యూ) సంబోధన ఒకటే! వారి బాషలో అక్షరాలన్నీ గురువులే. అందుకేనేమో అందరిపై పెత్తనం అహంబావం ఎక్కువ. అందుకేనేమో నేను (ఐ) కాపిటల్‌లో వాడతారు!

104. నీది కూడా 'రైట్' అన్నవాడిది సంస్కారం; నాదే 'రైట్' అన్నవాడికి నమస్కారం!

105. **Wed Lock** ముందె విశాకులంటే ఎట్లా?

106. సుఖాన్ని జయించాలంటే
తలపులోనే అర్థగించు
కష్టాన్ని జయించాలంటే
తలవంచి అనుబవించు.

107. ప్రకృతిలో ఈ దిష్టిగొట్టు పూలు సృష్టికర్త నేత్రాలు:

108. బంధువులు దైవసృష్టి
బంధాలు పాపసృష్టి!

109. వాదన, బోధన కన్న సాధన మిన్న

110. పురుషోత్తముని కొలచటం ఉత్తమం
ఉత్తమ పురుషునిగా మలచటం ఇంకా ఉత్తమం

111. ఆనందం అర్థవమైతే అది సంగీతం
సంగీతం ఘనీభవిస్తే అది ఘన శిల్పం!

112. ఇరువైపుల తగవు (న్యాయం) వుంటే
తగవులు అవి ఆగవు
ఒక వైపే తగవుంటే
తగవులు అవి సాగవు!

113. కష్టేఫలీ అన్నారు పూర్వం
ఈ కాలంలో అది అపూర్వం!

114. మతం మత్తు మందు అన్నాడు మార్క్స
మత్తు మందు సేవించడమే మతం అంటున్నారు మాడరన్స్!

115. మితిమీరిన మతిమరుపు
శృతి మించిన స్వాతిశయం
నడమంత్రపు అధినేతల
అధికారజనిత ప్రథమావలక్షణం!

116. లక్ష సల్లక్షణాలను భక్షించగల
దక్షత - కక్ష అనే ఒక్క లక్షణానికుంది!

117. సంస్కార లక్షణం స్వచ్ఛంద క్రమశిక్షణ;

118. కొందరు తమ విశ్వాసాలకు అంకితమై జీవిస్తారు. మరికొందరు విశ్వాసాలను అంకితం చేసి జీవిస్తారు.

119. ప్రతిభ కన్నా, ప్రతిభను గుర్తించే ప్రతిభ మిన్న.

120. కరుణ అనేది ఋణంగా ఇస్తే దారుణం.

121. నిఘంటువు సాహిత్య దీపికలు గాదు
జ్ఞాపకశక్తి విజ్ఞానసూచిక కాదు.

122. వయస్సు విజ్ఞానసూచిక కావాలి
వృద్ధావ్యసూచిక కారాదు.

123. మనకు వచ్చినదానితో బ్రతుకుతాం.
మంచి బ్రదుకుకు బాట మనం ఇచ్చినదానితోనే!

124. అర్ధాంగితో స్పర్థ లేకుంటే
అద్దె కొంపైనా ఇంపే - కళ్యాకింపే;
అర్ధాంగి స్పర్థాంగి అయి ఆగ్రహిస్తే
స్వగృహమైనా - కంపే - ముళ్ళకంపే

125. ప్రేమ ఒక ఉషస్సు
కామం ఒక తమస్సు
వివాహ మొక సదస్సు
సంతానం .... కస్సు బుస్సు
ఉత్తరార్ధ నమస్సు!

126. ప్రేమలేని పరిణయాలు
పెళ్ళి లేని ప్రేమాయణాలు
చిరంజీవులు, శాశ్వత సమకాలికులు!

127. స్వచ్ఛమైన ప్రేమ పెనుమంట
తుచ్ఛమైన ప్రేమ చిరుదీపం
విరహ పీచిక లెక్కువైతే
అది గువ్వున చెలరేగుతుంది
ఇది చప్పున చల్లారుతుంది!

128. నీ తలపులు వలపులు
దాచుకో .... ఒక ఇంతిలో
నీ తల దాచుకో ఒక ఇంటిలో

129. ప్రేమ టెలిస్కోపు
అసూయ మైక్రోస్కోపు

130. అర్ధాంగి చక్కని చుక్కగాకున్నా
చక్కని చుక్కానిగా వుండాలి!

131. ఇల్లు నీవు వసించెడి చోటు కాదు
వరవశించెడు చోటు
నీవుండు చోటుకాదు.
నిన్నుండమనే చోటు!

132. ప్రేమ పెండ్లికి ఉషఃకాలం .... అయితే
పెండ్లి ప్రేమకు సంధ్యాకాలం కాకూడదు!

133. అన్ని ప్రేమాయణాలు పరిణయాలుగా మారవు
అన్ని నేరాలకూ శిక్ష ఉండదు.

134. సుతులకు సతులు వస్తే మతుల గతులలో మలుపు!

135. నేనే మా ఇంటికి యజయానిని
అని చాటుకొనుటకు
అనుమతించిందోయ్ మా మానిని

136. ఎలనాగ అంటే ఎలక్ట్రాన్
పురుషుడు ప్రొటాన్
ఒక్కటైతే ప్రణయం
విడిపోతే ప్రళయం

137. ప్రియుని అలవాట్లకు
జరిగే పొరపాట్లకు
ప్రేయసి పెడుతుంది చీవాట్లు
ఆ చీవాట్ల శక్తి
అది ఎన్ని మెగావాట్లు?

138. ఆలి
మీద వాలి
తే కావాలి
ఇంట్లో ఒక లాలి?

139. 'మౌనం అర్ధాంగీకారం'
అర్ధాంగి కారంగా వుంటే
మౌనం వహిస్తే లేదు తంటా!

140. పయోధరాలు నల్లపడందే
వంటలు వండుతాయా?!

141. పయోధరాలకు ఆచ్ఛాదన అంబరమే!

142. వంద నీతి సూక్తుల కన్న
ఒక్కనాటి సూక్తి మిన్న!

143. శారీరిక స్థితిని బట్టి
'శారీ'రకం ఉండాలి!

144. అప్పుడప్పుడే కాంతత తప్పకుండా వావాలి
అంతులేని ఏకాంతత అయితే మరి చావాలి!

145. శ్రామికులకు 'రేపు' కూర్చి ఒక్కటే దిగులు
కాముకులకూ 'రేపు' (?!) గూర్చి ఒక్కటే తెగులు!

146. సంఘ ధిక్కరణ తగని పని
సంఘ సంస్కరణ తగ్గని పని!

147. ప్రజలకు కావలసింది దర్శకులు కాదు
చేసి చూపించే మార్గదర్శకులు!

148. పట్టెమంచం నీదైతే మాత్రం
వచ్చే నిద్ర నీ చేతిలో వుందా!

149. అబద్ధాలకు అతివ్యాప్తి యోగం
నిజాలకేమో అతి సుషుప్తి రోగం!

150. కష్టము శ్రామికునిది -
అదృష్టము పారిశ్రామికునిది!

151. పొట్ట ఎండితే పుట్టేవి కళలు
పొట్ట నిండితే పుట్టేవి లలిత కళలు!

152. Fine Art గీసేవానికి Fine Heart
వుంటుందని గారంటీ లేదు.

153. ఇంట్యూషన్ లేకుంటే
ఇంట్లో ట్యూషన్ దండగ!

154. ఏజంటు పనికి ఏజంటూ (Age) లేదు.

155. విమర్శలకు పారిపోకు
పొగడ్తలకు జారిపోకు

156. జాగ్రదావస్థలో ఆత్మవిమర్శ
నిద్రావస్థలో అన్యవిమర్శ

158 నీవు మొద్దువెధవవురా' అని మాస్టారు అంటే
"మా'స్టారు' బాగుంటే మీ దగ్గరికెందుకొస్తాం" అన్నాట్ట.

159. వేదాంతికి 'వాసాంసి జీర్ణాయ' శ్లోకం
వంట బట్టుతుంది. వేశ్యాలోలునికి వంట బట్టుతుందా?

160. సర్వేంద్రియాణాం నయనం ప్రధానం
ఏ వైద్యమైనా నయం ప్రధానం!

161. అర్ధాంగి వయస్సులో వున్నపుడు
అన్నిటికీ ఓ యస్ అన్నవాడు
వృద్ధాంగి అయినంత మాత్రాన
ఓ యాస్ అంటాడా?!

162. ముదిత అంటే ముదిమిని తప్పించేది-
కొందరు తెప్పించవచ్చు.

163. తిరుపతి దేవుడిని చూడాలని పతి దేవుడిని పీడిస్తే పుణ్యమొస్తుందా?

164 వయస్సు మీరగానే పయస్ ఆలోచనలు రావాలి (Pious) పైస్
చింతలో పడితే పీస్ ఉండదు.

165 జీబ్రాకూ ఆల్‌జీబ్రాకు ఏం సంబంధం? డోలుకూ గంగ డోలుకూ
ఉన్నంత.

166. కొంతమంది అకల్‌మంద్‌లకు (తెలివిగలవారు) ఆకలి మందం!

167. నేటి కె. జి. విద్యార్థులను చూస్తుంటే యూనిఫారం సంగతి దేవుడెరుగు గూనిఫారం అవుతుందేమో అని భయం వేస్తుంది.

168. అరగించటం మన చేతిలో వుంది;
అరగించుకోవటం మన చేతిలో వుందా?

169. విదురనీతి మంచిదే. 'వెదురు' నీతి ఇంకా మంచిది. ఉరుములురిమినా నిలద్రొక్కుకొని మరీ పెరుగుతుంది వెదురు చెట్టు!

170. కుండలో వండుకొని తింటే 'కుండలినీ' శక్తి వస్తుందా?
తాయెత్తులు కట్టుకుంటే ఎత్తుకు పై యెత్తులు వేయటం వస్తాయా?

171. రొట్టె విరిగి నేతిలో పడుతుంది కొందరికి
చెట్టు విరిగి నెత్తిమీద పడుతుంది మరికొందరికి!

172. చిక్కిపొయ్యారేంటి అంటే
'చిక్కని పాలు తీసికుంటున్నాం
చిక్కని పాలు చిక్కడంలా' అన్నాట్ట!

173. తాటిమీద మాటమీద నిలబడటం కష్టం!

174. పద్యం పాడరా అంటే నేపథ్యంలోనే పద్యం పాడతా అన్నాట్ట!

175. ఓట్లకోసం వోటర్లందరికి ఇచ్చాడు దావత్తు
పాపం అభ్యర్థికి దక్కలేదు ధరావత్తు!
వంట పొలం అమ్మి ఊడ్చిపెట్టాడు యావత్తు!

176. పేరులోనే కాదు PAIR లో కూడా వుంది పెన్నిధి!

177. కాలెండరు పేజీ తిరిగితే
లెండరుకు వడ్డీ పెరుగుతుంది.
'అప్పా'రావు నడ్డి విరుగుతుంది!

178. ఎక్కడో 'దివి'లో దేవుడున్నాడనే వాళ్ళను అక్కడనే వుంచడం మంచిది!

179. భక్తికి కావలసింది ఎదలో ఆరాటం- ఆర్బాటం కాదు!

180. అయ్యా! అభ్యర్థిగారూ!
నేను ఓటు వేసినంత మాత్రాన
నిన్ను వరించినట్లు కాదు
ప్రత్యర్థిపై నిరాశ ఆవరించినట్లు కానే కాదు
వాడిమీద పెట్టుకున్న భ్రమ తొలగినట్లు!"

181. మనిషిని తొలచివేసే విషయాలే
వాడిని కొలిచే సాధనాలు!

182. ఎన్నో భావాంకురాలు
మొలకెత్తిన చోటుకన్నా
నాటబడిన చోటనే
నాణ్యంగా విస్తరిస్తాయి!

183. తొందరగా చెయ్యటానికి పూనుకో
తొందరపాటు మాత్రం మానుకో!

184. గాలి నిండిన కాలిబంతికి తన్నులెక్కువ!

185. తన్నుతిన్న కాలిబంతికి ఎగురుడెక్కువ!

186. బంతిలో గాలి మింటిలో కలిసినా
మనిషిలోని మానవత్వం మంటలో కలిసినా
పతనం తప్పదు.

287. భౌతిక విలాసాల్లో అత్యంత ఖరీదైనది
నైతిక జీవనం!

188. జీవితంలో కాసులు లేకుంటే అన్నీ తిరకాసులే!

189. జాస్తి రూకలు చేరితే జాగరూకత అత్యవసరం!

190. కలిమి కాలంలో పాండిత్యం శోభ: లేమికాలంలో అనునిత్యం క్షోభ!

191. కలిమిని హరించే వానికి శిక్ష; కాలాన్ని హరించేవాడికి శిక్ష లేకపోవడం
విపక్ష!

192. కలికాలంలో మనీ బలానికీ మనోబలానికీ చెలిమి!

193. ధనం సుఖానికి సాధనం కాకున్నా ధనముంటే సుఖంగా రోదనం చెయ్యవచ్చు!

194. అర్థం అనర్థములకు మూలం కాదు. అర్థ వ్యామోహం మాత్రం సర్వానర్థాలకూ మూలం!

190. ప్రావర్టీ ఎంత వుంటేనేం వాడింట్లో ప్రావర్ టీ దొరకదు!

196. ధనికులు తాము ఆధునికులమని భ్రమిస్తారు!

197. 'మనీ' మాట్లాడుతుందట
కానీ వెళ్ళేటప్పుడు మాట్లాడకుండానే పోతుందే!

198. లాకర్ లేకుంటే మాత్రం
లాభియర్ కాకూడదా!

199. ధనముంటే మనం మనం అద్వైతం
లేకుంటే క్షణం క్షణం ద్వైతం!

200. డబ్బు అంటుంది నన్ను (None)
అనుభవించకపోతే ఎట్లా అని!

201. మనీ సంబంధం 'హార్మనీ'కి ప్రతిబంధం
కొండొకచో అనుబంధం!

202. కొందరికి జీవితం వడ్డించిన విస్తరి
మరి కొందరికి విస్తరించిన వడ్డీ!

203. అర్తువాసులంతా (earth) అర్థదాసులే!

204. ఫినాన్స్ (Finance) 'కట్' అనువాడు
పీనానికట్టె!

205. అందం సృష్టిని బట్టిగాదు- నీ దృష్టిని
అనుసరించి వుంటుంది.

—: o :—